

ఆంధ్రీకృత

# మల్లేశ్వరోపాఖ్యానము



-: ఆంధ్రీకర్త :-

అత్తిలి గోపాలకృష్ణమాచార్యులు

నరసాపురము



శ్రీః

# ఆంధ్రీకృత ముక్తీశ్వరోపాఖ్యానము



ఆంధ్రీకర్త :- అత్తిలి గోపాలకృష్ణమాచార్యులు
ధర్మపత్ని :- శ్రీమతి వేంకటసుభద్ర

# ఆంధ్రీకృత ముక్తీశ్వరోపాఖ్యానము

ప్రథమ ప్రచురణము - (1994 ఆగస్టు) - భావ శ్రావణము

వెల 60/- రూ

This book is published with financial assistance of Tirumala Tirupati Devasthanams, Under their scheme, "Aid to publish Religious Books."

-: ముద్రణము :-

| | | |
|---|---|---|
| పుటలు | 1 నుండి-220 వఱకు | సీతారామాంజనేయ ప్రెస్--నరసాపురము |
| ,, | 221 నుండి-226 వఱకును, | శ్రీ వాసవీదత్తా ఆర్టు ప్రింటర్స్, |
| ,,లోపల | 37 నుండి-చివరవరకును, | ఆర్యాపురం, |
| ,,తొలుత | 1 నుండి-10 వఱకును | రాజమండ్రి. |
| ,,లోపల | 1 నుండి-36 వఱకు | నవజ్యోతి ప్రెస్—నరసాపురము |

# -: కృతజ్ఞత :-

ఈ కృత్యాకృత్యాలోక లోకబాంధవమూర్తి — బ్రహ్మశ్రీ కాశీభొట్ల సుబ్రహ్మణ్యశర్మ మహోదయులకును;

ఇదం ప్రథమప్రచురణ మునకనుక్షణము, ఉత్సుకతనెయి, మిక్కిలిహోత్సాహమిచ్చుచు, నన్నొక కార్య(వ్య) నిర్వాహకునిగా నిల్పిన మానరసాపురాంధ్రగీర్వాణ పండితమిత్రమండలికిని:

అడిగినదియతడవుగ, విరివిగఁ బసదనమొసఁగి, ప్రచురణ పుణ్యకార్యమున కాద్యులైన శ్రీ తిరుమల తిరుపతిదేవస్థానముల కార్యనిర్వహణాధికారులకును; తదితర సహృదయులకును;

పనిబరువును గనుఁగొనియు, మిగులఁ జొరవగలిగి, మొదలిడి, ముద్రణార్థ భాగము మించిచేసిన "సీతారామాంజనేయప్రెస్సు" (నరసాపురము) వారికిని;

మోమోటపెట్టఁగాఁ, గాదనలేక, ముద్రణకార్యభారముకు గొంతమోసి, సాయము చేసిన "నవజ్యోతిప్రెస్సు" (నరసాపురము) వారికిని;

నాయసహాయశూరతాభాసతాకింకర్తవ్యతామూఢతలను గ్రహించి, యాగ్రహింపక, అవశిష్టముద్రణకార్యము పూర్తియౌటకు బాసచేసి, నన్నుగట్టెక్కించిన మిత్రరత్నము—డాక్టర్, శ్రీ ఆరిపిరాల—(కాదు; తెలుఁగువెలుఁగుల) నారాయణరాయ మహోదయులకును;

నన్నెఱుంగకున్నను, శ్రీ నారాయణరావుగారి మాటపై- ఈ నాగ్రంథమును చివరవరకును ముద్రింపించియిచ్చిన పుణ్యాత్ములు "శ్రీవాసవీదత్తా ఆర్టు ప్రింటర్సు" (ఆర్యాపురం-రాజమండ్రి) వారికిని; నేనిబ్బంది లెన్నిపెట్టుచున్నను — లెక్కింపక, మిక్కిలియోపికతో ముద్రణకార్యమును చక్కఁబెట్టినవారిసిబ్బంది యందఱకును —

—ఇన్నికాదెన్ని కృతజ్ఞతాద్యోతకవాక్యములు వ్రాసినను, బైనిబేర్కొన్నవారికందఱకును, నేనెల్లప్పుడును ఋణపడియే యుందునన్నమాట — అర్థవాదముకాదు - యథాఽర్థవాదము.

ఇట్లు,

గ్రంథకర్త

శ్రీః

# ఆఖ్యానకానుక్రమము

శ్రీః

# ఆంధ్రీకృతముక్తీశ్వరోపాఖ్యానము

## ప్రథమాధ్యాయము



మహితము, భూమహితము
నైమిశమనువనమునందు, నైష్ఠికులు మునుల్
సీమాతిగమహిముల్, ది
వ్యామేయపవిత్రవృత్తులమలినచిత్తుల్. 1

కం॥ పుణ్యాశ్రమంబునందు న
గణ్యంబగుదీక్ష దీర్ఘకాలికము మహా
పుణ్యదము సత్రయాగమ
రణ్యంబునఁ జేయుచుండ గ్రక్కున నటకున్. 2

సీ॥ వ్యాసమౌనిశిష్యుండితిహాసవేత్త
సూతమౌని, సర్వార్థవిజ్ఞాతరాఁగ
నచటమున్నున్న శౌనకాద్యఖిలమునులు
రోమహర్షణికతిథిమర్యాదఁ జేసి. 3

ఆ॥ సూతమౌనివర్య! సూతాత్మ్యసంభవ!
సర్వవృత్తవేత్త! సాధుచిత్త!
నీవు సెప్పఁ బేర్మి, వేవిధంబులవింటి
మేము పుణ్యకథల నెన్నొ మున్ను. 4

ఆ॥ లోకసృష్టిక్రమము, లోకేశ్వరుమహత్త్వ
మమరవరులవృత్త మసురచేష్ట
లాశ్రమాదిగాథలాలకించితిమయ్య!
మేము మున్ను సర్వతోముఖముగ. 5

గీ॥ నళినజోపమమతి! బ్రాహ్మణప్రభావ
ముత్తమక్షత్రియులవిక్రమోరుగాథ
లలఘుతరములు, సూర్యచంద్రులశుభాన్వ
యోత్థితచరిత్రములు వింటిముజ్జ్వలములు. 6

కం॥ పరమపవిత్రములగు, ముని
వరుల చరిత్రములు, మఱియుఁ, బర్వతకథలున్
సరిదుత్తమగాథలు, హరి
హరుల ప్రభావములు విన్చితయ్య, మహాత్మా! 7

ఆ॥ విపులకృపను నీవు వినిపించితివి మాక
పూర్వరీతిఁబూర్వపుణ్యగాథ
లెన్నొ మున్ను; శివునహీనమహత్త్వంబు
నెన్నొ చీవు సెప్పితిద్ధపుణ్య! 8

ఆ॥ వరగుణాఢ్యుఁడుండెఁబరమేశుభక్తుండు
"ముక్తహాని" శుద్ధబుద్ధియనుచుఁ;
దత్ప్రసక్తిచేత, ముత్ప్రకర్షంబున
వినఁగఁబొడమెఁగుతుకమనఘ! మాకు. 9

ఆ॥ ముక్తహానియెవఁడు? పుత్త్రుఁడేపుణ్యదం
పతులకతఁడు? తచ్చరితగుణములు
కీదృశంబు? లామహాదేవునకతండు
గూర్చుభక్తుఁడెట్లుకోరియయ్యె? 10

ఆ॥ అతఁడుమివులఁజేసినట్టియ ప్చతమేమి?
యతనివంశమెట్టిదాను? దీని
విపులఫణితిఁజెప్పవే, రోమహర్షణీ! "
యనఁగఁ, గథకుఁడిటులననియెఁబ్రీతి. 11

వ॥ మునీంద్రులారా! శ్రీమన్నారాయణాంశసంభూతుం
డైనబాదరాయణమునీంద్రునియనుగ్రహవిశేషంబున నేనీపురా
వృత్తంబుఁదిరావృత్తంబుగావింటి. బ్రహ్మతొల్లి నారదునకీ
ముక్తహరిచారిత్రంబునువినిపించె. వ్యాసుండరణ్యవాసాయాస

క్లేశంబులనొందుచున్న కౌంతేయాగ్రగణికియాత్యశ్వరభక్తుని వృత్తాంతంబుదీనిన్ బ్రసంగసంగతిని విన్చె; నాబాదరాయణుండే శుశ్రూషాపరాయణుండనైన నాకు దీనినుపదేశించె. నేవిన్నది విన్నట్టుల విన్నవించెద. సావధానులరై వినుండని హర్షోత్కర్షంబున రోమహర్షణి యాశౌనకాది మహర్షులకిట్లని సెప్పం దొడంగె, 12

చం॥ అరికృతదుష్పరాభవమహార్ణవమగ్నుఁడు, ధర్మరాజు, సో
దరులును, దాను, ద్రౌపదియు దారుణకాననసీమలందు సం
చరణమొనర్చుచున్, ఫలరసంబులనాఁకటిచిచ్చువుచ్చి, సం
స్తరణవిహీనకర్కశము, స్థండిలమందుశయానుఁడయ్యెఁగా! 13

గీ॥ పాంసువులరూషితుండయి, వరడులఱువ
నిద్రమేల్కాంచుచుండు; నిర్నిద్రమైన
దైవమేకట్టికుడ్వనాథీవరేణ్యు
భోగదూరునిఁజేసిసంపూర్ణముగను . 14

ఆ॥ ఇట్లుసాలయేఁడులేఁగ దుఃఖార్తయై
యాజ్ఞసేనిక్లేశమాపలేక
యొక్కనాఁడు నాథుఁడొంటినుండఁగ డాసి
యిట్టులనియెఁగన్నులింతసేసి . 15

చం॥ "ఇఁకభరియింపఁజాలహృదయేశ్వర! నెవ్వగనుంతయేని; శ
త్రుకృతపరాభవోద్భవమురూఢముమర్మవిభేదనంబు;మున్
సుకముగఁబ్రొద్దుపుచ్చితిమి సుందరహైమ శిరోగృహంబులన్
బ్రికటమహార్హ్యసన్మృదులవస్త్రవిభూషణధారణార్హ్యతన్. 16

ఆ॥ అట్టిమనము నేఁడునట్టడవులలోన
బంధబాళ్ళఁబండి పాంసువాత
హతులమగుచుఁ,బొద్దులట్టెపుచ్చెదము, క్షణ
మొక్కయుగమువోలెనోలెఁజాఁగె. 17

ఆ॥ పరమశాంతభావ ! వనటభారము పార
మేగునొక్కొ ! నీయుపేక్షఁజేసి
యింతపుట్టెఁగాక; యేమితక్కువనీకుఁ ?
దేజమొప్పదీనితీవ్రమహఁవు. 18

ఆ॥ ద్యూతనష్టమైనతొల్లింటి ప్రాజ్యసా
మ్రాజ్యలక్ష్మిఁగొమ్మ; మసలనేల?
నీదుముదలలేక, నీతమ్ములిందందు
"గ్రుక్కిళులనుమ్రింగుకొంచు" నుండ్రి. 19

ఆ॥ ఒకఁడుసాల్పఁడే సహోదరుఁడరికంత
లుంతనంబునకును; లుత్తలక్ష్మి
మరలఁగొనఁగఁ ? గనుక, మాంద్యమ్ము వీడి, త
మ్ములనుగూడి లచ్చిఁబొందుమయ్య ! " 20

కం॥ అని పలుకఁగ ద్రోవది తా
విని వడముడి తీవ్రరీతివిన్నెను; శాంతా
త్మునిఁగనుఁగొని ధర్మజు "న
త్యనుపమముపపన్నమీకులాంగనవల్కెన్. 21

ఆ॥ అరులవలనిపరిభవాగ్నివిజృంభింప
నరణివీవు; ద్యూతమయ్యెమథన
దండ; మింతపుట్టెఁద్వదుపేక్ష; నిద్ది యె
న్నాళ్లుసెల్లునింక ? నన్నుఁబంపు. 22

ఆ॥ శ్రీలఁదెత్తు; శత్రుఁజీల్చి చెండాడుదుఁ
గితవహృతముగాఁగనతులవిభవ
మేమిపౌరుషంబు ? ఋతమేమి ? రాజ ! నీ
కిష్టమెట్టులయ్యెఁగష్టమింత ? 23

ఆ॥ జూదమాడి యోడి సూడులుమోసంబుఁ
జేయ మాఱుసేఁత చేతగాక
తెచ్చిపెట్టితీవుతీవ్రంబుగాఁగష్ట
ముచ్చిపోవుఁదలఁపనుల్లమకట! " 24

ఆ॥ ఇట్లుతమ్ముఁడట్టు లిల్లాలు మదిఁగాఁడ
నాడు మాటలకుఁ బృథాఽగ్రసూతి
మదిని దుఃఖభరముమఱువంగ లేక, సం
ధాన పరత, స్థిరత, తథ్యములుగ. 25

కం॥ అను జన్మనిసంరంభం
బునుమానుపనెంచి, ధర్మపుత్త్రుఁడు ధర్మం
బును, నర్థంబునుమాటలఁ
గనఁబఱచుచు, భీమసేనుఁగనుఁగొని, యనియె. 26

కం॥ ఎఱుఁగుదునువత్స! మీయం
దఱకును గష్టంబుపస్థితంబయ్యెనుజూ!
అరికృతనికృతికిఁ బ్రతికృతి
నెఱపఁగసమయంబుగాదనిలసుత! వింటే! 27

సీ॥ సైరణవహింపనోపవు; సాహసికత
కనువు, గాదెవ్వరికసమయంబునందు;
నేదిభదితవ్యమో, కాకపోదుసూవె
యద్ది; యిద్ధబలాఢ్య! జనాళికెందు. 28

ఆ॥ ఏమిసేయువాఁడ నిప్పుడు? తమ్ముఁడ!
యిట్టి ఘోరశపథమట్టిచేసి,
సరియె, మానధనుఁడు సంధావ్యతిక్రమం
బాచరింపనెందునైనఁగాని?. 29

ఆ॥ రాజనీతిశాలి రాజ్యంబుసకళత్ర
పుత్త్రమిత్త్రమైనఁబోవిడుచును;
విడుచుఁగానియట్టియుడలకప్రాణముల్;
కాని, ప్రతినఁజేసి;మానలేఁడు. 30

ఆ॥ నీతివేత్తలెట్టునిందింత్రువిస్మృత
సంగరులను, మనల, వెంగలులని;
నీతిశాలియంచు, నిత్యమారారాజు
మెత్తురయ్య! జనులు మొత్తముగను. 31

ఆ॥ కాన, నోర్పుతోడఁగాల శేషమునెట్లొ
గడుపవలయు గడ్డుపుఁ గడఁకతోడ;
నట్లు లైన, దోసమంటునే, మనల? నో
యనిలతనయ! నీవునరసికనుమ!. 32

కం॥ అవిమృశ్యకృతములగుపను
లవియువిషాదావహంబులవుఁ; గావునఁజే
యవలెవిమర్శించియె మా
నవుఁడు మివుల నటుఁగాక, నవ్వులపాలౌ. 33

శా॥ క్షమపరమైనవస్తువగు; క్షాంతిమహోజ్జ్వలమైన సద్గుణం
బు; మహీక్షమాఽన్వితత్వమతిముఖ్యము ప్రాణదమైనయాపథం
బమితమహాపరిభావమదియాటవహింపఁగఁజెల్లుఁజూనె, యీ
క్షమఁగవచంబుగా, ననిలజా! శపథంబులు దీఱునంతకున్. 34

ఆ॥ క్రమముగా లభింపఁగలదు స్థిరాయతి
న్యాయ్యమైనస్థానమస్మదీయ
మనుచు, వినిచెధర్మతనయుండు భీమున
కంత, వ్యాసుఁడచటనవతరించె. 35

ఆ॥ పరిచురమహిమమహితశుచివేషధరుఁడగ్ని
తేజుఁడతులపుణ్యదివ్యమూర్తి,
యఖిలవేదవిభజనాయతకీర్తి, ద్వై
పాయనుండు, బాదరాయణుండు. 36

ఆ॥ స్ఫటికశుభ్రరశ్మిసంశోభితాపాంగ
వీక్షణముల శాంతముక్షితంబుఁ
జేయుచాశ్రితాళి, శ్రీహరిశుభమూర్తి
యంతనవతరించెవ్యాసమౌని. 37

కం॥ అటులఁబొడసూపువ్యాసుని
జటివరు, దూరమునఁజూచి, సాష్టాంగముగా
నిటలతటసుఘటితాంజలి
పుటుఁడయి, ధర్మజుఁడుమ్రొక్కెముదమొదవమదిన్. 38

ఆ॥ ధర్మపత్ని, సాధ్వి, ద్రౌపది పాదోద
కంబుఁ దేరఁ, దా ముదంబుమీఱ,
ధర్మరాజు ధన్యతన్ గోరివ్యాసుపా
దములఁగడిగె; "దురితతతులు నడఁగె. 39

కం॥ కలుషములనుగలిగె" ననుకొని,
జలములసానుజుఁడు, దారసహితుఁడునయి, యౌఁ
దలఁదాల్చి, ధర్మజుఁడు, ముని
కులపతిఁబూజించెభక్తికోటిగుణముగాన్. 40

ఆ॥ "నీకుఁదమ్ములకును, మీకాంతకును క్షేమ
మేగదా" యటంచు, "సేగులెల్లఁ
దీఱెనే" యటంచు, దివ్యప్రభావసం
పన్నుఁడడ్గెవ్యాసుఁడన్నరేంద్రు. 41

ఆ॥ వెచ్చనూర్చి, విన్నవించె వివ్వచ్చుని
యన్న వ్యాసమౌనికంతఁదాము
మున్ను బడ్డబన్నముల, మనఃక్లేశంబుఁ
గొంతయడఁచుకొనుచుఁ, గొంతికొడుకు. 42

కం॥ "మాపడినపాటులన్ బడ
నోపరభువినెవ్వరెందు నొరులు; మరల,సం
ప్రాపించుమాకునేవిధి
మాపూర్వప్రాభవంబు, మహితశుభంబుల్? 43

ఆ॥ వరుసఁజెప్పవలెనె? బ్రహ్మర్షి ! మాపడ్డ
బన్నములనుమరల, భవదనుత్త
మోరుదివ్యదృష్టికీ రేడులోకాలఁ
గానరాని దేది? మౌనినాథ ! . 44

ఆ॥ ఎఱిఁగి తేనిదీని కేదేనుపాయంబ
పారశత్రుకల్పితోరుదుఃఖ
మునకు, సదయహృదయమునను పదేశింపు
మనఘ! బాదరాయణా! మహాత్మ !!. 45

కం॥ సర్వగురుండవుగాదే;
సర్వవిదుండవునునీవు; సాత్యవతేయా!
పర్వకులఁబడుమా బోం
ట్లుర్వరఁ ద్వాదృక్షరక్షణోచితులుగదే! 46

కం॥ అని, శమనసుతుఁడు శమధని
మునివరు వేఁడంగఁ గరుణమునుకొని, వ్యాసుం
డనియె—"నృపతిలక! మీదగు
వనటమముంగూడ బెండుఁ వడఁ జేసెఁగదే ! 47

గీ॥ వీతరాగులమే మేడ? నూతనాతి
దుఃఖదములు మీపాటులదొంతులేడ?
యైన, దుఃఖంబునాపఁగానౌనె? యవ్వి
సుంతజ్ఞప్తికివచ్చె నశాంతమూర్తి!. 48

కం॥ హతవిధికృతమయి యిది యూ
పతితంబయినదియ; గాక బన్నము స్రమా
ట్నుత! తగినయదనుదనుకను
దతిక్షమైనుండవలయు ధీయుతులెందున్. 49

ఆ॥ శుభసమయము రాఁగ శుభదమౌ సర్వంబు;
నిన్ను బాధఁబెట్టె నికృతినిట్టు
లరులు నీగుణంబులగ్గింతురిటమీఁద
సత్యసంధుఁడవని, శమనతనయ ! 50

ఆ॥ జరగుచుండు దశలు చక్రనేమిక్రమం
బునను నరులకెపుడుఁ బుణ్యమూర్తి
యింతలోననరులనేపునైనసర్జింప
నౌనుపాయములనునరయుమీవు. 51

కం॥ ఔదాసీన్యము సెల్లునె
యాదుర్యోధనునిపట్ల? నతికుటిలుఁడు మా-
యాదక్షుండాతఁడు దయ
మేదినినీఁజాలునే, సమీచీనము ' న్?. 52

ఆ॥ అతఁడు నాసికాగ్రమందు వెచ్చనియూర్పు
తోఁచునంతవట్టు నీచతాఁడు
రాత్మతల కెలోఁగు; నంతియకాని; మీఁ
కర్ధరాజ్యమిచ్చునా? నృపాల!. 53

ఉ॥ శుద్ధమనస్క! ధర్మసుత! శుంభదఖండవిభూతిఁ బొందుమా!
యుద్ధములోన శత్రువులనుక్కడఁగించి ; వలంతివై, ధ్రువే-
ష్టేద్ధకులక్రమాగతమహీమహితోజ్జ్వలరాజ్యలక్ష్మి; దో-
రుద్ధు విక్రమక్రమముహుర్మహురూర్జితకీర్తిశాలివై". 54

ఆ॥ ఇట్లు వ్యాసమౌని యెచ్చరింపఁగ, ధర్మ
సూనుఁ డనియె " నేము దీనులమయి,
యుండినార మరులఁ జెండాడఁగలయుపా
యంబుగల్గెనేని, యానతిమ్ము. 55

ఆ॥ మౌనినాథ! విపులసేనాసమేతులు
సుప్రతిష్ఠితులును, సుహృదహీన
కోశశస్త్రయుతులు, క్రూరులు, శాత్రవుల్;
గెలువఁగలమె వారి? నిలువఁగలమె? 56

ఉ॥ గ్రీష్మరవిప్రతాపు విగీతచరిత్రులు, రాజరాజు, న-
త్యూష్మలతేజుఁ గొల్చెదర యోగ్యులు వీరనుజాల కెవ్వడా
భీష్ముఁడు, ద్రోణుఁడున్, గృపుఁడుఁ, బెన్నధికర్ణుఁడు ద్రోణపుత్రు సద
ర్పిష్మ సుదస్త్రశస్త్రపరికృత్తవిరోధిశిరోధు లెద్దిరా!. 57

కం॥ మృత్యుభయంకరుఁడును, స
ర్వత్యాగి, ప్రతాపశాలి, బ్రహ్మర్షులచే
నత్యంతశిక్షితుండును
స్తుత్యర్హుఁడు, భీష్ముఁడుండెఁ జూ! దాయలలోన్. 58

కం॥ అర్ణోనిధిగాంభీర్యుఁడు
కర్ణుండా రాజరాజు గాదిలిచెలి, య
భ్యర్ణమున నిలిచి, యతనికిఁ
దూర్ణశ్రీప్రాప్తిఁ గోరి, తుష్టింగూర్చున్. 59

కం|| ఆకర్ణు గెల్వ, మాకగు
ప్రేకము; శస్త్రాస్త్రమర్మ విదుఁడాతఁడు; దాఁ
బ్రాకటకౌటిల్యవిహా
రాకలితుఁడు; వానినెట్టులొ,నని గెల్వన్? 60

కం|| ఇతరులు పలువురుపతికిన్
హితరతులు; తదర్థముజ్ఝితేడితవిభవుల్;
మతిమంతులు, యోధులుగల
రతులపరాక్రములు; గెల్వనౌనే వారిన్? 61

ఆ|| ద్విడ్గణంబు గెల్వ, షాడ్గుణ్యపూర్ణ! సౌ
ఖ్యంబుగల్గ మాకు నభ్యుపాయ
మెఱుకపఱపు నిశ్చయించి, హితార్థివై,”
యనిన, మునివరేణ్యుఁడనియెనిట్లు— 62

ఆ|| “ధర్మరాజ! విన్ము; తద్దయునీవుద్వి
షద్గణంబు గెల్చి, సౌఖ్యమొందు
నభ్యుపాయమెట్టులన, నింద్రకీలాద్రిఁ
జేరియర్జునుండు ఘోరనిష్ఠ. 63

ఆ|| పరమశివుని గుఱిచి వరతపమొనరించి
పడయవలయుఁజుమ్మ! పాశుపతమ
హాస్త్రమనఘ! యీరహస్యంబుఁ ద్వద్గుణ
ప్రీతిఁ జెప్పితిం బృథాతనూజ! 64

చం|| శివుఁడు ప్రసన్నుఁడై, యొసఁగు శీఘ్రమె పాశుపతంబుఁ బార్వతీ
ధవుఁడు కిరీటికిన్ నిజపదద్వయనిశ్చలనిర్మలాంతరం
గవిపులభక్తిభావపరికల్పితజల్పితమౌన్యపుణ్యసం
గవముఖపంచకాలవిధిగణ్యశుభార్చనమెచ్చి, యిచ్చుమై 65

ఆ|| అట్టులందియస్త్రమర్జునుండే తెంచు
శీఘ్రమీవు నరివిజేతవౌదు;
వధిప! యెచటవెలయునస్త్రరాజంబద్ది,
యచటజయము ధ్రువము, ప్రచురతరము. 66

సీ|| తత్ప్రభావంబువర్ణింపఁ దరముగాదు
నాల్గుమోముల వేల్పునకును, రెండు
వేలనాల్కలయహిపరివృఢునకైన;
నట్టిదిలభింపఁగలదు మీ యర్జునునకు. 67

సీ|| బదరికారణ్యమునఁ బుణ్యప్రదమునందు
నరుఁడు, నారాయణుఁడనంగఁ బరమమునులు
తపముఁ జేయుదురందు; మీతమ్ముఁ డర్జు
నుండు నరనాముఁడౌ శస్త్రపండితుండు. 68

ఆ|| తపము క్రొత్తయా నె? విపులదీక్షాదక్షుఁ
డర్జునుండు, నీప్రియానుజుండు;
పంపుమింద్రకీలపర్వతంబునఁ దపం
బాచరింప వేగ ననుజు నధిప ! 69

ఆ|| రాజమాళివల్ల రాజర్షి "పాశుపతా"
డీమహాస్త్ర మెయింది, భూమహీతుఁడు
" జానుమంతుఁ" డొల్లి జావఁగా ట్టెను రా! త
దర్థమేనుమంత్రమర్జునునకు. 70

ఆ|| భద్రమాటపొంలె " రుద్రగాయత్రి " బో
ధించువాఁడ నిప్పుడంచితముగ;
శీఘ్రమేగఁ, గార్యసిద్ధియౌ; జయమబ్బు
నర్జునునకు; నిజము; యమతనూజ! " 71

ఆ|| అనెడు వ్యాసువాక్యమాలించి, పరపురం
జయుఁడు వేగవచ్చె సవ్యసాచి
ధౌతపాణిపాదతలుఁడయి, తత్సన్ని
ధానమునకు—శుభనిధానమునకు. 72

ఆ|| ధ్రువజయప్రదంబు, "రుద్రగాయత్రి" నా
రాయణాంశజుండు, వ్యాసమౌని
క్రీడికెంతయేనిఁ గృపనుపదేశింపఁ
బడసె నతఁడు దానిఁ గడుముదమున. 73

ఆ॥ వ్యాసమౌనికరుణ నర్జునుండామంత్రి
విద్యఁగాంచి, మేనువెంచి, పొంగి,
యింద్రసుతుఁడు వెడలె నింద్రకీలాద్రికిఁ
దపమొనర్చు పొంటె విపులయశుఁడు. 74

ఆ॥ సంయతేంద్రియుండు, సాత్యవతేయోప
దిష్టమార్గమునఁ బ్రవిష్టుఁడౌచు,
నన్నపంపుఁ జేసి, యర్జునుండింద్రకీ
లాద్రిఁ జేసె శ్లాఘ్యమైనతపము. 75

ఆ॥ ఘోరనిష్ఠనీశుఁ గూర్చి తపంబాచ
రించి, పాశుపతముఁ గ్రీడి వడసి,
చదిపె రిపుల భయద [విపుల] సంగ్రామరంగంబు
నందు నెదురులేక, యర్జునుండు. 76

కం॥ పాశుపతాస్త్రమహత్త్వము
శ్రీశాంభవుండైనవ్యాసఋషి దెలుపుతఱిన్
దా శమనజుండు మ్రొక్కి, ము
నీశునకిట్లనియె నయసహితమృదులోక్తిన్. 77

ఆ॥ "వ్యాసమౌనివర్య! ప్రస్తావవశమునఁ
బల్కినారు తాము "పాశుపతము
యోగశక్తిఁ జేసి, యొక్క మహర్షిము
క్తాహ్వయుండువొందె" నంచు; మఱియు 78

ఆ॥ "అతఁడు జానుమంతునడఁచె నద్దాననం"
చానతిచ్చియుండి రంతనాకుఁ
బొడమెఁ గుతుకమాత్మ; ముక్తర్షి యెవ్వఁడా
జానుమంతుఁ డెట్టిచర్యఁ జూపె ? 79

ఆ॥ ఈపవిత్రగాథఁ దాపసనాథ చే
తస్కు నన్నుఁ దేర్పఁ దాపసేంద్ర!
విస్తరంబుగాఁగ విన్పింపవలయుఁ; బీ
యూషధారగాదె, యుష్మదుక్తి ! 80

ఆ॥ బహుళపుణ్యఫలము భవదీయదర్శనం
బస్మదాదులకు మహర్షివర్య!
యదియుగ్రసంతప్తమహాక్షేత్రమునువృష్టి
వోలెఁదేర్చి, తుష్టిఁజాలఁగూర్చు॥ 81

ఆ॥ మునివరేణ్య! నాదుపూర్వపుణ్యము భవ
ద్దర్శనమునసూచితంబు గాదె!
దుర్లభంబుజగతిసద్విప్రులగుభవా
దృశులదర్శనంబువశమెసేయ ? 82

అ॥ జగతిమానవులకు సజ్జనసంసర్గ
మెప్పుడబ్బు, ఫలితమప్పుడబ్బు
రముగఁదక్కఁగాదె! ప్రాగ్జన్మపుణ్యవి
శేషమున మహాత్మ! శ్రీశమూర్తి !! 83

ఆ॥ ధన్యుఁడతఁడ; యతఁడెమాన్యుండగణ్యపు
ణ్యుండు; జగతినెవ్వని కొదవుసాధు
జనసమాగమంబు, సత్కథాశ్రవణంబు,
భగవదంఘ్రియుగ్మభక్తిసాల॥ 84

కం॥ క్రతువులచేఁ, గృచ్ఛ్రాది[క]
వ్రతములచే, దానధర్మబహుసజ్జనసం-
గతితీర్థనిషేవణముల
యతివర! స్వర్గంబుప్రాప్యమగుఁదుర్గతిన్॥ 85

క॥ శ్రవణాంజలిపుటపేయము
భవదీయవచోఽమృతంబు, స్వాదిష్ఠంబున్,
బ్రవిమలరసోల్బణము, స
త్యవతీసుత! యభిలషింతుఁదమిఁగ్రోలంగన్"॥ 86

చం॥ అనవుడు, వ్యాసుఁడిట్లనియెనాదరమొప్పఁబృథాఽగ్రసూతితో
"వినుము; నృపాలనందన! పవిత్రము, ముక్తమహర్షిగాథ; నె-
మ్మనమునశ్రవ్యవృత్తములమానవుఁడెవ్వఁడుతృప్తినొందుఁ? శ్రా
వనము, శుభప్రదంబగు భవత్ప్రతిపాదితవృత్తమియ్యెడన్॥ 87

మ॥ పరమార్థప్రదమున్, జగజ్జనశుభప్రాప్త్యేకమూలంబు, ని
ర్జరపేయేతరనూతనామృతము, శశ్వత్సజ్జనస్తుత్యమున్,
వరముక్తర్షిచరిత్రముర్వర వినంగా, నిత్యనూత్నంబగున్;
జరితార్థోత్తమసాధుబోధ! భవదుత్సాహోత్కముఁ దెల్పెదన్ ॥89

చం॥ నలినజుసాటి, "ముక్త"శుభనామయుతుండు, మహర్షివర్యుఁడు
జ్జ్వలమతిశాలి, శంకరభుజప్రభవుండు, సమస్తమానవ-
ర్యులవలనన్ బ్రశంసలెపుడొందుమహాత్ముఁడు, దొల్లి "జానుమం
డలుఁ"డనునొక్కరక్కసునణంచె, జగజ్జనతైకకంటకున్॥ 89

ఆ॥ అతనివలనఁబెక్కురసురులయసురులు
తొలఁగె విష్ణుమూర్తివలనఁబోలె;
నరవరేణ్య! ముక్తనామర్షి హర్షణీ
యోరుచరితుఁడనఘుఁడుత్తముండు॥ 90

చం॥ కలఁడొకమానవాశనుఁడొకానొక కాలమునందు "జానుమం
డలుఁ"డనువాఁడు; వాఁడుభువనత్రయశాంతికి వేఱువిత్తు; మా
యలయులవడ్డకూళ; కరుణాఽఽదిగుణోత్కరదూరుఁడయ్యు, న
న్నలినజుఁగూర్చి నిష్ఠురమొనర్చెఁదపంబుమహిష్ఠనిష్ఠతోన్॥ 91

ఆ॥ ఇట్లొనర్చఁదపమహీనంబుఁ, బరమేష్ఠి
మెప్పుఁగాంచునట్టు లప్పితామ
హుండురాక్షసునకునొసఁగెదుష్ప్రాపముల్
వరములెన్ని యేనిఁగరుణగలిగి॥ 92

ఆ॥ వానిఁబొంది, యట్లు వరగర్వమునఁబొంగి,
నింగినేల, నేలనింగిఁ జేర్చు
దిటవుగలిగి యసురతెంపరియై, తాప
మొందఁ జేసెలోకమొక్కపెట్ట ॥ 93

ఆ॥ బుద్బుదంబులట్లు తద్బాహుపీడితుల్
సర్వనిర్జరులును, సకలమునులు
ప్రిదిలి, ముదము వెడల భీతులై, లోకశం
కరునిఁబరమశివుని శరణువడసి॥ 94

ఆ|| విన్నవించుకొసరి విన్ననౌమోములు
శివునిఁగాంచుగడియః జెలువమలర
ససురదుండగములనసురుసురంచు, వా
రండఅంతవంతసణఁచుకొనుచు|| 95

ఆ|| అంతశంకరుండుగాంతాళమెచ్చఁగా
వెచ్చనూచ్చనవ్వియచ్చరాదు
గొందుబాధలంతమొందించుమేటి సృ
ష్టించె నహాహా! యొకయహీనబలుని|| 96

కం|| రాక్షసనాశార్థమువిష
మేక్షణుఁడు మహాత్మ, ముక్తఋషివరునన్యా
దృక్షేతరనైపుణు, స
ల్లక్షణలక్షితుని, లోకరక్షాదక్షున్|| 97

ఆ|| అతఁడుపాశుపతమహాస్త్రంబుశంకరు
వలనఁబడసి, యసురబలిమిఁద్రుంచె
జానుమండలాఖ్య, సర్వలోకైకకం
టకునిజిటికెలోనఁబ్రకటబలుఁడు || 98

కం|| శివభక్తశిఖామణియతఁ
డవనిన్ముక్తేశుఁడనఁగ,ఖ్యాతింజెందెన్;
ధ్రువమవుజయసిద్ధులుమా
నవు కుఁదత్స్మరణమాత్ర; నరనాథమణీ! 99

వ|| నీకోరినమేరకీపురావృత్తంబు, రసోత్తరంబైనదానివీనులవికడఁగా
వించితి” ననవుడు, ధర్మనందనుండువెండియు, బాదరాయణున
కిట్లనియె|| 100

అ|| “బ్రహ్మవేత్తృవర్య! వ్యాసనారాయణా!
బాదరాయణా! శ్రీవఃప్రమోద
దాయకంబు, శుభవిధాయకంబౌదీని
విస్తరించి తెల్పవే, మహాత్మ!|| 101

ఆ॥ వినఁగవలయు ననెడి ఘనకుతుకంబు నా
మదిని బొడలు మిగుల; మానినాథ!
పుణ్యగాథ దీనముక్తమనస్తాప
భరుఁడనగుదు; భవికపరుఁడనగుదు॥" 102

ఆ॥ అనఁగ వ్యాసుఁడిట్టులనియె ధర్మజుతోడ
"మును పౌక్షునారదునకు నలిన
భవుఁడు వర్ణభేదప్రస్తావమునఁ జెప్పె;
దీని నిష్ఠ నీకుఁ దెల్పువాఁడ॥ 103

ఆ॥ విన్నయంత శత్రువిజయంబు నిశ్చయం
బేను నీకు నోపృథాగ్రిసూతి!
యానుపూర్విగాఁగ నంతయు వాక్రుత్తు;
సావధానముగను నవధరింపు!॥ 104

ఆ॥ పూర్వకాలమందు సర్వదేవర్షి సం
స్తుత్యుఁడైన నారదుండు బ్రహ్మ
ఋషి ద్రిభువనములఁ జరించి, లోకస్థవృ
త్తాంతమెఱిఁగి, జనపదాళిఁ జూచి॥ 105

ఆ॥ క్షేత్రములను బెక్కు సేవించుచు, మహాన
దీజలంబులందుఁ దీర్థమాడి,
సొచ్చి యాశ్రమముల, సొరిది దిక్పాలుర
వివిధపృథివీపతుల సవిధమరిగి॥ 106

ఆ॥ హితముఁగ నపి వారి కెల్లరి కెల్లెడఁ,
గడుఁబవిత్రతరముగాఁగఁ జేసి,
వేదవేత్త, వివిధవిబుధర్షి పూజితుం
డమరమునివరేణ్యుఁ డంతనంత॥ 107

వ॥ కతిపయప్రయాణంబులు గావించి, మించిన హర్షోత్కర్షంబున, నించిన తర్షంబునన్ గైలాసంబును, మందరంబును, గంధమాదనంబును, హేమకూటంబును, మాల్యవంతంబును, పారియాత్రంబును, శ్రీశైలంబును, సేతుసర్వంబుం గావించుకొని,

తక్కుంగలవర్ష పర్వతంబులను గాంచి, తనివిసనక, యవ్వాని
నన్నింటినారోహించి, తత్రత్యులైనమహాత్ములైనమానీంద్రుల న్
బెక్కండ్రఁదర్శించి, సంజాతకౌతూహలుండై,శుభప్రదసత్కథా
ప్రసంగంబులంగావించి, నిజజనకుండును, నిఖిలభువనస్రష్టయు
నైన పద్మగర్భునిదర్శింపనుత్సుకుండై, మహోత్సాహంబున
నాఁడుండునేత్రోత్సవంబొనర్చుచుండుతదీయనివాసంబైనసత్య
లోకంబుఁజేరె; నదియును 108

ఆ॥ ఇద్ధపుణ్యపదము, సిద్ధసంఘునిషేవితంబుఁ దివ్యరూపధారిచరిత
దన్యకోటికీర్ణమతిలోకతేజోమయంబు,వ్యోమయానహరితలము

ఆ॥ అమృతభరితసరసిజాకరనదనదీ
శతసమావృతంబు, చారుకేళి
వనసహస్రశోభి, బహుశకుంతవిరావ
కలకలాకులంబు, లలితతరము ॥ 110

ఆ॥ శ్రీయుతములు, స్వర్ణచిత్రరత్నోజ్జ్వలం
బులగుసిద్ధభవనములనువెలసి
తుంగచంద్రశాలలంగడు నొప్పారి
సామగానములను జాలనొప్పి ॥ 111

ఆ॥ వివిధమణులచేత వేవెల్గువెల్గుల
వెల్లువలనుబోలె వెలసి మివ్వుల
సౌరుమీఱుదాని, సర్వగీర్వాణవం
ద్యంబు, వాగ్వధూసహాయుపదము ॥ 112

ఆ॥ కామకేళిలోలతామహార్ఘ్యవర్జిత
హర్షమేదురాదరాతిశయస
తీపతిప్రియత్వదీపితంబతిలోక
సుందరత్వనిత్యశోభితంబు॥ 113

వ॥ అదిమఱియు, నధర్మిష్ఠులు, నతపోవ్రతకర్మితులు, ననాచరితా
చార్యశుశ్రూషులు, ననాదృతబుధాధిక్యులు, నకృతబ్రహ్మ
సమర్పణులు, ననాభాషితసూనృతులు, నవేదశాస్త్రవిశ్వాసులు

నవర్థిజనబాంధవులు, నవన్నదాననిరతులు, నకల్పితాతిథిసంతర్ప
ణులు, ననారాధితగోవిందులు, ననర్చితమహేశ్వరులునైన
వారికిదురాసదంబై యుండు. మఱియును, మహితమహిమలును
యజ్ఞదానతపస్స్వాధ్యాయపవిత్రనిష్ఠాగరిష్ఠులును, అనవరతకృత
బ్రాహ్మణసమ్మానులును, సర్వభూతదయాళురును, అహింసా
కర్మనిరతులును, అక్రోధనులును, లోభవర్జితులును, అసజ్జనకృత
స్వమాత్సర్యులును, ధర్మిష్ఠులును, అగణ్యపుణ్యకృద్వరిష్ఠులునైన
మహానుభావులకైనను, గృచ్ఛ్రలభ్యంబై యుండును. నట్టిమహా
మహిమ మహితంబైన సత్యలోకంబుఁ జేరి, నారదుండు॥ 114

ఆ॥ నిర్మిమేషదృష్టినిఖిలలోకాద్భుత
ధామమైనదానిఁదద్దఁగాంచి
నారదుండుదనమనంబుననిట్లు జిం
తించె దానిసౌరుఁగాంచిమెచ్చి॥ 115

ఆ॥ "అహాహా! యిదియుమహితమహిమంబు, దివ్యంబు
నైనస్థానమహాను; దీనినిత్య
శోభఁగాంచలేరుసూ! దైవవంచితులెల్ల
కృత్రిభాగ్యులైనవిత్తములును॥ 116

ఆ॥ పరమపదముదీనిఁబురుహూతముఖ్యులు
దుర్లభంబుఁబొంది, దురభిమాన
దూరులౌదురట్టి స్వారాజ్యసామ్రాజ్య
మాపరింపరెప్పుడహాహా! నిజము॥ 117

ఆ॥ బ్రహ్మఋషులు దొల్లిబహువర్షములుతపం
బాచరించి, యిమ్మహాపదంబుఁ
బొందఁగల్గిరట్టిపూర్వమపూర్వమీ
సత్యలోకమలరునిత్యమిచట" 118

కం॥ అని, హర్షోత్కర్షమ్మున
మనమున మునినారదుండు మఱిమఱిఁదలపో
సి, నిజజనకునాస్థాన
మ్మును దరిసేరమేశనామముల వాకొనుచున్ ॥ 119

ఆ॥ ద్వాస్థజనులవలనఁ దనరాకఁ దెల్పి, శీ
ఘ్రముగఁ బిల్పునంది బ్రహ్మ వల్ల
నారదుండు సేసె భారతీసంసేవ్య
మానుఁ బద్మగర్భు మహాశయుంత॥ 120

ఆ॥ జలజపీఠమధ్యసంస్థితు, స్ఫటికాద్రి
కూటశోణమేఘకోటిభాస
మాను, భారతీసతీసేతదర్శించె
ధాతసర్వసంవిధాతఁ బ్రీతి॥ 21

ఆ॥ ఉభయపార్శ్వములను సుభగతాసుకుమార
తాఽభిశోభితామరాంగనల్ క
రాగ్రచామరాళి నల్ల నల్లన వీవ
వారి నాదరించువానిఁ గాంచె॥ 122

ఆ॥ తనను మించుపరమతత్త్వంబుఁ గాంక్షించు
వాని, రెండు రెండు పద్మపత్ర
ములను బోలు నేత్రములనెల్లెడఁ జూచు
పుణ్యమూర్తిఁ గాంచె మునివరుండు॥ 123

ఆ॥ సారెసారెకును బ్రజాపతులందఱుఁ
బృచ్ఛ సేయువాని సృష్టిఁ గూర్చి,
వారు విన్నవింప, వారి వినువానిఁ
దత్తదంశసంవిధాతఁ జూచె॥ 124

ఆ॥ పరమపావనులగు వాలఖిల్యాదుల
వందనంబొనర్చువారి, స్వావ
లోకములను జూచునాకరుణామయు
ననఘు, నలఘుమహిమముఁ గనియె మునియు॥ 125

ఆ॥ సరసిరుహసముత్థసౌరభలాభలో
భమునఁ జేసి ముసరు భసలకులము
నిగమవచనపూతనిజముఖానిలముల
వారితంబొనర్చువానిఁ జూచె॥ 126

కం॥ కుతుకమునఁబద్మసంస్థితు,
సతివిస్మయనీయమూర్తి, నానందరసా-
మృతహృదయు, సురజ్యేష్ఠునిఁ,
బితామహుఁ జూచె బ్రహ్మ వీణామునియున్ ॥ 127

ఆ॥ విశ్వసృష్టికర్తవీక్షించి దేవర్షి
మ్రొక్కెఁ తత్పదాగ్రభూమిమోక-
రిల్లినిల్చె నంజలించి; యంతఁజతుర్ము
ఖుండుసంతసించి, కొడుకుఁజూచి॥ 128

ఆ॥ "వత్స! రమ్మటంచు," హృత్సరోజంబు వా
త్సల్యరసమరందధారఁ బొంగఁ,
బిల్చి, స్వాంకమందునిల్చె నారదు, ముని
వర్యునాదరించెఁ బద్మజుండు॥ 129

ఆ॥ అంత, నిర్నిమేషమైనదృష్ట్యష్టక
మ్మునను జూచి, బాష్పపూరసుధలఁ
జిలికి, నలువసుతుని స్మితభాసితాననం
బగుచు, మధురభణితిననియెనిట్లు॥ 1‌30

వ॥ "నారదా! నీకుభద్రంబెకదా! నీనిరంతరసన్నిద్రిత్రిలోకసంచార కార్యక్రమంబుసక్రమంబుగాసాగుచున్నయదియె? త్రైలోక్య స్థానసంవాసులెల్లప్పుడు నిన్ను సమ్మానితుంగావింపుచుందురు గదా! బ్రహ్మర్షులును నిన్ను వీక్షించినంతనభక్త్యావిష్టంబైన మానసంబుననిన్ను నిండుసంతసంబునసంతసబూజింపుచున్నవారె లోకపాలురెల్లరు నీబోధంబును బాధంబ బాధకంబుగాఁగర్ణ పూరంబుగావించుకొను చుండుటమానరుగదా! భూలోకవాసు లెల్లరును స్వస్వవర్ణాశ్రమాచారపాలనపరాయణులౌదురేమి? త్రైలోక్యంబుననీవేయేస్వైచిత్ర్యంబులనునేత్రపర్వంబుగావించు కొంటివో! కుమారా! నీయీపర్యాణంబిప్పుడెందాఁకసాగించు టకై సంకల్పితంబయ్యెఁ? బాలకాలరంబునను నీవునాకన్నుల కమృతవర్తివై, యానన్నవర్తివై తివిగా! నిన్నుంగాంచుటం జేసె,

మేనుసంప్రీతుండనైతి. నీ భక్తివినమ్రభావంబులెంతయేని
మెచ్చితిఁ దగ్గవిషయమా! కుమార, తావకీనంబైన యనామయగాది
శోధంతంబంతయునాపీనుఁ విందుగావింపుమని" యంతఁ సాధారణ
సంభాషణభూషణ ప్రకాశంబుగాఁ బల్కుచున్న యన్నలువంగనుం
గొని, నా డుంకిట్లనియె|| 131

కం|| "త్రైలోక్యము, సచరాచర
మాలోకించితిఁ బితామహా! బహుధర్మా
వాలముఁ, బుణ్యారణ్యా,
వేలము, వివిధాపగా పవిత్రితకంబున్ 132

కం|| సకలకులాచలవిలసిత
మకలుష వర్ణాశ్రమాదికాచారంబుల్
సుకృతప్రదములు సిద్ధా
దిక నిలయంబులను గంటిఁ ద్రిభువనములలోన్ 133

కం|| లోకంబుల, లోకస్థుల,
లోకేశులవృత్తములవిలోకించితినేఁ
బ్రాకటముగస్వాభావిక
మైకాంతికశాస్త్రపద్ధ్రమాపటఁ గంటిన్ 134

గీ|| సర్వమీక్షించినాఁడ గంధర్వసిద్ధ
సాధ్యగుహ్యకయక్షరాక్షసులవర్త
నంబులు, సురాసురాదివృత్తంబులెల్లఁ
గంటిఁ; బెక్కేల? త్వత్సృష్టిగతముఁ గంటి|| 135

ఆ|| భవదమేయసృష్టి బహ్వద్భుతంబు, వా
జ్మనసగోచరంబె? కనకగర్భ !
నీవు దక్క, లోకనిర్మాణదక్షుఁడె
వ్వాఁడు శక్తుఁడౌను? వాగధీశ!! 136

ఆ|| సకలనిగమగ(వి)దితమకలుషమగుభవ
న్మహితమహిమకవధి మనుజులకు రు
లెవరుఁ దెలియలేరు; భువనంబులీరేడుఁ
గ్రీడనకములౌను జూడనీకు|| 137

ఆ॥ ఏను నీసుతుండనైన కారణముచేఁ
దత్ప్రసాదమునకుఁ బాత్రమగుట
నన్ను మానులెల్ల మన్నించుటిది యేమి
యబ్రమయ్యె ? దేవ, హంసవాహ ! 138

ఆ॥ తొలుత విశ్వకర్తవలఘుప్రభావ! త
ద్భర్తవీవు దేవ! హర్తవీవు;
బ్రహ్మవిష్ణురుద్రపదభాక్త్వమున సృష్టి,
స్థితియు, లయమునీవె సేయుచుందు॥ 139

ఆ॥ తొలుత జలములందు ద్రుహిణ! హిరణ్మయ
మ్ముంచితీవు బీజమంచితాత్మ!
యదియె హేతువయ్యెనైకభేదత్రిలో
కములకమలచరిత! కమలనిలయ!! 140

ఆ॥ ద్విర్విభక్తమాత్మ స్త్రీపుంసరూపత్వ
కల్పనమునఁ జేసి క్రమమునన్ జ
గత్పితృత్వమొందెఁ; గల్పితైతద్ద్వంద్వ
మాద్య ! ద్వంద్వదూర ! వేద్యవేత్త!! 141

ఆ॥ స్రష్టవైన నీదు సన్నిమేషోన్మేష
భేదములె యగుఁ బ్రళయోదయములు
భూతజాతమునకుఁ; బుండరీకాక్షస
త్పుత్త్ర! హంసపత్ర! పుణ్యగణ్య!! 142

ఆ॥ నీవు కర్తవాదు నిఖిలమ్మునకును; నీ
కేఁడి కర్త? నీవయీశ్వరుఁడవు;
నీవనీశ్వరుండ; వీవఁగూఁడవి; నీవ
నాదివౌదనంత! యంతమీవు॥ 143

వ॥ ధర్మంబు వేన నిర్దిశ్యమానంబగు వేనికాద్యంతభాగిత్వంబు శూన్యంబు, కర్మబ్రహ్మప్రకాశకంబులైన యీ వేదవాక్యంబులకీవగదా, కారణంబు! ఫుల్లాంభోజాతసింహాసనాసీన! వ్యక్తావ్యక్తస్వరూపిణియైన సూక్ష్మప్రకృతివీవ; దేవ! నీవల్లఁగదా,

బ్రహ్మాండంబులు మృత్పిండంబునుండి భాండంబులు వానునట్లు ద్భుతోద్భూతంబులౌచుండు. బ్రహ్మవేత్తలు నిన్ను బరమాత్మగాను నిర్మక్తుంగాను, ప్రకృతికంటెం బరుంగాను, వేదాంతగోచరుంగాను, నిర్గుణబ్రహ్మంబుగాను ధ్యానించుచుందురు. నీవు భూతజాతంబులయంత ర్బహిఃపదంబుల వ్యాపించియుందువు గదా! అట్టి నీకు బ్రహ్మాండంబులన్ దెలియరానిదేది? సర్వకారణుండవైన నిన్నున్ దండ్రిగాంబొంది యేను సర్వలోకపూజ్యత్వంబుగాంచితి; నిందు సందియంబావంతయు లేదు సుమా! ఈ హేతువుచేత నేగదా, పితామహా! మహాత్ములైన మహర్షులెల్లరు హర్షోత్కర్షంబున మామకోపదేశంబును స్వీకరింపుచుందురు! ఇదియంత యుం దావకీనంబైన సుప్రభావంబె కదా! భవదనుగ్రహలబ్ధంబైన జ్ఞానం బునం జేసి సకలంబును నాకుం గరతలామలకంబగుచున్నయది. ఐనన్, చిత్తాంధకారనాశార్థంబును జ్ఞానాభివృద్ధ్యర్థంబును తత్త్వవిశ్వాసార్థంబును మోహోపశాంత్యర్థంబును నిన్ను బ్రశ్నించి, ప్రత్యుత్తరంబుగాంచుట కేనెల్లప్పుడు నుత్సహించుచుందుదు. కావున, నీవు సుపుత్త్రవాత్స ల్యంబునం జేసి నేనడిగిన దానిన్ సాకల్యంబుగాం జెప్పుము. నాకు దైవం బును, గురుండును నీవె కదా!" యని వినయవినమితశిరస్కుండై, విన్నవించుచున్న యన్నారదమహామునింజూచి, యన్నలువ నలుమొగములం జిఱునగవు వెలుంగులు వొలయ, మృదుమధురంబుగా నిట్లనియె॥ 144

ఆ॥ "వలతు వినంగ దేని? వత్స! కౌతూహల
మ్మెందుఁ గలదు నీకు నెచ్చుగాంగ?
నాశ్రితస్వచర్య! శ్వశ్రేయసంబు నీ
కౌను; నాకుఁ జెప్ప హర్షమౌను॥" 145

వ॥ అనిన, సురముని శతధృతి కిట్లనియె॥ 146

ఆ॥ "ద్రుహిణ! వినంగవలతు బహుజగత్కారణం
బేది? వైదికక్రియాదిమూల
మేది? యక్షరాక్షసాదుల స్వక్రియల్
భేదమొందుదేన? విశ్వకర్త! ॥ 147

ఆ॥ పరమపురుష! యెవనివల్లఁ జాతుర్వర్ణ్య
ముద్భవిల్లెఁ? గల్గెఁ దద్విభాగప్ర
కారమెల్ల యెట్లు? పాఱులధర్మంబు
లేవి? నృపుల గుణములేవి? దేవ!॥ 148

ఆ॥ ఏది వైశ్యధర్మ మేది? శూద్రులధర్మ
మెట్లు వీరు నడువ నెంచనుత్త
మత్వ మొందుచుంద్రు? తత్త్వస్వరూప! నా
కేర్పడంగఁ జెప్పవే, మహాత్మ!॥ 149

ఆ॥ స్వర్గకీర్తికరము, క్షత్రియధర్మంబ
దేది? యవరజాతి కెల్ల విహిత
ధర్మమేది? వినఁగ ధర్మోదర! కుతూహ
లంబుగల్గె మది ఘనంబుగాఁగ॥ 150

ఆ॥ ధర్మగర్భ! విశ్వనిర్మాణకర్తవౌ
నీవుగాక, దీనినిర్వచింప
దక్షుఁడెవ్వఁడయ్య! దయతో నసంశయ
మ్మగల నాకుఁ దెల్పవే, మహాత్మ! ॥ 151

ఆ॥ ఊర్ధ్వశేషబోధ! సర్వవిద్యారాశి
వాఁడుగాదె! దేవ! హంసవాహా!
సకలసంశయంబులకు సమంజసమంజు
లోత్తరంబొసంగ నోపుదీవె॥ ” 152

వ॥ అనిన, వాణీజాని వీణాపాణి కిట్లనియె॥ 153

ఆ॥ “ వినుము; వత్స! చెప్పెదను జగత్కారణం
బైనదాని; నెట్టులన్నఁ, దొల్లి
యెఱుఁగరానిదై, యతీంద్రియంబై, తమో
భూతమ పరితర్క్యమును, బరంబు॥ 254

ఆ॥ సర్వశూన్యమట్టులుర్వరఁ దోఁచు; నం
దుండి వ్యక్తమైన యొక్కదివ్య
తేజముద్భవిల్లె దృగ్దృశ్యభిన్నమై,
యొప్పఁజూపె, యది ప్రమోత్సవంబు॥ 155

ఆ॥ ఇట్టులుద్భవిల్లినట్టిసర్వాత్మకుం
డాత్మసర్వసృష్టినభిలషించి
తొలుతసృష్టిఁజేసెజలముల; వానిలో
నైజబీజముంచెఁ దేజమొప్ప॥ 156

ఆ॥ అందునుండియయ్యెనండంబుహైమంబు;
నేనుబుట్టినాఁడదానియందు
లోకకర్తనైతి; లోకేశుఁడుఁ బితామ
హుండనన్ యశంబునొందినాఁడ॥ 157

ఆ॥ నారమనఁగ నీరమా; రమేశునకయ
నమయియుంటనీరమమలచరిత !
శ్రీరమావరుండునారాయణుండయ్యె;
భువనవిదితమిదియుఁబుత్త్రి! వింటె! ॥ 158

ఆ॥ నారదర్షి ! యేనునారాయణునినాభి
పద్మసంభవుండఁ; బ్రాఁబలుకులు
వలుకుచుండుఁజూవె! భక్తి "యోబ్రహ్మణ"
మనుచు, నెపుడు మరియు మనుచు జగము ॥ 159

ఆ॥ అతనితలఁపువలన నండంబుమొదట నే
ర్పడియె; రెండుసేసెఁబరమపూరు
షుండు దానిఁజీల్చి పొరిది నింగియు, నేల
వాని వల్లఁగల్గె; మూని! వింటె ! ॥ 160

ఆ॥ చరము, నచరమయిన సర్వంబునేసృష్టి
సేసినాఁడ; దేవసిద్ధచార
ణాదులుద్భవిల్లిరయ్య! తద్దివ్యులు;
నరులుభువినిబుట్టి, వరలుచుంద్రు॥ 161

ఆ॥ వత్స! దైత్యదానవప్రభృతులుకొంద
అంతరిక్షచరులు, నటులెకొంద-
అంబుచరులు; క్రిములు, నల్లకీటములెల్ల
వివిధభేదజన్మవృత్తులొప్పి॥ 162

ఆ॥ తారతమ్యమొందినారు ప్రాక్కర్మచే
నరులు ప్రకృతిఁబడసినారు సృష్టి
కంబె మున్న; సిద్ధకస్వర్ణరేణువు
లెట్లొ, నామరూపహీనులట్లు॥ 163

వ॥ కుమారా! సత్త్వరజస్తమోరూపయైన ప్రకృతిమాయామయంబు సుమీ! అమ్మహాశక్తియైనప్రకృతి యీశ్వరాధిష్ఠితయై యీసచరాచరంబైనజగజ్జాలంబునవ్యక్తిభవించుచుండు. జంతుసంతానంబంతయున్ తజ్జంబై, లోకంబునంగర్మవశ్యంబైయుండు, భూరిసద్గుణంబై తేజోమయంబైనసత్త్వంబు నిర్మలంబు. లోభదంభాదికారణంబైన రజంబుకించిన్మలినంబు. అత్యంతశోకవ్యామోహకారణంబైనతమంబుమలినంబు. అందుసత్త్వంబుశుద్ధంబని, మిశ్రంబని, ప్రాజ్ఞులు ద్వివిధంబండ్రు తద్భేదంబునంజేసియేగదా, విశ్వవిశ్వంబు తారతమ్యంబునొందియుండు! నదియెల్లందు వేని! 164

గీ॥ బ్రహ్మనిష్ఠులు, శుద్ధసత్త్వప్రధాను
లాదురస్పృష్టకర్మబంధానుబంధు
లై, సనాతనులై, పరమాత్మయందుఁ
జొక్కియుందురు కొందఱు సుకృతివరులు। 165

ఆ॥ మిశ్రసత్త్వవశులు మేదినిపైఁగర్మ
భేదములను, నైకభేదములను
జన్మలెన్నొయెత్తి సౌఖ్యంబులేకయ
విషమవిషయవశతవేగుచుంద్రు॥ 136

కం॥ దేహులకుఁగర్మబంధము
దాహృతపరాజమ్మ! యదియనాదియు, భయదం
బూహాతీతము, విషమం
బైహికమాత్రికనిష్ఠమె, నిబిడంబౌ॥ 167

కం॥ ప్రాక్కర్మవశతలోకము
లెక్కటి వైషమ్యమొందు; నెవరెవరికి యీ
దృక్కర్మ పురాకృతమో
నిక్కముతద్దృక్ఫలంబునిఖిలజనులకున్॥ 1(8

ఆ॥ ప్రకృతిసంభవములు, ప్రకటసత్త్వరజస్త
మోగుణంబులవ్వి; పుత్త్రి! కర్మ
మార్గమద్దుఁజూవె; దుర్గమంబగుకర్మ
మార్గమెన్నమానివర్గనుత్య! ॥ 169

ఆ॥ స్వర్గివర్గమెల్లసత్త్వగుణాధిక్య
భాక్త్వమునవెయూర్ధ్వపదముఁగనియె;
నమరమునివరేణ్య! యీయక్షగంధర్వు
లెల్లరాజసులుసుమీ! కుమార!॥ 170

ఆ॥ మానవాళియెల్లయీానుదామసగుణా
ధిక్యయుక్తమై, స్థితిన్ వహించు;
నిత్యసత్త్వగుణులుఁజెందురానందలో
కముఁ; దామసుల్ జఘన్యగతులు॥ 171

ఆ॥ తవిలియుందురంధతామిస్రలోకంబు
లందుఁబూాయచరణులగుచు, నుచ్చ
నీచగతులకెల్లనిజకర్మకేవల
కారణంబుపుత్త్రికా! ధ్రువంబు॥ 172

ఆ॥ ఉత్తమంబుబుణ్యకృత్తముల్ గతిఁగాంతు
రుత్తమాధమంబులాత్తధర్మ
లైనమానవులకధీనంబులౌ; మధ్య
మాఖ్యగతియునటులెయందుఁజుమ్మి!॥ 173

ఆ॥ జంతుసంతతికివి జన్మదేశములు క
ర్మానుగాములౌ; మదాననంబు
నుండియింద్రుఁడగ్నియుద్భవించిరి; చక్షు
రుదితుఁడినుఁడు; శశియుమదినిబొడమె॥ 174

ఆ॥ వాయువుద్భవించెఁబ్రాణంబునుండి; యా
కసము నాభియందుఁగల్గె; శీర్ష
జాతమయ్యెదివము; సత్త్వాదిగుణభేద
వశతస్థానభేదభాక్త్వమొందు॥ 175

ఆ|| గుణము, క్రియయు భేదమును బొందె, జంతువుల్
దాము భేదమొందుఁ దారతమ్య
మొనర; లోకములను సృజింపఁగా సృష్టి
ధర్మమిద్ది యుద్ధధర్మ! వింటె! || 176

ఆ|| కనుక, బ్రాహ్మణాదిజనులకు గుణభేద
కలనఁ గర్మభేదములును, స్థాన
భేదములును, దత్త్వవేత్తలు వల్కుచుం
దురు రమేశభక్తిభావహృదయ! || 177

ఆ|| మనుముఖంబునుండి సన్మాన్య! బ్రాహ్మణుం
డుద్భవించె; బాహుయుగ్మసంభ
వుండు క్షత్రియుండు; వొడమె నూరువుల వై
శ్యుండు; పాదజుండు శూద్రుఁడయ్యె || 178

ఆ|| భద్రభావ! వింటె; బ్రాహ్మణక్షత్రియ
వైశ్యశూద్రజను ప్రకృతిసిద్ధ
ధర్మకర్మములును, దదితర భేదముల్
గలవు పెక్కు; తెలియవలయు వాని || 179

ఆ|| సౌమ్య! విప్రుఁడౌను సత్త్వోత్తరుడు క్ష
త్రియుఁడు రాజసప్రవృత్తినుండు;
నూరుజుండు దామసోచితుండౌ; శూద్రుఁ
డరయ సత్త్వశూన్యుఁడగును జుమ్మ! || 180

వ|| ఇయ్యెవర్ణస్వరూపంబింక వర్ణస్వభావంబెల్లంజేని || 181

అ|| శాంతి, దాంతి, తపము, శౌచంబు, స్వాధ్యాయ
మోర్మి, యార్జవంబునో నరజ్ఞాన
మవని సురుల గుణములాస్తిక్యవైరాగ్య
ములు స్వభావసిద్ధములుకుమార! || 182

ఆ|| శౌర్యధైర్యములును, సద్బలతేజముల్,
దక్షతయును, మఱియుఁ దైక్ష్ణ్యమాహ
వోర్వినుండి మరలకుండుటయును క్షత్రి
యస్వభావజంబులార్యనుత్య! || 183

ఆ॥ వైశ్యలక్షణములు వాణిజ్యగృధ్నుత,
ధనము-ధాన్యములను దాఁచుటయును,
సత్యమంచునే, యసత్యమాడుటయు, వి
శ్వాసఘాతుకత్వభయనటనలు॥ 184

ఆ॥ శూద్రలక్షణములుసూ! ప్రాణగురూతోభ
యంబు, పార్థ్యభృత్యతాఽనుకూల
కృత్యపరత, మఱపు, క్షిప్రకారిత్వంబు,
సత్త్వహీనతయును సహజములగు॥ 1 5

ఆ॥ బ్రాహ్మణావనీశవైశ్యులకుచితంబు
లైన వైదికక్రియాకలాప
ములను దెలియ వినుము; మునిముఖ్య! షట్కర్మ
లవనిసురులకొప్పునా చరింప॥ 186

వ॥ అవియును గ్రమంబుగా నధ్యయనంబును నధ్యాపనంబును యాజనంబును యజనంబును, బ్రతిగ్రహంబును, దానంబును ననం బరఁగు; నివ్వియన్నియు బ్రాహ్మణునకు విహితంబులే యగు. వీనక్షత్రియునకు యజనాధ్యయన దానంబులు మూఁడును, మఱియుం బ్రజాపాలనంబు, నగృధ్నుతయు విహితంబులగు; నిఁక, వైశ్యునకుం గృషియు, గోరక్షయు, దానంబు, నిజ్యయు, నధ్యయనంబును, వాణిజ్యంబును గుసీదంబును విహితంబులైన కృత్యంబులు. త్రైవర్ణికులకీకర్మజాతంబు వేదచోదితంబు సుమీ! వారు వేదమంత్రపూర్వకంబుగాఁ గృత్యంబులెల్ల నిర్వహించుకొనంగగు. శూద్రులును, మఱియు నవరవర్ణులును బౌరాణికమార్గంబుననే కర్మాచరణంబునకుం గడంగునది. కృత్యనిర్వహణంబు సమంత్రకంబు నమంత్రకంబునని ద్వివిధంబు. బ్రాహ్మణక్షత్రియవైశ్యులు సమంత్రకంబులుగాను, శూద్రావరజాతులమంత్రకంబులుగాను గృత్యంబులాచరించునది. శూద్రునకు ద్విజశుశ్రూషయే పరమధర్మంబు. దయాసత్యశౌచంబులు సార్వవర్ణికంబులైన ధర్మంబులు॥ 187

గీ॥ బ్రహ్మముఖసంభవత్వసత్త్వప్రధాన
తాఁతిశుద్ధత్వములవిప్రుఁడన్ని వర్ణ
ములకుగురువయి, పూజ్యుఁడౌ; నళిననయన
పదయుగళనిత్యనిశ్చల భక్తి భావ! 188

ఆ॥ పొక్కిలికిని బైనఁబురుషుఁడు మిక్కిలిఁ
బూజ్యుఁడౌనుగాన;ముఖము మేధ్య
తమము; బ్రాహ్మణుఁడు తజ్జాతుఁడౌట న
త్సర్గమంతటికిని స్వామియతఁడె॥ 189

ఆ॥ వేదవేత్తయైనవిప్రునియందు దే
వతలు నిల్చియుందురు; బ్రాహ్మణునకు
వందనంబొనర్ప వలెఁ;గాని, యశ్లీల
మనఁగఁజనదు పాఱునందుచేత॥ 190

ఆ॥ ఎవరుబ్రాహ్మణులనుదృప్తులఁగావింతు,
వారుతృప్తిసేయువారుసర్వ
దైవతముల; ముఖ్యధర్మంబు బ్రాహ్మణ
పూజనంబువర్ణములకు నెల్ల॥ 191

ఆ॥ విప్రపాదపద్మవిప్రకీర్ణ పరాగ
మానుసర్వసంపదాస్పదంబు;
సర్వతీర్థశుద్ధిసాధనంబాపత్ప
రంపరానిరాకరంబునౌను॥ 192

ఆ॥ ఇదియు సకలనిగమవిదితంబు;విహితంబు;
సర్వశాస్త్రమార్గసమ్మతంబు;
సర్వధర్మమర్మ సారభూతంబిద్ది;
యిద్ధపుణ్య! గణ్యశుద్ధసత్త్వ! ॥ 193

ఆ॥ చేతనంబులౌను శ్రేష్ఠంబులుజడాహ్వ
యములకంటెఁ; జేతనములలోన
మానవుండు పూజ్యుఁడౌను; మానవులలో
బ్రాహ్మణుండు పూజ్యవర్యుఁడన్న ॥ 194

ఆ॥ బ్రాహ్మణాళియందు వర్ణనీయుఁడు బుద్ధి
శాలి; యట్టిబుద్ధిశాలురందు
నర్హతముఁడు సూ! సదాచారవంతుఁడ
వ్వారియందు హెచ్చు బ్రహ్మవేత్త॥ 195

ఆ॥ పూజ్యుఁడౌను జూవె! పుట్టువుకతనే
బ్రాహ్మణుండు; చదువు, వ్రతము తపము
కారణములుగావు; పఱుండు సర్వోత్త
రుండు; పుణ్యకృత్తముఁడతండు॥ 196

ఆ॥ జపము, తపము, దాంతి, శాంతి, స్వాధ్యాయంబు
వ్రతము, హుతము, తృప్తి వఱలునిష్టి
జన్నిగట్టులకునుసంస్కారములు భృశో
ద్దీపకంబులివ్వి దేవపాని! ॥ 197

ఆ॥ క్షత్రియులకుఁజెల్లుశస్త్రాస్త్రధారణం
బిజ్య, లౌకికార్థహేతువాద
చర్చ, వేదవిద్యనేర్చుట, విప్రవి
ద్వత్సమాదరంబు, పాలనంబు॥ 198

ఆ॥ వాహదంతిముఖ్యవాహనారోహణ
నిపుణతయును, గావ్యనిర్ణయంబు
పరమధర్మములగుఁ; బాడిదప్పనివర్త
నంబు వేదచోదితంబులివ్వి॥ 199

ఆ॥ వైశ్యధర్మములగు బ్రాహ్మణపూజ, వా
ణిజ్యకృషులు, శౌచనీతిపాశు
పాల్యములుఁ గుసీదవర్తనంబు, రమాధి
నాథపాదపద్మనమ్రభావ! ॥ 200

వ॥ బ్రాహ్మణక్షత్రియవైశ్యుల వైదికకృత్యంబులన్నియు వైజాత్యం
బులు సుమ్ము. మఱియు, నవ్వియన్నియు దేశకాలవిభక్తంబులై
మంత్రపురస్సరంబులై యొప్పుచుండు; స్త్రీ శూద్రులాచరించు
కృత్యంబులుతూష్ణీంభావసమాచరణీయంబులు. లోకైకవిష్ణునాథ లే

నిరాబాధంబులై, బాధంబులైన నూధారంబులు, లోకంబులకీ
క్రియూభేదంబు లీక్రియఁగల్గుచుండు", ననిపలికిన, వినిసురముని
నిటలస్థ్సపుటితకరకమలపుటుండయి, పుయిలోడక నలువ
కిట్లనియె ॥ 201

ఆ॥ "సరసిజాతజాత! వరుసఁజాతుర్వర్ణ్య
కర్మభేదమెట్లు గల్గె? ధర్మ
భేదమెట్లుగల్గె? పృథ్విపైఁ బెక్కులు
కులములుండె; వానిఁదెలియవలతు [యు]॥ 202

ఆ॥ వానిపుట్టుకయును, వానిభేదంబులు,
వానికృత్యభేదవర్గ మెల్ల
నద్భుతంబు; సెప్పుమంబుజోద్భవ! భవ
త్ప్రపకుఁబాత్రమైతి; విపులఫణితి" 203

వ॥ అని, వినయవినమితుండయినయమరమునివరునకుఁగమలజుం
డిట్లనియె॥ 204

ఆ॥ "విపులమగును వానివివరింప; సంక్షేప
రూపమునను జెప్పనాపలుకులు
వినుము; వానివాని భేదవాదంబులు
తెలియఁగలవు నీకుదివ్యమౌని! ॥ 205

ఆ॥ మహితమహిమమయినబహువిధసమయంబు
సరగజరుగజరుగ, స్మరపరాయ
ణత్వమునననునరులు, నారులు శాస్త్రమ
ర్యాదలేక లేశమైనఁగాని ॥ 206

ఆ॥ కామకాతరత్వగాములై, యుచ్ఛృంఖ
లముగఁబరకళత్రలాభలోభ
చిత్తులౌచు, నరుఁడు, స్త్రీలును బరపురు
షోపభోగవృత్తిఁబాపమనక ॥ 207

ఆ॥ సురతమాత్రలాభసుఖముననాల్గువ
ర్ణములు వర్ణసంకరతకు హేతు
భూతములయి, సారిదిఁబుట్టించెఁబడియు, నె
న్నొదియుఁదెఱఁగులయిన భిదల వాన ॥ 208

ఆ॥ మగలు, మగువల యకొఱఁ జేయు వ్యభిచార
కారణమునఁ జేసి వేఱుపడియె
వర్ణసంకరత్వ మర్ణోజనాథపా
దాబ్జనిశ్చలాంతరంగభృంగ ! ॥ 209

గీ॥ అనులోమ్యంబుఁ, బ్రాతిలోమ్యంబు, సంక
రత్వమును వర్ణములకు నేర్పడఁగఁ బుత్త్రి !
సాంకరికులు బాహుళ్యంబె సంగమించి
రెట్లనంగను వినుము మునీంద్రనుత్య ! ॥ 210

ఆ॥ పాదజన్మువల్ల వైశ్యాంగనకుఁ బుట్టు
వాఁడు కరణసంజ్ఞ వఱలువాఁడు;
వైశ్యువల్లఁ బుట్టువాఁడు బ్రాహ్మణికినం
బష్ఠుఁ డనఁగఁ బరఁగువాఁడు పుత్త్రి ! ॥ 211

ఆ॥ రాజువల్ల వైశ్యరమణికిఁ బుట్టిన
వాఁడు మాగధుండు; వైశ్యువల్ల
క్షత్త్రియాంగనకును జన్మించువాఁడు మా
హిష్యనామకుం డహీనపుణ్య ! ॥ 212

ఆ॥ పాదజన్మువల్ల వైశ్యాంగనకుఁ బుట్టు
వాఁడు క్షత్త్రయండ్రు వసుధఁ గొంద
అవనిసురుని వనితయందు రాజునకుద్భ
వించువాఁడు సూతుఁ డిద్ధపుణ్య ! ॥ 213

ఆ॥ వైశ్యువల్లఁ బుట్టు వైదేహకుండు బ్రా
హ్మణికిఁ; గరణియందు మాహిషోద్భ
వుండు సంజ్ఞఁ గాంచుఁ బుత్త్రిక ! రథకారుఁ
డనఁగ; ననఘచరిత! యమలహృదయ ! ॥ 214

ఆ॥ పాదజన్మువల్ల బ్రాహ్మణియందుఁ జం
డాలసంజ్ఞుఁ డాదటన్ జనించు
వాఁడు; సంకరత్వవశమునఁ బదియు, నె
న్మిదియుఁ దెఱఁగులయిన భిదలు గలిగె ॥ 215

ఆ॥ బ్రాహ్మణాదులైన వర్ణముల్ నాలుగ
ప్రాపశత్వమొందె భేదములను;
వాన గల్గె భిన్న వర్ణముల్ నూఱొక్క
తెఱఁగులగుచు; విగతదురితచరిత ! ॥ 216

ఆ॥ ఆత్మపుణ్య! పుత్రి! తత్తదాచారముల్
తత్తవర్ణకృత్యధర్మములను
భేదమొందు దేశభేదకాలపరిభే
దములవలన; విమలతరమనస్క! ॥ 217

ఆ॥ సమయవిదులవలనసాంకర్యభేదోచి
తంబులైనసర్వధర్మములు ప్ర
సాదితంబులౌను సముచితాచారముల్
వేదవత్ప్రమాణమౌఁదదుక్తి ॥ 218

ఆ॥ వడుగుఁ జేయ దగును బ్రాహ్మణక్షత్రియ
వైశ్యులకు విహితవర్ణములను.
దత్తదృతువులందు, దత్తదాచారభే
దానుసారమెట్టులనఁగ, వినుము ! ॥ 219

ఆ॥ అవనిసురమహీపులకష్టమైకాదశా
బ్దములఁ; బదియుమూఁట వైశ్యునకు; వ
సంతగ్రీష్మములను, శరదృతువున జేయ
నౌను వడుగువరుసగాను బుత్రి ! ॥ 220

ఆ॥ ఎవ్వఁడేని, స్వకులమేదియో, యాచార
మేదియో, క్రియాప్రభేదమేదొ
యెఱిఁగిసేయ, వంశవృద్ధకర్మాగతం
బును, వాఁడు పతనమును బడయఁడు ॥ 221

ఆ॥ మూర్ఖుఁడై, యెవండు పూర్వులయాచార
ముజ్జగించి, యన్యమొప్పఁ జేయు,
వాఁడు పతితుఁడగును; వంశధర్మప్రణా
శకుఁడునౌను; వాఁడు శఠుఁడునౌను ॥ 222

వ॥ అహింసయు, నక్రోధంబును, సర్వభూతహితేచ్ఛయుననునీయవి సర్వమానవులకుసాధారణంబులైనధర్మంబులు. పుత్రికా!యిట్లు వర్ణవైభవంబును సంగ్రహంబుగాఁదెల్పితి; నీకనేమివినవలతు వద్దాని నెఱింగించెద"నని, చతురాననుండు తూష్ణీంభావంబు నొందె; నంతటనారదమహామునీంద్రుండు శారదాప్రాణనాథునకుం బునఃపునస్సాష్టాంగదండవత్ప్రణామంబులాచరించుచుం, బ్రసాదముత్పాదించుచు, సప్రశ్రయంబుగా, సాంజలిబంధంబుగా నిట్లని విన్నవించె॥ 223

కం॥ "వినుతనిజసృజనవిభవా!
వినఁదగినవిశేషములనువినిపించితి నా
కనఘ! నతశుభద! సుజనా
వన! చతురానన! సమస్తవర్ణవిషయముల్॥ 224

వ॥ పితృచరణులయిన తమదయవలనఁజాతుర్వర్ణ్య క్రియాభేదంబులును, సంకరజాతిభేదంబులును,దత్తదాచారకృత్యభేదంబులును యథాతథంబుగాఁ నంగల్గితి;ననఘుతఁ భవదసితరఘువతరపరిచయ విభవమును మిగులబహుళముగఁబడసినకతమున మఱియు వినవలసినయది యొకటిగలదడుగవలయునని, కుతుకముగలిగి, యవధరింపంబ్రార్థించుచున్నవాఁడఁ; గుతూహలహాలహాలికా సహాసనాసహంబైననాసాహసంబునుమన్నింపనర్హుండ వీవాదు, గాదె! నావిన్నపంబెద్దియనిన॥ 225

ఆ॥ సత్యచర్య! చిత్రకృత్యవిచక్షణుల్
మహినిగలరు జనులు "మహాక్షత్రికాఖ్యు"
లేనుగంటి; వారలెల్ల "రార్యక్షత్రి
యులు" ప్రసిద్ధులుత్తమోత్తములును॥ 226

ఆ॥ శౌర్యధైర్యవంతులార్యధర్ములు రూప
శోభితులు సువర్చసులు స్వధర్మ
రతులువారలెల్లబ్రాహ్మణదైవత
భావులనఘచరితులోవిధాత! 227

ఆ॥ వారిపుణ్యగాథ వారిజాతాసనాసీన! వినఁగ నాకుఁ జిత్తముల్ల
సిల్లు; విస్తరించి చెప్పవే, మహాక్త్రికుల్ నాల్గుజాతులందుఁ గల్గువారె?

ఆ॥ పదియు; నెన్నిమియనవిదితజాతులలోనఁ
గాని, యవరజాతిఁగాని మహాక్త్రి
కాఖ్యులుద్భవించిరే? ఖ్యాతిఁగాంచిరే?
వారిగాథ వినఁగవలఁతు దేవ !॥" 229

వ॥ అనియిట్లపూర్వంబుగాఁ బ్రశ్నించుచున్న సుపర్వమహర్షి
వర్యుఁ జూచి, యవ్విరించి రసోదంచితంబుగాఁ, బ్రస్తావోచితం
బుగా, మృదుల మధుగ వచనరచన మెఱయ, సురుచిరఫణితి
నిట్లనియె. 230

సీ॥ "వినుము; నారద! మహాక్త్రికుల నఁగ, ననఘ
చరితులగుదురు వారలు; సర్వకార
ణంబు, బ్రహ్మంబు మఱి, నిర్గుణంబు, పరము,
నాదిమధ్యాంతరహితంబు, నద్వయంబు ॥ 231

సీ॥ అట్టిబ్రహ్మము మాయ, సృష్ట్యాదిహేతు
వైనది; స్పృశింపబ్రహ్మవిష్ణ్వాదిరీశ
మూర్తిసంజ్ఞితమయ్యెఁ; దన్ముఖభుజోరు
పాదములనాల్గువర్ణముల్ ప్రభవమొందె ॥ 232

ఆ॥ తత్త్రిమూర్తిభేదమాత్రాసితాంతకుం
డగుమహేశుశుభభుజాగ్రమందు
నుద్భవించెజాతి యొక్కఁడార్యక్షత్రి
యాఖ్యమై, ప్రసిద్ధమై, కుమార ! 233

ఉ॥ అందఱుశౌర్యమందిరులె; యందఱుధైర్యసమున్నతిన్ మహా
మందరులే; యరిందములె; మాని విప్రపృథుప్రభావులే;
యందఱుఁగీర్తిచంద్రిరులె; యందఱు భవ్యమహానుభావులే;
యందఱుసుందపుణ్యులె; శుభాధికులే; దిగధీశభావులే ॥ 234

కం॥ శరనిధిగాంభీర్యులెయందఱు; గుణమణినికరరోహణక్షితిధరులం
దఱును గురుచరణసేవాధురంధరులె; సుందరతనుతులితమదనులే !

ఆ॥ మహిత యశుఁడు, హాని, హాక్తికుండద్విజా
నాథబాహుజాతుఁడేధమాన
ధర్మనైభవుండు, తతవేఁమార్గసం
యుక్తుఁడౌమహాత్ముఁడుండె" నంచు ॥ 236

ఆ॥ చెప్పుచుండునంతముప్పిరిగొన్న జి
జ్ఞాసఁజేసిపల్కె నారదుండు;
"స్వామి! మనవి; వినఁగవలతు; హాక్తికకులో
ద్భవుఁడు భవునిభుజమువలనఁబొడమ॥ 237

ఆ॥ ఏలయయ్యెనయ్య! యేతత్కులాభిఖ్య?
యుగ్రబాహుదండముస్స్వప్రవ
దేశమాటనా? సురేశవందితపాద
పద్మయుగ్మ! దేవ! వాక్పతీశ !! 238

గీ॥ వారిధర్మంబులెవ్వి? సంస్కారమెట్టు
లిష్టమాఁ? దెల్పఁగదవె, లోకేశ! బ్రహ్మ
కల్పమున; జేసియో, లేక, క్షత్రకల్ప
మునను జేసియొ, యెఱిఁగింపుమనఘ! నాకు॥ 239

ఆ॥ గిరధీశ! వారిశారీరసంస్కార
ములకుఁగల్ప మేది? మూలవృత్తి
వారికేది? యెట్లువఱలునయ్యది? యెఱిం
గింపుమదికి నింపునింప దేవ !!" 240

వ॥ అని, వినయవినమితుండయి, యడుగుచున్నకొడుకును గనుంగొని శతధృతిమతిధృతమహితామితాదృతియై, సందేహాసందోహ విచ్ఛేదకారిణియైన బోధముద్రముద్వ్రసూప, హర్షోదోఁప, నిట్లనియె ॥ 241

ఆ॥ "హ్రుత్కమలము విరియుఁదత్కులోద్భవకార
ణంబుఁజెప్ప, వినఁగ; నారదర్షి !
మూలపురుషుఁడయిన ముక్త్యర్షి గాథచేఁ
బొడమునిపుడు మేనఁబులకలహాహా! ॥ 242

ఆ॥ వీనుదోయి విందు, వీరశృంగారర
జితము, పుణ్యధర్మయుతము; హృద్య
వృత్తశోభితంబు, వేదోక్తమార్గప్ర
వృత్తమనఘమాత్మతృప్తికరము ॥ 243

ఆ॥ వృద్ధులొసఁగుమిగులవినఁగనాఖ్యక్షత్రి
వృత్తములుఁ, దదీయవిపులమహిమ
మౌనినాథకథితమౌక్తికధర్మముల్
తెలుపువాఁడ; వినుము లలితహృదయ! ॥ 244

చం॥ తొలుత, యుగాంతకాలమున ధూర్జటిసృష్టియొనర్చె నూహకై
జలములు; భూతజాలములు సంకులతామసవృత్తి నుండఁ, న
జ్జలములఁ దోఁచె శ్రీహరి దిశావలయంబునఁ గాంతిఁ గ్రమ్ముచున్;
జలజమొకండు పుట్టె హరినాభిపదంబున దర్శనీయమై॥ 245

ఆ॥ సంజనించి వాఁడఁ గింజల్కవర్ణుండ
నైన నేను నలువ; నాసరోజ
మందుఁ బుట్టి, యొంటి నట్టిట్టు దిక్కులం
జూచుచుంటినయ్య! చోద్యమయ్యె॥ 246

ఆ॥ చూడఁ జూడ నన్ను శూన్యదృక్కులనెక్కు
డెల్లఁ, జింతనిండె హృదయమునను;
ఖేదమొదవె మిగుల 'నాపనువేమి? నే
నేమిసేయువాఁడ? నెందు జొత్తు? ॥ 247

ఆ॥ నాకు దండ్రియెవఁడు? నన్నెలపుట్టించె
నతఁడు? శరణమెవఁడు? గతియెవండు?
నాదు ఖేదమణఁచు నాదయామయుఁడెవం"
డనుచు, ననుచు గోర్కెలతిశయింప॥ 248

ఆ॥ చింతమున్గియుండ నంతలోఁ దోఁచె నా
కాశవాణి నాకుఁ గడఁకఁ గూర్చి
"భయము వలదు; వత్స! భవదీయజనకుండ
నేను; ప్రణవజపము నిష్ఠఁ జేయు"॥ 24

క॥ అన, వినియుఁవినకమున్నే
ప్రణవము జపియింప, దివ్యవర్షంబులు వేఁ
జనియె సహస్రంబులు; హరి
సనాతనుండశ్వశీర్షశాలి,స్వయముగన్॥ 250

క॥ ననుఁగఅపెసాంగవేదము
లనుహయశీర్షుండునిశ్చలంబగు కరుణన్;
విని, నిగమనిగదితధ్వని
దనుకనిసృష్టించితిని యథాపూర్వముగన్॥ 251

ఆ॥ చరము, నచరమయిన సకలంబుసృజియించి
మించినాఁడ నే విరించినాఁగ;
బహువిధంబులైనప్రాణులంతట క్షుత్పి
పాసలలమఁజాలబాధనొంది॥ 252

ఆ॥ సత్త్వములనుఁగొన్ని "జక్షామ" యనిపల్క
నయ్యెనంతనవియుయక్షవర్గ;
మాక్షణంబకొన్ని "రక్షామ" యని, యయ్యె
రాక్షసాళి; యంబురాశిఁజొచ్చి॥ 253

ఆ॥ చరము, నచరమయిన సర్వసృష్టియువారి
చేత క్షోభమొందె; సేఁగిలోఁగె;
లోకమెల్లరాక్షసాకులంబయ్యె; ది
క్కేది, భూతజాతమెంతయేని॥ 254

ఆ॥ అంత, నేను సృష్టికారంభమునుజేసి
మూఁడులోకములను బురుడులేని
కడిమిసూర్యుఁ,జంద్రుఁ, గ్రతుభుజులను, వహ్ని
నింద్రు, దేవయోనులెల్ల,మఱియు॥ 255

సీ॥ కామధేనువుఁ జౌదంతిఁ;గల్పవృక్ష
మల్లనుచ్చైశ్శ్రవంబు, శేషాహి, స్వర్గ
మండలంబును, మధ్యమమండలంబు,
జంతుసంతతి, గుల్మవృక్షములు, లతల॥ 256

సీ॥ పశువులను, బక్షులను, భోగివర్గమదిరి
నదుల, నుదధుల, వనముల, సదయశాంత
భావుల, జగద్విశేషులఁ, బరమఋషుల
నావసిష్ఠాదులను, మతియహీంభువనము॥ 257

సీ॥ అఖిలసృజనమున మోహితచిత్తుఁడై
నై, పరిహృష్టహృదయమప్రమత్త
వృత్తినున్నఁగాని, వేదరాశిబలాత్క
రించి, దొంగిలించి, రక్తుఁజేసి॥ 258

ఆ॥ అసురులునధిచరులు పరిసభోతికభసు త్రై,
మధువు, కైటభుండు మాయనన్ను
మోసగించి వేదరాసులు గొంపోవఁ
గన్నులప్పగించి, కాంచుచుంటి॥ 259

ఆ॥ ఏమి సేయుఁదోఁప కేనుధ్యానింపధ్యా
నింపఁగానవచ్చెనిందిరావ
రుండు, భక్తిగమ్యుఁడుండజవాహుండు
మత్స్యమూర్తియగుచు, మాన్యకీర్తి॥ 260

ఆ॥ దేవదేవుఁడంతనావార్ధిలోపలఁ
జొచ్చి, యసురవరులఁ బరిచ్చి; వేద
రాశిఁ దెచ్చి, యిచ్చి, శ్రీశుండు తార్క్ష్యపై
నేఁగెలచ్చితోడ వేగమునను॥ 261

ఆ॥ జగములెప్పుడెపుడు సంక్షోభముందు దై
త్యాళివల్ల, శ్రీశుఁడప్పుడప్పు
డవతరించి, యసురహననంబు ధర్మసం
స్థాపనంబొనర్చుఁ; బాపమడఁచు॥ 262

చం॥ కలఁడు మహాచభావుఁడలకశ్యపమౌని, యనూనసత్త్వుఁడా
కలితతపఃపరిభావపరికల్పితసర్వచరాచరాత్మకా
త్యలఘుతరప్రపంచుఁడు, సమంచితపుణ్యవిశేషభాగ్యుఁడు
జ్జ్వలమహిమాతిశాయి, దితిజపరికరాదితిజపరిష్కృతుఁడై॥ 263

ఆ॥ అతనిసతులుదితియు, నదితియు; వారిసం
తతులు దైత్యులమరతతులు; వారు
యుద్ధకాంక్షదక్షు, యొండొరుల నెడలేక,
పోరుచుందు రెపుడు ఘోరరీతి॥ 264

ఆ॥ సోకుమూకలఁ బెరిచి, థాకసూపఁగ, నాగ
లేక, తెకలాచు, లేఖులంత
శరణుఁజొచ్చిరఖిలశరణు, జనార్దనుఁ
జక్రిపాణి, సింధుజాసమేతు॥ 265

ఆ॥ శ్రీరమేశుఁడెల్ల జేజేలకుఁబ్రసన్నుఁ
డై, వధించెఁజక్రహతిని జేసి
దితిజసమునసమును; ద్రిదశులువచ్చె స్స్వర
శ్రీకులై; గతార్తులై, కరంబు॥ 266

కం॥ సంతోషించిరనంతా
నంతకృపకుఁబాత్రులై, యనన్యమహిములై,
సంతమసమెడల, వెలుఁగుజి
రంతనరుచిదివసకరకరంబులువోలెన్॥ 267

వ॥ ఈవృత్తాంతంబంతయునిట్లుండె-నంత॥ 263

చం॥ కలఁడు, తపోఽధికుండొకఁడొకానొకకాలమునందునత్రి యు
జ్జ్వలతరనైష్ఠికుండు, నుతవానప్రస్థాశ్రమంబునన్, శిలా
స్థలిశయనించువాఁడు, విజితప్రకటేంద్రియుఁడున్, నిదాఘసం
దలఘుతరాగ్నిపంచకవృతాంతరసంస్థితుఁడున్, మహాత్ముఁడన్।

ఆ॥ తనదుధర్మపత్ని, యనసూయభక్తితో
సేవఁజేయుచుండఁ, జిగతపంబుఁ
జలిపెనత్రిమహానిసారసానహేర
సాక్షశివులఁగూర్చి, యమరు దువ్వ॥ 270

ఆ॥ అత్రిమహానిపర్యాడాహానినాత్రిఁదది
వర్జితముగఁబర్ణవారివాయు
భక్షణుఁడు శమదమక్షమాయుక్తుఁడు
నై, యొనర్చె సన్మహాతపంబు॥ 271

ఆ॥ అతిప్రమూర్తులంత, నాయత్రిమూనిని
స్థాగరిష్ఠతకును, వాగతీత
మహిమమునకు మెచ్చి, ద్రుహిణుండు, హరిహరుల్
సన్నుతాత్మకులుప్రసన్నులైరి॥ 272

ఆ॥ విపులకృపులు, ముగురు విస్మయదర్శనుల్
బ్రహ్మవిష్ణుశంకరప్రసిద్ధ
సంజ్ఞలొప్పువారు, సత్ప్రనాళేంద్రనీ
లాళిమౌక్తికప్రభాంచితతనులు॥ 273

ఆ॥ మఱియు, వాణి, పద్మ, పార్వతి హత్తగా
నత్తమిల్లు వారలాత్తశోభ
హంసలైన తేయమాంసలాంసోక్షవా
హాధిరూఢలై, ప్రహర్షలౌచు॥ 274

కం॥ ఇరుగెలఁకుల, వెనుకను ని
ర్జరులు గుములు గుములు గాఁగ, సంశ్రితులయి,రా,
హరిహరహిరణ్యగర్భులు
కరమరుదుగనతిప్రమాసఁగనఁగానిరెదుటన్॥ 275

ఆ॥ ఎనిమిదయిన కన్నులను, రెండుకన్నుల,
మూఁడుకన్నులను త్రిమూర్తులైన
బ్రహ్మవిష్ణు శివులు బ్రహ్మర్షి నత్రిద
ర్శించిరెసక మెసఁగనెంతయేని॥ 276

ఆ॥ అత్రిఁజూచి, వారలంభోజషండబర
ముజ్జ్విజాక్షిరుచుల, వాజ్ఞిపుణాత
మోఘపటుప, సజలమేఘగర్జాధ్వనిఁ
బలికిరిటులమధురభణితి వెలయ॥ 277

కం॥ "వత్స! మనః ప్రియమాగను భ
వత్సంకల్పితతపఃప్రభావత్సర భా
క్త్యాత్సద్వ్యక్తిత్యాసి, య
నుత్సిక్తైనస్వరూపత్కరోద్ధతిఁగూల్పన్॥ 278

ఆ॥ కోర్కె యేమి? సెప్పు మరొక్కపవరాజోవి
శేష!" యనఁగ, నత్రి తోపి యాచు,
నా త్రిమూర్తులకును సాష్టాంగదండప్ర
ణామమాచరించె నేమమొప్ప ॥ 279

ఆ॥ కరమున నమృతమొలుకుకరుణాకటాక్షవీ
క్షణములఁబరఁబంకజాతపీఠ
పంకజాక్షపంచవక్త్రులాయత్రి న
త్యాదరమునఁజూడ,నతఁడువొంగి ॥ 280

వ॥ ఆనందబాష్పంబులు నేత్రాంబుజంబులకుమరందబిందుసందోహ
దోహలంబులై, పక్ష్మలాక్షిదక్షిణాక్షిక్షితినుపలక్షింప, నత్రి
యక్షీణభక్తిన పారపారవశ్యంబునన్ గనకగర్భకనకాంబర
కనకగిరిధనుర్ధరుల నిట్లనిప్రార్థించె॥ 281

ఆ॥ "సృష్టి, స్థితిని, లయముఁ జేయుచు, రాజస
సాత్త్వికములఁ, దామసంబునొప్ప,
బ్రహ్మవిష్ణుశంకరస్థిరసంజ్ఞలఁ
దాల్చు మిమ్ము మదినిదలఁతు నెపుడు॥ 282

ఆ॥ సర్వదేవతలకు సార్వభౌములరు మీ
రాశ్రితేష్టదాతలౌదు రెప్డు;
సర్వభూతహితకులరు రింద్రియాతీతు
లైనఁగాని, మిమ్ముఁగానలేరు ॥ 283

ఆ॥ సన్నుతింతుమిమ్ము సర్వవేదప్రమా
ణాంగులైనవారి, నఖిలవిభుల,
నతిజగత్ప్రభావయుతుల, మహాత్ముల,
ముఖ్యమైనస్థానమునకుఁ బ్రభుల ॥ 284

ఆ॥ "ముఖ్యమైనకర్మములఫలంబును, యోగ
ములఫలంబుమీదు పుణ్యదర్శ
నముసఁబొందముఁబుడమినరులకు" నని మనీ
షులువచింతు రెపుడు సువిదితముగ॥ 285

ఆ|| సదయహృదయులార! స్వారాజ్యహేతువుల్
సర్వకేతువులగు సర్వకార్య
ములను ముగియుచుండు మువ్వరా మీయందె
దేహధారులకును దివ్యులార! || 286

ఆ|| చేటుగల్గ మాఱు సీతకు, సంపదల్
నిండుఁగనముఁ జూపుచుండుటకును
మీదు దివ్యనామ మాదట సంస్మరిం
చుటయె మూఁదఁ యని సుజనులందురు|| 287

ఆ|| సుప్రసన్నులార! దీప్రభవద్దివ్య
మూర్తిదర్శనమునఁ బొందినాఁడ
ధన్యభావమేను; మాన్యుఁడంత; మీదయన్
బడయరానిఫలము పుడమిఁ గలదె? || 2‾8

ఆ|| మహితమహిములార! మందాకినీతీర
వాసులకును బహుపిపాసయున్నె?
తాపమెట్లుపుట్టుఁ? దాపసలోకహి
తార్థులైన మీదసార్థులకును? || £89

ఆ|| ధర్మపత్నియందుఁ దనయుల మువ్వురఁ
గాంచఁ గోరుచుంటిఁ; గరుణగలిగి
దివ్యవర్యులార! యవ్యయులార! మీ
మ్ములను బోలుసుతులె పుట్టవలయు|| ” 2;0

ఆ|| అత్రిమౌనికోర్కె నాలించి, యాత్రిమూ
ర్తులును మధురవచనములఁ బలికిరి
స్మితముఖములకును సింగారమును గూర్ప
నభయమొసఁగి, సార్థమావిధాన || 291

ఆ|| “ మునివరేణ్య! మిగులఁ గొనియాడనే నీదు
కోర్కె; మముఁ బోలుగుణగరిష్ఠు
లుండరెందుఁ గాని; యుష్మత్తపశ్చర్య
మెచ్చఁ గూర్చె మాకు సచ్చరిత్ర! || 292

ఆ॥ నిన్ను గ్రహింతుమన్న సంతోషంబు
లోకరక్షణైకలోలుపతయు
హెచ్చ, నీకుఁ గూర్చు నిల్లాలియందు ము
వ్వురము మేము పుట్టి వరసుతులుగ॥ 293

ఆ॥ పుణ్యమూర్తులై, యగణ్యమాహాత్మ్యసం
యుక్తులైన మీ ప్రియోపలాల
నమును గొంతకాలమమృతపానముఁ బోలె
ననుభవించువారమనఘ! మేము ॥" 294

వ॥ అనిపలికి, యా మూర్తిత్రయంబంతర్ధానంబునొందె-నంత॥ 295

ఆ॥ అత్రిమూర్తులత్రియర్ధాంగియనసూయ
గర్భమందుఁ జొచ్చి, యర్భకులయి,
పుట్టువారలైయమోఘాత్మవాక్యప్ర
సంగులైరి వారసంగులయ్యు॥ 296

వ॥ అంత, నంతర్వత్నియైనయయ్యత్రిపత్ని యందునా మూర్తులు
మువ్వురును దత్తాత్రేయుండును, దుర్వాసుఁడును జంద్రుండును నను
సంజ్ఞలతో సంగ్రిమాంశంబులం బుట్టి సర్వలోకప్రఖ్యాతులైరి.
వారిలోన సత్పుణ్యచారిత్రుండై, దత్తాత్రేయుండు శ్లాఘనీ
యుండై, భగవద్భక్తిసంయుక్తుండై, పెక్కుహాయనంబులు
ప్రాణాయామపరాయణుండై సర్వలోకపావనుండై చరించుచు,
రమాధినాథుని ధ్యానించుచు, మహత్తరంబైన తపం
బాచరించె శుద్ధసాత్త్వికులైనమహర్షి వర్యులెల్లరున్ దచ్చరితం
బత్యద్భుతంబని కీర్తించుచుందురు. దుర్వాసుండును మహా
యోగియై, పరమశివచరణ నళినయుగళపరిచరణపరాయణుండు
నయి, హిమగిరిపరిసరధరణిన్। దుష్కరంబైనతపశ్చరణంబున
నుండె. సర్వలోకేశ్వరుండైన గౌరీప్రాణేశ్వరుండాతనికిం
బ్రసన్నుండై దుస్సాధంబులైన యణిమాదిసిద్ధులనన్నింటినను
గ్రహించెఁ; జంద్రముండును, దపోయుక్తుండై సుశీతలంబైన

కాంతివిశేషంబునొంది, తత్పరమశోభావైభవంబునం జేసి త్రిలో
క్యాంధతమససంహారతత్పరుండై యుండె; నందుదుర్వాసుండు॥297

మ॥ ఒకనాఁడించినవేడ్కఁ జూడనరిగెన్ ద్యోవాహినీమాత్న మహా
క్తికహారాకలితోపకంఠమును, భృంగీగానసంగానిశ
పరికటోత్తుంగమదేభగండమదధారాధౌతశృంగాటకం
బకళంకస్ఫటికోన్నతోజ్జ్వలమహాహారశ్రేష్ఠసౌరికమున్॥ 298

మ॥ వికసత్పుష్పవినిష్పతన్మధురసస్ఫీతపరిభూతాధికా
ధిక సౌగంధ్యలసత్పరాగభరమందీభూతవాతపరిచా
రకకల్పద్రుమనందనోపవనమున్, రత్నద్యుతిద్యోతిత
పరికటాయామవిశాలవీధికము, విభ్రాజద్విమానౌఘమున్॥299

మ॥ మణిముక్తామయతోరణాన్వితము, శుంభద్విద్యుదుద్యద్ద్యుతీ
ష్యపిజాంగప్రకరప్రభాకలితదివ్యస్త్రీ సహస్రప్రవ
ర్తనవీణాక్వణదీక్షణశ్రవణవిస్తారప్రమోదావహం
బును, బాపాపహమున్, సుధాశనబహువ్యూహంబు పదోహమున్

మ॥ ఘనహంసీకలనాదమేదురదిశౌఘంబున్, విపంచీతత
క్వణితపరిస్ఫురితామరీగళరవాఖండకరిమోపక్రమం
బును, కర్ణామృతపంచమస్వరపికీస్ఫూర్జద్విరేఖోత్కర
స్వనశారీశుకమంజుళానుపమసద్వ్యాహారవద్భూజమున్॥ 301

ఆ॥ అచటిచంద్రశాలలందు విహారముల్
సేయుస్త్రీలనీలచికురకలిత
ముఖములమరతటినిఁబోడమి, భృంగావళీ
సంవృతాంబుజములచాయఁదోఁచు ॥ 302

ఆ॥ అచటిరత్నకుట్టిమాత్యంతచిత్రభా
భాసమానమై, నభస్స్థలాస
మానశోభ పెక్కులౌనింద్రచాపసం
శోభితయునుబోలెఁజూడనొప్పు ॥ 303

ఆ॥ అచటివారకాంతలద్భుతంబుగఁ బ్రీతి
రథ్యభూమి ఘర్ఘరంబు, శింజి-
తంబు నింపుఁ గూర్పఁ బంబిన ఘోషతో
సంచరింపఁ గలుగు శ్రవణసుఖము॥ 304

ఆ॥ అచటి కల్పపాదపాలంకృతోద్యాన
వాటికలను, స్ఫటికబహుళభూము
లందధోముఖంబులౌచు, బింబానుబిం
బములఁ దోఁచుఁ జిత ఫణితిఁ దరులు॥ 305

ఆ॥ అచటి పౌరకాలు, హాళిఁ గంగజకేళి
లోలురైన యువతులో లిఁ గూడి
మాడి, యుందు ప్రిందు వేడుకఁ గుంజకుం
జమున సంజలందు శైలవీధి॥ 306

ఆ॥ ఎందఱెందఱేని నిందు నిష్టాపూర్త
కర్తలయ్యుఁ గూడఁ గష్టపడక,
యందలేరు దీని స్వాధ్యాయవేత్తలు
వ్రతవిధాతలైనవారలైన॥ 307

ఆ॥ ఇష్టబహుళయజ్ఞ లెప్పుడు సంగ్రామ
మందు వెన్నుఁ జూపకట్టి వీరు
లుగ్రనిష్ఠఁ దపములొనరించువారు, స్వా
ధ్యాయశీలురకిది స్థానపదంబు॥ 308

ఆ॥ అట్టిస్వర్గమందు, నమరావతి మహేంద్ర
పాలితంబుఁ జూచి, పరమమునియుఁ
జిత్రశోభఁ గాంచి, చిత్రీకృతాత్ముఁడై
రత్నపూర్ణరథ్యరహిని గనియె॥ 309

ఆ॥ అప్పుడేమహేంద్రుఁ డైరావతారూఢుఁ
డై, విహారభూమి కరుగువాఁడు
సురలు బెరసికొలువ, సురుచిరవేషుఁడై,
మూనికంతనంతఁ గాననయ్యె॥ 310

వ॥ అమ్మహేంద్రుండును, మహోన్నతైరావతపృష్ఠాస్తీర్ణ సౌవర్ణ
రేఖామయూఖోత్కరోపలాలిత చారుకౌశేయకుథా
సీనుండును, మౌక్తికాతపత్రరత్నరంజితమంజుళమాళిసంశోభి
తుండును, సముత్తుంగహేమాంగదాలింగితోన్నతమాంసలాంస
యుగ్మండును, సంభాసమానానాసమానానూనహారకటక కేయూ
రాంగుళీయకాదిమణిమయసకల భూషణభూషితాంగుండును,
వైమానికనికాయమధ్యవిద్యోతమానుండునునై, వృత్తోరుపీవర
పయోధరభారదర్శనీయంబును, గరకమలవిధృతసితవితతసతతవీజ్య
మాన చారుచామరంబును, స్మేరాననంబునైన దైవతయావతంబు
సాదరంబుగాఁదన్నుంబరివేష్టించియుండ, నిర్మలమందహాస
చంద్రికలునిండారంగాయుచుండుదనవదనవిధుమండలంబుసందర్శన
సౌభాగ్యభాగ్యాధిక్యానుభూతిం జేసి, వారికాటుకకన్నులఁ సల్ల
కల్వలచకచకలతోఁ డంగ చాకచింబ చరింపుచుండ, నగ్న్యంత
కాసునాధిపాంబుధీశానిలార్థేశాదిప్రచాపులున్, దక్కంగలక్రతు
భుక్కోటియునళికతలకీలితాగ్రహస్తులై, విధివిహితవివిధోప
చారులై, సేవింపుచుండం, దనవేయుంగన్నులొక్కమాఱువిప్పారి
యాత్మమానానూనమానోన్నత్యంబు నృత్యంబు సేయింప, భేరీ
మర్దలాదివాద్యంబుల గంభీరధ్వానంబు దిక్కుహారంబులం
జొచ్చి, వియచ్చరులచ్చెరువొందునట్లు మాఱుమ్రోగ,
వాగముఖ్యాసమారబ్ధాభిమతనృత్తగీతాదివినోదంబులనితస్తతో
ఽభిజుష్టబృంహిష్ఠసువ్యక్తానుభావుండై యనియత్ప్రథులతర
బహువిధవిభవాభిశోభితుండై యుండంజూచి చిత్రీయమాణ
హృదయుండై, యద్దుర్వాసుండు॥ 311

ఆ॥ ఇంద్రుభోగభాగ్య మేమనివర్ణింతు?
నశ్వమేధశతము నాచరించి,
యానిరూఢమైన యింద్రత్వ మొంది, త్రై
లోక్యమేలు నితఁడు లోలబుద్ధి ॥ 312

ఆ॥ ఇట్టులెంచిహాని, యించినవేళ్ల "దే
వేంద్రుఁజూతుఁగాక యిప్పు" డంచు,
నిశ్చయించియాత్మ, నిర్మల సంకల్ప
కల్పితంబనల్ప గౌరవంబు ॥ 313

ఆ॥ కల్పవృక్షపుష్పకల్పితమాల్యంబ
మూల్య చారుతాప్రపూర్ణమైన
దానిఁ,గీర్ణ ధూళిమానితమారంద
బిందుతుందిలంబు, సుందరంబు ॥ 314

కం॥ అందుకొనిహానివర్యుఁడమందానందంబుతోడమాల్యంబును,దా
నిం, దతవిభవుండయినపురందరునకొసం గెమదభరప్రచురునకున్

వ॥ దుర్వాసుండు సాదరాశీర్వాదంబుగా నొసంగిన యమ్మందార
మాల్యంబును స్వీకరించియు, శచీశుండసమీచీనాసూక్ష్మ ణ
సూచనంబుగా, దానినైరావతకుంభికుంభంబులపైనుంచి, యించు
కైననుబ్రహ్మాభావంబులేక, యహాన్మనీంద్రునకువందనంబైనం
జేయక,యన్యతోవ్యాపృతమనోదృష్టియై,యదృష్టదూరుండుగా
సాపరాధియయ్యె; నంత. 316

ఆ॥ అతిమహాభిభూతమైరావతంబు, తనకొనిదత్తమైనమాల్యమంతఁ
గాలరాచివైచి,గంభీరవేది,తానడుగులిడుచుఁజనియెనతిరయమున

ఆ॥ అంతహానివర్యుఁడైశ్వర్యగర్వాంధ్యదోషమూషితునినశేషనిర్జ
రాధినాథు, మదగజారూఢు, రూఢనాకాధిపత్యు,నిట్టులల్గితిట్టె ॥

ఆ॥ "ఓరి, యింద్ర! యింతయుద్ధతిసెల్లురా?
యెంతలేవియున్న, నింతపొగర ?
బ్రహ్మవేత్త, నన్నె పరిభవించెదవురా?
యనుభవింతుదీనికైన ఫలము ॥ 319

ఆ॥ విభవమదము, మఱియుఁ, బ్రభుతయు ముదిరె నీ
కోరి ముదిర వాహ! యదుటుమాను
రోరి! దైత్యపై న్యమోలిసీస్వారాజ్య
వైభవంబునెల్లఁబాపకున్నె ? ॥ 320

ఆ॥ చుట్టుముట్టినీదుపట్టణంబునుగొల్లఁ గొట్టియిట్టెనిన్ను నట్టహపుల
కనుపకున్నె బిట్టుదనుజబలంబనుచరులతోడ; నింతబిరుసులేల?

ఆ॥ ఎవఁడు శుభకరములయిన ఫలసుమములఁ,
జందనంబును గరువందనంబు
మీఱఁ బోఱఁజిమ్ముఁ, బాఱులదూపించు
వాసవిడుచు నెంతవానికైన సిరులు ॥ 322

ఆ॥ ఓరి, యింద్ర! స్వర్గభూరివైభవము, త్రై
లోక్యజయము భోగలోలుపతయుఁ
గల్పవృక్షపంచకంబును, గామధే
నువునుగలుగుపొగరునుసుగురోరి ॥ 323

ఆ॥ రాజ్యలక్ష్మియబ్బ, రజ్జులుపచరింతు
వనఘులయినమునులయధికమహిమ
మెఱుఁగవీవుసుంత; యరులకుదెంచి, ని
న్నణఁచినీమసిరులఁగొనరె, తులువ ! ॥ 324

ఆ॥ అప్పుపట్టుపడునె, యైరావతోచ్చైశ్శ్ర
వంబులైనఁ, గల్పపాదపంబు
లైనఁ, గామధేనువైన, సుధాంధోఽప్స
రస్సమూహమైన, స్వస్సనిష్ఠ ! ॥ 325

ఆ॥ అతిమదాఢ్య! నీదునైశ్వర్యగర్వాంధ్య
మునకునంజనంబు, ముఖ్యమైన
యాపథంబురిక్తతాఽఽఖ్యంబు, దాన వి
ప్రర్షిసాధుదర్శనాప్తిగల్గు ॥ 326

ఉ॥ శంకరకింకరుండనయి, సమ్యగుపాత్తమహత్త్వశాలినై
యంకిలిలేక, యెందయిన, నాదరగౌరవభాజినౌచు, నే
నుంకువగాఁగఁగైకొనుడునుత్తములిచ్చుసపర్యలెల్ల; నీ
వింకిటధిక్కరించితివదేలర, ఛేలతనంబునన్ననున్ ? 327

గీ॥ ఎఱుఁగవో, కాక- గర్వంబొ ! మొఱకుఁదనమొ !
కర్మఫలమొ! శచీశ ! నిష్కారణంబ
శాపమొందితివైనను, శంకరప్ర
సూతిసేవింపఁ, బూర్వవిభూతిగల్గు ” ॥ 328

గీ॥ ఇటులశపియించిదుర్వాసుఁడింద్రు, నిచ్చ
నేఁగెనందేనిశాంతింపకింద్రుఁడింత
యేమెఱుంగఁడువాద్యనిస్వానయుక్త
భోంకణాపూర్ణనిజగజఘీంకృతులను ॥ 329

వ॥ అంతం గొంతకాలంబునకు బలిప్రముఖులయిన దనుజవరులు నిజ
గురుండైన శుక్రుండుపదేశించినమార్గంబు నవలంబించి, మహో
త్సాహంబునం ద్రిదశాలయంబుఁ జుట్టుముట్టినం, బొలివోనిమగ
తనంబులు మెఱయ, రయంబున హరిహయప్రభృతులయిన సుమన
స్సముదయంబులు రవడించి, యరిబలంబుల గుండియలవియఁ
గవిసి, రథగజతురగముఖనిఖిలవాహనారూఢులై వచ్చి, శరపర-
పరలం బఱపుచుఁ, బ్రాసతోమరముద్గరభిండివాలాదికంబులైన
శస్త్రవిశేషంబుల వేయుచు, నాగ్నేయైంద్రవారుణవాయవ్యా
ద్యస్త్రంబులం బ్రయోగించుచు, నితరేతరవిజిగీషనీషన్నాత్రింబైన
పీడక, పోరాడుచుండు నయ్యుభయబలంబులకును నిరవధికంబును,
నిజభుజబలసమధికంబును నభూతపూర్వంబును, నత్యాశ్చర్య
కారణంబునయిన పృథులతర ప్రధనంబు ప్రవర్తిల్లె నయ్యెడ॥ 330

మ॥ హయరింఖాగ్రవిఘట్టనప్రభవధూళ్యాచ్ఛన్నసౌవర్ణభూ
మియదృచ్ఛాజనితాతివిస్తృతరజోమిశ్రీభవత్సంఖ్యమం
దుయథోద్యచ్ఛతురంతజాలము, సముద్ధూతాంబరాచ్ఛాదితా
గ్రియచిత్రప్రభ, శోభమానమయి, చూడ్కిన్ వేడ్కఁ గొల్పెన్
గడున్॥ 331

ఆ॥ అపుడు రజము పెరుగ, నన్యోన్యమును సహుం
కారములు సెలంగఁగా, రణాంగ
ణంబునందరాతినామనిర్దేశహుం
కారములనహంత్రివీరవరులు॥ 332

కం॥ భేరీభాంకారంబులు
వీరులకోలాహలములు విస్తారములై
నారసితడిండిమార్భటు
లారణభువిఁబుట్టినిండె ద్యావాభూముల్॥ 333

ఆ॥ అస్త్రకృత్తమత్తహస్త్యశ్వమస్తోత్థ
శోణితంబుచే రేణుజాల
మెల్లఁ బాఱ జొచ్చె మెల్లమెల్లఁగను, గం
గాప్రవాహమట్లు దీప్రమగుచు॥ 334

ఆ॥ ద్వంద్వయుద్ధమంతవర్తిల్లెఁబత్తిప
త్తిని, రథాధ్యు రథికుఁడును, దురంగ
మాశ్వుఁ దురగసాది, నాధోరణుండు హ
స్తిపకునెదిరిపోరధీరులగుచు ॥ 335

ఆ॥ అపుడు యుద్ధభూమి విస్ఫులాపగయుఁబోలె
నొప్పె మొండెమ్ములుమటుఁగనులు
మీలు, కురులు నాచు, గ్రాలునశ్వములు న
క్రములు, క్షతజముదకమమర మిగుల॥ 336

ఆ॥ కృత్తశస్త్రులసురభుభువీరులిర్వురు
విడిచియుకడమలను, విపులజాను
ముష్టిఘాతములను బూఁచిన మోదుగుల్
వోలెనల్లదోరుగఁబొల్చిరపుడు॥ 337

ఆ॥ అమరులసురులిర్వురన్యోన్యకృత్తమ
స్తులు, కబంధమాత్రులిలను విడిచి,
నభముఁజరిసి, విపులనారాచదుర్దిన
శ్రీవిధానులైరిచిరమునలుక॥ 338

వ॥ ఇట్లు దిత్యదిత్యపత్యసైన్యంబులనోన్యవిజిగీషావశీవం జేసి, సమీకంబుఁ జేయుచున్, దీక్ష్ణతరంబులైన శరపరంపరలం గురి యుచు, సమరసమగ్రవిక్రమక్రములయి, విజృంభించుచుండ నంత మాయావులైన దైతేయులాచార్యుండైనశుక్రనీతిమార్గోపాయం బుననిరపాయులై, దుర్వారశౌర్యసంరంభులై, యజేయులై, యాది తేయులసైన్యంబుదైన్యంబునొందించికాందిశీకులంగావించుచుండిరంత

మ॥ హతసంరంభులమర్త్యులెల్లరును దైత్యవ్రాతమాయాహతిపీ
డితులై, యీడితనైభవం బఱఁగ, దాడిన్ రాయిడిన్ జెంది, వి
స్మృతనైజప్రచురప్రభావులయి, స్వర్గక్షితివిహారంబుపీ
డి "తలల్ వట్టి;" పలాయనోపయికదృష్టింబూనిరెంతేనియున్॥

ఆ॥ అటులఁబాఱిపోవునమరుల శితశర
పటలిఁబఱపిరసురవరులువెనుచ
వెంటనంటి; వారు వెనుకకుఁజూడకుం
డంగఁజేసి, మదికలంగఁజేసి॥ 341

ఆ॥ అమరపతియు, ననలుఁడంతకుండసుర యు
ప్పతియు ననిలుఁ డర్థపతియు, నద్రి
జాధినాథుఁడంచు నంతఁబలాయితు
లయిరిపుల వలనభయభరమున॥ 342

ఆ॥ అరనిముసము గోనసై రావతంబు, సు
చ్చైశ్శ్రవంబుసూడఁగానలేక,
దృశ్యభావమొందె వశ్యలోపునకు న
వశ్యభావిశాపవ్రజహతిని॥ 343

ఆ॥ తొలఁగెఁజిటికలోనదుర్వారమైన దు
ర్వాసుశాపవాక్యవశతశక్రు
భోగభాగ్యములును, భూతపిశాచవి
ద్యాధరాదిదేవతావనంబు॥ 344

ఆ॥ అత్యయమునుబొంది, దైత్యబాణాగ్నిసం
ప్లుష్టులగుచు, దైన్యనిష్ఠులై, త్రి
విష్టపాశవీడి, యష్టకష్టాలపా
లైరిత్రిదశులెల్లఁగాఁబడపుల॥ 345

సీ॥ అట్లుప్రాణావశిష్టులై, యమరులెల్లఁ
గాందిశీకులుగాఁగ, రాక్షసులుస్వర్గ
మాక్రమించిరి; బలిదైత్యచక్రవర్తి
యిందుసింహాసనంబధిష్ఠించె; నంత॥ 346

వ॥ బలియు, బలియుఁడయి, దుర్వారదోర్వీర్య సాహస్యసౌందర్య త్రైలోక్యసామ్రాజ్యసామ్రాజ్యధురంధరత్వంబునన్ బ్రఖ్యాతిఁ గాంచియుండె. శంబరుండును, జంభుఁడును, అరిష్టనేమియు, శకునియు విరోచనుండును, బ్రతిహేతియు, హయగ్రీవుండును, సుమాలియు, విప్రచిత్తియు మున్నగు రాక్షసాధినాథులఖర్వగర్వ భూయిష్ఠులై, త్రిభువనములను దమతమభుజబలముకలిమి వశపఱచుకొని, విచ్చలవిడి సంచరించుచుండిరి. నాకౌకసులును, గానసౌకసులై, కత్రశీకులై, దీనదశం బ్రాపించిరి. దైవప్రాతికూల్యంబు సంజేసి, యాసుధాంధసులు క్షుధాద్యబాధాస్ఫురితయాసులై భయాందోళనడోలాయమానమానసులై, యత్యంతదుఃఖాక్రాంతులై, యశరణశరణుండును, త్రైలోక్యనిర్మాణకర్మఠుండునైనయ కాంచనగర్భున్ గాంచి, యత్కించిన్మాత్రసంచిత తాత్కాలికసముద్రోదంచితులై రప్పుడప్పరమేష్ఠియుబృందారక బృందంబులం దీసికొని, క్షీరాంభోధిం జేరి, యందు శేషాహిపర్యంకంబున నిందిరా సుందరీసంసేవ్యమానుండై యోగనిద్రాముద్రితుండైన వాసుదేవుంగాంచి, యిట్లని సన్నుతింపందొడంగె॥ 347

సీ॥ షాడ్గుణ్యసంపూర్ణ! ద్విడ్గణాంతక! సర్వ
ధాత! సర్వాధార! పూతనామ!
సర్వోపసంహార! సర్వదేవేశ్వర!
సర్వలోకేశ్వర! శర్వశక్ర
సన్నుతసత్త్వసంపన్న! సంపన్నళి
నేక్షణాలక్షితవక్ష! దక్ష!
శ్రీవత్సవత్స' లోకావనదీక్ష! య
వ్యయ! యమేయాత్మ! దివ్యానుభావ!

గీ॥ నాథనాథ! జగచ్ఛరణ్యా! ధుతాఘ!
దేవదేవ! దయార్ద్రపవర్ధితనిజాశ్రి
తోత్కరోత్సాహ! ధర్మసముత్క! మాంగ
శాంగ! క్షీరాబ్ధిశేషపర్యంకశాయి॥ 345

కం॥ దేవళ్లకు దేవగవున్;
పావనపావనుఁడవీవుపద్మానాథా!
నీవఖిలభూతములకున్
గేవలజనకుండవయ్య! కృతఫణిశయ్యా!॥ 349

ఆ॥ పీతవాస! శ్రీశ! విశ్వవిశ్వోదయ
కారణుఁడవు, యుగయుగంబుమొదల;
యుగయుగాంతమ దు జగములునీయందె
లయముఁగనుచుదేవ! ద్వయవిహార! ॥ 350

ఆ॥ అఖిలలోకబీజమవు, నిర్గుణుండవు
నయిననీపరిభావమానుపూర్వి
గా నుతింపశక్యమానెయెవ్వాని కే
నీశ! తార్క్ష్యవాహా! కేశినాశ! ॥ 351

ఆ॥ భూమి పాదపద్మములు; నింగిపొక్కిలి;
ప్రాణపంచకంబువాయువౌను,
దిశలుశ్రుతులు; కనులువినకరహిమకరుల్;
దివముశీర్షమగ్నియవుఘుముఖము ॥ 352

కం కుక్షిస్థచతుర్దశభువ
నక్షయ! యక్షరణ! ఘనఘనాఘనదేహా!
చక్షుశ్శ్రవస్సమూహా
ధ్యక్షమృదు మృదులతనుశయా! సానుశయా!॥ 353

ఆ॥ నిన్నుశరణుఁజొచ్చియున్నారమేము; భూ
తాంతరాత్మ! యచ్యుతా! మహాత్మ!
నిన్నుఁజెప్పుచుందురినిగమాంతవేత్తలు
పరమపురుషు, భువనశరణు, వరదు। 354

ఆ॥ పరిభు! సహాసరిశీర్ష! విభు! సహస్రాక్ష! స
హాసరిపాద! యజ! సహస్రనామ!
భువనమేకపాదముననూని, యదిమి, ది
వంబునిండియున్నవాఁడవంత॥ 355

ఆ॥ ఎవఁడు సృష్టిఁ జేసెనీజంగమస్థావ
రాత్మకంబువిశ్వ మాపితామ
హుండు నీదునాభినుద్భవించినతమ్మి
కడుపువల్లగాఁగ బుడుతఁడయ్యె॥ 356

ఉ॥ కారణకారణా! నమదకారణకారుణికోత్తమా! వనీ
వారణదారుణాపదపవారణ! వారణరాజయాన! కో
పారుణనేత్రకోణశతధాఽఽకులితాఖిలయాతుధాన! ధా
నారుచిరోపదానకృదనారతసౌహృద!ప్రోవవే,మమున్॥ 356

ఆ॥ ఇప్పుడార్తులైనయెల్లజేజేలకు
శరణమీవ దేవ! పరమపావ
నాత్మ! నీవెఱుంగుదసురులచేష్టలు,
నమరులొందుచెట్టులతులవిభవ!" 357

మ॥ అని, యార్తిన్దను వేడునిర్జరులముందావిర్భవించెన్ దయన్
ఫణిపర్యంకశయానుఁడాశ్రితులమందారంబు, లక్ష్మీను రా
.గనుసంవాహితపాదపద్ముఁడు, సపర్యాలోలనీశాఽఽదరుం
డును, మాళిస్థమణిప్రభాద్విగుణితానూనాహిరత్నాంకు[శు]ఁడున్

మ॥ దళదిందీవరనీలదేహరుచులన్ దర్పంబెలర్పన్, బయో
జలధిన్ నల్లనికల్వతేకులను సంఛన్నంబుఁగావించుచ
జ్జల ఁతానునుఁగన్నతండ్రి, యుభయశ్రాంతైకసద్మంబు, ని
స్తులనైజస్మితదీధితిన్ బయిఁబయిన్ శోభాయమానంబుగాన్॥ 359

ఆ॥ అమృగాంకులక్ష్మిఁగామినీగండపాం
డురుచి తనదుస్మితముపరిభవింపఁ
జేయుచుండఁ, గరుణపీయూషధారయుఁ
బోలెడీనదేవపాళిఁదన్ప ॥ 360

ఉ॥ పల్లవినఁపులున్, సరసిజాతసహస్రమజస్రకాంతులం
దెల్లెడఁబర్వఁజేయఁగ, నహీనమణిస్థగితాంగదాదికో
ద్యల్లలితోజ్జ్వలాభరణహారిసుశోభనభూష్యభూషణ
తోల్లసితాంగఁడోచుఁ, గమలోదరశోభ, రమన్ ధరించుచున్॥

ఆ॥ ప్రావృషేణ్యచంచలావృతవారివా
హంబుఁబోలె, శ్రీశుఁడవ్యయుండు
సుప్రసన్నుఁడై, విశుద్ధగంభీరవా
గ్గుంభనముల దేవకోటిఁబలికె॥ 362

ఆ॥ "వింటి దైత్యులేచి, పీడించుటలు తెలి
గంటులార! మిమ్ము; గర్వకాల
మిప్పువారి; కెందు నెప్పుడేదానొ, య
ద్దానిదాఁట నెవరితరముగాదు॥ 363

ఆ॥ వినుఁడు; విబుధులార! ప్రియమును, హితమునౌ
వచనమొకటి; దానివల్ల నెల్ల
యపుమీకు సంక్షయంబుగా నేరదు;
బలము పెరుగు; సంపదలు ఘటిల్లు॥ 364

ఉ॥ సర్వసుపర్వులార! త్రిదశత్వము మర్త్యత, నిర్జరత్వముం
బర్వినదేహదార్ఢ్యము, నపశ్చిమనిశ్చలసంపదాఢ్యతన్
మర్వను; హవ్య, ముద్దులును, ముచ్చటలున్ వెలిగాక పోవుటల్,
నిర్విభవంబు, దివ్యతయు, క్షేమముఁ గోరితిరేనిఁ, జెప్పెదన్॥

ఆ॥ మీరలుద్యమించి, భూరితరోత్సాహ
మొప్ప, మందరాద్రి నున్నతంబు
మంథదండముగ, నమంథరవృత్తి వా
సుకిమహాహిఁ ద్రాడు సొరదిఁ జేసి॥ 366

ఆ॥ అనఘులార! యసురులను, మహాబలులనె
య్యమునఁ గలుపుకొనుఁడు; నమృతలబ్ధి
లుబ్బురాదు, వారు స్తబ్ధతఁ గలుపుఁగో
ల్తనముగల్గి, మిమ్ములను విడువరు॥ 367

ఆ॥ వారు, మీరుఁగూడి, క్షీరాబ్ధిఁద్రచ్చుడుఁ
బోషమున నమృతము నెడుభూరిశక్తి
యుక్తమైనయాహారోత్తమంబొకఁడు మ
హార్ణవంబునుండి తూర్ణముగను॥ 368

ఆ॥ మృతియు, మూర్ఛ, క్షుత్తు, మేకొనఁ జాలవు;
వృద్ధిఁ బొందు మేధ; వీర్య మొప్పు;
బలము పెరుగు; నమృతపానలాభంబున;
వశము గాదె, వైరివర్గ మెల్ల! ॥ 369

వ॥ ఆపై తే ముల్లారా! పోయిరండు. మీకు మేలయ్యెడు; నచిరకాలం
బున నే విజయలక్ష్మి మిమ్ముఁ జెట్టవట్టు నసురవినాశంబునుం గాఁగలదు
బ్రహ్మర్షి యైన దుర్వాసునిఁ బరాభవించిన నేరంబునం జేసి మీకీ
దుర్వారంబైన దీనత్వంబు గల్గె. శంభు పాదపద్మ ధ్యానాసక్తిం జేసి
తత్కింకరులైన మీకింక కింకతొలంగ లగ్గుగల్గు; శివుని ప్రసాదంబున
మీకు శివంబగు. మీరెల్లరు, నా చెప్పిన చొప్పున దప్పక
యత్నింపవలయుం జుండీ! యుపేక్షింపవలదని" యానతిచ్చి,
శ్రీమన్నారాయణుం డంతనంతర్హితుండయ్యె॥ 370

ఆ॥ అంత, లోకపాలు రందఱు లోకేశుఁ
గూడి, యతని మున్నుగాని యథాగ
తంబుగా రసాతలంబును జేరి, త
త్రత్యులైన దైత్యులను దరిసిరి॥ 371

ఆ॥ అటుల దరిసి, యమరు లసురనాయకు, బలి
చక్రవర్తిఁ జేరి, సఖ్యమొంది
రంతఁ, ద్రిదశవిభుఁడు సంతసంబునఁ బ్రశ్ర
యం బెలర్ప, నిట్టులనియె బలికి ॥ 372

ఆ॥ "అన్న! దైత్యరాజ! యైశ్వర్యసంపన్న!
యొక్క మాట - మనకు నూనసౌఖ్య
దంబు; వినుము; మనకులంబులు కశ్యప
ర్షీంద్రువల్ల నుల్లసిల్లెఁ గాదె! ॥ 373

ఆ॥ ఒక్క తండ్రి బిడ్డ లుజ్జ్వలతేజస్కు
లుత్తములుఁ, బ్రసిద్ధు లూర్జితోరు
కీర్తు లుభయవర్గవర్తులు, దేవదా
నవులు [illegible]లఁగఁ దగును మిత్రులమైత్రి ॥ 374

ఆ॥ మూర్ఖునకెప్పుడుఁగలహమును గోరుచుండును;
సఖ్యమిష్టమగును సాధుజనుల
కాగ్రహంబునెట్టులైనఁద్యజింపనౌ;
నగును బుద్ధిఫలమనాగ్రహంబు॥ 375

ఆ॥ ఒకఁడొకరు సాయమొనరించుకొంచు వి
రోధులైన సోదరులకు సిరులు
వాస్తవములు, హస్త వాస్తవ్యములు, నిరా
తంకములును, శాశ్వతంబులౌను॥ 376

ఆ॥ ఒక్కకట్టె విఱువ మిక్కిలి తేలికౌఁ;
గాని, మోపు విఱువఁగలఁడెవండు?
శత్రుకుజ్జయంబు సాయమెప్పుడు;
గలసిమెలసిమనుటవంతితనము॥ 377

ఆ॥ సత్త్వశాలియగుచు సఖులను బెక్కండ్ర
బుద్ధిమంతుఁడెప్పుడుఁబ్రోదిసేయ
వలయు; మఱియు, స్వీయపక్షంబువారికె
న్నండువజ్జఁగూర్పకుండవలయు॥ 378

ఆ॥ అల్పమయ్యుఁ, దృణమునల్పోపకారియౌఁ
గర్ణదంతశోధకర్మలందు;
నట్టిచో, వచఃకరాదులు గల్గువా
రలయుపేక్షఁజెప్పనలవియగునె ? 379

వ॥ కావున, నస్మద్వంశంబులు రెండును, వర్ధిల్లుపొంటెనొక్క
కృత్యంబుమనయుభయులకునవశ్యకర్తవ్యంబుగలదుతత్సాధనంబు
నంబునం జేసియీసురాసురకులంబులుభయంబులుననాకులంబులై
మరణభయవివర్జితంబులైయుండు; నయ్యుపాయంబెట్టిదనిన॥ 380

ఆ॥ " మందరాద్రిఁజేసిమంథానదండంబు
మంథరజ్జువుగనునమంథరగతి
వ్యాళలోకనాథు, వాసుకిఁజేసి, క్షీ
రాబ్ధిఁద్రచ్చియమృతమందనౌను॥" 381

వ॥ ఇట్లని, శ్రీమన్నారాయణునియాదేశంబు, మనమందఱముం
గూడి, యీకార్యంబుసాధింతము. పీయూషంబునుసంపాదింత"
మని పలికి; మఱియు, సురపతి యిట్లనియె॥ 382

ఆ॥ " జీవనౌషధంబు పావనపీయూష
ముభయులకును సేమమొదవుదానఁ;
గార్యమల్పమైనఁ, గాదొక్కనికిసాధ్య
మెన్నసాహ్యసాధ్యమెంతయైన॥ 383

ఆ॥ అమృతసాధనంబునందందఱము యత్న
మాచరింతమన్న! యమరులసురు
లుభయులునుబ్రధానతోద్యోగులై, యుద్య
మింపఁగార్యసిద్ధియింపుఁగూర్చు" 384

చం॥ అన, బలిచక్రవర్తియుఁ బ్రహృష్టవశంవదుఁడై, ప్రమోక్తులం
దు, నముచివైరిమెచ్చుకొన, నూతనమానమృతాభిలాష నె
మ్మనమును గొందలింప, నసమానబలాఢ్యులఁబిల్చి దైత్యులన్
ఘనతరమైనయుద్యమమునాకులతో నడుపన్ దలంచినన్॥ 385

వ॥ అంత, దేవదానవులుపీయూషలాభలోభంబునం జేసి, పూర్వ
వైరంబులువిస్మరించి, నిర్భరంబైనస్నేహంబుఁగల్గి, క్షీరవారాశిని
రంతమథింపం దొడంగి, 386

ఆ॥ హరియు, వారిలో నొకరుఁడయి, దేవతా
శ్రేణినుండిత్రచ్చె క్షీరవార్ధి;
నప్పుడుప్పతిల్లెఁజప్పుడురోదసీ
భేదనంబు, లోకభీతిదంబు॥ 387

ఆ॥ దుగ్ధవార్ధిరవము ముగ్ధులన్ జేసె దే
వతల; రాక్షసులను వితతముగను
విదిరిచె; దెసలనదిరిచెఁ; జిద్రుపలుచిద్రుపలు
సేసెఁబర్వతముల శీఘ్రముగను॥ 388

ఆ॥ ఆవిరావమునకు దేవదానవులు భీ
తాత్ములైరి; విపులవ్యాకులితులుఁ,
జలితులయిరి; మదుల గళితులునయిరి; సం
భ్రాంతులైరి; వారు తాంతులైరి॥ 389

ఆ॥ ఆక్షణంబ మందరాద్రి స్రంసితమయ్యె
సర్పరజ్జుబంధసంధులెడల;
నంత, దుర్నివారమహాచ్చుఁ, బాతాళపా
తంబునొందె మందరంబహా రే! 390

ఆ॥ సురలు నసురులద్రి సురుగుటఁగనుఁగొని,
దాని నిల్వరింపఁదరముగాక,
యార్తులై, విభీతినాక్రోశమొనరించి,
శరణుఁజొచ్చి రార్తిహరుని, హరిని॥ 391

ఆ॥ దుస్సహార్తిఁగుంది; నిస్సహాయసమూహు
లై, సురాసురాళి శ్రీసతీశుఁ
జేరి, హరియుఁగరుణఁజేపట్టి, యుద్విగ్న
లైనవారినెల్లనాదరించి॥ 392

ఆ॥ మగ్నమైనయద్రి, మందరంబును గూర్మ
మూర్తియై, రమాధవుఁడు ప్రసన్నుఁ
డై, సముద్ధరించె వాసుదేవుఁడు, జనా
ర్దనుఁడు, సర్వగుఁడు, పరాత్పరుండు॥ 393

ఆ॥ సురలు, నసురులంతఁ బరమసంతుష్టులై,
యుత్సహించి, త్రిచ్చిరుదధి సమధి
కానవధిక ధుంధుమారావబంధురం
బును, సుధాఽతిలిప్స, మోదమంది॥ 394

వ॥ అంత, ఫణిపరిబృఢవృఢతరఫూత్కారవివర్ధితవిషవిషమజ్వాలా
జాలసమాకులంబును, విస్తృతోన్నతోన్నతోల్లోలకల్లోలమాలా
డోలాలాలితకుమారాయితకులాచలకులంబును, భయంకరమహో
వర్తనతావర్తితిమితిమింగిలంబును, సముత్థానవేగోత్పాతపాత

వాతజాతోత్క్షాలితపాదపరాజంబును ఉచ్చలచ్ఛీకరబిందుసందోహ
సవ్యాపసవ్యసంవ్యాప్తసర్వంసహాసకలహరిదంతరంబును,
రౌద్రబీభత్సభయానకవిద్యుతగగనాంతరంబును, దేవదానవో
ద్దండదోర్దండక్షుబ్ధంబును నైన దుగ్ధవార్థిన్ జూచుచుండ నంత
లోనన, సర్వలోకభీకరంబును, గాకోలకాలకూటహాలాహాలా
పరపర్యాయంబు నైన మహావిషంబు పుట్టియొక్క పెట్టున సప్తనారాశి
నిశ్శేషపరిశోషణంబుగావింపను, క్షణార్ధంబునన్ద్రైలోక్యంబు
సచరాచరంబు నిర్దగ్ధంబుఁ జేయను, మహోత్తుంగశైలజాలంబుల
నెల్ల నుభస్మీపటలంబొనర్పను, సకలనదనదీసమూహయంబులఁ బ్లో
షణశోషణంబులన్ శ్రవణపర్యనభీషణంబులు గావింపను,
శర్వదుర్భగ్భుక్ఛటచ్ఛటధ్వానంబులు భూనభోంతరనిరంతర
దంతురంబులై నిండుచుండ, విజృంభించె; నప్పుడు

ఆ॥ విషమవిషమువొడమి, విషనిధిలోకముల్
గాల్చుచుండఁ, జూచి, కగమునాకు
లాత్మలొచు, సురలు, నసురులు గర్తవ్య
మూఢులై రసోఢకీర్ణులైరి। 396

కం॥ ఆపదఁగడపంబెట్టఁగ
నోపునెవండనుచు, వారలుత్కంఠితులై,
తాపోపశాంతిఁగానక
యాపురహరు, హరుని, జేరిరందఱునార్తిన్॥ 397

కం॥ హాహాకారముఁ జేయుచు,
నోహరిసాహరిగఁబోయి, యొక్కుమ్మడి హా
లాహలజృంభణముడుపఁగ
నా హరుఁబ్రార్థించిరిట్టులందఱుభక్తిన్। 398

కం॥ "శంకర! భక్తవశంకర!
కింకరదమరేంద్రవిష్ణుగీరథినాథా!
హుంకారమాత్రమార్జిత
పంకాహంకార! వేదవర్ణితగాథా!!॥ 399

కం॥ హైమనగచాపహస్తా!
హైమననగజాఽధినాథ! యార్తశరణ్యా!
సోమాలంకృతఫాలీ!
వ్యోమాంబర! వ్యోమకేశ! పురదైత్యహరా!! 400

గీ॥ ఈశ! సర్వేశ! ప్రణతార్తినాశ! కైంకి
రాతమదభంగ! కృతకకిరాతవేష!
దోషదూర! పశ్యత్ఫాల! ద్యుసదనుత్త
మోజ్జ్వలైశ్వర్య!నుత్తశత్రూరుగర్వ!! 401

కం॥ మృత్యుంజయ!యజ! సృష్టి
స్థిత్యంతనిదాన! సోమశేఖర!భక్తో
పేత్యస్వాశ్రయ!యీశ!ని
రత్యయనిర్వాణదాయి!! హర!గిరిజేశా! 402

కం॥ గంగాధర! శూలధరా!
యంగీకృతభైక్షచర్య! యత్యనురాగా
ర్ధాంగీకృతదాంపత్యా!
సంగరహిత!ఫల్గునకృతసంగరసహితా! 403

## దండకము

శ్రీమన్మహాదేవ! దేవాధిదేవా! యచింత్యప్రభావా! యమేయానుభావా! యుమాద్యంద్వభావా! శివా! వామదేవా! నమస్బ్రహ్మవిష్ణ్వింద్రముఖ్యాదితేయావళీరత్నసౌవర్ణసన్మౌళి సంసక్తకల్పద్రుపుష్పస్రగంతర్వినిర్యన్మరందప్రవాహప్రముగ్ధ స్థిరస్నిగ్ధతన్మూర్ధజాభుగ్నసంలగ్నమత్తద్విరేఫోత్కరభ్రాంతి భాశ్వారిషద్వ్యక్షణాళీప్రణాళీక!సాళీకకాళీకపాళైకపాళీస్మితచ్ఛాయ సచ్ఛాయధమ్మిల్లబద్ధేందురేఖామయూఖాన్వితద్యోధునీస్రోతరుచ్చా వచస్ఫారవీచీ సమీచీనసీచేతరాద్ధత్యనిర్ధ్యానసానూనకారుణ్య పుణ్యావితానేకలోకా! సమీకావధూతాతిదుష్టార్తికృద్దుర్జనా జసప్రవిస్రాంతమేదోఽస్థిమజ్జాఽసృగాద్యాప్తిసంతృప్తభూతాళి బేతాళకోలాహలాభీలదిగ్జాల!యీశానతద్వామదేవాదిపంచాన నోద్భూతశైవాగమాచారసంప్రీతచేతస్క ! ప్రసన్నా

యాగాదిసత్కర్మాభీష్టానుసారావతారార్చనామూర్తివిఖ్యాత
కీర్తీ! జగజ్జాలసృష్టిస్థితిధ్వంసకార్యత్రయీతీక్ష్ణసంరూఢవాణీశ
లక్ష్మీశగౌరీశమూర్తిత్రయఖ్యాత నైజస్వరూపా! విరూపాక్ష!
యుక్షధ్వజా! దక్షమాఖ్యాధ్వరధ్వంస! విధ్వర్కవహ్న్యక్ష!
విఘ్నేశషాణ్మాతురానీతసత్పుత్రవత్పుణ్యగణ్యా! యగణ్యాన్య
సాధ్యేతరాబాధ్యమధ్యాహ్న సూర్యప్రభాజ్వల్యజాజ్వల్య
మానాత్మనీనప్రభూతోరుతేజోభరాసహ్య!
గుహ్యాతిగుహ్యాదిపంచాష్టకఖ్యాతపంచస్వరూపా! దురాప
క్షమాఽఽదీక్షసాడ్గుణ్య! షాడ్గుణ్యపూర్ణా! యపర్ణాతపఃప్రాప్య!
సృష్ట్యాదిపంచాంగకృత్యాళినిత్యా! త్రితత్త్వప్రసిద్ధాత్మశక్తీ!
పరాజ్ఞానశక్త్యంశ సంసిద్ధతత్వంచసాదాఖ్యలింగప్రభేదప్రభూత
ప్రపూతప్రపూర్ణప్రసిద్ధాఖిలవ్యాప్తదీప్తప్రశస్తీ! హరా! పంచవింశ
త్యభిఖ్యా! మురారాతిసఖ్యా! కుబేరాతిముఖ్యా! జగత్సాక్ష్య
కర్తృత్వవిఖ్యాత! బృందారబృందాభిముఖ్యా! యఘఘా!
మఘఘ్నా! స్మరఘ్నా! పురఘ్నా! స్వదేహామరక్షోణిజాతాగ్ర
జాగ్రత్కసాంగ్రజ్జటాజూట! పశ్యల్లలాటా! పినాకీ! యనేక
ప్రకారానిశాపూరితక్రివ్యభుక్షువ్యభుక్కోటిముఖ్యాశ్రితాశా!
పృథివ్యప్కృపీటోద్భవస్పర్శనాకాశసూర్యేందుయజ్వాఖ్య
మూర్త్యష్టకస్ఫూర్తిమత్త్వాత్మభావప్రకారప్రకాశా! తదాకాశ
వాయ్వగ్నివారిస్థిరాZభిఖ్యలింగప్రసిద్ధాతిపుణ్యప్రదేశా! మహేశా
మహాకాళశ్రీసోమనాధాదికద్వాదశజ్యోతిరుద్దామలింగస్వరూపా!
చతుర్వక్త్రసూతా! చతుర్వేదవాహా! క్షితిస్యందనా! వార్థితూణీర!
హేమాద్రిచాపారమా క్షేశరోపా! త్రిశూలాదినానానిశాతా
యుధాపూర్ణహస్తా! ముహుస్తాండవాభిఖ్యనాట్యప్రభేదప్రశస్తానవ
త్వాడపదాన్మశ్రితానన్యరక్షాక దేవాసురవ్రాతమున్ జంగమ
స్థావరాత్మాఖిల ప్రాణివస్తువ్రజంబిప్పుడింతా సకృద్ఘోరహాలా
హలాభీలకీలాNళినాశంబుగాకుండంగ పాడవే! దేవ! తాటస్థ్యమున్
జెందియిట్లీవుపేక్షింపన్యాయింబె? భావత్కకారుణ్యపూర్ణాక్షి

క్షోణపరిపాతార్హ్యసాఁ గాదె; యీనీయపత్యంబు! దీనావనా!
మాకు దిక్కెవ్వరన్యుల్? విపన్నప్రపన్నత్వయుక్తంబదః కింకరౌ
ఘుంబు వేవేగ రక్షింపఁగారాఁగదే! సర్వకర్తృత్వభర్తృత్వ
హర్తృత్వభోక్తృత్వగంతృత్వమంతృత్వయంతృత్వరంతృత్వ
నేతృత్వదాతృత్వశాస్తృత్వభాక్త్వాతిశాయీ! బలీవర్ద
యాయీ! చిరస్థాయినానాప్రకారోరుభాగ్యప్రదాయీ!
త్రయీవేద్య! సర్గాద్య! నైవిధ్యనైరుధ్యనైవర్ణ్యనైస్వర్యనైకల్య
నైష్ఫల్యనైయర్థ్యముల్ నొంచెమమ్మున్; వ్యథాఽత్యంతనై దగ్ధ
మేర్చెన్ మము న్నిహాజ్ఞాతమున్, యాతనాప్రాతమున్
బాపవే! పాపవేదండపంచాస్య! పంచాస్య! త్వత్స్మరదీప్తుల్
శుభాప్తుల్ గదా; మాకుఁ! ద్వద్భూషణంబుల్ శ్రవోభూషణంబుల్
గదా మాకుఁ! ద్వత్సన్నిధానంబు తత్సన్నిధానంబ యౌఁగాదె! యాగాము
లేలా? ప్రభూ! బాములన్ గాములన్ బాఱఁద్రోలంగరావేల?
యీజాలమేలా? యుమాకేళిలోలా! యికం దాళఁగాఁజాల మేలా
పరీక్షించుటల్ మమ్ము? క్షేంగా, యుపేక్షించుటల్? భక్తసంత్రాణ
శీలా! మహేశా! యోకాలకాలాఖ్య! పంచాక్షరీమంత్రసత్పంజర
స్థాస్నుకీరాయితాత్మస్వరూపా! యివే, నీకు జోహారుల్
వేనవేలివ్వియే యేకనోక్తైన్ని యేనిన్; ప్రణామంబులెన్నేని
నీకివ్వియే; వందనంబుల్ సహస్రాధికంబుల్; జగజ్జాలమున్ జాలిమై
గావరావేఁ? జాగేల? కైలాసవాసా! దిశావాస! రక్షింపవే,
యీక్షణంబీక్షణశ్రోత్రకేయూర! మా మొక్కులంగీకరింపన్
జలంబేమి? యేమైన మానేరమున్నన్, క్షమింపన్ గదున్ జెల్లదే?
యెల్లలోకంబులిట్లేచ్చు నీ కాలకూటాగ్నిఁ బోకార్పవే! వేగఁ
జేకూర్పవే శ్రేయమున్ సర్వలోకాళికిన్! శాంతిఁ గల్గింపవే మాకు
నిర్వ్యాజకారుణ్యమూర్తీ! సమస్తాంతరంగప్రవర్తీ! మృడా!
క్షీరవారాశివీచీవిలోలోరుడిండీరహాసిస్వతస్స్వచ్ఛనైజాంగ
రుక్ శ్రీ! శ్రితాభీష్టదానోత్సుకత్వస్ఫురత్స్వాదుతాభాక్సుఖ
వ్యాహృతిశ్రీ!! యనన్యాదృశాపాయనదోత్యతకస్వావదాన

ప్రపూర్ణస్థిరాశావకాశావదాతావతీర్ణోరు కీర్త్యావళిశ్రీ !!!
యకూపారదాత్రీయసంతానశీల విశాలాతి శాయ్యద్భుతాన
న్యసామాన్యమానాన్యశ్రీమానాన్యవరాపూర్ణ సద్భక్తసన్నోదీర్ణ కారుణ్య
సచ్ఛ్రీ!!! పునఃపూర్వకాసన్నమస్యానమస్కారముల్ స్వీకరింపం
గదే! నెమ్మి నమ్మానసింపంగదే!! దేవదేవా! నమస్తే;
నమస్తే; నమస్తే; నమః॥ ” 404

మ॥ అని, ప్రార్థించుచుపర్వపూర్వసురదీనాలాపముల్ వించు, హై
మనశైలాధిపపుత్రికాధవుఁడు, శుంభద్భూరికారుణ్యుఁడై,
క్షణమాత్రన్ నిజరూపమొప్పఁగను, సాక్షాత్కారమున్ జెందెనీ
క్షణశబ్దగ్రహకుండలాంగదుఁడు, దిగ్వ్యాప్తప్రభాపూర్ణుఁడై॥ 405

ఉ॥ స్థూలజటాకలాపము, విశుద్ధతనుద్యుతిపూరమున్, గరా
కీలితశూలమున్, వృషభకేతనముం, గజచర్మచేలమున్,
ఫాలవిలోచనంబు, హరిణగ్రహశాలిశయంబుఁ, బాత్రకం
కాళముఁ, గాలిదేహమున, గాంగఝరంబులున్ శిరంబునన్॥ 406

సీ॥ ఒకకేలశూలమింకొకకేల బాలసా
రంగంబు, శైత్యమార్దవములొంద,
సగమేననగజాతవగమీఱ, గగనాప
గయుఁ, జంద్రరేఖ సిగం జెలంగ,
నృకరంకమాలికల్, మకరాంకతనుభూతి
రేఖలు మెఱ, మేనశ్రీలనీన
నఖిలాంగనద్ధపింగాక్షిద్యుతిస్ఫార
హైమసూత్రదివ్యభూషావళులొప్ప,

గీ॥ దీప్రసర్వాస్యభవదివ్యదీప్తి, నేత్ర
ములకుమూఁటికి మిగుల వెలుఁగులింద్ర
చాపశోభనుశారదజలదమునకుఁ
బోలెఁగల్గింపనుత్తుంగశైలమందు॥ 407

గీ॥ శాంతగంభీరమూర్తిఁ, బ్రసన్నమంద
హాససుందరవదను, సహార్ద్యసదను,
నందివాహనుఁజూచి, యానందమొంది
యందఱును జేసిరప్పుడు వందనములు॥ 408

వ॥ అంత॥ 409

ఉ॥ భక్షితకాలకూటు, హిమవత్క్షితిభృద్దుహితృప్రియున్, లలా
టేక్షణు, నీక్షణశ్రవణహారవిభూషణు, భక్తపోషణున్,
యక్షపతిప్రియున్, సరసిజాసనవాసవవాసుదేవస
ర్వ్యక్షణవాచరామరులురంజిలి, నెంజలిదక్కి మ్రొక్కఁగన్॥ 410

ఆ॥ హర్షమొందిరప్పుడాబాలగోపాల
మమరవరులుగురిసిరలరులజడి;
మొరసెఁ దివ్యదుందుభులు; పాడియాడి
రచ్చరలు; సర్వతఃప్రశాంతిగల్గె॥ 411

ఆ॥ దెసలు తెలివొందె; విసరెసుఖానిలం
బులు; హాలాహలంబుహాళహళికను
గలఁచి, శివుఁడు పరమకారుణ్యుఁడై, హుంక
రించి, చిటికెనోనమ్రింగునంత॥ 412

ఆ॥ అణఁచియిటులుకరుణనమరాసురులకూర్తి,
సుఖముఁగూర్చి, హరుఁడుస్తూయమానుఁ
డగుచు, ప్రమథగణములనుగమింప, నదృశ్యుఁ
డయ్యె; సురలుఁ, నసురలప్పుడుమరల। 413

ఆ॥ అమృతరసముకొఱకు నధికోత్కలికమీఱఁ
బ్రికృతిఁబడసి, బసీ త్రిచ్చవార్ధి
నుద్భవించెనశ్వముచ్చైశ్శ్రవాహ్వయం
బిందుపాండరంబు, సుందరంబు॥ 414

ఉ॥ చామరతుల్యవాలము, విశంకటవాయుమనోజవంబు, ర
మ్యామలదేహకాంతియు, జలాచలప్రోథవిశీర్ణ ఫేనము
ద్దామచలత్ఖురాగ్రబహుధాపరిధూతధరాపరాగసం
క్రామితసర్వదిక్కము, తురంగమువిచ్చె సముత్థహేషలన్॥

ఆ॥ పొడమెఁబిదపవార్ధినడగొండవంటి చౌ
డంతి, వెల్లగౌరదారదాన
ధారలొప్ప, సప్తధాస్రవముల సప్త
పర్ణగంధిలములు, బంధురములు॥ 415

ఆ॥ అమరులసురులుభయులామోదమొందఁ,ను
చ్చైశ్శ్రవంబు, నగ్గజంబు జంభ
భేదిస్వీకరించె; బిఱివోక, వీఁకవా
రువధిమరలఁద్రిప్పుచు డిరంత॥ 416

ఆ॥ దుగ్ధవార్ధిఁగామదోగ్ధ్ర్యభిఖ్యదివ్యధే
నువుజనించెస్ఫటికధవళ,లంబ
సాస్న, శృంగయుగ్మసంగతౌన్నత్య,నే
త్రాభిరామ,సర్వహర్ష ధాత్రి॥ 417

ఆ॥ పిదపఁ,గలశజలధినుదయించెఁగల్పక
పంచకంబు, సర్వవాంఛితార్థ
దానవిత్తమంచితప్రవాళాంకుర
రత్నదీప్తి,స్వచ్ఛనూత్నకాంతి॥ 418

ఆ॥ అంత, దుగ్ధవార్ధియందుఁజింతారత్న
ముద్భవించెదివ్యమద్భుతంబు,
సకలశుభకరంబు, చారుతరాకార
మహాచు,జండతేజమేచినింప॥ 416

ఆ॥ సముదితోష్ణరశ్మిసమదీప్తిగల్గి,కౌ
స్తుభముపొడమెఁబిదప; దుగ్ధవార్ధి
నాత్మవీచిహస్తమందుంచుకొని,దాని
హరియురస్స్థలంబునందుఁజేర్చె॥ 420

ఆ॥ తోఁచెదుగ్ధవార్ధివీచికాగర్భమం
దాదిలక్ష్మి; యత్కటాక్షలేశ
మఖిలభువనములకు నధికాధికర్ధిహే
తువు, మనోరథాప్తిదోహదంబు॥ 421

ఉ॥ సుందరమందహాసములజ్యోత్స్నలుపంచుముఖేందుబింబమున్;
మందమనోజ్ఞయానమును, మంజులమౌక్తికభూషణద్యుతుల్,
చెందొవఁగ్రిందుసేయు నరచేతులు, పీనకుచద్వయంబు, క
న్విందొనరింప, లక్ష్మిఁగని,నెమ్మనమునుత్సుకుఁడయ్యెవిష్ణుఁడున్॥

చం॥ సిరియు, సరోజపీఠమునఁ జెచ్చెరఁ దానధిరూఢగాఁ గజా
మరములు విచ్చి పుచ్చుకొని, మందమనోహరలీలవీచున
చ్చరలకరాగ్రకంకణవిశంకటఝంకరణంబులొప్ప, ది
క్కరులు మరందతుందిలవికాసిసుమాభిషవంబుఁ దీర్చెడున్॥

సీ॥ శ్రీవత్సకౌస్తుభశ్రీవిభాసితవత్సు
భక్తవత్సలుని, శుభంయుచరితు
శంఖచక్రగదాఽసిశార్ఙ్గాయుధు, నహంయు
ధాష్ట్ర్యసిద్ధానను, దార్క్ష్యవాహు,
నీలాంబుదశ్యాము, లీలాఽవతారనై
పథ్యశోభితుని, గీర్వాణవంద్యు,
వైకుంఠు, వైకుంఠవాసు, నకుంఠభ
క్తావనోత్కంఠునిఁ, బావనాత్ము,

గీ॥ ఘనఘనాఘనచయమును, గనదుపోఢ
కాంతికాంతక్షణప్రభవింతవింత
గాఁగ, శోభింపఁ జేసినక్రమముదోఁపఁ
జేరి, తద్వక్షమును లక్ష్మి సౌరుమీఱ॥ 424

ఆ॥ భువనజనని, విష్ణుభుజమధ్యపీఠసం
భాసమాన, లక్ష్మిఁ బరమమునులు,
నమరవరులు మ్రొక్కి రళికదేశనివేశ
వత్కరాంబుజముల, భక్తిమీఱ॥ 425

ఆ॥ పిదప, నుదధిఁ బొడమె మదిరారసాపూర్ణ
కలశకలితహస్త, కన్యయొకత
వారుణీసమాఖ్య; ప్రకటమన్మదులు, దై
త్యులు పరిగ్రహించి రెలమిదాని॥ 42

మ॥ కరమాశ్చర్యకరంబుగాఁ బొడమి దుగ్ధపాథోధి, న
చ్చరలబ్జాస్యలు, సింహమధ్యలు, లసత్సచ్చారుహాస
సురవిద్యుద్ద్యుతిదీప్తలుత్పలదళాక్షుల్, పీనవృత్తస్తన
వరణీయల్, సురలోకశోభితలు, దివ్యల్, భవ్యలయ

ఆ॥ వారలెల్ల స్వైరచారుభాషిణులు, సం
గీతనృత్తనృత్యకేళిలోల
లై, త్రివిష్టపంబునందుఁ జరించిరా
కుటిలకచలు, లసదచటులకుచలు ॥ 428

ఆ॥ దాంతి, శాంతిగల్గి, ధన్వంతరియనంగ
నొక్కదివ్యమూర్తి యుద్భవించె
దుగ్ధవార్ధినుండి స్నిగ్ధగంభీరసు
స్వరుఁడు, సింహమధ్యుఁ, డురుభుజుండు॥ 429

ఆ॥ కంబుకంధరుండు, కమనీయకార్తస్వ
రాంగుఁ, డిందుసుందరాస్యుఁ, డింద్ర
నీలకుంతలుండు, నీలోత్పలాభలో
చనుఁడు, ఘనుఁడు, సుప్రసన్నుఁ డంత॥ 430

ఆ॥ అమృతకలశమలరు హస్తద్వయంబునన్
గలశజలధిఁ బొడమె ఘనఘనాఘ
నాభుఁ డబ్జనాభునవతారమైన ధ
న్వంతరి ప్రసిద్ధనాముఁ డప్డు॥ 431

ఆ॥ అమ్మహాత్ము, దైత్యులాదిత్యులందఱు
ధన్యు, నోషధాత్ము, బుణ్యమూర్తి,
వాసుదేవునుద్ది, పాణికృతామృత
కలశు, రోగశైలకులిశుఁ గాంచి॥ 432

ఆ॥ అట్టిపిడిమందరాకర్షణక్లేశ
మెల్లరుల్లసిల్లి రుల్లములను;
వారిఁ జూచి యిట్లు వాక్రుచ్చె ధన్వంత
రిప్రభుండు, నిండుహృదయ మొప్ప॥ 433

ఆ॥ "వినుఁడు, సురలు, నసురులును బ్రాలుమాలిక
మాని గైకొనుండు దీనిసుధను;
దీనిఁ ద్రావ, రోగమేనిఁ, జావేనియు,
లేకయుండ్రు; కీఁడుసోకకుండు ॥ 434

ఆ॥ దేహపుష్టిఁ జేయుఁ, దేజంబు, వర్ణవి
క్రమము లొప్పు నమృతరసముఁ గ్రోల;
స్థైర్యధైర్యశౌర్యచాతుర్యములు గల్గు;
యుద్ధమందు శ్రమయు నుండఁబోదు॥ 435

ఆ॥ మఱపు, వెఱపులేక, వరలు మీర నిఁక పరా
జయము గలుగఁబోదు; సంశయింపఁ
గాదు; రండు; దీనిఁ గైకొని, స్వేచ్ఛమైఁ
ద్రావుఁడయ్య! యీసుధారసంబు॥ 436

మ॥ సుమహాయత్నమొనర్చి నారు భయులక్షుద్రప్రభావాఢ్యమీ
యమృతంబిట్టుపలబ్ధమైనయది; హవ్యక్రవ్యభుఙ్ముఖ్యులా
ర! మిథోహార్దమునన్ సుధారసము గ్రోలన్ రారండు! మీ
శ్రమ లెల్లన్ ఫలియించె; నందితశుభప్రారంభ మామీకిటన్॥

ఆ॥ పూర్వపుణ్యమున నపూర్వపూర్వసుపర్వు
లార! యీశుభేచ్ఛ తాప్తిఁ గాంచి,
నారు నేఁటికిఁ జీరసములు మాని,
యీరసామృతంబుఁ జూఱఁగొనుఁడు॥” 43

ఆ॥ అనుచుఁ బలికి, యంత, నంతర్హితుండయ్యె
నప్రమహామహుండు; నమృతసహజుఁ
డమృతకరుఁడు దితిజులదితిజుల్ సూచుచుం
డఁగ నెసని యెసరగ గగనమునకు॥ 439

ఆ॥ అంత, దైత్యులెల్ల రాదిత్యులును సంత
సంబుతో సుధారసంబుఁ గ్రోల
సమయమెఱిఁగి, సర్వసన్నద్ధులై యుండఁ
బ్రోత్సహించెఁ గలిసిముర విరోధి॥ 440

ఆ॥ కలి గలంప, వారు కలసికి స్వార్థ్యంబు
దక్కి, చాలయమృతంబుగాఁగ
నొకరినుండి యొకరు గిఱిరించి, యొడిసి, పీ
యూషపానకాంక్ష యుదిలగొనఁగ॥ 441

వ॥ లోభంబునన్ జేసి, పరిలోభనతాత్పర్యంబునఁ బారంపర్యప్రాప్త
పీయూషభాండమండిత హస్తాగ్రజాగ్రత్సంరంభప్రారంభులైన
యద్దేవపూర్వదేవవర్గంబులకున్ గలహంబు,” “చినికిచినికిగాలి
వానయైనట్లుగా” నత్యుత్కటంబై, తమదగునమృతరససంపాదన
వ్యవసాయంబ తయుగొడ్డేటిపాటయైపోయె—నంత॥ 442

ఆ॥ దైత్యులిద్ధవీర్యదర్పితులై, క్రౌర్య
మొప్ప దేవతాళి నోటువుచ్చి,
యపహరించిరిట్టి యమృతంబు; వారలు
ద్విగ్నులైరి; దైన్యమగ్నులైరి॥ 443

ఆ॥ భుగ్నహృదయులయ్యు, లగ్నహాశ్రీశుపా
దాబ్జభక్తిగల్గి, యమ్మహాత్మ
శరణుఁగోర, నార్తిహరుఁడైనహరి వారి
కభయమొసఁగఁదలఁచి, యభవరదుఁడు॥ 444

ఆ॥ అవతరించెనచట యన్మాయ విశ్వరూ
పిణియొ, గూరమేశుఁడనఘమోహి
నీస్వరూపమొప్ప, నస్వప్నదైత్యవ
ర్గములనడుమ, గరుడగమనుఁడహహా!॥ 445

వ॥ కిసలయసముదయమృదులలలితకరయుగళయుఁ, గమ్రరోలంబ
నికురంబలంబవేణియు, సరసమధురతరవచననిచయవిరచనచణయు
నయనవలనతులితహరిణియు, నధరదళపదతలారుణారుణయు నన్న
యత్పంచబాణయునైన నాజగన్మోహినిన్ గాంచి, దేవదైతేయు
లెల్లరునుల్లంబులనెంతయునుల్లసిల్లిరంత॥ 446

ఉ॥ ఆసకలేందుసుందరముఖాన్వితఁ, జంచలచంచరీకరే
ఖాసఖనూర్ణకుంతలవికాస, విభాసురచారుహాసరే
ఖాసహితన్, నవోపమితకర్ణయుగన్, మృగరాజమధ్య, న
ధ్యాసితకుందకుట్మలరదాళి, మదాలసహంసగామినిన్॥ 447

ఆ॥ భూషితాంగయష్టి, నీపద్మలగ్నోద
రాఢ్యఁజూచినంత, మాఢ్య, మెప్ప
దైత్యులెల్లముగ్ధతాదిగ్ధులైరి; వా
రలఁగలంచెలలనలలితగతుల॥ 448

ఆ॥ ఒకనిఁ గనుచు, నవ్వు; నొక్కనిఁగవ్వించుఁ;
గన్నుగీటునొకనిఁగాంచి; పైట
జార్చు; జక్కఁజేర్చుఁ; జన్నులఁజూపు;లా
లిత్యమొప్పనిట్టులీల, బాల॥ 449

ఆ॥ మదనరసముతరుణఘనములనురల మం
జీరమంజుమధురశింజితములు
వోలయఁ, గేళిపద్మమునుగరకీలితం
బుగ, శ్రమోదబిందువులునుజాఱ॥ 450

ఆ॥ చెవిఁజెంవినకలువఁజేరిఝుంకృతిఁజేయు
తేటిఁదోలుకొంచు, మాటిమాటి
కెడమచేత, బొమలముడువఁగఁగుటిలన
ర్తితమునిటుఫలకనతివయారు॥ 451

మ॥ అలరున్ గార్తికచంద్రమూర్తి, లలితంబై. స్మేరమేతన్ముఖం
బలఘుప్రస్ఫుటసారసాకరగమత్స్వద్వంద్వసంసూచనం
బులు,తల్లోచనముల్; కుచాఖ్యలికుచంబుల్,బింబబంధూకమం
జుళమావాతెఱతేనెలూఱు,హసితాంశుల్ స్నిగ్ధముగ్ధంబులౌ॥

ఉ॥ కుంతలకాంతిమండితము, కోమలగండయుగంబు, కేతకీ
పాండిమడిండిమంబు, మణిభాసురదర్పణచారుతాఽర్పణా
ఖండయశోఽభిశోభితము, కౌతుకహేతుకహాసచంద్రికా
శౌండము, ముద్దువెట్టుకొనుసాహసమూనరిదానవుల్ గడున్॥

ఉ॥ కాంచనకాంచికామణినికాయపరీతనితంబబింబమ
భ్యంచితసంచలత్కిసలయాకృతిఁబాదయుగంబు, మధ్యమున్
బంచముఖార్భకాపహాసనప్రవణంబునుగాంచి; సర్వరా
త్రించరవర్గమెల్లసుదతీప్రియతన్ బరవత్త్వమొందినన్॥ 454

ఆ॥ అంత; విస్తరించియమృతాపహరణాభి
లాష, దైత్యులావిలాసినీల
లామరామణీయకామృష్టనైయక్తి
కస్వభావులైరి; నిస్స్వభావులైరి, 455

ఆ॥ " అహహా! యేమిరూపమదియేమిలావణ్య
మేమిమేనికాంతి! యేమిసౌర
భేమిత్రీరటంచు, నూమినీచరులబ్బు
రంబదస్సుదర్శనంబటంచు"॥ 456

ఆ॥ మెచ్చి " యీమెయేదెమచ్చెకంటియొ; యీమె
కుటిలకుంతలయుత; కుంభికుంభ
తులితకుచయుగాఢ్య, లలితకర్ణాంతవి
శ్రాంతనేత్రి, యేరికాంతయొక్కొ! 457

ఆ॥ ఈమెయింతయొప్పునే, చంద్రబింబాస్య,
కుందకుట్మలాభశోభరద;
శ్రోణివిపుల, శూన్యశూన్యతలోదరి,
యమృతరసపుబావి, యతివమోవి॥ 458

ఆ॥ ఎవతెయొక్కొ, యీమె! యీరేడులోకాలఁ
గలదెయింతయందగత్తె? మదమ
రాళగమన, సుందరస్మేరవదన, తా
రాZZభనఖర, పల్లవాంఘ్రియెందు?॥ 459

ఆ॥ విభ్రమైకలోల, బిబ్బోకసర్వస్వ,
సరసకదళికోరుచారుతాZZఢ్య,
యెవతెయీమె?" యంచు,నెంచి రాత్రించరుల్
సేరిరామెఁజుట్టువారి, వారు॥ 460

వ॥ ఇట్లుసమ్మోహమోహితచేతస్కులైనయాదానవులాజగన్మోహినిన్ జేరి
తత్సన్నిధానంబున నేతమసన్నిధానంబునుంబోనిసుధాభాండంబు
నునిచి, శుచిస్మితరుచిరముఖియయినయామెకిట్లనిరి॥ 461

ఆ॥ “ఇందువదన! నీదుసందర్శనంబు మో
దంబుఁ గూర్చు; మోహదంబు గాదు;
గతమునెల్ల దెచ్చు స్మృతిపథంబునకున
చ్చెరువుగాఁగఁ, గోర్కెకిరవుగాఁగ॥ 462

ఆ॥ మోహనాంగి! నీయభూతపూర్వంబద్భు
తంబుఁ, బుణ్యదంబు, దర్శనంబు
గల్గువాఁడు పుణ్యకర్ముఁడే; ధన్యుఁడే
వాఁడు; నిజము తలిరుబోఁడి! వింటె!॥ 463

ఉ॥ నమ్మనొ, నమ్మవేమొ! వచనమ్మిది గాదనిత్యమ్ము; నీకస
త్యమ్ము; పయఃపయోనిధిని ద్రచ్చుడు మేము సురాసురుల్ ప్రమో
దమ్మునఁ బొందియున్ సుధను, దావకదర్శనపుణ్యభాగ్యల
బ్ధమ్మగు తృప్తిఁ బొందము; యథార్థము; తప్తసువర్ణసన్నిభా!

మ॥ జనియించెన్ గలశాబ్ధిమధ్యమునఁ ద్రచ్చన్ ద్రచ్చఁ బీయూష మో
వనితాలోకశిరోమణీ! యమృతసద్భాజనంబుఁ జిత్తైక మో
హనమున్, దీనిఁ బరిగ్రహించి, దయతో నస్మన్మనోభీష్టదా
యినివై, వంతులఁ బంచిపెట్టఁగదె, సంతృప్తిన్ వెలార్పన్ గదే!॥

ఆ॥ సుందరాంగి! యెచట సురుచిరాకృతి గల్గు,
నచట సకల గుణములమరుఁ గాన,
నీవు సాలువట్టి మా వివాదముఁ దీర్చి,
సుధను మాకుఁ దృప్తిఁ జూఱలిడుము”॥ 466

ఆ॥ అనుచుఁ, బలుకు దనుజులను గారవించి, యా
మించుబోఁడి ప్రౌఢిమించి, మఁచి
తనము తోఁడవుగాఁగ వనితసత్కీర్తిము
క్తాఫలాళి వారిఁ దన్నెనిట్లు॥ 467

ఆ॥ “అసురులార! యంతరంగంబునన్ జిత్ర
వర్తకుండు చిత్రవర్తనంబు
లాచరించుచుండు; మీచిత్తవృత్తి, వా
గ్వృత్తిఁ దెలియఁగలనె? స్త్రీనిగాన॥ 468

ఆ॥ అన్నలార! వినరె, యూబాలగోపాల
మాడుమాట నెప్పుడాడునాడు
జాతిమృషలెయ్యనఁగ? సంవిభాగవ్యవ
హారమునకుస్త్రీలఁగోరనౌనె? ॥ 269

ఆ॥ లోకమునను, లోలలోచనల్ భావించు
టొకటి; సెప్పుటొకటి; యొకటిసేయు
టగుట, సహహా! నిగమమాగమమున్ నేర్చి,
బోధగల్గి, నమ్మఁబోరు వారి॥ 470

ఆ॥ లలితముగనుగాముకులుపరిణయపరిచా
రకతఁబొందవచ్చు; రతులఁదేల
వచ్చుఁ; గార్యవిఘ్నయోచ్చయోచితసమ
యమున స్త్రీలనమ్మనగునె? చెపుఁడ! ॥ 471

ఆ॥ క్రివ్యభుక్కులార! కామిని యీజగ
నోర్మహీనియని, మీరలూహఁజేసి,
హాసమునకునయిన, నసఁజెల్లునే మీకు,
నీతిమంతులౌ మనీషులకును?॥ 472

ఆ॥ మొదటఁబలికియొకటిఁ, బిదపఁదదన్యథా
కరణమనఁగ, విమతపురుషునకగు;
దానవానికేమిహానియాఁ? గాని,య
య్యదిజఘన్యమన్యమఘసమున్నె ?॥ 473

ఆ॥ నన్నుమీరలెల్లసమ్మతిరేని, భా
గములుసరియుఁగాఁగ, నమృతరసముఁ
బంచియిచ్చెదాన; వంతులునిర్వివా
దముగ, నుభయులకు ముదమ్ము మీఱ॥ 474

ఆ॥ ఎవరికెంతభాగమెషపకసమయాను
రోధమునను వచ్చు, రోషమేది,
తోషమొందనౌబిభీషికల్ మాని, మీ
రైన, దాన వారలైనఁగాని॥ 475

ఆ॥ ఇట్టులైనచో, సమీహితార్థములు సి
ద్ధించుమీకునెల్ల; నించుకేని
నన్నమాటఁదప్పకున్నచో,లగ్గాను;
యోగ్యులుజ్జగింపరుక్తమోఁదు॥ ” 476

ఆ॥ అనుచుఁ,బలుకువాక్యములు వెదీయుంబును
వినుచు, సురలు, నసురులునుపెదుక్త
మాచరింపనెంచిరా చారుగాత్రియు
మెచ్చెవారినెల్లమచ్చికంటి॥ 477

ఆ॥ మునితయమృతకలశముపెతవచశ్చతు
రతమెలర్ప, హాస్తగతమొనర్చ
కొని, సుపర్వదైత్యులను రెండుబంతులఁ
దీర్చి,యంతఁబైఁడి త్రిడ్డుఁబూని॥ 478

ఆ॥ త్రావఁజేసెసుధను దేవతాగణముల
నెల్లమోహనాంగిమెల్లమెల్ల;
“ నింకమాకుఁబోయు; నిప్పుడువోయు”నం
చసురులెదురుసూచిరసురసురని॥ 479

ఆ॥ తాల్మిఁగోలుపోయి, దైత్యులుశంకించి,
యాత్మదర్శనప్రయత్నమూని
యైన, వారలామెయక్షిభ్రువక్షేప
లోభితాత్ములై, విలోలురైరి॥ 480

ఆ॥ ఆశపాశహూచు, నాశరపాశుల
బంధితులనుజేయ, వారలుబుకుఁ,
బలుకులేక, పులుకుపులుకునఁజూచు “చే
మన్న, నేమియానో” యనుచుబళిర! ॥ 4 1

ఆ॥ నెలఁతమెఱుపుపగిది, నికషోపలంపు రే
ఖయునుబోలె, మణులకాంతిఁబోలె,
దీపికయునుబోలె, దితిజులమనము లోఁ
గొనియెఁదీయమావిగుత్తివోలె॥ 482

మ॥ అకళంకంబదనీయమాస్యముఁగనన్, యామిన్యధీడ్దర్శనం
బిఁకఁజాల్లాలనిపించుఁ; గల్పకఫలంబేతత్ప్రివాళాధర
ప్రకటస్వాదుతకున్ దలంకుఁ; గుచకుంభంబుల్ వృథాజృంభణన్
గికురించున్ గరికుంభమున్; బలుకులున్ క్షీరాబ్ధిసారంబులౌ॥ 483

ఆ॥ ఇదిమొగంబుగాదు; వివితశారదచంద్రి
బింబమిదియుఁగుచయుగంబుగాదు;
హేమకుంభయుగ్మమిదిభ్రూయుగళిగాదు;
పంచబాణుచాపవల్లిగాని॥ 484

ఉ॥ చంచలచంచరీకములసంతతిఁగుంతలములక్ హసించు; శో
భాంచితమాననంబుశరసజ్జముధిక్కృతిసేయు; దంతముల్
వంచితమున్ బొనర్చునొకవంతునదాడిమబీజరాజి; నే
త్రాంచలముల్ మనోజునిశితాస్త్రపరంపరలన్ జయించెడున్॥485

ఆ॥ పల్లవములుహస్తపాదముల్; నఖపంక్తి
కుసుమవిసరమగును; గుచయుగళము
ఫలభరంబు; ధ్రువము; లలనలతాభాస
మానభాసమానయానుగాదె!॥ 486

మ॥ పదవిన్యాసములన్ విలాసవతి విస్ఫారంబు, సాకూతము
గ్ధదృగాపాతమునన్దమిన్ గొలుపు: వక్షస్స్రస్తసూక్ష్మాతిహృ
ద్యదుకూలస్ఫురదున్నతస్తనదిదృక్షామోదమున్ గూర్చు; క్షా
మదశాశోభివిజృంభిసక్థియుగరంభాస్తంభముల్ జూపెడున్"487

ఆ॥ అనుచు, నసురగణములాజగన్మోహిని
రూపరేఖలకునిరూఢగాఢ
కాంక్షగల్గియి ట్లైసంక్షుభితాంతరు
లైరి; కాముకతవికారమొందె॥ 4 8

ఆ॥ ప్రియతగదురఁగామవిక్లిష్టులై, దైత్య
లెల్లశూన్యచిత్తవృత్తులైరి;
యూహాలేహాలేది, మోహినీసృష్టిసం
కలనమోహితులయి, పలుకు క్కి॥ 489

ఆ॥ అంత, నావరాంగి, యాజగన్మోహిని
త్వరితగతి స్మితంబు, గురిసి, యమృత
రసముఁ ద్రావఁజేసె రజ్జులాడితనంబు
మెఱయ, నమరవరుల మేలుఁగోరి॥ 490

ఆ॥ ఇట్లు దివ్యులెల్లఁ గృతకృత్యులగుడు, వి
జ్ఞాతమోహినీస్థకైతవప్ర
కారుఁడప్పు సింహికాపుత్త్రుఁడుద్విగ్నుఁ
డైన రాహునాముఁ డతులబలుఁడు॥ 491

దైత్యపంక్తినుండి తద్దయువచ్చి, దే
వతలపంక్తిఁ జేరి, వారితోడఁ
గ్రోలెనమృతరసము "గుటుకు-గుటుక్కు-న";
సన్నఁ జేయ సూర్యచంద్రులరసి॥ 492

ఆ॥ ఆరమాధినాథుఁడా మోహినీరూపుఁ
డాక్షణంబు త్రించె నసురశిరముఁ
జక్రధారఁ జేసి సాహసమ్మున సుధా
ధారగ్రోల, యాతుధానుఁడంత॥ 493

ఆ॥ తెగియుఁ, బ్రతికె శిరము; దేహంబు ప్రాణితం
బయ్యె; రెండు వ్రయ్యలవియుఁ గ్రమము
గా, ధ్వజంబు పూర్వకాయంబు, రాహువు
త్తరము; నింగిఁ జేరెఁ దద్ద్వయంబు॥ 494

ఆ॥ గ్రహగణంబుఁ జేరి, రాహు కేతువులు ఛా
యాగ్రహంబులౌచు, నాగ్రహంబు
మీఱ, రవిని, శశిని మ్రింగుదురా; నాగ్ర
హాప్రవృత్తులిట్టు లౌనుగాదె!॥ 495

ఆ॥ దైత్యులంత అంత, దైన్యోపహతులౌటఁ,
గ్రుద్ధులౌచు, వక్రబుద్ధులౌచు,
విప్రలబ్ధులౌచు, దీప్రప్రతాపులై,
యుద్ధమునకు సర్వసిద్ధులైరి॥ 496

ఆ॥ దితిజముఖ్యులంత, దీర్ఘాగ్రహాగ్రహ
గ్రస్తులై, శరాసపాశశక్తి
పరశుతోమరాసిప్రహరణహస్తులై,
యుద్ధమునకుఁ గడఁగి రుద్ధతులయి॥ 497

వ॥ ఈర్ష్యాళువులై యుద్దామసంగ్రామరంగంబునందు గ్రమ్మరులై
సంచరించుచు, నారాతిరించరులు ఖేచరవీరులపయిఁ బడి యురవ
డించి, శల్యంబులన్ దాడించుచుఁ, గుంతంబులన్ బ్రయోగించుచు
భిండివాలంబుల ఖండించుచుఁ, గుఠారంబుల విదారించుచు,
ఘోరంబైన పోరాటంబునకున్ గడంగి రంత; నాదిత్యసైన్యంబు
లును దైన్యంబునొందక, దైత్యుల యౌద్ధత్యంబు నోర్వక, సంక్రు
ద్ధులై యుద్ధోత్సాహసాహససంరబ్ధులై, దివ్యంబులును, దీవ్రం
బులును, దీప్రంబులునైన శస్త్రాస్త్రంబు లసంఖ్యాకంబులుగాఁ
బ్రయోగించినప్పు డాదిత్యదిత్యపత్యంబు లుభయులున్ బరస్పరవిజి
గీషామనీషన్ విజృంభింప, సంగరంబు సర్వలోకభయంకరంబై
ప్రవర్తిల్లె - నయ్యెడ॥ 498

కం॥ చతురంగబలోపేతులు,
చతురతముల సమరనిపుణులాయుధపాణుల్
తతభుజబలాఢ్యులగునా
దితిజులు, నదితిజులుఁ బోరఁ దీండ్రించికడున్॥ 499

కం॥ మదమలినగండములగు ద్వి
రదముల, నరదముల, హయవరంబులపై బ
ల్లిదులు త్రిదశులే తెంచిరి
ముదమొదవఁగ మదుల యుద్ధమునకుఁ బేర్మిన్॥ 500

ఆ॥ వ్యాఘ్రసింహసూకరారూఢులై, కాస
రముల, ఋక్షఖడ్గరంకుశరభ
రాసభములనెక్కి, రక్కసుల్ వచ్చిరి
కలనిపోలమునకును గడురయమున॥ 501

ఆ॥ దివ్యులెల్లఁ జేర్మిఁ దేదీప్యమానంబులైన వ్యోమయానహారిగాను
లౌచురాఁగఁ గాముకామినీచరులు భీకరములయినమృగఖగంబులెక్కి॥

వ॥ వారందఱును దుర్వారంబులైన నానాయుధంబుల నన్యోన్యమారణో పాయంబుగాఁ బ్రయోగించుకొనుచు, గగనతలంబుఁ గప్పుచుండ భేరీప్రముఖంబులైన వాద్యంబుల ఘోషంబులు సువీరవారప్రచారితంబులైన సింహనాదంబులును, సైనికనికాయకోలాహలంబులును మొత్తంబులై, రోదసీకుహరంబు నుద్దండధ్వానాపూర్ణంబుఁ జేయుచుండ, నాగ్నేయవారుణనాగగారుడదైత్యవైష్ణవభూధర వాసవాద్యస్త్రంబులను, గదాముసలముద్గరకుంతాదికంబులైన శస్త్రంబులను హస్తలాఘవంబులు మెఱయన్ బ్రయోగించు కొనుచు, రణరణకంబున రణంబొనరించుచున్, దదుద్యమంబునన్ గ్రుద్ధులై, రుధిరధారాపరిసిక్తులై, యన్యోన్యాయుధక్షతసర్వాం గీణులై, యుద్గీర్ణధాతుధారాపూర్ణనిర్ఝరకందరాకీర్ణంబులైన మహామహీధరవారంబులున్ బోలె, దేవపూర్వదేవసైన్యంబు లొప్పె; నట్టిప్రధనధరాతలంబునన్ బరాక్రమక్రమచంక్రమ మాణమత్తేభోత్తుంగతురంగయోధగాత్రప్రభూతోద్భూతరక్త ప్రవాహంబులేకోన్ముఖంబులై, సప్తార్ణవపీతోయంబులనెల్ల నారు ణ్యంబునొందించె; నిట్లు ప్రవర్తిల్లిన తద్ఘోరసంగ్రామంబు భిన్న కుంభంబులైన మత్తమాతంగంబులును, ఛిన్నసర్వాంగంబులైన తురంగంబులును, విభిన్నంబులైన కేతుసంఘంబులును, బతితంబు లైన సైనికనికాయకాయంబులునున్ గల్గి, భయావహంబై యుండె; నట్లు బహుతిథంబైన కాలంబతిక్రమింప, నాదైత్యులుగ్రులై క్రోధోద్రేకవ్యగ్రులై, సురాదితేయులనెల్ల నతినిష్ఠురంబులగు నాయుధంబుల నిర్దయమొయి మర్దించుచుండిరంత॥ 503

ఆ॥ అమరులంత, నాప్రహారముల్ సైరించు
కొనఁగలేక, శరణుఁగోరి రబ్జ
నాభు, శత్రుమర్దనప్రవణాత్ము, శ్రీ
నాథు, దివ్యభవ్యనామధేయు॥ 504

ఆ॥ కరుణగలిగి, యమరవరులఁ గావఁగ, నసు
రులనణఁపఁగా, సరోజనేత్రుఁ
డేగుదెంచె గరుడునెక్కి, పంచాయుధ
శస్త్రహస్తుఁడౌచు, సత్వరముగ ॥ 505

ఆ॥ వచ్చి, యట్లు శార్ఙ్గబాణాసనోన్ముక్త
శరపరంపరల నసురవిరోధి
సముదయంబుఁ గూల్చెఁ గమలాఽధినాథుఁ డ
బ్జాక్షుఁ డతుల భుజబలాఢ్యుఁ డౌచు ॥ 506

ఆ॥ దిత్యపత్యమెల్లఁ దీవ్రశరౌఘసం
పాతశాతితంబు, ఘాతితంబు
పాతితంబు, మూర్ఛితాతిపలాయితం
బయ్యె నల్ల నల్లనయ్యచేత ॥ 507

వ॥ ఇట్లు రక్షోవీరలోకంబంతయున్ బరాజయంబు నొంది, సంక్షుబ్ధ
చేతస్కులై, తత్ప్రతీకారపరికారాశక్తులై, హతావశేషులై,
వచ్చినవారు వచ్చినట్లు నొవ్వవడి, క్రొవ్వుసెడి, నవ్వులం బడ
లేక, దవ్వు దవ్వులన్ దాలుఁగినసరి; తదనంతరంబ॥ 508

ఆ॥ అన్నరాదులందునున్న యజ్ఞానుమ
న్నామకుండు, దైత్యనాయకుండు
తపమొనర్చి, బ్రహ్మదయ నిష్టవరములఁ
బడసి, యమరవరుల బడలఁజేసె ॥ 509

ఆ॥ వానిపీడఁ బాయఁగా నెంచి, యాదిత్య
లబ్జనాభుఁ డంబుజాసనుండు
వాసవుండుతోడు వచ్చుచుండఁగ, లోక
శంకరున్, బురారి శరణుఁ జొచ్చి ॥ 510

ఆ॥ జానుమంతు కూరి చర్యలు పచ్చనా
ర్చుచు, వచించిరంతఁ, బ్రచుచి. కృ
పాంతరంగుఁడై, సుహాదేవుఁ "డోఁడకుం"
డనుచు, నమరవరుల కభయమొసఁగె ॥ 511

ఆ॥ ఆమహేశుదోర్మహాదండసంజాతుఁ
డైనముక్తహాసియంత, దివ్య
తేజమొప్పఁగూల్చె నాజానుమండలు
లోకకంటకుని, మదాకలితుని। 512

ఆ॥ ముక్తహానివల్లహార్తికవంశంబు
వేదమార్గనిష్ఠమెుఁగనర్చె;
బ్రహ్మబాహుజన్ములకుక్షత్రియత్వము
ట్లార్యమైనక్షత్రియత్వమబ్బె॥ 513

ఆ॥ ఏదిక్షత్రియార్హ మేదిరాజర్షుల
కర్హ మేది? శాస్త్రమందుఁజెప్పఁ
బడియెనేది? ధర్మముడివోక, ముక్తర్షి
వంశ్యులట్టిధర్మబద్ధులైరి॥ 514

వ॥ అని, యనితరసాధారణధోరణీసారణీసంవర్ధితానేకేతిహాసోపన్యాస విన్యాసశాఖోపశాఖోపశోభిమహానోకహాయితాయతమూర్తి స్ఫూర్తిభాసురుండైనపద్మాసనునన్ జూచి, సాచీకృతచారువక్త్రుండై వాచంయమీంద్రుండైననారదుండు కౌతూహలదోహలుండై, సప్రశ్రయంబుగా నిట్లని విన్నవించె॥ 515

మ॥ "అరవిందోద్భవ! స్వర్ణగర్భ! యెటులార్యక్షత్రవంశంబు వృ
ద్ధిరసాభోగమునన్? మహాత్మ! పరమేష్ఠీ! రాక్షసశ్రేష్ఠుఁడు
ద్ధురుఁ డుద్దండుఁడు, జానుమండలుఁడు; ప్రోద్ధూతామరప్రాభవుం
డరుదారీతివరంబులన్ బడసెనెట్లాద్యంతమున్ దెల్పవే!॥ 516

ఆ॥ అద్భుతంబు దేవ! ప్రోద్భూతకౌతుకం
బుప్పతిల్ల, నడుగుచుంటిఁ దెల్పు
మానుపూర్విగాఁగ, యావదేతత్కథా
సరణి దయనలర్ప, జలజగర్భ! 517

ఆ॥ అనఘ! యసుర యెట్టిఁడా జానుమండలుం
డేతపంబొనర్చె? నేవరంబు
లొందె? వానివల్లఁ గుందిరమర్త్యులే
రీతి? నెట్టివాఁడు బుష్టివరుండు?॥ 518

ఆ॥ ముక్తనాముఁ డెట్టిభూరిబలోపేతుఁ?
డెట్టులమ్మహాత్మునీశ్వరుఁడు
భూతభర్త యేలపుట్టించె? సంకల్ప
మాత్రకల్పితావితత్రిలోక!॥ 519

ఆ॥ జానుమండలాఖ్యఁ జంపుటకై మహే
శ్వరుఁడు, మాని, ముక్తసంజ్ఞునెట్లు
సృష్టిఁ జేసె? సర్వతోష్టూయమాన! కం
జాతజాత! ధాత! ధూతపాప!॥ 520

ఆ॥ వినఁగ వేడుకయ్యె; విస్తరంబుగ ముక్త
మానిగాథయెల్ల; మహాక్తికోచి
తములఁగాలసమ్మతముల, ధర్మముల, నీ
శ్వరుమహామహత్త్వసరణి దేవ!॥ 521

ఆ॥ శ్రవణమాత్రమునను సర్వసిద్ధులు మాన
వులకునొనుగాదె! భూరితేజ!
పీయమాన సూచుఁ బీయూషము; పినాకి
చరితమెవనిఁదృప్తివ! ఉపదవని॥ 522

మ॥ అతిమాధుర్యమహోల్బణన్, వివిధపాపాఖ్యాంధకారార్కదీ
ధితి, దుఃఖార్ణవమగ్నమానవతరిన్, దేవా! దవాగ్న్యుజ్జ్వల
ద్యుతి నజ్ఞానవనాళికిన్, శశికళాద్యోవాహినీశోభితో
న్నతజూటోత్తమగాథ నెవ్వఁడు మహానందంబునన్ దేలఁడో!॥ 523

ఆ॥ ఎచటశివునికథలు ప్రచురప్రచారమున్
గాంచు—సరయువచటగంగ, యమున,
వేణ్ణ, తుంగ, భద్ర, పెన్న, సరస్వతి,
గౌతమియు, విపాశ కదలిపాఱు॥ 524

ఆ॥ ఏస్థలాన నెప్పుడే దేశమందు, నే
దిశను, మందిరానఁ దేవదేవు
డయినశివునిచరితమనఘంబు ప్రతిపాద్య
మాశ్రయింతురమరులచటమునులు॥ 525

ఆ॥ కాన, ముక్తపానిగాధకున్ గారణం
బయినశివునిమహిమ మఘనుడంబు
దయదలిర్పఁదెల్పు;తండ్రి! లోకేశ! నా
కుతుకభరముఁదీర్పు; కూర్పుముదము॥" 526

వ॥ అని, సురముని యడిగినంత, శతధృతిప్రసన్నముఖకమలనిరర్గళ
వినిర్గళితమధురమధురవచనమరందబిందు సందోహ దోహద
దోహలధారాౝసారసారణీధోరణులనాతని సౌమనస్యసస్య
శస్యమానసకేదారంబుఁదన్పుచు, నల్లనల్లన నిట్లనియె॥ 527

ఆ॥ నీదుప్రశ్నమాత్రమోదంబుఁగూర్చెన్;బ్ర
శస్తమిద్ది; వత్స! నిస్తులంబు;
వేయువిన్ననేమి? యాయుమాజానిది
వ్యేతివృత్తమొకటియెల్లమించు॥ 528

ఆ॥ పాపవహ్నిదాహతాపంబుదీఱె, గం
గాఽవగాహనముననటులెనరుఁడు
గాంచునీశుపాప్రిపుగఁగాధరకథాఽవ
గాహనమునఁజేసికమ్రిముగను॥ 529

వ॥ అందును, నీవుప్రశ్నించినముక్తిచరిత్రంబతిప్రసిద్ధంబును, జగ
త్పవిత్రంబును, మహాద్భుతంబు, న్నాకర్ణస్తుత్యంబును, బరమ
రహస్యంబునునగు; నైనను, నీకునాపకసెప్పెద; సమాహితాంతః
కరణుండవై, యాకర్ణింపు; మశ్రేయెట్టులనిన॥ 530

చం॥ అలఘుపరాక్రమక్రముఁనర్గళదోర్యుగళప్రతాపులు
జ్వలనిజరూపులిద్దరునిశాచరులుద్ధతులజ్ఞానుమం
డలుఁడు, సుమండలుండన; హతాత్ములభక్రిధులంతకోపముల్,
గలరుకుమారకా!కృతయుగంబునఁద్రిపురస్థులుద్ధురుల్॥ 531

ఆ॥ లోకకంటకులు, వివేకశూన్యులు, బహు
మాయలెఱుఁగువార జేయులొచుఁ,
గలశజలధిమథనకాలమందన వాప్త
కాములొచు; పాపగాములొచు॥ 532

శాస్త్రార్థకోవిదుండును, శుచివ్రతుండును, శుభాచారుండును,
సుశీలుండును, సత్యస్వరూపనిరూపకుండునైన శుక్రాచార్యున్
జూచి, సాష్టాంగనమస్కారంబులాచరించి, నిల్చియున్న యాన్నరాద
సోదరుల, నాత్మ శిష్యులనిర్వురన్ దదేక దృష్టిన్ జూచి,
కూర్చుండనియమించి, యయ్యాచార్యవర్యుండిట్లనియె॥ 539

ఆ॥ "వత్సలార! ప్రమదవశమయ్యెహృదయమ్ము;
నయము చేత, మీవినయము చేత;
నెఱుఁగఁదలఁపుగలదు మఱి మీకలికుపు
రాఁ, గతంబు; నేఁదు రాఁగతంబు? 540

చం॥ ఇరువురుమీరు క్లేశభరమేలొకొ, చెప్పక చెప్పుచున్నయా
త్తెఱఁగువహించినారు? భవదీయపదంబునుదుష్టులైన మా
ర్తుకుపడినాక్రమించిరో! విరుద్ధపథంబున దైత్యరాజ్యల
క్ష్మి రహింసురల్ బలాధికతఁ జేకొనిరో! కొనరో, మిముఁబూరిపాటిగాన్

ఆ॥ దనుజులమరులరణాకణకమునను
గెలువఁబోయి వారివలన నోటఁ
బొందలేదుగా! యరిందములార! యే
కాకులై, యిసీ! చికాకులేల? 542

ఆ॥ పరిజనంబువిడిచి, పరువుఁబ్రతిష్ఠను
విడిచి, బడలి, యడలి, వడిగ నిటకు
వచ్చినారుమీరు; ప్రతికృతినేనేమి
సేయువాఁడ? మీరసెప్పుఁడయ్య!॥" 543

వ॥ అని, యపలాపనంబుసేయక, యుపలాలనపూర్వకంబుగాఁగ్రిచ్చి
గ్రుచ్చియడుగుచున్నతమయాచార్యవర్యున్ జూచి, జానుమండ
లుండు సప్రశ్రయప్రణామపూర్వకంబుగా, సగద్గదనదద్గళంబుగా
నిట్లనివిన్నవించె॥ 544

ఉ॥ షడ్గుణతాపప్రపూర్ణ! భుజశాలులు, శిష్యులుమీకునూష్మలు
ద్విడ్గణతీక్ష్ణవీర్యులు, దితిప్రభుల్ విభవంబులెల్ల తా
మడ్గులసద్దులేక, విదితాన్యపథంబులఁబట్టిపోర, నా
మిడ్గురుపుర్వువెల్గులు, నిమేషవినశ్యములంచెఱుంగరే?॥ 544

ఆ॥ స్వామి! దేశికేంద్ర! సర్వతత్త్వార్థవే
త్తలరు మీరు; లోకములను మీకుఁ
దెలియరానివేమి గలవు? త్రైకాలిక
విదులరట్టి మీరు వేద్యవేత్త! ॥ 545

ఆ॥ భూరితేజ! యేల పునరుక్తమును జేయ?
మీరెఱుంగరే, యమేయదివ్య
మహితమహిమ! సురలు, మఱి మేముఁ గూడి, పీ
యూషదముఁ బయఃపయోధిఁ జేరి॥ 546

ఆ॥ మందరాద్రి, దెచ్చి, మఱి వాసుకిని జుట్టి,
త్రిచ్చినార మంత, సచ్చరిత్ర!
యందుఁ బుట్టిన యమృతమద్దానిఁ గైకొనఁ
గలహ మయ్యె మాకుఁ గాలవశత॥ 547

ఆ॥ అమృతరసముకొఱకు నమరులు, నసురులుఁ
గలహపరులు గాఁగఁ, దెలిసి నళిన
నయనుఁడపుడు నళిననయనయై, మోహినీ
సంజ్ఞ వచ్చె దేవజాతిఁ బ్రోవ॥ 549

ఆ॥ అట్లు వచ్చి, సురలకమృతంబుఁ బంచియా
నట్టివారు దాఁపిరంతి ముదమున;
వారిఁ జూచిచూచి, వావిరిఁ బుట్టెఁ గ్రో
ధంబు రాక్షసులకుఁ; దప్పిదం బె?॥ 539

ఆ॥ అంతఁ, బోరు ఘోరమయ్యెను దేవదా
నవులకపుడు సురలు నవుసుగ జూచి
చాలలేక మాకు, శరణుఁ జొచ్చిరి విష్ణు
మూర్తి, శత్రుభీతి మాఱిఁ బోవ॥ 550

ఆ॥ గరుడవాహనుండు కరుణాళువై, ప్రస
న్నాత్ముఁడై, శరప్రహారములను
బాఱఁద్రోలె దైత్యవర్గంబు నెల్ల; ని
ట్లమరె జయము సురలకపుడు; నిజము॥ 552

ఆ॥ విజయలక్ష్మిఁ గాంచి, యజరులు త్రైలోక్య
మాక్రమించి, రాక్షసాళిఁ బూరి
సాటిసేయకుంట, షాడ్గుణ్యసంపూర్ణ!
పూర్ణదుఃఖదము గఁదోఁచె మాకు॥ 553

ఆ॥ మాఱుసేతయేమొ మాకెఱుంగఁగరాదు;
మీప్రసాదమొకటె, దీప్రతేజ!
మాన్యకీర్తిశాలి! మాకునాశాజ్యోతి,
మీ కెఱుంగరొక్కొ, మీమహత్త్వ?॥ 554

ఆ॥ చెప్పనోరురాదు; సిగ్గగు; సద్గురూ
త్తంస! దిత్యపత్యసంసదాల
యములు, వాపికాఽంతరముల గాంగేయప
ద్మములె మొలువఁ గొల్లి, మఱియు నేఁడు॥ 555

ఆ॥ అసురులకటకంటకారణ్యభూములఁ
గడపుచుంటిరి కాలము వలి, బహలి;
యెవరి పేరువిన్న, నింద్రాదులకొకప్పు
వణఁకు దోఁచె, నాసురారులిప్పుడు॥ 556

ఆ॥ కాందిశీకులైరె కాంతకల్పాంతమృ
త్యువులఁబోని దైత్యయోధులొక్క
పెట్టనొక్కనాఁడు విశ్వతోవ్యాప్తులీ
ప్రొద్దు "చెట్టుకొకఁడు, పుట్టకొకఁడు" 557

ఆ॥ కపటులింకఁ బొఱఁగఁ, గొంపలూటాడఁ
గాఁ బరాక్రమించు ఘనులు రక్క
సులు వేంతులైన, సుక్కిరి సందుగొం
దులను వారు; దైవదూరులౌచు॥ 558

ఆ॥ ఎనుములెన్నియేనియును, బందులెన్నియే
నియు భుజింతురి తృప్తిమెయి నిరంత
రంబు; కపువైత్యులిం బెఱుంగక, పూన్య(ల్య)
మాంసమును, రుచిపరిశంస లేక॥ 559

ఆ|| ఒక్కనాఁడు తామురక్కసుల్ దేవతా
స్త్రీలఁగూడి, స్వర్గసీమలన్ వి
హారకారిశోభనత్యంతతృప్తులై,
దృప్తులైరి; యింపు దిక్కు లేక|| 560

ఆ|| బెండువడతిరిగి కొంపఁజేన్, గోసల
మీదశిష్యవర్గమోదయాఽఽఢ్య!
వెనుకవారిఁగనక, వెనుకకుఁజూడక,
“తలలు తపవికొనుచుఁ” దొలఁగి, చనిరి|| 561

ఆ|| అలమటించుచుండిరట విప్రచిత్త్యాది
దైత్యవీరులిట్టె మృత్యువశులు
గా, హతావశిష్టకర్బురుల్ దీనత్వ
మంత, నంతరంగమావరింప|| 562

ఆ|| తొంటిగర్వమెల్లఁదొలఁగిపో, రక్కసుల్
“దిక్కు—మొక్కు లేక,” యొక్క మొగిని
గాందిశీకులైరి; కర్తవ్యతామూఢు
లై, యసోఢరీఘ్నులైరి; వింటె ! || 563

ఆ|| ఏమిచెప్ప? మీరెఱుఁగదా, గురులు మా
కార్య! మీదుశిష్యులైనదైత్యు
లెల్లరుల్లసిల్లుటేమీకుసంతోష
దాయకంబునగుఁగదా! మహాత్మ!|| 564

ఆ|| చింతఁజేయుఁడాత్మశిష్యవంశాభివృ
ద్ధ్యర్థమార్యవర్య! సుధ్యుపాస్య!
శిష్యవంశవృద్ధిచేఁగాదె, దేశికుల్
పరిమదభరితులగుచు, వఱలుదురిల! || 565

ఆ|| గురుఁడె బ్రహ్మయాను; గురుఁడెవిష్ణుండు; సా
క్షాచ్ఛివుఁడు గురుఁడె; స్వచ్ఛమూర్తి!
గురుఁడెపరమధామముపరాయణము; త
ద్గురుఁడెయాను శిష్యకోటికెల్ల|| 566

ఆ॥ గురువునందుభక్తి గురుతరంబెవ్వని
కొలఁదిగడు వహించుఁ గోరి, నిర్మ
లత్వమెపుడు గురుఁడు, సత్త్వసంపన్న! ధ
న్యుండు వానికంటెనుండునొక్కొ!॥ 567

ఆ॥ అతఁడు వడయు లోకమందెల్ల భాగ్యముల్;
గురుని ప్రాణమాని, సురల నెవఁడు
పూజసేయు, వాఁడు నొందబోఁడు ఫలంబు;
సురలకంటె ఘనుఁడు గురుఁడు లోకమందు॥ 568

ఆ॥ ప్రీతుఁ జేయ గురుని, ప్రీతులౌదురు దేవ
తలు సమంత; సర్వదైవతస్వ
రూపుఁడౌను గురుఁడు; శ్రుత్యర్థతత్త్వవే
త్తృగరిగణ్య! సంచితాతిపుణ్య!॥ 569

ఆ॥ సులభుఁడయిన గురుని గొలువక, దుర్లభ
దైవతములనెవఁడు తద్దఁ గొల్చు,
వాఁడు హస్తగతము వీడి, వివేకశూ
న్యతను దవ్వు వాఁడు క్షితితలమున॥ 570

వ॥ మహాత్మా! మీరు తత్త్వార్థకోవిదులును, దేశకాలవిభాగవిజ్ఞాతరుల
విశేషించి, దైత్యులకెల్లరకును గురుదేవతామూర్తులరు, కావున
నేదేనొక్కయుపాయంబుఁ జేసి, మీ శిష్యులకౌన్నత్యంబెట్లు
సిద్ధించునట్లు యోచించి, సెలవీయుండగు భగవచ్ఛబ్దశబ్దితుల
రౌదురుగదా, మీరు! భవదీయాంతేవాసివర్గంబంతేవాసింజెందు
నట్లు శీఘ్రంబుగా నిశ్చయించి సెలవీయుం" డని,
జానుమండలుండు ప్రార్థించి పల్కినన్, దదీయ నయనీయదీనా
లాపంబులకు దితిపత్యాచార్యుండైన శుక్రుండెంతయుఁ బ్రొక్కి,
కటకటంబడి; యొక్కింతతడవు ధ్యాననిమీలితలోచనుండై,
యాలోచించి, భావ్యర్థంబు తెలుంగునెఱింగినవాఁడై, మృదుల
హాసితరుచిలసితసితరుచినిచయవిశదరుచింబరిహాసన్నిజముఖలలిత
కలాకలాపకలాపలాలితుండై, యిట్లనియె॥ 571

ఆ॥ "విదితమయ్యె; వత్స! యదితిసంతతివొందు
దైన్యమిద్దిగల్గెదైవవశత;
భావికార్యమునకుఁ బ్రతిక్రియఁజింతింప
నెవరికేని శక్యమే? కుమార!॥ 572

ఆ॥ ఎవరికెప్పుడెచటనేభవితవ్యత
దైవహృదయనిశ్చితంబొ, వారి
కప్పుడచటనదియునగు; దానికిని బ్రతీ
కారమున్నదే,జగంబులందు?॥ 573

ఆ॥ కానియర్థమెప్డుగానేరదటె; ప్రతి
కార్యమర్థమెప్డుగాఁగలయది;
వత్స! వంతయేల? భావ్యభావ్యర్థని
ర్ణయమశక్యమెంతనయవిదులకు॥ 574

ఆ॥ గతముఁజింతసేయఁ, గతమేమి? తచ్చింత
నంబుమూఢలక్షణంబుసూవె!
యమృతమనరూకును గమలసంభవుఁడు గ
ల్పించె;నీవసముననై నచారమెంచనేల? ॥ 575

ఆ॥ అమృతసేనసత్త్వంబు, శ్రీ
వైష్ణవపరిభావవైభవంబు
దేవతలకుజయముఁదెచ్చె; దైత్యులకప
జయముగలిగె; నింకసందియంబె ?॥ 576

ఆ॥ పూర్వవైభవంబపూర్వంబుగాఁ, బూర్వ
దేవులకులభింపఁగా,వలచితి
రేని, బ్రహ్మమెచ్చఁగా,నిష్ఠనొందఁదపో
ధ్యానధనులుగండుదైత్యులెల్ల॥ 577

ఆ॥ ముష్కరత్వమేది, దుష్కరంబు, దురాప
మైననిష్ఠనొందఁదపోఽధికత్వ
వైభవమునఁజేసి, వత్స! సర్వార్థసం
సిద్ధిగలుగుమీకుఁ; జింతతొలఁగు॥ 578

ఆ॥ తపముఁ జేసి, పొందఁదగనిదేదియు లేదు;
తపమువలనసాధ్యతమము లెల్లఁ;
జిరతపోఽతిశయముదురతిక్రమంబు; దు
స్తరము దుర్గమబ్బువరితపమున ॥ 579

ఆ॥ అమరులాత్తపీయూష మృతాశనముననా
దితిజులెల్లరైరి; దిత్యపత్య
ముగ్రతపమొనర్చి, యోడింపవలయు వా
రలజయింపనిపుడువలనుగాదు ॥ 580

ఆ॥ క్రోధమేది, శాంతరూఢచేతస్కులై
నియమనియతులగుచు, సిద్ధిఁబూని,
దైత్యులిష్టబ్రహ్మనాయఁబడయన్, దప
మాచరింపవలయు నన్నలార ! ॥ 581

ఆ॥ జయ్యమానుసురనికాయ్యంబు, సురనికా
యంబుతోడమీకు; నయ్యలార !
తొల్లిమీరలెల్లనుల్లసిల్లిరితపో
విలసనమునసురలఁదోలఁగఁద్రోచి ॥ 582

ఆ॥ మఱచినారెమీరు? వరతపోమహిమఁబ్ర
యత్నపూర్వకముగనాచరింపుఁ
డుగ్రతపముసరసిజోద్భవుఁగూర్చియ
వశ్యమిపుడు; సిద్ధివశ్యమౌను ॥ 583

ఉ॥ సందియమొందనేలనుది? సత్యముమద్వచనమ్ము; నమ్ముఁడీ !
కందువగాదు; మీదయినకందువదీఱునుదీన; దీనఁజె
సందిదితిప్రసూతిమతి, సంధియు, విగ్రహయానమున్ ద్వైధా
నిందితభావమాసనమనింద్యములిప్పుడు నానిఁగోరుటల్ ॥ 584

ఆ॥ విగతసాహ్యదంబువిధియమీకిప్పుడో
యన్నలార! సురవిపన్నులార !
సమయమిపుడుగాదు సంధ్యాదులకుఁ దప
శ్చరణమునకుఁగనకగిరికిఁజనుఁడు ॥ 585

ఆ॥ వినుఁడు నాదుమాట; విశ్వాసముంచి, స్వ
ర్ణాద్రిఁ జేరి, యచట నాశ్రమంబుఁ
గల్పితంబొనర్చి, యల్పాన్యనిష్ఠ, యు
క్తాత్మ తన్మదుక్తి నాత్మఁ దల్పి ॥ 586

ఆ। విధని విప్పకుండ, విధిఁ గూర్చి ధ్యాన ప
రాయణత్వమునఁ జిరంబు తపము
నర్ప, సిద్ధి గల్గు; నోర్పు మైఁ గాలాను
కూల్యమెదురు చూడఁ గోర్కె తీరు ॥ ” 587

వ॥ అని, పలుకు గురువరుని వచననిచయములకలరి, దనుజవరులందొ
క్కరుండైన జానుమండలుండు సాష్టాంగప్రణామపూర్వకంబుగా
నయ్యాచార్యవర్యునకిట్లనియె ॥ 588

ఆ॥ సత్వరంబు నాకు సత్త్వసంపన్న! షా
డ్గుణ్యపూర్ణ! గురువరేణ్య! ధ్యాన
విధి ననుగ్రహింపుఁ డధిగతత్వద్బోధ
మహిమఁ దపమొనర్తు ద్రుహిణుఁ గూర్చి ॥ 589

ఆ॥ సేయుటొకటె కాదు; సేగు లెల్లను దీఱి
దితిజలక్ష్మి మరలఁ దెచ్చువాఁడ;
మీరొనర్చు తపము మించునట్లొనరింతుఁ
దపముఁ యతపరతఁ దవిలియేను ॥ 590

ఆ॥ దైత్యవృద్ధి హేతువత్యమర్త్య ప్రభా
వంబుఁ బొంది, యోఁదపంబువల్ల
నింబుఁ గూర్తు మీకుఁ బంచిన వేడ్క నా
శీర్వదించి, నాకు సెలవొనఁగుఁడు ॥ 591

ఆ॥ దాఁటువాఁడ వార్ధి, దైత్యుల వృద్ధికై;
విషము మ్రింగువాఁడ; విషమశిఖిశి
ఖలను జొచ్చువాఁడఁ; దలఁచిన యంత శి
క్షణమొసఁగఁ దాముక్షణములోన ॥ 592

వ॥ అతిశయితకరుణాభరంబున 'నన్ను ననుగ్రహించి, శిక్షణంగాయుం'' డని యును, ''యథోపదేశవర్తినై, దైత్యాలక్ష్మీదీప్తికై యత్నింతు'' ననియును బలుకుచున్న యాజ్ఞానుమంతలు వాక్యంబులాలకించి యదుగ్యాచార్యవర్యుండాచమించి, మించిన వేడ్క-మై, గుహ్యతమంబైన బ్రహ్మమంత్రంబుపదేశించి, కృత్స్నంబైన దనుష్ఠాన విధానంబును, నిగూఢంబైన తత్ప్రభావంబును, బీజబిందుమహత్త్వంబును, యథాతత్త్వంబుగా వ్యక్తీకరించిన, నాలకించి, యుదంచితప్రీతిన్ జానుమంతలుండఖండభక్తి తాత్పర్యంబున నయ్యాచార్యవర్యునకుంబునః పునః ప్రణామంబులాచరించి, మృదుమధురవచన రచనంబు ప్రీతుంగావించి, తదనుజ్ఞంగైకొని సానుజుండై, నిజనగరంబుఁజొచ్చె-నంత॥ 593

ఆ॥ అట్లు నగరిఁజొచ్చి, గురాయన్నదమ్ములి
ర్వురును సచివవరుఁ, సురవిజితుఁ
గూర్చు చుట్టములను గాంచుచుమ్మని సుర
కంటకాఖ్యుఁబంపఁగా, నతఁడు ॥ 594

ఆ॥ వారిఁదోడి తేర, వీరులాజానుమం
తలును మంతలాహ్వయులు వినిచి
గురునిదేశమెల్ల; సురవిరోధులమనః
క్లేశముడిగె శుభప్రకాశనమున ॥ 595

ఆ। కొన్ని నెలలు వారిఁ "గూడి-మాడి" మెలఁగి,
దైత్యులంతబహుతిథంబుగడున,
జానుమంతలుండుదానేఁగెనుసుమేరు
శైలశృంగమునకుఁజలుపఁదపము । 596

వ॥ ఆప్రదేశంబు, నానాఘనానపాదపలతాకీర్ణంబును, నానా పక్షికులకలరవాకులంబును, యక్షకిన్నరగంధర్వసిద్ధసాధ్యవిద్యాధరసంఘసేవితంబును, గగనగంగాతరంగగణసముత్తుంగ మంగళభంగిశృంగారంబును, స్వర్ణవాపీవ్యాప్తశోభాఘనమాన సంభాసమానంబును, సాలరసాలతిన్త్రిణీ బ్రహ్మ ములక చంపక కింశుక

తాలహింతాలతమాలకృతమాలనక్తమాల మాతులుంగలవంగ నారంగేంగుదీమధూకపిచుమందమందారకరవీరకోవిదారాశోక నాగపున్నాగకేసరశిరీషబంధుజీవకపిత్థకాంచనకపిలాంగకవట కుటజనిచుళకురంటకఖదిరఖర్జూరక్షీరవృక్షాది నానావిధానూనా నోకహసందోహదేహావేల్లితావితానవిద్యోతమానసామదేశోపశోభితంబును, బహువిధవిటపివిటపపటలాంతరితహారిహారీత పారావతలోహపృష్ఠవ్యాఘాటదార్వాఘాటసారంగపేచకశిఖండి కలవింకకారండవటిట్టిభకకుళింగప్రముఖవివిధవిష్కిరపుష్కల గళమంగళకూజితపికీకూజావిరాజితంబును, సింహశరభసైరిభ భల్లభల్లూకశార్దూలవరాహగజగవయగండకతరక్షుప్లవంగ మైణశల్యశ్వాపదసమావృతంబును, నైకవివిధనైనవిధఖగమృగ గళరవబహుళబధిరితదిగంతరాళంబును; దంతురితాంధకారవార పరిత్రోవ్యాప్తంబగుటం జేసి, యవిదితదివసమధ్యవిద్యోతితాతప తైక్ష్ణ్యంబులైన మేరుశైలశృంగంబుం జేరి, ఘోరరాత్రించరవీరుండా శ్రమంబొందుగల్పించుకొని, వివిక్తంబైనయయ్యెడ నుండుం జొచ్చి. గురూపదిష్టదిష్టంబున నేదిష్ఠదిష్టసాధిష్ఠనిష్ఠసిద్ధినాశించి నిష్ఠాగరిష్ఠమార్గంబు నాలువాసియువీనరవోవనీయక పాటించుచు నిరది యుగ్రామంబు నిర్జించి, దుష్కరంబైన తపశ్చర్యకుం గడంగె నెట్టులనిన ॥ 597

ఆ॥ గ్రీష్మకాలమందు చూపస్త్రబార్చిష్మచ్చ
తుష్కమధ్యసుస్థితుండతండు
సూర్యబింబమందుఁజూడ్కులునిల్పి, పం
చాగ్నిదీక్షతోఁ; దదత్యయమున ॥ 598

ఆ॥ వానకాలురాఁగ, దానవనాథుఁడా
కంఠఘ్నముగ, నకుంఠితగతి
నుండితపమొనర్చెనుపవాసతత్పరుం
డంబుభక్షణుండు నగుచు, నగుచు ॥ 599

ఆ॥ లేఁగఁగూర్కుమాని, కాలంబుఁబుచ్చుచు,
సీతుకాలు రాఁగ, నాతపంబు
సోఁకనిచోట నిల్చి, సురవైరినిశలనా
వృతుఁడు, గోచిపాతయేధరించి ॥ 600

ఆ॥ చేసెఁదపము నిష్ఠశీతవాతాహత
తనుఁడు వాయుభక్షి తాజితేంద్రి
యత్వఘనుఁడతండు ధ్యానధనుండునై
బ్రహ్మనిష్ఠుఁడై, స్థిరత్వమూని ॥ 601

వ॥ సర్వనాడీనిరోధంబును, దశప్రాణనియమంబును, మనోనైశ్చ
ల్యంబు నుంబూని, నూఱువేలేండ్లు దారుణంబైన సమాధినుండి,
నిరామయంబుగా బ్రహ్మధ్యానపరాయణుండై, యోగమార్గంబు
నన్ బ్రహ్మనాడింబ్రకోపింపఁజేసి, నిరామయుండును, నిర్గు
ణుండును, అవ్యయుండును; లోకాధినాథుఁడును, లోకగురుం
డును, పరేశుండును, సదానందుండును, జ్ఞానానందుండును,
మహానుభావుండును, వేదవేదాంతవిద్యాదివేత్తృగమ్యుం
డును, వేదవేదాంతవేద్యుండును, వివిధవిబుధజనగణవిచింత్యుం
డును, అనంతుండునైనవాణీప్రాణేశ్వరున్ ధ్యానించుచు, నిశ్చల
తపశ్చరణంబునన్ గాలంబుఁబుచ్చుచుండె–నని తెలుపుటయును॥

కం॥ సిరిముగఁడుమొలికిగా, బం
గరుగట్టదిగట్టవిల్లుగాఁ, దగఁద్రోళ్ల
బ్బురముగఁగూల్చినయోగం
పరగండఁడ ! కపిలమల్ల ! నరసపురేశా !! 603

ఇది, ఆంధ్రీకృతము క్షీశ్వరోపాఖ్యానంబున,
జానుమండలతపోవర్ణనమను
ప్రథమాధ్యాయము.



శ్రీరస్తు

# ఆంధ్రీకృత ముక్తీశ్వరోపాఖ్యానము

## ద్వితీయాధ్యాయము



మద్దైమనశైలే
జ్ఞామాతా! మాతృభూతసంజ్ఞాఖ్యాతా!
భూమకరుణానివేశా!
భీమేశా! నరసపురకసిలమల్లేశా!! ॥ 1

ఆ॥ అవధరింపుమవల; నమరమునీశ్వరుం
డడిగె; నలువనిట్టు "లనఘ! జాను
మండలుండొనర్చుఁ జండతపం బెట్టు
లూఁకొనిరి త్రిదశులుద్ధవిడిని? ॥ 2

ఆ॥ అతని తపముఁ జెఱుప, నమరులు దివ్యాప్స
రఃకదంబమంప, రక్కసుండు
విఘ్ననిఘ్నుఁడై, పవిత్రదీక్షను వీడ
కుండెఁ జంచలత్వమూన కెట్లు?॥ 3

ఆ॥ వానికంటె మున్ను దానవుల్ పెక్కురు
"నిష్ఠనీరుగాఁడ", నియమమడిగి,
విఘ్ననిఘ్నులైరి; వీఁడు జానుమం
డలుఁడు చెఱుపు లేక, నిలిచె నెట్లు?" ॥ 4

వ॥ అనియడిగిన, నలువ కొడుకునకిట్లనియె॥ 5

ఆ॥ వినుము; వత్స! యుల్లుపనుజుఁడు మేరుశృం
గమునఁ దపమొనర్ప, నమరులమర
పతికిఁ దెలిపిర తనివార్తలఁ దావిని,
యదిలఁగొని యెమిగుఁ మడనతండు ॥ 6

ఆ॥ శతమఖుండు ప్రిసభజర్జరచేతనుం
డగుచు, దోర్లిపడ్డయసురబాధ
లోకక్రమాలుమదిఁదళుక్కనమెఱయఁగా;
నేమిదోఁచకుండెఁదా మతిచెడి॥ 7

ఆ॥ చిత్తశల్యమదియు; చుత్తలపాటుని
ప్పటికిఁగలుగఁజేయుఁ; బటిమఁజెఱుచు;
నమృతలాభమందకసురులనేకులు
పోరిచాలలేక, పాఱి, యంత॥ 8

ఆ। దితితనూజులందుహతశేషులును, గ్రూరు
లైనకొందఱేమియాగడంబు
మాకొనర్పఁదాముమదిఁదలంచిరో! తలం
పఁగను, దోఁచునులికిపాటునాకు॥ 9

ఆ॥ మఱియు, దైత్యవంశమండనుండా జాను
మండలుండొనర్చుమహితతపము
మదికినుదుకుఁగూర్చు; మఱిమఱివిన, మహా
ద్భుతము,వానితపమపూర్వమంట॥ 10

ఆ॥ జానుమండలుండు సజ్జనసంఘంబు
సంతతంబునియమసాధితోద
యాఘ్యుఁడౌచుఁగూర్చుహానిదుష్టాత్ముఁడై;
యుద్ధతాత్ముఁడై, మహోగ్రుఁడౌచు॥ 11

ఆ॥ లోకమందువిద్య, లోకోత్తరమహాత్త
విత్తమమలతపముసత్త్వములకు
వృద్ధిఁగూర్చు; నివియెయుద్ధతాత్ములకు స
ర్వక్షయప్రదంబులౌక్షితిపయి॥ 12

ఆ॥ కాన, యత్నపూర్వకంబుగా, జానుమం
డలు సమాధిలోకనాశకరము
మాన్పనౌను; సత్త్వమపి్రితి, త్రైలోక్య
రక్షణంబుగల్గు నీక్షణంబ॥ 13

ఆ॥ ఆకుబుద్ధినాకలోకాధిపత్యార్థ
మాచరించుఘోరమైనతపము;
నంచు, నిశ్చయించి, యాఖండలుండు త
ద్విఘ్న మెట్లు లనుచు, వెదకె మదిని॥ 14

ఆ॥ ఒకవినిశ్చయంబునకువచ్చి, వజ్రి సిం
హాసనస్థుఁడై, దివౌకసులను
గూడి, కొల్వుదీరి, పైఁడిబొమ్మలఁబోలు
లలనలంత తనను బలసికొలువ ॥ 15

ఆ॥ వజ్రహస్తుఁడప్డువారినెల్లఁబంపి,
వేయుఁగన్నులుద్దవిడివసంత
సహితుఁడయినకుసుమశరుఁడయింబడఁబెను
త్పలపలాశమాలికలనుబోలె ॥ 16

ఆ॥ కంతుఁడంతమ్రొక్కె-సంతోషితస్వాంతుఁ
డై, నిటాలసుఘటితాంజలియయి;
పినపఁ, ద్రిదివపతియుఁ, బ్రీతిమైనత్యున్న
తాసనార్ధమందునతనినిలిపె॥ 17

ఆ॥ కుసుమశరుఁడుదెలిసిగోత్రారియౌన్నత్య
మతనిహృదయమునకుఁగుతుకభరముఁ
గూర్చ నేర్పుగల్గి, కొసరియిట్లనిపల్కె
వినెడు సురలమదులవింతదోఁప॥ 18

ఆ॥ " త్రిభువనాధినాథ! త్రిదశేశ! నీకింక
రునిననుగ్రహించుటనఁ గ,నఘ!
సూనతీయవలయు, నవసరంబేమొ;యు
య్యదిమెప్రభులకుచితమదియెదయయు॥ 19

ఆ॥ అధిప! యాత్మతుల్యమైనకార్యమున నీ
దాసునుద్యమింపఁజేసి; ధన్యుఁ
గాననుగ్రహింపు; గౌరవించుటభృత్య
కోటికడియగడ! యకుంఠవజ్ర!॥ 20

ఆ॥ ఎవఁడుగానినీకనిష్టభూతుండు, ని
ష్ఠాగరిష్ఠుఁడై, పరిశక్తిఁగాంచు,
నాబలాఢ్యుఁడైనబలాకటాక్ష వీ
క్షణఖలీనలీనతనునొనర్తు ॥ 21

ఆ॥ ఎవఁడుగాని, నీదయిన పదంబును బొందఁ
గోరి, క్రతు, శతంబపారలోభ
పరతఁ జేయఁబరఁగు, వాఁడు వారాంగనా
ధరసుధారసంబుమరఁగుఁగాత! ॥ 22

ఆ॥ ఎవఁడుగాని, నీదయిన సంపదాళి ని
లింపనాథ!, కోరి, యింపుమీఱ
యుగ్రతపమొనర్చు, నువిదలకెమ్మోవి
నాన యోగవిద్యమానువాఁడు॥ 23

ఆ॥ ఎవఁడుగాని, వీడిభవనపుత్రకళత్ర
భృత్యసంపదాళి నిత్యమోక్ష
కాంక్షఁ "గాంచదన్న," శాంతలనీవివి
మోక్షలోలుఁడౌనుబొమ్మవాఁడు॥ 24

ఆ॥ ఎవఁడుగాని, నీకనిష్టభూతుండు బా
హ్యవిషయములవిడిచి, యల్లపరిత్య
గాత్మనిష్ప్రవీయమంతరంగంబు, వాఁ
డంగనాఽతిసక్తుఁడౌనుజూవె! ॥ 25

ఆ॥ వృత్రశత్రు! యెవ్వఁడత్రిస్తుఁడై, ధర్మ
మర్థమోక్షములె పుమర్థములుగ
బుద్ధినెంచువాఁడుముగ్ధలపాలింట్లఁ
బట్టుకోర్కెనుండువాఁడుగాదె!॥ 26

ఆ॥ రెండెసాధనములు త్రిదశేశ! నాకు నీ
శాసనంబు, సుమశరాసనంబు;
వీనిచేనసాధ్యమైనదేదియులేదు;
దుర్గమంబులేదు; స్వర్గినాథ! ॥ 27

ఆ॥ చెప్పరాదె, దేవ! "సిగ్గు చిందులు ద్రొక్క"
కన్నె డెనిమీఁదఁ గన్ను వైచి
తాశుభాంగి, యౌవనారూఢ, ద్వత్కంఠ
సక్తబాహఁ జేయఁజ లనొక్క!॥ 28

ఆ॥ ఏమి, యెవతెనేనిఁ గామించితే, పతి
వ్రతను? త్రిదివనాథ! త్వత్పదాబ్జ
పతితఁ జేయువాఁడ, వ్రతభంగ మొనరించి,
సురతసూచనైకపరతనామె॥ 29

ఆ॥ పంపునన్ను దేవ! వైళంబ త్వన్ని దే
శంబుఁదీర్చి, పుష్పచాపమిద్ది
ధన్యమౌతెఱంగు, ధన్యుఁడనేనౌ తె
ఱంగుఁగాంచువాఁడ; రజ్జుగాదు ॥ 30

వ॥ అని, పలుకుసుమశరునింగనుంగొని, కనుంగొనలమందహాసరేఖలు "దోబూచులాడం" బ్రాజ్ఞతల్లజుండైనగీర్వాణవల్లభుండల్లనల్లన నిట్లనియె॥ 31

ఆ॥ "ఔను; మీనకేతనా! నీవచఃప్రకా
రంబుసత్యమే; శరంబుపొప్ప
మెచ్చవైనఁ జొచ్చునీయది; నీయది,
పొరఁగరానితావుధరణిఁ గలదె?॥ 32

ఆ॥ నాదువజ్రమెన్నఁగా, దూరతస్థాయి
కుంఠితంబు; శ్రీవికుంఠనాథ
పుత్త్ర! సర్వగామి, ముఖ్యసాధకమహా
స్త్రంబవీవెనాడు; శంబరారి!॥ 33

ఆ॥ నీపరాక్రమంబు శ్రీపుత్త్ర! నేనెఱుం
గనె? యనన్యసాధ్యకార్యమౌట;
నిన్నుఁబంపుచుంటి, నిఖిలలోకోపకా
రార్థమదియు; మదన! స్వార్థహీన! ॥ 34

చం॥ విదితముకాదె, నీకు:! బ్రిభవించెను ధాత్రిభృన్మహాపథం
బదియుఁబయఃపయోధిఁ; గుసుమాయుధ! దానిని దేవతాతతిన్
సదయుఁడు దాఁ బ్రివఁజేసె హరి; సత్ప్రరిఘులనాధవిక్రిముల్
త్రిదశవిరోధులన్ జదిపె శ్రీహరి వేల్మిడిఁజక్రధారలన్॥ 35

ఆ॥ అసురులందు మదన! హతశేషులన్ జాను
మండలుండు, ధైర్యమండనుండు
నిగ్రిహించి, యింద్రియగ్రామముజయించి,
చేయుఘోరతపము జేయుచుఁడతఁడు॥ 36

ఆ॥ దైత్యుఁడిచ్చగించు త్రైవిష్టపశ్రీ బ
లాద్గ్రహీత, నూష్మలప్రతాపుఁ
డౌ నుజాను మండలాఖ్యుండు, దుష్టుండు;
తపమొనర్చి, మఱియు దర్పమొందె॥ 37

ఉ॥ నీవు, మధుద్వితీయత, ననిందితపౌరుషభూషణుండవై,
శ్రీవరనందనా! మదన! శీఘ్రిమెయూర్వశి,రంభ,మున్నుగా
దైవతయావతంబును ముదంబునఁ జేకొని, జానుమండలున్
భూవినుతప్రితాపము నమూఘునిఁ జేయఁ బెనైష్టికాగ్రిణిన్?॥ 38

ఆ॥ వినుము; మదన! నిజము; దనుజుండు నిష్ఠాగ
రిష్ఠుఁడైనఁదత్ప్రకృతిచలంబు;
గానఁ, గామబోలు వానిగెల్చుట, తపః
క్షయమొనర్చుటన, నశక్యమెట్లు? 39

ఆ॥ వానితపముక్షయముగా నౌను త్రైలోక్య
మంగళంబు సౌఖ్యమింగితజ్ఞ!
యట్లుగాక, సిద్ధియబ్బెనే, వానికి,
లోకనాశమగాను శ్రీకుమార!॥ 40

ఆ॥ శౌర్యమిద్దిసేయఁగల్గుదు నీవు; ధ
న్యుండవౌదువింక, నొందుమాట
దక్కు, పొమ్మ; కీర్తిదక్కునులేవు; స
త్యమ్మ; పుష్పబాణ! నమ్మమయ్య!॥" 41

ఆ॥ అనుమహేంద్రువాక్యమాలించి, సంతుష్టుఁ
డై, రతీశుఁడనియెనమరపతికి
"దేవ! కింకరుండ; నీవానతిచ్చిన
ట్లాచరించి, మెప్పులందువాఁడ ॥ 42

ఆ॥ హరియు, హరుఁడు, బ్రహ్మ, యఖిలామరులు మునుల్
మానవాదులెల్లమానవాదు
లస్మదీయబాణహతినిర్జితుల్ గారె!
జర్జరితులుగారె ! నిర్జరేశ ! ॥ 43

కం॥ మునుబదరీవనీ, నారా
యణముని, పురుషోత్తముఁడు, తపోఽధికుఁడు, మదీ
యనిశాతబాణపాతం
బున, స్ఖలితసమాధిగాఁడె ! పుణ్యచరిత్రా ! ॥ 44

కం॥ మృత్యుంజయుఁడు, పినాకి, దు
రత్యయమద్బాణపాతమదియెదలో, ని-
ష్ప్రత్యూహంబుగనాటిన,
నత్యాదృతి, సామిదేహమాలికొసఁగఁడే ? ॥ 45

ఆ॥ తనదుతనయమరగెఁదమ్మిచూలి, పితామ
హుఁడు, సృష్టికర్తయొండుదక్కి-
నస్మిశాతబాణమున్నిద్రమై, నాటఁ
గాదె, నాఁటనోలెఁగ్రతుభుగీశ ! ॥ 46

ఆ॥ శర్వసన్నిభుండు, సర్వతత్త్వార్థద
ర్శకుఁడు, మునివరుఁడు, పరాశరుఁడు, పు
రాణసారవేత్తరమియింపఁడే, దాశ
కన్యఁబట్టితొల్లిశూన్యుఁడౌచు ॥ 47

ఆ॥ ఎంతతపమొనర్చనేమి ? విశ్వామిత్రుఁ
డుండెబద్ధుఁడై, మహోజ్జ్వలంబు
లైనమేనకాదృగావళీవాగుర,
ననఁగ, మచ్ఛరప్రహారములనె ॥ 48

ఆ॥ ఋశ్యశృంగుతండ్రి, పశ్యల్లలాటతు
ల్యుండు దా విభాండకుండుతొల్లి
యిట్టిసలక్ష్యమెుందఁడే, రంభకుచకుంభ
ముత్రికాఁగిలించునోడుపులఁబడి॥ 49

ఆ॥ నాకనాథ! సర్వలోకంబుఁ న్ గామి
నీనిశాతదృష్టి, సూనబాణ
వృష్టిఁ దెఱలువాఁడ సృష్టిలోన న్నాఁడె?
నాదువచనమిదియుఁగాదుపోల్లు॥ 50

ఆ॥ సంశయింపనేల? సాధింతు నే దేవ
కార్యమిద్ది; నన్నవాఁ ర్యపీర్యుఁ
బంపుమిష్టె యో నిలింపవల్లభ! భవ
చ్ఛాసనంబొనప్ప స్వర్గనాథ! ॥” 51

వ॥ అని, పలుకుమదనునివచనములువిని, శతమఖుఁడును, ముదిత
హృదయుఁడును, సదయుఁడునయి, యతనినినిజకరకిసలయమున
గ్రహియించి, మృదుమధురవచనరచనలనిట్లనియె॥ 52

ఆ॥ ఎఱుఁగుదేనునిన్ను; విరివిలుతుండ! నీ
వంతవాఁడవౌదు; హంతకారి!
పొమ్ము వేగ; భద్రములుగల్గునీకు; గె
ల్పొంది, సురలమెప్పులందుమోయి!॥” 53

ఆ॥ అనుచుఁ బ్రోత్సహింప, నమరేశ్వరుండు, మీ
నాంకుఁడంత, నిజగృహంబుఁ జేరె;
రతికిఁ, దనదుసతికిఁ బ్రియాయైక మూర్తికిఁ
జెప్పిపోవువాఁడు, శ్రీసుతుండు॥ 54

వ॥ అంత, శచీకాంతుండును, గార్యత్వరాఽక్రృష్యమాణ
స్వాంతుండై, లేచి, సత్వరంబుగస్వర్వేశ్యావాటికన్ జొచ్చి,
యందొక్కదివ్యమందిరంబునచున్న దాని, సంగీతభంగీతరంగిత
సాహిత్యసాహిత్యచాతుర్యధౌరంధర్యంబొప్పుదాని, ఘనఘనా

ఘనసంకాశకేశపాశోపశోభితయైనదాని, చంద్రార్ధదివ్యర్ధికృ
తఫాలఫలీలాలాలిత్యసత్యయైనదాని, సంపూర్ణపూర్ణిమాచంద్ర
మండలమండనాయమానాననమంగళలక్షణ
లక్షితయైనదాని, నానాచిత్రభ్రూవల్లరీవేల్లితముఖలవణిమసుమివుల
వెలయుదాని, శతపత్రపత్రాగ్రపాకృద్భ్రక్ప్రతతులం బ్రసరించు
చున్నదాని, రత్నకుండలరుచినిచయమండితగండయుగళమణి
ముకురయుగళభంగిశృంగారతరంగరేఖానిరాఘాటాంగీకార
ముగా ముద్రితశ్రీ సాకారశోత్రశోభితయైనదాని, మొల్ల
మొగ్గలమొత్తంబులన్ ముత్యాలపాటొందించుదంతపంక్తులకాంతులకు
మందహాసదీప్తులుకొత్తవెల్లులవెల్లువలీయుచుండ, బింబోష్ఠ
బృంహితమహితారుణదీధితులదాడిమబీజపంక్తిచ్ఛాయాదా
యాదత్వంబుసంపాదించియుండించుచుండుదాని, మదనవిజయ
మంగళశంఖశోభానిశ్శంకవిజిగీషావిశేషభూషితలావణ్యధురా
బంధురకంధరాశ్రీధురీణయైనదాని, మణిగణఖచితవలయకేయూర
రాజత్పాణిపల్లవబాహావల్లరియైనదాని, కనకకలశయుగళపరి
హాసనచణసుదృఢపృథుల పీనోత్తుంగవక్షోజద్వంద్వమందానన్యా
సన్యసామాన్యమాన్యరమ్యత్వగణ్యయైనదాని, గంగావర్త
సనాభిగంభీరోత్సవ్యత్యార్ధోన్నిద్రసంభవద్రోమల్లికకోరకాభి
రామిత్వస్ఫీతనాభియైన, పీవరవృత్తోరుకాండనిర్జితరంభాస్తంభ
వేదండశుండాదండమండితయైనదాని, శాలిగర్భసగర్భనిర్భరశోభా
శాలిజంఘాలంఘితకాహళహాళహాళికయైనదాని, క్వణత్కింకిణీ
స్వనసకలచరణనూపురసహచరక్రీడాసక్తరంగవిహారభంగా
యాతసంసక్తకలహంససంసత్సమ్యక్కృతకేళీకారాతంకా
నంగీకారచేతోఽంతరయైనదాని, ననంగవిద్యావైశద్యవైశారద్యంబుల
నొప్పుదాని, సింహమధ్యను, విద్యుదుద్యదుజ్జ్వలశోభాఽతి
శాయిని, సూక్ష్మశ్యభిధేయనుజూచి, తద్దత్తరత్నభూయిష్ఠ
మహార్హాసనంబునసుఖాసీనుండై, సునాసీరుండు తత్కరార్పిత
కర్పూరతాంబూలంబునందుకొని, తత్పాణిధృతచామీకరదండ

మండితచామరసామోదసంవీజితుండై, విజితశ్రముండై, తదంగ
ప్రత్యంగప్రత్యగ్రబాగ్రరామణీయకంబు సేచనకంబుగాఁ,
దనవితతిత్రిలమలన్ "దోర్బూచులాడు" మనోనయనంబులనాచి
చూచి, సమీచీనంబుగా నిట్లనియె || 55

తే|| "కువలయాక్షి! నీకుఁ గుశలంబె కద! సర్వ
తోముఖంబుగాఁగ, దేవవనితలు
కరము సేవఁ జేయుదురె, నీకుఁ బొరపొచ్చె
మేమిలేక?" యని, మహేంద్రుఁ డడుగ || 56

తే|| ఆమె వెక్కసించు కంతలజ్జారేఖ
దోఁప, సస్మితాస్యయై, పురంద
రునకు వినయఘనశరీరూఢంబుగా, గాఢ
భక్తియుక్తయౌచు, రక్తయౌచు || 57

తే|| ప్రభు! సహస్రనేత్ర! త్రైలోక్యనాథ! మీ
యాదరావలోకనాశ్రమాత్ర
లాభ మొందువారికౌ భవికంబులు;
సంశయింపనేల? స్వర్గనాథ! || 58

తే|| మీయనుగ్రహమున మేన కాదిగా దివ్యప్సరః
కాంత లెల్ల సఖ్యమంతరంగ
మందు నిండ, నాదు డెందంబు హరియించి,
సంచరించుచుండ్రు సంతతంబు ||. 59

ఆ|| ఇది యపూర్వమో మహేంద్ర! యత్యద్భుతం
బింటికీవు వచ్చి, యిట్లు మాట
లాడునాఁడు దాని దోచాపలంబు స
హించుటది దరిద్రచుచువజ్రి! ||. 60

వ|| ప్రభువులకుం బరిగ్రహంబులయందు స్వాతంత్ర్యంబు సర్వతో
ముఖంబుగదా! వారిచిత్తంబెప్పు డెచ్చటముచ్చటం బొందుచుండు
నచ్చటవిచ్చలవిడింబుఖిలోటువక్కి యెక్కువమక్కువ మెయిన్
వచ్చుచుం, బోవుచుండురు. ఇదియె, మణిమయసదనంబు.

ఇవియె, కాంచనాంచితంబులైనమంచంబులు. ఇదియె, కల్పకారామంబు. ఇవ్వియెరత్నపంజరంబులు. సర్వభూషాభూషితంబైన యోషాసహస్రింబిదియె. ఈదాసురాలిసేవలంగీకరించి, సముచితకార్యంబులన్ యథేచ్ఛంబుగా వినియోగింతువు గాక! ఇందున్నయున్నతోన్నతవైభవపాత్రిభవంబులన్నియున్ ద్వదధీనంబులెగదా! భవదాగమనంబునన్ననుగ్రహించుటకేయని, గ్రహింపనేరనిదానంగాను. సముచితోపచారంబులొనర్పనాకాదేశించి, ధన్యురాలింజేయ వేడుకొనుచున్నదాన. భృత్యవర్గంబు నిత్యంబుపత్యర్థనిర్వహణపూర్వహానసమర్థంబైయుండనభ్యర్థింతుఁగాదె!" యనిన, విని, శతమఖుండాశశిముఖికిట్లనియె ॥ 61

ఆ॥ "సలితాంగి! నీవుశాలీనతాశాలి
యైనమాటసెప్పితదియు, నీదు
నాభిరూప్యమునకుననుగుణంబ, సురూప
ముంతసోటగుణములొప్పుచుండు ॥ 62

ఆ॥ నీదియెల్లనాదిగాదగునో! తత్త్వతం
త్రితనుజేసి, నిన్నురమణి! యొక్క-
నొడ్డపనికిఁబంపుదును; గాని, దానినీ
కెట్టులైనఁ, జక్కఁజెట్టవలయు ॥ 63

ఆ॥ నిజము; తరుణి! రిపులువిజిగీషులును, వ్రిత
క్రతుఃమాధిపరులుఁగాన, వారి
గెల్వనవివజ్రికీలితహస్తుండ
నైననఁగాని, నాకుహాఁణనయన! ॥ 64

ఆ॥ తన్వి! నీవయాయుధంబవుదై[illegible]త్యులగెల్వనాకు; సమడకిరవాణి
వాచలిప్తుశ్రేష్ఠదారుణంబుగమేరుశృంగము-దుఁదపముఁజేయుదురట!

ఆ॥ జానుమంతుఁడనెడుక్షణదాచరాగ్రణి
ఘోరతపమొనర్చి, సారలక్ష్మి
బలిమిఁగానఁగమదినిదఁచుచుండుటఁగంట
గించుఁగలయుమాకు; మించుబోణి! ॥ 66

ఆ॥ అసురులమరులతివ! యత్యంతసాపత్న్య
మేదుగాలమొంది, కీడాకల్లో
కల్లోనప్పుకొనుచు, పల్లవోష్ఠి! మహో
ల్లాసమహానువారలకు; ధ్రువంబు ॥ 67

ఆ॥ అసురకసిమసంగునెసరేగి, సురల, స
మాధియందుసిద్ధియబ్బనేని
దుష్టులెల్లరకునుగష్టప్రదుల్; వారి
తపముపంచ, వారిధార్ష్ట్యమెచ్చు ॥ 68

ఆ॥ కనుక, కనకగాత్రి! కాలాతిపాతంబు
సేయకీవు మేరుశృంగసీమ
కేఁగితత్తపంబుసేగినొందింపుమీ
దింపుమీ, సురాళిదీనదశను ॥ 69

ఆ॥ నీకునన్మథుండు వీఁకసహాయుఁడౌ;
మాధవుఁడు, మలయమారుతంబు
చందమామ, భ్రమరసముదయంబు, పికాదు
లెల్లవత్తురబల ! పిల్లురేగి ॥ 70

ఆ॥ తన్వి! సాలుదీవ, తద్ధైర్యకంచుక
చ్ఛేదనమునకీవుసాదరముగఁ
జూడ, నెవఁడుధైర్యశోభితుండౌ, నిచ్చ?
నిచ్చకంబుగాదు; మచ్చెకంటి!" ॥ 71

ఆ॥ అనుమహేంద్రుఁజూచి, వనితావతంసంబు
వలికెవినయగరిమ "ప్రభుప్రసాద
మునను జేసిలోకమునదుష్కరంబేమి ?
త్వన్నియోగమొకటియున్నఁ, జాలు ॥ 72

ఆ॥ త్రిపురదహనునయిన, నపగతధైర్యుఁ గా
వింపవలఁతినే; నిలింపనాథ !
కామకాతరుండు, స్థిమితశూన్యుఁడు, కీస
వెలితి యనుఁజెప్పవలెనె, వేఱ ?" ॥ 73

వ॥ అని, పలుకుచిలుకలకొలికిపలుకులువిని, తనివొందని, యమర
పతినరహసితసితముఖుండై, గద్దియదిగ్గనడిగ్గనుఱికి, సాధు
వాదంబులశాతోదరినాదరించి, "పోయిరమ్మని" పల్కి, యామెను
వీడ్కొల్పె నంత ॥ 74

ఆ॥ ఊర్వశీసమాఖ్య, స్వర్వేశ్య, సర్వగీ
ర్వాణనాథు, నింద్రుఁబ్రణతిఁజేసి
తత్కరార్పితంబు, సత్కారముక్తాస
రంబుఁగంఠసీమకింబొనర్ప ॥ 75

ఆ॥ ప్రీతిఁదాల్చి, యాదరింపనింద్రుండు, దాఁ
కేళిమందిరంబుఁగీరవాణి
జొచ్చి, సఖులుదన్నుఁజుట్టునుగొల్వ, భూ
షణవిభూషితాంగి సౌరుమీఱ ॥ 76

చం॥ ఘుమఘుమలాడుమాల్యములు, గోరినవన్నెలవిన్నవల్వలున్
గమలవశాక్షి మేలయినగంధపుఁబూఁతలుఁదాల్ప సొమ్ములున్,
సుమశరుఁడున్, వసంతుఁడుఁదనున్ గడునాదృతిఁగొల్వ యావతం
సమితవిభూషితంబయి, సమావృతఁజేయఁగఁదన్నుఁజేరఁగన్ ॥ 77

వ॥ తారకారాజిమధ్యంబునన్ విరాజిల్లుచంద్రరేఖయుంబోలె శోభిం
చుచు, విద్యుల్లతావిరాజమానంబై నభోవీథియుంబోలెనొప్పా
రుచు, నానావనూనవృక్షాకీర్ణంబును, బహుళవిహంగకులకల
కలకలరవగళముఖరితంబును మనోహరంబునైన మేరుశృంగంబుఁ
జేరి, యనేకరమ్యాతిరమ్యంబైన స్థానంబున వసంతసమా
క్రాంతంబును, నూతనమంజరీసంసక్తమత్తానురక్తభృంగీభృంగ
ఝంకారసంకులంబును, పల్లవలవాస్వాదనకషాయకంఠసంగాయ
త్కలకంఠకులకంఠకలకోమలకాహళానుకారిసహకార
కోలాహలాకులంబును, పుష్యత్పాటలసంసర్గసుగంధిలలితానిల
కుమారసుకుమారపరిసారసారంబును, మరున్నటసమాదిష్టదిష్టోప
దిష్టమంజరీనృత్యమంజుళంబును, వికసత్కుసుమసమాకీర్ణాభ్యర్ణ
వల్లీవేల్లితపాదపంబును, పల్లవోద్గమపట్టోద్గమనీయమాంశుకాంశు

కమనీయచరితపరిస్తీర్ణంబును, వాసంతికాసమాశ్లిష్టసహకార
మనోహరంబును, నాగవల్లీపరిష్వక్తపూగానోకహభాసురం
బును, మల్లీవల్లీవేల్లితకురంటకమహీరుహసమూహంబును, మాధవీ
లతాసక్తమంజుళవంజుళరంజితంబును గణికాగణాగణితసంసక్త
కాలస్కంధబృందావృతంబును, మీనకేతనగాధాగాధబోధ
సాధీయోధీయోగభోగైధమానమృగవిహగయుగళాకులంబును,
కరేణుముఖగండూషపిపాసానుసరత్కరివరవరణవరణీయంబును
కోకభుక్తముక్తబిసాంకురశేషబాలసచక్రవాకచక్రిచంక్రమ
క్రమంబును పణశృంగాగ్రశృంగాగ్రసిక్తకంఠాయనాకృష్టైణీ
సనీరితమీలితలోలలోచనాంచలాంచితంబును, నైకపుష్ప
నిష్పతదతిసాసక్తమధులిణ్మధునరవధికనిధుపనసముత్సముత్క
రంబును, సకృన్మృణాళనాళలాలనసలాలససంసక్తకలహంస
ద్వంద్వసంసక్తక్రీడాకారశారీమంబును నైనతదీయాశ్రమంబునన్
బ్రవేశించి, యాస్వర్వేశ్యావతంసంబైనయూర్వశి, యా
దానవనాయకుం జేరి ॥ 78

ఆ॥ ధ్యానయుక్తు, మౌని, జానుమండలు, జితేం
ద్రియుని, శాంతు, దాంతు దృఢమనస్కు
బ్రహ్మనిష్ఠుఁ జూచి, పరమాద్భుతాక్రాంత
యయ్యెఁ గాంత; యట్టులైన, గాని ॥ 79

ఆ॥ విభ్రమంబులామె, వివిధముల్ ప్రకటించి
యును, ప్రలోభములు బహుప్రకార
ములుగఁ, గొలిచి, దైత్యమోహమూర్తునిఁ జేయ
నెంచె; నౌర; తెగువ! మించుబోణి ॥ 80

ఉ॥ ఆమనిఁ దోఁచు తీఁగెవలె నల్లన నల్లి, సపుష్పకోరకో
ద్దామముగాఁగ, నూర్వశియు, దానాపన్నయకుమీఁదవైచుచున్
దామముమున్ను, ఫాలఘటితస్ఫుటితాంజలియై, ప్రణామమెం
తే ముదమొప్పఁ జేసి, రమణీమణి వీవనవీచె మెల్లగన్ ॥ 81

వ॥ మఱియును, సురసరసిజనయనసత్యగజాగ్రిన్మాఘ్యపుష్పా
ఢ్యంబును, మందారామందసౌందర్యధుర్యప్రసూనాంచితంబును
జాతపల్లవసంపత్సంలగ్నంబును, మరందబిందుసందోహాభి
వర్షియుసౌగంధికజకీర్ణంబును, భృంగీభృంగసంగీతరీతిసంసర్గియు
నైనమాల్యంబునుగ్రుచ్చి, యచ్చెలువచెలువమమర, నమర
విరోధిశిరోధింగీలించితద్భుజాంతరప్రాలంబంబుగావించి, యంతట
మానక ॥ 82

ఆ॥ వీణ, సప్తతంత్రి, మాణిక్యకోలంబ
కాఢ్య, రత్నరంజితాతిశోభఁ
దాల్చి, శ్రుతిలయాన్వితంబుగా, లలితంబు
గాఁగమీఁటి, పాడి, కాంత, యంత ॥ 83

సీ॥ లలితలలితంబుగ, సురల నర్త
నంబొనర్చెలయానుకూలంబుగాఁగ
నాట, పాటయు రెంట నిపుణైనసాధ
నములుగాఁగ, రతీశుఁడంతర మెఱింగి ॥ 84

ఆ॥ దైత్యహరుని మీఁద దర్పంబు పెర్వఁగం
దర్పఁజేచి, నైచెఁదలిరుములుకు
లేశములేక, కుడిచు-నెషముగా సింగాణి
మార్చిమార్చి, పెద్ద మార్చి పేర్చి ॥ 85

ఆ॥ మాధవోద్ధృతంబు, మన్మథారంభజృం
భితముని ట్లుదన్ను వీసమైన
గాసిసెట్టలేమిఁ, గర్వాంధుఁడేమియుఁ
జేనమొందఁడయ్యెబలియుఁడతఁడు ॥ 86

ఆ॥ కనులయెదుటమచ్చెకంటిగాన్పించిన
నైన, మాటలాడఁడయ్యె, నామెఁ
జూడలేడ; యేమిచోద్యంబొ! బ్రహ్మలోక
గోచరంబు, మనసుగుఱివదఁడు ॥ 87

ఆ॥ అట్టినిశ్చలాంతరంగు దైత్యుని, యోగ
భాగుఁజూచి, యమ వనిత "యితఁడు
మహితమహిముఁ"డనుచు, మదిఁదలఁచి, తదంతి
కంబువీడియుండెఁగాంతయంత ॥ 88

వ॥ నిరాశానిరుత్సాహంబులునిండారిడెందంబునంగ్రిందుకొన, మంద
మందగమనంబునయ్యింద్రుపదసయొక్క కందువంజేరి, సుదూ
రంబువిచారించియుఁబాకశాసనుశాసనంబునిర్వహించుటకే
యోజయుంగానలేక, యెట్టకేలకుధైర్యంబవలంబించి, "కానున్నది
కాకమానదు గాకేమి'యేనెట్లైనను, స్వామికార్యంబుఁదీర్చెదన్
గాక ! రక్షోఽధ్యక్షునకు మోహంబునుత్పాదించుటపొంటె
యథాశక్తియత్నించెదన్ గాక!"యని, నిశ్చయించి, తత్సమీ
పంబుఁజేరి ॥ 89

ఆ॥ అఁత, పూర్వరంగమారమణీమణి
వీణెఁబూని, శ్రావ్యగానమాచ
రించెఁగాని, యసురదృఢచిత్తుఁడై, ధీర
ధీయుతుండునై, ధృతింజెలఁగి ॥ 90

ఆ॥ చూడఁడయ్యె; వేల్పుఁజేడియతోమాట
లాడఁడయ్యె; మానఁడయ్యెధ్యాన
యోగమతఁడు; స్థాణువోయనంగ, సునిశ్చ
లత్వమూని, గాలుబన్ బిగించి ॥ 91

ఆ॥ నిర్భరాంతరుండు, దుర్భరదర్శనుం
డయి, స్థిరాత్మ యోగమందియున్న
జానుమండలాఖ్యు, మానినీమణి "యసా
ధ్యుం"డటంచు, నెంచి; యూర్వశియును ॥ 92

ఆ|| అతని తపముఁ జెఱుపనలవి గాక, యశక్త
యై, యమర్త్యలోకమరిఁ, మిగుల
లజ్జఁ జేర్మిఁ జేసి, యజ్జలజాక్షి యె
గమ్ము వాంఛియుండఁగిమ్మనకయ || 93

ఆ|| ఉవిద మాటిమాటి కుత్సాహహీనయై
దీనహీనరూపు, దివసశశిక
లోపమానయై, ముహుర్ముహురుచ్ఛ్వాస
ములు నిగుడ్చె; స్వాంగవిలసనములు || 94

ఆ|| రోయుఁ; "త్రిభువనైకనాయకు, దేవనా
యకుని జూతునెట్టు? లతనికేమి
చెప్పుదాన? నిప్పుడొప్పరికించు టె
ట్ల"నుచు, నెంచుకొనుచు, వనిత మదిని || 95

ఆ|| "ఎందుఁ బోవుదాన? నెట్లాత్మగోపనం
బాచరించుదాన? నసురయోగి
చిత్తవృత్తి మార్పఁ జేవసాలదనాకు
శూన్యనైతి; శక్తి సున్నయయ్యె || 96

ఆ|| దగ్ధదేహమేల? స్నిగ్ధరూపంబేల ?
యందమేల? నాదు చందమేల?
దైత్యు నాకనినిష్ఠఁ దప్పింపలేనైతిఁ;
జెప్పుకొన్న, సిగ్గుచేటు గాదె ! || 97

ఆ|| ఐన, జింతయేల ? కానున్నదేదియో
కాక, మానునొక్కొ ! కాలమొకటి
దైవమొకటి, వాయుదేవు వేగంబొక
టియును నడ్డుకొనుపటిష్ఠుఁడెవఁడు ?" || 98

ఆ॥ అని, తలంచి, దేవతాంగనధైర్యంబుఁ
బూని, స్వర్గనాథుఁ మ్రొక్కి, యూర్వ
శీశుభాఖ్యశిథిలశిథిలంబు, వచనబం
ధంబు దోఁపఁ, బల్కెఁ దాఁజడియుచు ॥ 99

ఆ॥ "ఏమిసెప్పుదాన? నెకిమీఁద! నీయను
గ్రహముఁబడసి, యరిగి, కార్యసిద్ధి
మాట కేమిగాని-మరల, నీసాన్నిధ్య
మ్మెట్లులెట్టులో, రహింబడసితి ॥ 100

తే॥ కదలినదుమునమిగులఁగదలాడికదలాడి
యెదురుగాఁజలించి, యెట్టకేల
కొస్థఁజేరుకొన్నయోషనైతిని; దేవ!"
యనఁగ, సంశయించి, యనియెవజ్రి ॥ 101

తే॥ "ఏమి, కామినీమణీ! యెటుల్ వర్తించి
తీవు? రిపునితపము నెటులఁజెఱచి
తీవు? సఫలమయ్యెనే? నీదుప్రస్థాన
మమరవరుల.నూధియశఁపఁబడెనె? ॥ 102

తే॥ రాక్షసోదయాంకురంబుసమూలని
ర్మూలనంబుఁబొందెనే? లతాంగి!
చెప్పు చెప్పు వేగ; స్వీయప్రవృత్తిఁ, ద్వ
జ్జయమువినఁగ మానసంబుపఱచు" ॥ 103

ఆ॥ అనఁగ, నచురవనితయతికంపితనిజాంగ
యష్టియై, నతాననాబ్జయూచుఁ
గాలిబోటన వ్రేలనేలవ్రాయుచు, నూర్వ
శియునుబలికెనిటుల, భయముగదుర ॥ 104

కం॥ సురపతిదత్తానుజ్ఞను
శిరసావహియించి, యూర్వశియుఁ, బరిషత్సు
స్థిరులఁ బ్రణమిల్లి, నతముఖ
సరసిజయయి, సరసగతిని జనె గృహమునకున్ ॥ 111

వ॥ అని తెలిపిన, వినియవ్వలివృత్తాంతంబెట్టిదని, యప్పిశాచాని
యవ్వాణిజ నినడుగుటయును ॥ 112

కం॥ సిరియురమునఁగలకతిఁగోర
కలుషములికిఁగాఁగఁ, బ్రోల్లుగాల్చిన యోగిం
పరగంపఁపవీ వెకబా !
నరసాపురకపిలమల్లనామమహేశా ! ॥ 113

ఇది, ఆంధ్రీకృతముక్తీశ్వరోపాఖ్యానంబునం
దూర్వశీవిలాసంబను ద్వితీయాధ్యాయము.



శ్రీ ర్స్తు

# ఆంధ్రీకృతముక్తీశ్వరోపాఖ్యానము

## తృతీయాధ్యాయము



ఆ॥ సిరిమగండు౯, నలువ, సురపతి, కరితనుభుజుల్
కొలువఁగొలువుదీరి చెలువమమరు
గరిమ నీకెతగుర; కపిలమల్లేశ! గౌ
రీశ! నరసపురవరేశ! యీశ!! ॥ 1

ఆ॥ అవధరింపు; దేవ! యవ్వలి వృత్తాంత
మును సురమౌనియడిగె నబ్జగర్భు
"భానుమండలాఖ్యఁ బూనిన నిష్ఠయ
ద్భుతము; వినము-కనము; భువనములను ॥ 2

ఆ॥ వినఁగవినఁగ, మహితవృత్తాంతమిదికుతూ
హలమును మదికిఁ జాలఁ గలుగఁ జేయు
చుండెఁ, గాన, విడువకుండఁగ సర్వంబు
నానతీయుమయ్య! యబ్జగర్భ! ॥ 3

ఆ॥ పిదప, నేమిసేసెఁ బిశితాశనుఁడు, భాను
మండలుండు? దపమఖండనిష్ఠ
నెన్ని యేండ్లొనర్చె? నేమి తద్వృత్తాంత?
మలఘుఫలమ దేమి యందెనసుర? ॥ 4

ఆ॥ తపముపండియసురతపముకసేసిన
ఫలియ దేమి? యతఁడు వరముఁ బడసె
నేమి? నీవనుగ్రహించితే, తండ్రి! త
త్సర్వమునుఁగఁజెప్పు జలజగర్భ" ॥ 5

పాతంబు నొందిరి. పారావారంబులెల్ల నవ్వారిగాఁగ శోషిల్లెఁ దిగ్గజవ్రజంబులు ఘగ్గడిల్లె. సకలనగకులంబులు ప్రచలంబు లయ్యె. సిద్ధసాధ్యచారణగంధర్వవిద్యాధరాదులు విషాదంబు నొందిరి. లోకంబులును, లోకాధినాథులును నార్తవ్యాధిగాధితు లైరి. చతుర్దశభువనంబులును ముహూర్తకాలాంతరంబుఁ గంపించె నంతట, నయ్యండజుని వందురుచున్, దుఃఖ నెగడొందిన బృందంబులతో నయ్యరవిందసంభవుని శరణంబు నొంది, యిట్లని యభ్యర్థింపందొడంగిరి. 11

ఆ॥ దేవ, లోకనాథ! ధీర, నాబాసుమం
షలుని ఏరిసి, నళినని యు! వేగఁ
దత్తపోఽగ్ని లోకదాహంబుఁగ వీఁప
కుంఠ, మున్నె వరములొసఁగుమయ్య ! ॥ 12

ఆ॥ ఏముదత్తపోఽగ్ని నెట్లు సైరింతుమ
బ్జాసనా ! చతుర్ముఖా ! మహాత్మ !
శరణమీవె మాకుఁ బరమనిష్ఠాగరి
ష్ఠుని, సురారిఁ జూపమనసు గలిగి ॥ 13

ఆ॥ సారిదియసురయుడు గుహఁ దముం, “నష్టగుణీ
తపముగాఁగ” నొసఁగఁదలఁపుమనఘ !
తేఁపవేని, మాదు దైన్యంబు, హైన్యంబు
మాను టెట్లు? సర్వమాన్య ! చెపుము ! ! ॥ 14

ఆ॥ వీఁకవాఁడు సర్వలోకాధిపత్యమ్ముఁ
గోరెనేని, యిమ్ము; ఘోరమైన
తత్తపోఽగ్ని హైపఁదరమౌనె, మాకు? లో
కేశ ! వాగనీశ ! యిష్టపుణ్య ! ! ॥ 15

దితిసుతుండు, నిత్యదృప్తుఁడై, వరముల
కలిమిభువనములకుఁ గాఁడో సర్వ
లగ్గుగాదె, దేవ! కిగ్గాడిఁ దత్తపో
వహ్ని నైపఁదకమె? వనజనిలయ!! ॥ 16

ధాత! లోకజాతదాగ్ధ్రహాహేతువీ
ఘోరవహ్ని శాంతిఁ గూరెనేని
సత్యపానుజూపె, సత్స్వారంభంబు
నీదినిశ్చయంబుగాదె, దేవ! ॥ 17

దైత్యమునికిఁ గాంక్షితములైనవరముల
నిచ్చి, పోవునయ్య! యెల్లలోక
ములనటంచు, "యజ్ఞభుక్కోటివల్కె, మా
టాడకుండె; నంత, నబ్జసూతి ॥ 18

సురలఁజూచి. తేఁగరుణనై; "సురలార!
యభయమిచ్చుచుంటిఁ; శుభముగలుగు
వరములసురకొసఁగువాఁడ, నంతట, శాంతుఁ
డౌనుగాక, యసుర; యమరులార! ॥ 19

కాకమాన దెందుఁగానున్నది యమర్త్య
లార! పోవుదముసురారికడకు"
ననుచు, నలువయరిగెఁ గనకాద్రిశృంగసం
స్థితు, సురారిఁజూడఁ గుతుకమునను ॥ 20

ఏకపా[illegible]లాకారసంస్థితు,
స్థాణు[illegible] ల[illegible]ఁజూచి, [illegible]ంత
లాయు[illegible] [illegible]బ్రహ[illegible] యత్యంతసంతుష్టి
గటి[illegible] [illegible]ముపం[illegible] ॥ 21

ఆ॥ మెచ్చి, వరములీయ వచ్చితి నిన్
"కోర్కె యేమి? దైత్యకులపతి!"
యనుచు, సన్నిధానమంది, పితామహు
పతనిబ్రహ్మరంధ్రము మూసి ॥ 22

ఆ॥ శాంతిఁ గూర్చె వానికంతట, జానుమం
పలుఁడు గనులు మొగిచి, నలువ సమ్మ
దాశ్రుపూరమొప్ప, నపరిపేశుఁడు నరో
రుహజు. హంసవాహు, ద్రుహిణుఁ గాంచె ॥ 23

ఆ॥ పద్మపీఠు, బ్రహ్మ, స్ఫాటికశైలాగ్ర
ఫుల్లకింశుకంబుఁబోనివానిఁ
బద్మరాగతుల్యభాభాసమాను, వే
దోపగీయమాను, యోగివంద్యు ॥ 24

వ॥ కనుంగొని, కనుంగొనలబాష్పపూరంబులురల, నసురవరుండు
ప్రసన్నాత్ముండై, యానందతుందిలహృదయుండై, భక్తిభావం
బున నిట్లని స్తుతియింపం దొడంగె ॥ 25

సీ॥ "భూతభావన! ధాత! భూతేశ! భూతాత్మ!
పరమేష్ఠి! లోకేశ! పద్మగర్భ!
లోకకర్తవునీవ; లోకభర్తవునీవ
లోకహర్తవునీవ; లోకమీవ
విప్రవాగ్వ్యాపార వేదాక్షరవ్యక్త
నైజస్వరూప! నీరేజపీఠ!
వాణీమనోనాధ! వజ్రపాణ్యాదిగీ
ర్వాణమాళిస్ఫురద్రత్నరాజి

కాంచనీ రాజితాంఘ్రి రేఖాంకితీన
క్రీసనిస్ఫలపగప్పై వైభవానుకూల
శీలనబసన్ము క్షేందుకుగ్జ్వాలలోల
మందహాసానుభావ! శ్రీంభత్ప్రభావ!! ॥

దేవా ! త్వన్మహాత్మ్యాంశలేశంబు మూలాధారంబుగా, లోకపాలురెల్లరును క్షేమంశులేశంబులేకుందురు. భూరిక్షీణాకంబు ద్రైనయజ్ఞంబులెన్ని యేనియుం జేసి, ద్విజశ్రేష్ఠులు యజ్ఞేశ్వరుండవు నైననిన్నె గదా యజించుచుందురు! నిన్నెవ్వరెవ్వరే యేరూపంబో నుపాసింపుచుందురో, నీవున వ్వారినెల్ల నవ్వారిగా నట్లేయనుగ్రహింపుచుందువుగాదె! ఇంద్రుండవు నీవె; ఉపేంద్రుండవు నీవె; రుద్రుండవు నీవె; ప్రజాపతివి నీవె; సర్వభూతాత్ముండవు నీవె; ప్రభూ నిన్నె శరణంబుఁ జొచ్చినాఁడ; పాలముంచిన, నీటముంచిన నీదే భారంబు, ఆమ్నాయవేత్తలు, సధ్యాత్మరతులునైన జనులు నిన్నె పరాత్పరునిగాను, బరమాత్మునిగాను జెప్పుచుందురు. సకల తపఃఫలంబయిన భవదీయ దర్శనమహాభాగ్యంబునొందఁ గల్గితి నేను ధన్యుండ; మాన్యుండ. నాజననంబు సఫలంబయ్యె, నాజీవితంబు విత్రంబు యోగీశ్వరులన్వేషించి, కన్గొనలేని నీవయిల్లు నన్నన్వేషించుకొనుచువచ్చి, దర్శనంబిచ్చితివి. నాకంటె ధన్యతముఁడింకరేడు లోకంబులందెవ్వండును లేఁడు. నన్ననుగ్రహింపు'' మని, వివిధ విధంబుల వేఁడుకొనుచున్న యా రాజసుమంతులఁ జూచి, వాణీవల్ల
భుఁడిట్లనియె ॥ 27

''నీతపంబుకల్మి నేను సంతుష్టినొం
దితి; నిజమ్ము సుమ్ము! దితిసుతాగ్ర్య !
యిట్టి ఘోరనిష్ఠ నెవ్వరే నాఁడెందుఁ
బూనరయ్య! కాదు బూటకంబు ॥ 28

వ॥ పూర్వకాలంబున గొందఱు అబ్భక్షులు, కొందఱు వాయుభక్షులు, కొందఱు పర్ణభక్షులు, కొందఱు నీవారకభక్షులు, కొందఱు శాకభక్షులు, కొందఱు ధూమైకభక్షులు, కొందఱు మృద్భక్షులునై బహువిధంబులం దపం బాచరించినవారు లేకపోలేదు. నిర్భక్షుండ వైననీవలె బ్రహ్మనిష్ఠుండైన తపశ్శాలి యొక్కండైన నింతకు ముందు లేఁడు. ఇఁక ముందు పుట్టఁబోఁడు. మెఱమెచ్చులకీ చక్కంబులాడుచుంటి ననుకొంటివో? వంట! మహాత్మా! శిఖీ! నీవంటి నిష్ఠాగరిష్ఠుండు నీయట్టి జగజెట్టి "నభూతో నభవిష్యతి" యంట కొంటెమాటగాదు సూ, పోటుబంట! నేనీకుం బ్రసన్నుండనైతి. సన్నకసన్నగాక, మిన్నగా వరంబు వేఁడుమిచ్చెద. సర్వసౌభాగ్యకారణంబును శ్రేయస్కరంబునైనదాని నేనీక వశ్యంబు వశ్యంబగునట్లనుగ్రహించెద;" నని, యనునయించుచుం, బలుకుచుండు నక్కంజాతసూతికిన్ దైత్యసూధినేత యిట్లనియె ॥ 29

ఆ॥ సత్యమహాను, దేవ! సాద్గుణ్యముగనాదు, నిష్టకీప్సు వరగరిష్ఠఫలము
సంగడించితేని, జాంబూనకోదరా! కోరుమన్న నాఁడు భూరితేజ!

ఆ॥ ఇదియనుత్తమంబయినవరంబని వేఁడు
చుంటి; దేవదేవ! యుజ్జ్వలప్ర
భావ! వీరశబ్దభాక్త్వంబు సర్వలో
కంబులందు నాకుఁ గల్గుఁగాక! ॥ 31

ఆ॥ దానఁ జేసి యేను దానవాధీశుండ
నై, మహేంద్రముఖ్యులౌ సుపర్వ
కోటి చేత నేటికోల్మి? "కో"యనఁ
గోటిదాస్యములను గొనఁగవలయు ॥ 32

ఆ॥ స్థిరముగాఁగలక్ష్మిచిరముగానిల్చు దై
త్యాధిరాష్ట్రరాజ్యమందుఁజంచ
లత్వదోషమింక, లక్ష్మికిలేకుండుఁ
గాత! ధాత!! యంబుజాతజాత ! ॥ 33

ఆ॥ మఱియు, వరమునిమ్ము మరణంబు లేకుండు
నట్లుగాఁగనాకునమరవరుల
వలనఁగాని, ప్రాణివర్గంబువల్లఁ,ద్వ
త్సృష్టిలోనవేనిచేతఁగాని॥ 34

వ॥ దేవా! నీవునిజంబుగానాతపః ప్రకారంబునకున్ మెచ్చుకొంటివేని,
నాకవధ్యత్వంబువరంబుగాననుగ్రహింపు " మని, నిశ్చప్రచం
బుగా, నిష్కర్షించిపల్కిన యాజానుమండలునకుంబ్రసన్నుఁడై
యయ్యరవిందసంభవుండిట్లనియె॥ 35

ఆ॥ "అటులెయవుసుగాక! యమరగంధర్వయ
క్షాదివీరవరులెకాదు—నాదు
సృష్టిలోనిప్రాణియేదైనఁగాని,నిన్
జంపలేదు; లేదుసందియంబు॥ 36

ఆ॥ బలిమికలిమిసురలగెలుతువు; సకలలో
కములునీకులొఁగి, కైవసమగుఁ;
బొమ్ము వేగ; చిరతపోలబ్ధసత్ఫల
మ్మందుకొ" మ్మటంచు, నావిరించి॥ 37

ఆ॥ సురలతోడ, మౌనివరులతోనంత, నం
తర్హితుండుగాఁగ, దైత్యనాథుఁ
డెంతయేని గర్వమేచ, నీచాతినీ
చంబు, వానగోచరంబుగాఁగ॥ 38

ఆ॥ క్షేత్రయాత్రనంత, సాగించి రాకిరించు
కించిదానతయు సహించుచుఁ దల్లి
లేక, లేఖపాళిఁ జీకాకుపెట్ట, స్వ
ర్గంబుముట్టడించె గండుమీఱి॥ 39

ఆ॥ సురల, మునుల, ధర్మపరులగు సాధుల
నేఁగిలోఁగఁజేసి, జేతుకాముఁ
డాసురారిదీనమానవస్థకు వారిఁ
దెచ్చె ద్రుహిణవరసదృప్తుఁడౌచు॥ 40

॥ అని, తెలిపిన, విని, యవ్వలివృత్తంబెట్లనియడిగె వీణాపాణి
జానిననుగుటయును॥ 41

శశిసుజంద్రరేఖ, వికటంబులగుమూఁడు
కన్నులందునొకటఁగానుపింప
కత్తుకత్తి, మేనసగజాతయొప్పఁ శ్రీ
కపిలమల్ల! రిపునికాయభల్ల!!॥ 42

ఇది, ఆంధ్రీకృతము కీర్తీశ్వరోపాఖ్యానంబునందు జానుమండలవర
ప్రాప్తియను తృతీయాధ్యాయము



శ్రీ స్తు

# ఆంధ్రీకృతముక్తీశ్వరోపాఖ్యానము

## చతుర్థాధ్యాయము

కం॥ సిరియురమునఁగలకతినోర
కఱకుములికిఁగాఁగఁ బ్రోళ్లుగాల్చిన మాగం
తఁగంటఁజవీ వెకదా!
సరసాపురకపిలమల్లనామమహేశా! ॥ 1

ఆ॥ అవధరింపు; దేవ! యవ్వలివృత్తాంత
మమరమునియునడిగెనబ్జగర్భు;
"జానుమంటలాభిధానుఁ డట్లద్భుత
విక్రమక్రమంబు పెక్క-సముగ ॥ 2

ఆ॥ నీ యనుగ్రహంబ జేయునిన్ జేయ, దై
త్యాధినాథుఁ,దండ్రి! యసురులెల్ల
నిల్లునీదుకరుణ నేచి, లోకము లేర్చు
నేర్పుఁజూపి; రెంతనీచులార! ॥ 3

ఆ॥ హంసవాహ! నీదు "నంపెదంటలు" లేక,
వార లెట్లుమత్తులై, రుషాక
షాయితాక్షికోణులై, యీజగత్త్రియ
మ్మనుజయింపఁగలరు? వనజనిలయ! ॥ 4

॥ ఆనిలింపవైరి, జానుమంటలుఁడెంత
కాలమేర్చు లోకపాళి? నేమొ
నచ్చిరమరులసురుఁగార్చిచ్చుఁబోని వా
నినిసహించుకొనిరొ-కానరా, చెప్పుము! 5

ఆ॥ అహాహా! "ముక్తహాని"యంటివి కాదె, ము
మ్మొనవట; దేవ! "యదియపూర్వగాధ"
యంటి"వదియు, బహురహస్యాన్వితం"బంటి, "కా
తూహలంబుఁ గూర్చు నూహ నేయ"॥ 6

ఆ॥ అంటి వనఘచరిత! యాముక్తము నివరి
త్రింబవిన్చి, శ్రోత్రితర్పణంబొ
నర్చు"మంచు, వేదునారదున్ జూచి, య
బ్జాసనుండు మందహాసమొప్ప॥ 7

ఆ॥ "వినుము; వత్స! దైత్యవీరుఁడా జానుమం
డలుఁడు నాడు వరముకలిమిమిగుల
గర్వమొంది, లోకకంటకుండై, జగ
త్త్రయముఁ గాల్చునట్టిదంటయయ్యె॥ 8

ఆ॥ సాధుపుంగవులను బాధించు; యోగుల
కెగ్గొనర్చు; విప్రబుధుల, యాయ
జూకవరుల, దుష్టుఁడై, కస్తిఁగుడుపుఁ; గి
గ్గాడియసురతనదుదాడులందు॥ 9

ఆ॥ పఱచయసుర ప్రోలు "సురకంటకం" బధి
ష్ఠించి, దుష్టబుద్ధి, క్రించు, దైత్య
మండలాధ్యుఁడై, యఖండగర్వంబున
జానుమండలాభిధానుఁడేచె॥ 10

ఆ॥ పెక్కిరించువాఁడు పోత్రమునఁ, సాత్త్వి
కులనుజూచి, న్యాయకోవిదులయి
రాజ్యమేలు మేలిరాజర్షివరులతోఁ
బోరఁగోరు, నో! యూనాకసుర ॥ 11

సీ॥ అంగవంగకళింగులాంధ్రులు, ద్రావిడుల్
బర్బరుల్, ఘూర్జరాహ్వయులు, శూర
సేనపాంచాలకాశ్మీరమాగధలాట
మాళవనేపాళగౌళయవన
గోనర్దకాదికక్షోణీతలాధీశు
లెల్లరుదైత్యలోకేశు ప్రోల
నొసలల్ వంచి, మౌళ్యంచితస్రక్ప్రస్త
మకరందరేణుసంబాధగౌర

ఆ॥ పాదుఁ జేయుచుండ్రి పాదపీఠముఁ జేర్చి
యెంత లేసిదో లు, హ్రీతు[ణు]లౌచు
వానిఁ బ్రీతుఁ జేసి, వానియాదర మొంద
కుండువాఁడు నొక్కఁడుండఁబోఁడు ॥ 12

ఆ॥ మఱియు, రాజులెల్ల మరియాదకై, వేఁట
లాడి, జానుమండలాసురునకు
గహనసీమఁ జంపి, బహువిధమృగముల
ప్పనముగాఁ గనిత్తురనఘమతులు ॥ 13

ఆ॥ వాఁడునాప్తబంధువర్గంబులం గూడి
వానినెల్ల మెక్కి బోనమందు
నుక్కి వుండు, దైత్యుఁ డుజ్జ్వలరూపయౌ
వతముఁ గవయఁ దివురుఁ బ్రతిదినంబు ॥ 14

ఆ॥ ఐనఁ, దృప్తిలేక, దానవుం డొకమాఱు
వ్యోమయానచరుల, నుజ్జ్వలాంగు
లైనసురలఁ జూచి; యట్టె విజృంభించి
రోషరూక్షస్థైర్యభాషణుఁడయి ॥ 15

ఆ॥ ఎగసిబిట్టు, తీవ్రముగవ్యోమగుహానంబు
వ్రీల్చి, యమరులకును భీతిసేసి
తనివిసనక, యంత, దనుజుండుకనఁబడ్డ
వారినెల్లఁజదుపుఁగ్రూరుఁడౌర ! ॥ 16

ఆ॥ అరరె! యసురయహఁచుయక్షగుహ్యకసిద్ధ
సాధ్యగణము, వాఁడసాధ్యుఁడై, మ
హీంధ్రసానువులననేకవిధక్రీడ
లందుఁజాలఁదేలియాడువారి ॥ 17

ఆ॥ వాఁడు విన్నఁజాలునాడుదియన్మాటఁ
గన్నఁజాలుస్త్రీలఁ; గాముకత్వ
పాశవములదైత్యపాశుండుబల్మిఁదాఁ
బట్టి; రతులఁదేలి, వదలిపెట్టు ॥ 18

ఆ॥ అసురకలఁచినైచి, వ్యాముగ్ధమానసుం
డౌచు, మధ్యలోకమంతస్వర్గి
వర్గమెల్లవణఁక; దోర్గర్వమొప్ప, ని
ష్ఠురవిచేష్టితములసారిదిఁబూని ॥ 19

ఆ॥ కొండలూడఁదీసి, చండప్రతాపుఁడు
ద్దండుఁడై, ప్రవృద్ధదర్పమొప్ప
గ్రామసీమలందుఁగ్రౌర్యంబుమైఁబాఱ
వైచు, వాఁడుసాఁనీచుఁడౌర ! ॥ 20

ఆ॥ వాఁడొకప్డుచంద్రుఁబట్టిక్రీడార్థకం
దుకముగాఁగవైచుఁబ్రకటగర్వి
సూర్యుబిట్టునిల్పుఁజోద్యంబుగాఁ; జాను
మండలుండు, ధాష్ట్యమండనుండు ॥ 21

ఆ॥ వానిబారికోర్వ వశమేది, యక్షగం
ధర్వసిద్ధసాధ్యనాగకిన్న
రాదిఖాదితేయులధ్యాత్మవేత్తలా
మౌనివర్యులింద్రుఁగానఁబోయి ॥ 22

ఆ॥ "శరణమీవెమాకు; సురనాథ!" యని! వెచ్చ
నూర్చి, దైత్యుఁడార్చి పేర్చు దుష్ట
చేష్టితములనెల్లఁజెప్పిరి; బ్రహ్మప్ర
సాదమునను వాఁడు చండుఁడౌట ॥ 23

ఆ॥ వారిదైనదైన్యవాక్యంబువిని, యింద్రుఁ
డభయమొసఁగి, వారికనియెనిట్లు
"వినుఁడు; విబుధులార! మునులార! జానుమం
షలుఁడు బ్రహ్మ వరముకలిమిఁ జేసి ॥ 24

ఆ॥ సరకుఁగొనకమిమ్ము, సంక్షోభపెట్టు; నే
నెట్టులూరకుందు? నిదియెనాడు
శస్త్రధారవాఁడు శతధాసహస్రధా
భిన్నదేహుఁడౌను; వెఱపుడుగుఁడు ॥ 25

ఆ॥ క్షణములోనవానిగర్వంబుసర్వంబుఁ
దుడిచివైతు; వానిదుడుకణంతు"
ననుచుఁబలికి, ననుచుననితరసాధార
ణోరుపౌరుషమునకునుద్యమించి ॥ 26

ఆ॥ అనిమిషాధినాథుఁడైరావతారూఢుఁ
డై, యమర్త్యసైన్యమనుగమింప
నాయుధములు బెక్కులాయత్తపఱచి, జీ
మూతలాంఛనంబుఁబూనెధనువు ॥ 27

। ప్రధనవిజయనిధుల, రథగజతురగాధి
రూఢులైనవారిఁ, గ్రూరయోధ
వరులఁగూడి, యింద్రుఁడరిజయోత్సుకత, దం
డెత్తిపోయె దైత్యునెదురుకొనఁగ ॥ 28

॥ అంత, దైత్యసైన్యమాదిత్యసైన్యము
నన్యోన్యవిజయకాంక్షఁ జన్యమందు
నేకశస్త్రముల, ననేకాస్త్రములఁ బ్రయో
గించుకొనుచుఁ గొంచకించుకైన ॥ 29

వ॥ వాసవవైశ్వానరవైవస్వతవాసతేయాచరవార్ధీశవాయువైశ్రవణ
వామదేవముఖులొక్కుమ్మడినురవడించి, జానుమండలుని, వాని
తమ్ముండైనసుమండలుని, వారిపరివారంబులోనివారైనమహిషా
సురకాలనేమిఘటాకాసురులను జీకొని, వివిధంబులైనప్రధనసాధ
నంబులఁ బ్రయోగించియెంతయేనిబాధింపందొడంగి—రంతవారును
"దక్కువతిన్నవారుకారు"గావున, వారికిఁదీసిపోవక, నానాశస్త్రా
స్త్రంబులనుం జెత్తి, వ్యాఘ్రభల్లూకఖడ్గాదిమహోగ్రసత్త్వం
బులువాహనంబులుగా, నారోహించివచ్చి, యాదిత్యసైన్యం
బులదైన్యంబునొందించిరోదోఽంతరాళంబును భేదించుచాడ్పున
విన్నవారెల్లరుం జేష్పడునట్లుగా, భీకరంబులైనసింహనాదంబులు
సేయుచువిజృంభించి—రంత,సర్వసత్త్వసాధ్వసాధ్వపక్షాసంఘాయ
కంబైనయామహానాదంబునాకర్ణించి, మేరుమందరవింధ్యాది
శైలకందరాంతరశయానులగుసింహవ్యాఘ్రవరాహాదిక్రూర
సత్త్వంబులెల్లనుదమకౌర్వ్యంబెప్పుడోయనంగఁగఁగడంగరీయం
బులకైపడి, వడిసెడి, యొడిసెలలు, బెడిదంపుటడిదంబుబడిఁ
బడఁబడినవడుస్రనభయవిహ్వలంబులై, యడుగులుతడఁబడ,
హతాత్పతయాళువులయినబుడుతలబుడిబుడిచెయిదములనంగనను
గనఁగొనక, యిటునటుదిరుగుడుపడుచు, నడకూడంబోవంగ
నంత ॥ 30

ఆ॥ సైన్యగాత్రభేదిశస్త్రాస్త్రపాతసం
జాతనూత్నరక్తశైవలినులు
కంకఘృష్ణములుగఁగదనరంగమునఁబా
అంగఁజొచ్చెగల్లరాచికొంచు॥ 31

ఆ॥ ఇట్టియుద్ధమందహీనసత్త్వుఁడు, దాన
వుండుఘోరాసురుఁడు, చండకోప
ఘూర్ణితాక్షుఁడగుచు, క్షోభించి, గర్జించి,
గదను వ్రేసెనందు గ్రిఁడు వరిపడఁగ॥ 32

ఆ॥ అంత. వానికమ్ముఁడైన సుమంతలుఁడొక్క
కొంచపెల్లగించి. భండనమున
గాడనేసెవహ్ని గాఢ, వేగమున వ
క్షంబువగుల, వహ్ని కలఁతఁజెంద॥ 33

ఆ॥ అంతమాత్ర వహ్నియసలక, జ్వలదుగ్ర
బాణపాతములనుబర్వతంబుఁ
జూర్ణితంబొనర్పఁజూచి, సుమంతలా
సురుఁడుముసలమేసెసరగవహ్ని॥ 34

ఆ॥ తత్ప్రహారమునఁబతత్త్రిప్రభవుండౌచు,
నిష్ఠమూర్ఛనొందెఁగృష్ణవర్త్మ
కాలనేమియంతఁ, గాలాంతకాకారుఁ
డై, కృతాంతు ముద్గరాయుధమున॥ 35

ఆ॥ వ్రేసి, మూర్ఛనొందఁజేసె; విభ్రాంతులై
రెల్లఁదిగ్దిశయోధులేచి, యంతఁ
గ్రోర్యదౌష్ట్యరాశి, ఘంటాఖ్యసురుఁడు మూ
ర్ఛితునొనర్చెఁ గిన్నరేశుఁబోర॥ 36

ఆ॥ తక్కు దేవతలను, దక్కువై శేయులు
బిట్టుతెలుపు, వారు "చెట్టుకొక్కఁడు,
పుట్టకొక్కఁడుం" బోయి, పోయినపోకన్నెం
"దలలుతప్పవికొసరి"‒కలంతంగొసరి॥ 37

ఆ॥ నాకులెల్లఁగాందిశీకులై దూకుల
పాటునొందఁగా, నిశాటులంత,
దృప్తచిత్తులై చూఁదిదివంబధిష్ఠించి,
యిచ్చవచ్చినట్టు పెచ్చరిలిరి॥ 38

సీ॥ భూరిలావణ్యసంపూర్ణ తారుణ్యరా
సులు, సురస్త్రీలు బందులనలంగిరి;
పూతక్రియాయికిన్ బ్రీతిదాయకములౌ
పారిజాతంబులు పాన్పులయ్యె;
మందాకినీజలానందపదంబులు స్వర్ణ
జలజముల్ దిగుడుబావుల నడంగె;
సురకంటకాఖ్యమహాపురవరంబద్వానీ
యంబైననాకలోకంబయయ్యె;

ఆ॥ సుప్రభాతమయ్యెదీపప్రభ తాపుఁడా
జానుమండలాభిధాను ధాటి
నామరూపహీనమామకుప్యాదలో
కమునకహహా! యదియెకాలమహిమ॥ 39

వ॥ మఱియు, వినుము; కుమార! కాలవైకృతంబున నైన వైపరీత్యంబున
కేమనంగలదు? కులిశపాణికుశలంబు పేక్షించి, చారురూపంబులై,
వసివాడక, సువాసనావాసితంబులైన కల్పవృక్షపుష్పం
బుల సంగ్రహించి, ప్రయత్నపూర్వకంబుగా సగ్రథించిపించి

నక్తంచరేశ్వరునకు పాయనంబుగా నర్పించుచుండు, వీతిహోత్రుం డును, పౌరోభాగ్యంబునం జేసియుఁ గ్రియామహాభాగ్యం బెక్కడ దప్పునోయని, భీతభీతుండై, షడ్రసోపేతంబులై, తదుల్బణా న్యూనత్వంబులు లేక, సమత్వసంశోభితంబులైన భక్ష్యభోజ్య లేహ్యచోష్యపానీయంబులం బదను గ్రహోపనీయమానంబులుగా యథాకాలంబున సమర్చుచున్; బౌరోగవంబు వహించుచుండుఁ జండశాసనుండైన శమనుండును మండలు రాజ్ఞ లేక, దండధరుండు వానియేలు నేలనే ప్రాణినైనన్ బాణినన్ స్పృశియింపభీతిం జెందు చుండుఁ; సూర్యుండు ధ్వాంతక్షిప్తి కాలాంభోజషండవ్యాకోచనాధన మాత్రంబకాని తదధికతరంబగు కిరణవిసరం బ్రసరింపం బోవ్యాహారంబున భీరుత్వంబుచేత నేమానియుండు. మలయమారుతంబెప్పుడను మలయగిరికటకనికటంబుననటే యుండి. తద్రక్షోధ్యక్షభీతిసైతుక తత్పరిష్టసూచనార్థాత్యాశ్చర్యచర్యారూపప్రపంచత్తసంభూష్యస్రోతా దృష్టచందనమంజరీజరీజృంభత్పరాగపూర సౌరభోద్గారంబులై, మందమందయానంబులం బదిశావరోధవీథీవితానంబులన్ బుల్కపుల్కనవిహారంబుల హోరాత్రంబులేక రీతిని జేయుచు, యామినోద్యోగంబు నిర్వర్తించుచుండుఁ; జందురుండును దచ్చంద్రశాలలన్ జంద్రశిలాఘుటికలతో సంగూడదదీయచంద్రికల కేళీ విశేషంబులం గ్రీడాకందుకంబగుచుండు; నిల్లుగా సంసేవ్యమానుం డగుచున్నను, ఆజానాపావనదుష్టాత్మ్యంబైనయాజాను మంషలుండు లోకంబులన్ గ్లేశమొందించుచునేయుండున్ గాని; శాంతస్వాంతుండుగాకయుండు. లోకంబునన్ బామునకున్ బాలు వోయుట కేవలంబు, విషవృద్ధికేగదా, దోహదంబగుచుండుఁ; గావున, వాండును॥ 40

ఆ॥ అతిసమున్నతాసనాసీనుఁడై, డాయ
వచ్చు మునుల, ద్విజుల, బ్రహ్మవేత్త
లను, శుచివ్రతాఢ్యులను జూచి, లేవఁడు;
కిరించు దనము మానఁ డించుకైన ॥ 41

ఆ॥ వారినెల్లఁ గనియు నియోగించుఁ
"గూరగాయలమ్ము వారివోలె;"
ఎంతగర్వి! వాని యింటికి వచ్చిన
గురుకుమారకులను గూడఁ గేరు ॥ 42

ఆ॥ గర్వమునను భృత్యనిర్విశేషంబుగాఁ
జూచునెల్లవారి, నీచు, మూర్ఖు
ధూర్తు, క్రించు, మీఁది గుర్తెఱుంగకుండు, వాఁ
డేమిగాఁగ లోన నెంచినాఁడొ!॥ 43

ఆ॥ పూర్వవైరమెంచి, సర్వగీర్వాణవ
ర్గంబు హింససేయఁగ ఱకుటసుర;
యగ్నిముఖమునుండి గూహవిర్భాగముల్
సురలకందకుండ "సొడ్డుపెట్టు" ॥ 44

ఆ॥ పఱచ, పొలసుఁ దింపి సురకన్యకలఁ బట్టి
తెచ్చి zర్షముంచి, తీరికంత లేక,
యూమికులను నిల్పుగ మీఱబుద్ధిదా
రిద్ర్యమెంతయేని రెక్కుఁ జేయు॥ 45

ఆ॥ దానవాధముండు దానుగర్తాత్మకృత్య
మేమెఱుంగకయు, యశూనగర్వ
మునను యక్షతురగముఖుల, గంధర్వుల,
వృక్షసేచకులుగ, నేర్పరించె॥ 46

వ॥ మఱియు, వాఁడు శంకరుకింకరులను, శ్రీవిభుసేవకులను, సార స్వానుష్ఠాతలను సనేలుబట్టియీడ్చి, చేతులారబందీబంధనంబుం జేయుచుండును; బాహ్యణాయామపరాయణులకు, రేచకపూరక కుంభ ప్రియత్నపరులను, సత్త్వసంపన్నులన్ జపేటాదులన్ దండించు చున్, బీడించుచుండు. నిజతపోబలంబుచేతను, వరగర్వంబు చేతను, సకలసురనికరంబునకు నిరాకారంబకారణంబదూరకాక మాత్రింబున నేయను భరంబునకుఁ దెచ్చుచుఁ, దనివిసనక ॥ 47

॥ అసురయున్న తాసనాసీనుఁడై, సుమం ములునితోడఁ, బరిజనంబుతోడఁ గొలువుదీరియుండి, కోరి ప్రశ్నించు దుం డగము లెన్ని, యన్నినయమమీఱ ॥ 48

వ॥ "ఓకీ! యీ వాఁడేవి ప్రబుపున్ గారాఁగారంబునం బెట్టి, కారా కూరంబుగావించితిరి? స్త్రీలనెందఱబందీకృతలం జేసినారు రా? యే యజ్ఞంబులు విఘ్నితంబులుగా సర్పంబడినవి? విధివద్యజనపరా యణులనెందఱన్ దాడించితిరి? ఎచ్చటెచ్చటన్ బుణ్యాశ్రమం బులు పుణ్యజనుల చేర క్తధారాసంసిక్తంబులుగావింపంబడియె? " నని, యడిగి, యావద్వృత్తాంతంబునాకర్ణించి, వాఁడు మేనునెంచి యావులించి, హర్షించుచుండు. లోకంబునసంక్షోభంబెంతగల్గింపం బడిన, వాఁడంతసంతోషించు; నొకొక్కప్పుడు వాఁడు లేని నేరములెన్నేనిఁగల్పించి, సురమునినికరంబులంగనికరంబులేక, నికరంబుగదండించుచుండు; నిట్లు దుష్టచేష్టితంబులఁ చేదివ్ కసలు ద్విగ్నభగ్నమానసులై, క్లేశితక్షోభితులైరి ॥ 49

॥ అమరవరులు గొల్లి యమృతపాయులైన నసురవిభుని వలననసురసురయి బంకుగొంకునొంది, సాధ్వసధ్వస్తాంత రంగులైనం, గరంబువింత ॥ 50

వ॥ అని, తెలిపినవిని, యవ్వలివృత్తాం ... ట్లని, పీణాపాణివాణీజాని నడుగుటయును ॥ 51

ఆ॥ సిరులువొలయునోపలగరగరిబూదిపూం
తయును, జడలనమరతటిని, సామి
దేహమందుభూభృదీహితఫలము, శ్రీ
గౌరిపెలయుదేవ! కపిలమల్ల !! ॥ 52

ఇది, ఆంధ్రీకృతముక్తీశ్వరోపాఖ్యానమునందు
జానుమండలప్రతాపవర్ణనమను
చతుర్థాధ్యాయము.

---

శ్రీరస్తు

# ఆంధ్రీకృతముక్తీశ్వరోపాఖ్యానము

## పంచమాధ్యాయము

---

ఆ॥ సిరులకిరవుధరణినరసాపురంబు సు
స్థిరనివాసమని, మదిందలంచి
యున్నసుజనకోటికెన్న, ముంగొంగుబం
గరువుగావె, నీవు కపిలమల్ల ! ॥ 1

ఆ॥ అవధరింపు; దేవ! యవ్వలివృత్తాంత
నమరమునియడిగెనబ్జగర్భు
"నమరులమృతపాయులయ్యు, నశ్లేలయ
య్యసురవలనమిపుగనుసురువడిరి ? " 2

ఆ॥ "ఆయుపేక్ష యేటికో, యింద్రిముఖ్యుల
క్షేయుపాయమూని శేమిసేసి
రో" యటంచు, వినఁగనాయతకౌతూహ
లంబుగ గైవామనంబునందు ॥ " 3

వ॥ అని, యడిగినసురమునికినలువయిట్లనియె ॥ 4

ఆ॥ "వినుము; వత్స! నీకువివరించిచెప్పెద
నసురులట్లుబాములంది, కుంది,
దానిమాఱుసేతఁగానక, వానిసై
రింపలేక, సురలు, ఋషులుగలిసి ॥ 5

ఆ॥ ఇంద్రుఁజేరి, మొ్రక్కి, యిట్లనివిన్నవిం
చిరి–"మహేంద్ర! రాత్రిచరుఁడుమనలఁ
బెట్టుబాములెట్టివట్టిట్టివనఁగాదు;
పారమున్నె? దేవ! మేరయున్నె? ॥ 6

ఆ॥ నీపురాజజయ్య, దేవేంద్ర! మాకు నీ
బాముశేమి? నీదుభావమేమి?
యేలయీయుపేక్ష? త్రైలోక్యవాథ! మే
మోర్వలేమురాక్షసోగ్రబాధ ॥ 7

ఆ॥ లెమ్మ; శత్రుఁజీల్చ, లేఖాళిఁగష్టాబ్ధిఁ
దేల్చ; నాథ! నీవనల్పవిక్ర
మైకనిధివిగావె? నీకసాధ్యంబేది?
మమ్ముఁగావుమయ్య! నమ్మితోమ ॥ 8

ఆ॥ అకట! నందనంబు, నాసుధర్మయు; వైజ
యంతమమరనది, యనంతవాంఛి
తార్థదోగ్ధ్రి, ధేనువాకల్పవృక్షంబు
లసురుస్వార్జితంబులయ్యెనేఁడు ॥ 9

ఆ॥ ఎంతకష్టపుకార! యింద్రుఁ సేవించు
నేమువానిఁ బెద్దగా మదిం ద
లంచి, కొల్చి, పొద్దులంబుచ్చు దుస్థితి
కై మఱింతవంతగల్గుచుండు ॥ 10

ఆ॥ అధముఁడసురపుత్త్రునకీత్రిదాసులఁ
జేసి, పనులఁ దేరఁ జేకొనంగ
నెత్తియుపనమువివ్వుల; నెంతటిపగవాని
కైనవలదు-వలదుదీనవృత్తి ॥ 11

ఆ॥ ఈశ్వవృత్తిమాకునీశ్వరకల్పితం
బగునె, దీనదీనమైనజీవ
నంబుదీనఁబుచ్చుచుంబుయిలోఁడి, కి
గ్గాడియసురఁగొల్వఁగాఁదరంబె ?॥ 12

ఆ॥ వజ్రివయ్య, మేఘవాహుండవయ్య, నా
ఘమునంతవానిధిషణబలిమి
శిక్షగల్గునీవశేషశేముషి లేని
యుద్బుధారణోమహాత్మ! తగునె ? ॥ 13

ఆ॥ నేము సేవఁ జేయ లేమువానికి దేవ !
జీవనంబుగూడపీదిరంబుఁ
గుట్చుచుండెమాకు, గృహ్యకాదులప రా
క్రమముకొల్పనా ! స్ఫురత్ప్రతాప ! ॥ 14

ఆ॥ అధిప! యమృతపానమపరాధపుయ్యె; దుః
ఖైకమూలమయ్యెననె యసునసు
ష్టుదుష్టసేవమాన్చి, భద్రంబుఁ గూర్పుమీ
సైన్యమేల? మాకుదైన్యమేల ? ॥ 15

ఆ॥ గురునిగురుమతిసురుచిరోపాయముల
హింసఁజేసి, దేవ! యీసురమను
నీసురౌఘదైన్యమెల్లఁబోఁగార్పవే
కూర్పవేముదంబుకులిశపాణి ! ॥ 16

ఆ॥ ప్రభు! దురంతసేవ "అంపపుశోఁతగా,"
బాధఁగూర్చునిర్నిరోధమాచు
నేర్చుమామనంబుఁగార్చిచ్చునోలె; నీ
నేర్చురీతిమమ్ముఁదేర్చుమయ్య ! ॥ 17

ఆ॥ నింద్యమీనితాంతనిస్తేజమైన జీ
వితముఁగడపలేమువిబుధనాథ !
సేవకంబెమృత్యువే, వరంబగుఁగాదె !
జీవితాంతమార్తిఁజేయుసేవ ॥ 18

ఆ॥ లోకమందుదీర్ఘరోగి, ప్రవాసి, య
న్యావసథనివాసి; సేవకుండు
చెప్పఁదగుదురెప్డుజీవన్మృతులటంచు
నెఱుఁగవోకొ, నీవు! సురగణేశ ! ॥ 19

ఆ॥ విక్రమాఢ్యుఁడేని, విద్వాంసుఁడేని, స
ద్గుణవిశిష్టుఁడేని, స్తోకమంజు
భాషణుండయేని, భంగమొందుటధ్రువం
బమరనాథ! వఱవుసమునసిసిరో ! ॥ 20

వ॥ దేవా! యేమనిమనవిసేయుదుము? సేవయేవృత్తిగాస్వీకరించిన మానవులకు దేహంబులందుస్వాతంత్ర్యంబుశూన్యంబు. అరణ్యంబులవర్ధమానంబులైనవృక్షంబులకుంబోలెమానుష్యులకైనబంత హైన్యంబుఁదెచ్చునోయనియునెఱుంగకుండునీచులకుస్థానిత్వంబు

పరమప్రాప్యంబు భానుమంతుండు హిమానియుం బోలెం జంద్రాతపం బంధకారంబునుం బోలె స్వేచ్ఛాధీనత్వంబు సకలసుగుణంబుల నణంచుచుండు. మఱియు, వృత్రశత్రూ! శత్రుసేవాదౌర్భాగ్యంబు మాకత్యంతదుస్సహంబైన వేదననాపాదింపుచుండుఁ. పరంబైనభూతిం బొందియానందించిన మేమిప్పుడు పరాభూతిం బొంది, కుందుచున్నవారము. మహామహా! యిప్పటికైనను పేక్షనుజ్జగించి ద్విషజ్జనంబు నిర్జించి, యీ నిర్జరులంగాపాడనోపవయేని, మేమవశ్యంబు శత్రువ్యాపాద్యమానులమౌట తథ్యంబు సుమీ!" యని స్రుక్కుచు, వక్కాణించుచు, దీనదృక్కులం దన్నుం జూచుచున్న యజ్ఞభుక్కులకక్కభృద్విభేత్త యాశ్వాసపూర్వకంబుగా, సవిశ్వాసంబుగా, నిట్లనియె ॥ 21

ఆ॥ "ఎఱుకలేనివాఁడనే? సురలార! ప్రా
లాత్మలి, మిమ్ము విడుతునే ? లఘుత్వ
శాలినే ? జగానశాలీనులే, భవి
తవ్యతను మఱల్పఁదలంచువారు? ॥ 22

ఆ॥ ఎచట, నెప్పు, డెట్టులే భవితవ్యత
నియతినియమితంబొ, నిజము సుండి !
యచట, నప్పు, డట్టులా భవితవ్యత
తప్పఁబోదు; వేఱు సెప్పఁగాదు ॥ 23

ఆ॥ జానుమండలాభిధానుఁ డుగ్రతపంబొ
నర్చి, బ్రహ్మఁగూర్చి, యర్చిరాది
మార్గగాములైన మహనీయులనుగూడఁ
బట్టి, వాఁడు బిట్టురట్టు సేయు ॥ 24

ఆ॥ వరముఁబడసినలువవలన, నయ్యసుర మా
తాండు లేక, తనకు, నెల్లలోక
ములకు గాధఁగూర్చ; మురహరహరులేమి
సేయలేరువాఁడ జేయుఁడౌట ॥ 25

ఆ॥ కర్తగలఁడశక్యకార్యంబునకశక్య
మైనదానిఁ జేయలేనివాని
కుప్పతిల్లఁబోదుకుప్ప తెప్పలుగాఁగ
దుర్యశంబమర్త్యవర్యులార ! ॥ 26

ఆ॥ జానుమండలాభిధానునేసంహరిం
పఁగవలంతిఁగాను; బ్రహ్మవల్ల
నయ్యెఁగాన, నసురయంతవాఁడిప్పుడం
దఱమొనర్తమజునిదర్శనంబు ॥ 27

ఆ॥ అతఁడెమనకుశరణమాతండెసంభద్ర
సంవిధాతయెల్లస్వర్గివర్గ
ములకు; సందియంబువలదింక; సత్యలో
కమునకేఁగి, బ్రహ్మఁగాంచి, మఱియు ॥ 28

ఆ॥ అతనిచరణయుగళికర్మిలిమ్రొక్కి, ప్రా
ర్థించి, సత్కృపారసాంచితంబు
తత్కటాక్షమంగళోత్కృష్టవీక్షణో
త్కరముఁగరముఁబడయుదము; పొదఁడు ” ॥ 29

ఆ॥ అనుచు, వారిఁదేర్చి, యమరవిభుండు సు
స్థిరుఁడు, సిద్ధసేవ్యమురుశుభప్ర
దంబు, దీప్రమప్రతర్క్యమనాలోక్య
మైనసత్యలోకమట్టెచేరె ॥ 30

ఆ॥ సురలతోఁడ, మౌనివరులతోడను గూడి
వజ్రపాణి భక్తిఁ బ్రహ్మఁ గాంచి
మ్రొక్కి, వేఁడి, తమ్ము రక్కసుండు దైత్యుఁ
బెట్టుబాధ లెల్ల వినిచె నిట్లు ॥ 31

ఆ॥ “దేవ! జానుమంతుఁ డీవేల్పులకు, మౌను
లకుఁ, ద్రిలోకవాసులకు వృథా వ్య
థా నితాంతహానిఁ దాఁ జేయుచున్నాఁడు
వానినెల్లఁ జెప్ప వశము గాదు ॥ 32

ఆ॥ ఎఱుఁగవో కొమా! నీవు సరసిజపీఠ ! స
ర్వజ్ఞమణివి గావె, ప్రాజ్యతేజ !
యెఱుఁగనట్టులుంట యిది చిత్రవిలాసమా
దేవ! నీకు, మమ్ముఁ బ్రోవుమయ్య ! ॥ 33

ఆ॥ జానుమంపలాభిధానుఁడౌ రాక్షసుం
డేర్చె లోకముల, నహీనమైన
త్వత్ప్రసాదలబ్ధవరగర్వమునఁ జేసి
వాఁడజయ్యుఁడయ్యె నేఁడు జియ్య ! ॥ 34

ఆ॥ వాగనీశ యిష్టత్వన్మూలకంబైన స
మాధయంబుఁ దీర్ప, మమ్ముఁ దేర్ప
నీవ నేర్తు; వన్యులేవారు నేర్తురు ?
దేవ ! కావరావె, దివ్యతేజ ! ॥ 35

ఆ॥ స్వభోగులైన సర్వగీర్వాణుల
ప్రసుని పంచపాళి నిపుసాల
గుడుచుచుండి రివె తలువడిగా పుంబడి
తొలఁగునా కొమా! యివ్వి తొలఁగవా కొమా ! ” ॥ 36

|| అనుచు, మనవి సేయు నసురాధిపునిఁ జూచి
బర్హిర్ముఖవల్కుఁ డానవజిహ్మమధుర
మధురఫణితి, ముదిరమంద్రస్వరాఢ్యమౌ
వచనరచన మెఱయఁ, బ్రచురకరుణ ||

|| "శతమఖముఖనిఖిలబర్హిర్ముఖప్రముఖులారా! వినుండు. వానికి నేన, వాంఛితార్థప్రదానంబున్ జేసినాఁడ. వాఁడు నావల్ల నేఁగదా ప్రాప్తోదయుండైనవాఁడు! నేను వాని నాశంబునకుం గారకుండఁ గారాదుగదా! తెలిసి తెలియముల తికమకలం దెమలక, విషకలుషితంబును, గంటకసంకటంబునైన వృక్షంబును బెంచి, పెద్దసేసి, చేఁ జేతలం దలం ద్రుంచుటం గలందలంచుమైన నెవ్వానికేనిం జెల్లునే? యద్దానవుం డుద్దండుండై, యభ్యుత్థానంబు నొంది, భవదభ్యుదయంబునకున్ నిరోధకుండై, దౌష్ట్యసాధకుండై, ధూమకేతువుం బోలెం దోఁచుచున్నాఁడోయని, యాలోచించియున్, హేతువేమియు గోచరంబుగాకున్నయది. ఇయ్యది నాదోషంబుగాదు సుఁడీ! దారుణంబైన తత్తపోవిశేషంబు మాకు "ముంగాలిబందమై", వాని కోరికమేరకంగీకారంబుఁ దెల్పుటయ లంఘనీయంబయ్యెఁ, గడచిన శుభాశుభంబుల కేమిగాని, ప్రస్తుతకర్తవ్యం బాలోచింపవలెఁ గదా! "గతజలసేతుబంధనంబునం" గలిసిది కాసంతగాని, వచ్చునది కాసంతగాని, సుంతగానిపించునే? ఐనను, మీకొక్కమాటఁ జెప్పెదం; బరాకులేక, యాలకింపుఁడు|| 38

|| యాతుధానుఁ జంప, లాతులెవ్వరు వలం
తులు? సుధాంధులార! యావికుంఠ
నాథుఁ డొక్కరుండె గానన్యవిక్రమో
ద్యముఁ డతండు చక్రి యతఁడెగాక || 39

ఆ॥ జక్కడంచి చక్రి పెక్కుర, దుష్టరా
క్షసులఁ, గొల్లి దేవగణముఁ బ్రోచె
శ్రీశుపాప్రుఁగాంచి, శ్రేయముల్ వొందని
వాఁడెవండు? వాఁడెవండయేని ॥ 40

ఆ॥ ఆదిదేవుఁడతఁడు, వేదవేదాంగసం
స్తుత్యమహిముఁడతఁడు, సుప్రసన్నుఁ
డయ్యెనేని, మనకునభయమిచ్చెనయేనిఁ
దక్కువేమి? దైత్యులెక్కయేల ? ॥ 41

ఆ॥ సర్వరక్షకుఁడు, సర్వభవోద్భవుం
డైన శ్రీశువల్లనభయమంద
సేగులెల్లఁజెప్పి, "నాగేశశాయి! మ
మ్మేలుకొమ్మనంగ," మేలుకల్గు" ॥ 42

ఆ॥ అని, శచీశుఁబల్కి, యావాగ్వధూటీశుఁ
డెల్లవారిసురమునీంద్రపాళి
వెంటఁబెట్టుకొనియె; వేవేగనేగెన
కుంఠమహిమమగువికుంఠమునకు ॥ 43

మ॥ కనియెన్ దప్పులవాగ్వధూధవుఁడు, న్యక్కారాస్తమాయాతనై
జనిగూఢోరుమహత్త్వభాక్కులగుయజ్ఞస్వత్వభుక్కుల్, నితాం
తనిరీహుల్ దనవెంటరాఁ, బ్రచురమాన్యప్రభవుండైన శ్రీ
శునివాసంబు, వికుంఠపట్టణము, నత్యుదగ్రప్రభావాఢ్యమున్ ॥ 44

చం॥ కనుఁగొనెవాగ్వధూధవుఁడఖండమహోమహితంబుఁ, బ్రిస్ఫుర
త్కనకకవాటశోభితసుధాధవళోన్నతరమ్యహర్మ్యమున్
మణిమయభూషణోత్కరకనద్వపురుజ్జ్వలవేషధారిస
జ్జనసివహానుభూతసహజస్థిరముక్తివధూపగూహమున్ ॥ 45

శా॥ కాంచెం గాంచనగర్భుఁ డుత్సుకతఁ సాక్షాత్కారముం గోరి, య
భ్యంచద్భక్తిసమృద్ధినిష్ప్రియై రమాప్రాణేశపాదాబ్జని
శ్చాంచల్యప్రియు జగజ్జనురదృష్టస్ఫార రేఖామయూ
ఖాంచచ్చక్రకుసవక్రవిక్రమునిఁ, నిత్యశ్రీగృహ[లస] ద్వక్షునిన్

ఉ॥ కాంచెను వృద్ధవృద్ధులను గాంచనగర్భుఁడు, స్వర్గవర్గమ
ఖ్యాంచలచంచలేతర నిరంతర నిర్మలమందహాసరే
ఖాంచితామృతచంద్రికసుధాంశునిభాస్యబింబముం
దుంచినయట్టులొప్పెడుమహామహితున్, కమలాసమన్వితున్
[మనోహరున్] 47

॥ అట్లు గాంచి, కాంచనగర్భాదులు గాంచనాంబరుం, బరాత్పరుం బునఃపునః ప్రణామ నామసంకీర్తనాదుల సాదరామోదమేదురాంతరంగుం గావించి, యించుక సంభాళించుకొని, వినయవినమితతనులయి, తనుతరవచనరచనం ద్రిచతురపరిమితాక్షరంబుల నొప్ప సిట్లని విన్నవించిరి. "దేవా! మా విన్నవించు మాటల నొక్కించుక సావధానంబుగా నవధరింపవేఁడుకొనుచున్నారము. రమేశా! జానుమన్నామకుండైన మానవాశనుండొక్కరుండు మమ్మెల్లరం జిల్లిగవ్వకుం గొఱగానుంగానక, కనుంగొనలం గనలగ్గలంబై, కనకసమను నగ్గియుం బోలె, సిగలుమియు వడుపున నెల్లజీఱలు జీఱాషనీయక, మాఱెందు లేక, యేమునీవారమనుగౌరవంబు నీనారశుశ్రాగ్రిమాత్రింబేనిఁ గనక, వీఁకమైను దేఁకంబు వ్రేకంబుగా, సాకులమైన మాకు నాకులపాటుఁ గావించుచు; నాకులచాటు పిండె వంటి మా యొంటరిజీవితంబులు బయటఁబడ, బడలియడలు మమ్ము ముమ్మరమ్ముగఁ బట్టిపల్లార్చుచు, సోకోర్చుకొన్న కొలందియుం దౌర్కిక్కినను దలయెత్తనిబుడదపాములుగా మమ్ము

నెమ్మనమ్మున నందెంచుచున్నవాఁడు. వాఁడేనాఁడేమిగా నున్న వాఁడో - కాని, నేఁడుసూతులుగాఁ చుసేయనోపకుండును, నేను గనయుండియు, లేనివారమై, వానిబారింబడిపాతిపోవను లేకున్న వారము. వానివల్లనైన యారాటంబును సైరింపను నేరకున్న వారము, పారావారశాయీ! యీశానాదు లెవ్వరుఁ గానివాని డాకనుడీకొను వారు లేరు. భవచ్చరణనళిన యుగళభజనానితరసులభ నిరంతరనితాంతసాధనాంతరులమై, దీనతాఽధీనాంతరులమైన మమ్మెట్టులుద్ధరించెదవో, యుద్ధవాగ్రజ! భుజాంగ్రిజాగ్రచ్చక్ర ధారావిదారితక్రివ్యాచ్చక్ర!" యని, ప్రార్థించుచున్న వారిదీన వాక్యలకక్రమలామనోహరుఁడు కరంబునికరంబయినకనికరంబు మెఱయ, సురమునినికరంబువిన, సరసిరుహసంభవునితో నిట్లనియె

సీ॥ "వినవయ్య! హంసవాహన! సురజ్యేష్ఠ! నా
కౌకసులార! మహర్షులార!
వినుఁడయ్య! రాక్షసవీరునిమారణో
పయంబు; మఱి, వాఁడు జేయుఁడౌను
మీకును, నాకును; లోకేశదత్తవరా
వరమునఁ జేసి దర్పంబు మదిరే
స్పృష్టపూర్వులు సర్వసేనాఽఽధ్యులైనని
ర్జరులును, యక్షకిన్నరులు, గుహ్య

గీ॥ కాదులే - కాదు; నేనైన, నాబలాఢ్య
జానుమండలుఁబోరిఁబోఁడంపలేము
తపముపర్చుటం జేసినత్ఫలమునొందెఁ
గావున, ననాధ్యుఁడయ్యె నిక్కము ప్రభుండు ॥ 49

ఉ॥ ఐన, వచించువాఁడ; నమృతాంధసులార! వచోలవంబుఁదా
పైనదివానినాశము; మస్మన్మహామహనీయ శంభునంశజుం
డౌ నకనాథుచేత నభిరాత్రి యుధశ్యము నాశమొందు; నే
దీనిని యోగసంజనితసృష్టిఁగనుంగొనినాఁడ; నమ్ముఁడీ! ॥ 50

ఉ॥ కావున. మీరలంచెలు "నెకామెకి" నారజతాద్రికేగి, గౌ
రీవరు,లోకశంకరుని, నృత్యపరిజేత, గికిశుం, నీను,నో
దేవతలార! చాలగనుతింజి, నక్షేసి, తదీయసత్కృపన్
మీ వెత బెల్లఁబాఁకోన నేకొనుఁడయ్య!జగచ్ఛుభంబగున్ ॥ 51

చం॥ పరమశివప్రచండకారణాకృతి భరితాంతరుఁడంతకాంతకుం
డుసుతరగౌరసుందరమనోమహితుండు. హిమాద్రిపుత్రికా
వరుఁడు, మహాత్ముఁడీశ్వరుఁడువశ్యమువశ్యతఁగాంచుమీకు; నే
నెఱుఁగుదుఁదత్త్వభావము; మహిష్ఠతదుత్తమసత్త్వభావమున్ ॥

చం॥ చనుఁడుసురల్! మునుల్! చనుఁడు; చయ్యన నేభవదగ్రిగామిచా
దును; బరమేశ్వరుండవిదితుండె? మహాత్ములు,బ్రహ్మవేత్తలా
ఘనులకు? స్రష్ట,భర్తయుఁ,బరిగాఢమహత్త్వుఁడు మేశుఁడవ్యయుం
డనుపమితాదరాన్వితమనోజ్ఞుఁడు,మీకుఁబరిసన్నుఁడయ్యెడున్"

వ॥ అని, పలుకుచున్న శ్రీమన్నారాయణాన మే యోపాయసూచకంబు
లైన వాక్యరబుల కెంతయు సంతసించి, సురలును,మునులును
హరిని, హిరణ్యగర్భునింబురస్కరించుకొని, వ్యోమమార్గంబున
నిర్గమించి, యమితద్యుతియు, నుత్తుంగశృంగభూయిష్ఠంబును,
రత్నకందరసుందరంబును,నామేఖలసవిలాసవిహారసలాలసవిద్యా
ధరద్వంద్వసంచారాంచితంబును, భస్మరూషితాదూషితసర్వాం
గీణులు, నానందమానందసందోహాకుంచి మానసారవిందులును,
శంకరకింకరత్వనిత్యవ్రతులునైన పరిమథగణంబులచేతం బరికీర్ణం
బును. హసా [illegible] కాశంబును, కోటిచంద్రప్రభాపరిభాస
మానంబును, [illegible] త్యంతిపవిత్ర సమన్వితంబును, సంతుష్ట

సర్వసర్వేశ్వాపశ్యనిత్యజ్యోత్స్నావిహారంబును, దివ్యౌషధి
ప్రభాప్రభావితంబును, శ్రవణ సుభగవిరుతయుతకలకంఠకుల
కలకలబధిరిత దిశదిశావకాశంబులును, దప్తకార్తస్వర
భాస్వరత్వగ్దర్శనీయంబులును, విస్తారసమస్తవిటపచ్ఛాయం
బులునైన కల్పవృక్షంబులచే సమాకీర్ణంబును, ఘటితఘటీ
సమాటోపాటీకనకన క్షనతకసప్తభూధసూర్యస్ఫుర్తులును, సంపూర్ణ
ఘార్త్షిమాచంద్రమూర్తులును, సముత్తుంగశృంగసనాథంబులు
నైనకామవో(గ్రీసధ్రీనయూథంబులచేఁబరితోవ్యాకీర్ణంబును
బ్రతిప్రస్థసుస్థిరస్థితపరమహర్షిమహర్షిపవిత్రితంబును, బుణ్యాగణ్యమహా
మహిమమహితపరమశివగాథాగాయద్గంధర్వకిన్నరబృందంబును
గ్రీష్మగ్రాతపాదాలక్తకచిహ్నితసానుకంబును, శతాధికశివాయతన
సోపానోపశోభితంబును, దివ్యోద్యానసముద్యోతితంబును,
బుష్కలదివ్యపుష్పసుగంధగంధిలంబును, భవ్యస్తంభసహస్రభవ్య
దివ్యభద్రమంటపమండితంబును, దివ్యరత్నప్రభాకీ
ర్ణంబును, దివ్యకుట్టిమసముట్టంకితంబును, దివ్యకీరశారికా
వారోద్గీ "తేశానస్సర్వవిద్యానా"మిత్యాదీశానగాథానైకోద్గీథ
సాధుగాననాదమేదురంబును, సంతతబహిరంతస్తమస్సంతాన
నాశంకరంబును శంకరవాహశాక్వరరాజారబ్ధోత్ఖాతకేళీవైచిత్రీ
వ్యాఖ్యానప్రఖ్యాపనసానుభాగభోగాభోగంబును రాశీభూతామందా
నందక్షీరవారాశియుంబోలియున్న కైలాసశైలంబును సందర్శించి
వాసవాదులైన సూదితేయులందఱు వందనంబులాచరించి, మంద
మందగమనంబులతో నయ్యద్రిరాజంబునారోహించి, చక్షురక్షు
ద్రోత్సవసంధాయకంబులును జిత్రవిచిత్రధాతురాగధారాధౌత
ప్రకటకటకశిఖరబహుముఖవిరాజితంబును, సప్తర్షిగణసేవితంబు
నైనయాశ్వస్థాన ... గాంచిర ను॥ 54

సీ॥ రత్నవిష్కంభసంక్రాంతకాంతివిశేష
రూపితాశాముఖాశేషశోభి
సంతతానంతపుష్పలతావితానసం
వ్యాప్తాంతరిక్షకళ్యాణకాయ
మానమానితము, చిత్రాసనసింహాస
నాసీనపారిషద్యాభిత ఇప
రమ్యాంతరమును, బుష్కలపుణ్యాఢ్య
సజ్జనశ్రేణిసంసజ్జితంబు

గీ॥ స్వర్ణమాణిక్యకుట్టిమాభ్యర్ణరత్న
రమ్యసోపానపంక్తి, విస్రంభసంభ్రమ
మభ్రమద్భృత్యవర్గసంభాసమాన
మై, యనన్యసామాన్యవిఖ్యాతినొప్పు॥ 55

వ॥ అందు॥ 56

మ॥ దళదిందీవరమింద్రనీలము సముద్యన్నైజదేహప్రభాZZ
వళి కెంతేనియునప్పులన్ మునుఁగ, దూర్వాజగ్ధిసంతాసమొం
ద, లసన్మూర్తినెసంగు కాళి, నిజకాంతన్, గాంతదేహార్ధమం
దెలమిన్ దాల్చినదేవదేవుని,శివున్, మృత్యుంజయుంజిన్మయున్

కం॥ స్కందుఁడు, ద్వైమాతురుఁడును,
నందియు, భృంగియును, తండునాముండునుభ
క్తిందద్దయుసేవింప, న
మందకృపందన్ని, వారిమన్నించువిభున్॥ 58

ఆ॥ చంద్రహాళి, నీను, జాజాలిముఖ్యమహా
నీంద్రపాళిచెవులకింపునిఁపు
వచనరచనముదముఁబ్రచురంబుగాఁగొల్వ
జేశిశాగ్రిణ్య, దేవదేవు॥ 59

ఆ॥ పుణ్యమూర్తిఁ, బంచముఖు, మూఁడుకన్నుల
వేల్పు, వేల్పుటేలు పెఱయుజడల
యడవిమిగులనిండు నడగొండకొనబోని
శిరముగల్గువిభుని, శివుని, భవుని ॥ 60

కం॥ కనుఁగొని, వెన్నుఁడు సాష్టాం
గనిపాతముగాఁగ మ్రొక్కి, గౌరీనాథుం
డును, హస్తగ్రాహముగాఁ
గనుదనప్రియమిత్త్రుఁ దన్పె గాఢాదృతిమైన్ ॥ 61

ఆ॥ కన్నసన్నఁ జేసి, వెన్నుండు నాదితే
యులనువిశ్రమింపఁ దెలిపి, తాను
బ్రావృషేణ్యవారివాహగంభీరగ
ర్జానుకారికంఠుఁడై, నుతించె ॥ 62

సీ॥ ఈశాన! సర్వజ్ఞ! యీడ్య! గౌరీప్రాణ
నాథ! భక్తాఘౌఘనాశ! వ్యోమ
కేశ! కంఠేకాల! కృత్తివాసస్సంజ్ఞ!
ఫాలాక్ష! పంచాస్య! శూలహస్త!
షాడ్గుణ్యపూర్ణ! షడ్విద్గణాహంకార
మార్జనచణభుజాఖర్జు! దుర్జ
నాగోఽసహస్వతేజోఽభిశోభివ్యాపిత
విశ్వవిశ్వా! మహోక్షాశ్వయాయి!

గీ॥ పంచకృత్యస్వకృత్య! యకించనత్వ
బాహ్యరూపనిరూప్య! యనూహ్యదివ్య
కృత్య! కృతకృత్యులీభవద్భృత్యులెల్ల
నీదునయ పేర్మినిష్ప్రపంచావెనిధన! ॥ 63

సీ॥ ఏమూర్తి యాద్యమహాసృష్టి, యేమూర్తి వ
హించుహవ్యము, హోత్రి యేది, యేవి
రెండుమూర్తులును గల్పించు నహోరాత్ర
ములను, శబ్దాశ్రయంబునఁ బ్రసిద్ధ
మెయ్యది, ప్రకృతియీ యెల్లబీజ[భూత]ములకు
నేది, యెద్దాన దేహివ్రజంబు
ప్రాణవత్త్వముఁ గాంచుఁ, బార్వతీనాథ! యీ
యష్టమూర్తులఁ జేసి, నష్టివర్జి

గీ॥ తముగ సర్వాత్మనా జగత్కారణంబొ
[illegible]వు మహేశ! యనాథనాథ!
సార్థకము నీకు నీశ్వరాహ్వయము దేవ!
యీశనంబునఁ జేసి, యహీనభావ! ॥ 64

వ॥ దేవా! నీవు నిఖిలసుఖప్రాపకుండవౌటం జేసి, శంకరుండవు. సకల శుభకరంబులయిన సత్కృత్యంబులకొప్పుటం జేసి శంభుండవౌదువు నీవిట్టియైన యీశివశంభుశబ్దంబులు నిత్యప్రాపత్యమానంబులై నీవియుం బోలి పవిత్రజనంబుడయ్యునకు సతతవిభూతిం బ్రభూతంబుగాఁ గల్పించు; మృత్యుభీతిం బాఱఁదోలు; బాధలం బాపు. వైజ్ఞానికులును, యోగనియూఢాత్ములునైనవారు నిన్నే శరణంబునొందుచుందురు. నీచారిత్రంబులు నీచారిత్రంబులుగాక, సర్వాశ్చర్యచర్యంబులు, సర్వాగణ్యంబులు నౌనుగాదె! యెట్లన-నీప్రశ్మశానసంవాసివయ్యు, మహర్షులపరమహంసపరిపూతహృదయగుహాకుహరంబులన్ గాని, రజతశిఖరిశిఖరంబులంగాని విహరించుచుండు పంచాస్యమూర్తివిగదా! ఆదిభిక్షుసమాఖ్యాసమాఖ్యాతుండవై బుభుక్షలేకయే యీవు భిక్షాటనంబు లీలామాత్రంబుగా స్వీక

రించియు, యక్షాధ్యక్షసహస్రాక్షులకసదృక్షంబుగా మహైశ్వర్య
మహాసౌఖ్యప్రదానంబుఁ జేయుచుండుటఁ బ్రధానంబుగాఁగల్గి
యుండువుగాదె! మహోత్కృష్టప్రాప్తిసుధాఽఽసీనుండవై, కోంచ
వీటిమింటజంగంబవై, నటయాడుచుండువాఁడవయ్యు, నైరావణ
వాహాదులైన సురాదితేయులందతిచేతనువందనంబుల నందుకొనుచుఁ
గ్రందుకొనునమందానందంబు నొందుచుండువు గదా! యదియును
గాక ॥ 65

చం॥ అవనిరథంబు, పుష్పవదనర్గళవేగరథాంగయుగ్మమున్
సవిషఫలాత్తమత్తనువిశంకటమార్గణమున్, జతుశ్శ్రుతుల్
జవయుతరథ్యముల్, సరసిజప్రభవుండును సూతుఁడున్, సుమే
రువుధనువబ్ధితూణముగఁ బోల్లను మూఁటిని గూల్చితీవగా ॥ 66

సీ॥ లోకముల్ పదునాల్గుఁ శోఁకఁ జిచ్చైకాల్చు
కాలకూటము మ్రింగఁజాలు నెవఁడు
మృత్యుదేవతనోటి మెఱుఁగుఁగోఱలు దుల్చి
ముని సుతుఁ బ్రతికించు ప్రోడి యెవఁడు
తారకాసురుధాటిఁ దల్లడిల్లు జగంబుఁ
గావ, షణ్ముఖుఁ బుత్త్రుఁ గాంచు నెవఁడు
విశ్వనాథుండునా, నీశ్వరుండనఁగ, సా
ర్థకనామధేయవిభ్రాజి యెవఁడు
గీ॥ నీవుగాక; యేవంవిధానావదాన
మానితానూననానాఽఽగమప్రసిద్ధ
శుద్ధసత్యయశోవ్యాప్తిశోభిదశది
శాఽవకాశుఁ డెవ్వండు? దేవదేవ!! " ॥ 67

వ॥ అని, సబహుమానంబుగా, బహువిధంబులన్ దన్ను స్తుతియించు
చున్న శ్రీమన్నారాయణదేవునకన్నిలగిరివుండిట్లని వాక్రుచ్చె

ఆ॥ "నీకు, నాకు భేదమే కొంచెమును లేదు; నీవె నేను; నేనె నీవటన్న
సిద్ధసూక్తిఁ గొంత బుద్ధి నూహింపుమా! శ్రీరమాధినాథ! సాధుబోధ!!

ఆ॥ వేఱు లేదు మనకు గోరంతయేని; దే
హములు వేఱుగాని-యాత్మయొకఁడె
నీకు భక్తులైన, నాకును భక్తులౌ
దురన, నీవె యెఱుఁగుదువు మురారి! ॥ 70

ఆ॥ ఇట్టులేల వచ్చె తెలియఁగింపు; నీకోర్కె-
నేమి? లోకములకు హింసలాచ
రించు దుష్టదైత్యులెందరైనఁ ద్రుంచుఁద
నానఁ బెల్లురేఁగినారో! చెప్పుమ !! ॥ 71

ఆ॥ సురలకయిన, నవనిసురలకునయిన ను
గుమతులెవరుగాని, కుచ్ఛితమునఁ
జెట్టసేయు సాహసిత్వంబుఁ జూపిరో!
తెల్పి తేని, వాండ్రఁ దెంత్రమణఁతు ॥ 72

ఆ॥ ఏమి కారణంబు? దాము బృందారకుల్
తేరుతొంటియట్లు; పేదలైన
దీనభావమునకు, హీనభావమునకుఁ
గారణంబదేమి? శ్రీరమేశ ! ॥ 73

ఆ॥ వజ్రిపాణి హీనభావుండుగాఁ దోఁచు
నేల? దుఃఖితుండువోలెఁ దోఁచు
వహ్ని యాజ్యగంధవాసితుండుగ లేఁడ
దేల నిష్ప్రభత్వమితఁడు పూనె? ॥ 74

ఆ॥ తెలుపుమితఁడు యముఁడె? దీప్తదండాభిమం
డితుఁడిదేల మున్ను నిష్ప్రతాపుఁ
డట్లు తోఁచు? మొగమునట్టె దిగాలుగా
వంచియుండె; నేల వ్రాయుచుండె॥ 75

ఆ॥ ధనము నొద్దవోవ, వనటఁగుందెడుగేస్తు
వోలెవరుణుఁడిపుడుమునుపటివలె
లేఁడదేల? చెపుమ ! శ్రీరమానాయకా !
రత్నరాసులంజెలంగువాఁడు ॥ 76

ఆ॥ నిధులుతొమ్మిదెంటికధిపుఁడయ్యును, బరా
ధీనుఁడైనవాని తెఱఁగుఁదోఁపఁ
జేయుచుండెయక్షనాయకుండిదియేమి?
కలతెఱంగుఁజెప్పు; గరుడగమన! [కమలనయన!] ॥ 77

ఆ॥ దేవతల్ సమస్తదివ్యాస్త్రవేత్తలే
వీరలెల్లనిఁదుఁజేరిరేల?
విన్నఁదనముఁజూడ, విషమదశామగ్ను
లైనకేతెఁదోఁచు; నౌన? కాద? ॥ ” 78

వ॥ అని, యడిగినత్రిణయనునకుంగమలనయనుండిట్లుచెప్పందొడంగె

కం॥ “ఈవృత్తాంతంబద్భుత
మూ; వృషభధ్వజ! యొకండు; హరిహయముఖులౌ
దేవళ్లై “గుండెగాల” మ
నావిర్భూతాభిమానిఁ, యాతువరుఁడిలన్ ॥ 80

కం॥ సురకంటకాఖ్యమానిచ
పురవరమునన ధివసించి, మునివృత్తినతం
డరవిందసూతి, బ్రహ్మను
గుఱిచిమహానిష్ఠఁదపము, ఘోరమొనర్చెన్ ॥ 81

కం॥ తత్ఫలితంబుగ, నోప
శ్యతాప్ఫల! విరించి, వరములసురకొసఁగెఁదా
నుత్పల్లహృచ్ఛబ్జుంఠయి
యుత్ఫణఫణికయ్యెనది, పయోదాసమటుల్ ॥ 82

కం॥ తద్గర్వంబున, నా కరి
వ్యాఘ్రగణనాయకుఁడు, జాతివైరంబున, భూ
భృద్గృహమేధీ! బహుదివి
షద్గణములరోయుఁజూవె! సహ్యేతరుఁడై॥ 83

ఆ॥ బ్రహ్మకారణంబువానియాఢ్యత్వంబు
నకుగిరీశ! యమరులకు నసాధ్యుఁ
డయ్యెరక్కసుండజయ్యుండు; దుర్వృత్తి
మాచరించుఁడన్నిశాచరుఁడు॥ 84

ఆ॥ అసుర బలిమి మెసవునకట! యాగచ్ఛాగ
ములను; శుద్ధసత్త్వమూర్తులైన
వృద్ధమునుల, యోగిబృందంబుఁబీడించు;
నౌర! తెలియువానిదైన తెగువ॥ 85

ఆ॥ అంత, స్వర్గివర్గమబ్జోద్భవుంజేరి,
సెప్పుకొనిరియసురచెట్టలెల్ల;
మాఱుసేయలేక, మత్సమీపమునకు
వారిఁదెచ్చె ధాత పార్వతీశ!॥ 86

ఆ॥ గిరిశ! దివిజులసుర గెలువనేరరు లోక
పాలురేనుఁజాలవాని గెల్వ;
దాపురంబదేల? మోపురారి! సురారి
సంహారింపనీవ సాలుదయ్యా!॥ 87

ఆ॥ జానుమంతు, దైత్యుఁజంపక, లేదు క్షే
మంబులోకములకుమాసహాయ!
హాయిఁగూర్పుమయ్యా! యంతకాంతక! యంత
మొందఁజేయుమసుర యుక్కివుండు।" 88

వ॥ అని, యిట్లు విషమంబయిన విషయంబును విషమనయనుండు
విశదంబుఁగావించి, హరివిరమించినంత విరించి యంజలించి, లేచి
సధ్రీచీనంబుగాఁ గుక్షేత్రజ్ఞజానికిట్లని విన్నవించె॥ 89

సీ॥ "దేవదేవ! త్రికాలజ్ఞ! త్రిపురదహన!
త్రిణయన! మురారి తెల్పినరీతి, దాను
మంతలుఁడసాధ్యచండిమోద్దండవిక్ర
మక్రముఁడజయ్యుఁడెట్లు తన్మసమణంతొ? 90

ఆ॥ "వరముఁ గొసఁగి వానియురుతపోవహ్ని ని
ర్దగ్ధములనుగాక, రక్షణంబొ
నర్పు లోకముఁల"ననంగ, బృందారకుల్,
మానులిష్టసిద్ధి లేనొసఁగితి॥ 91

ఆ॥ ఇంతకంటెమార్గమేదియు లేక, చే
యంగరాని నేరమైన జేసి,
"యసురయుదుటుకొంతయణఁగుఁగా"కనుచుఁ, దా
త్కాలికమగు మేలుఁదలఁచినాఁడ॥ 92

ఉ॥ శ్రీహరిఁ యిప్పుడన్నటులె సేయుచుదారుణమార్గణంబుఁ, దా
నోహరిసాహరిం జెలఁగుచుండు; సురారిసురాళిఁదోలి, ఘో
ర హవమందమందగతినద్దుదలంపక, నిత్యనూతనో
త్సాహమునంబ్రవర్తిలు; వశంవదులిప్పుడు వానికందఱున్॥ 93

చం॥ గిరితనయామనఃప్రియ! శిఖిద్విపరాజదినేశదృక్త్రియా!
పరమకృపాZZలవాల! విభవప్రదదివ్యశివత్వసంస్థులా!!
చరణసరోరుహాశ్రితులసద్యఉపాత్తమహత్త్వపుణ్యభా
గ్వరులనొనర్పునేర్పు మెయిఁగష్టములన్ దొలఁగించి శంకరా!"94

మ॥ అని, ప్రార్థించి, పితామహుండుదనదానవాజ్యకారుణ్యమున్
గను జేసెంగ జగత్త్రిరాత్మయుపరత్వప్రిష్ఠబంహిష్ఠసా
ధనమున్గా, ధనదార్థ్యయప్రివణుడు ద్యల్లీల, లోలాత్మతన్
జనునగ్లేచినటీరువిస్పృష్టులుతాప్రహంబనహ్యంబుగన్॥ 95

వ॥ అంత, నిందు ్రిండును, బ్రహ్మవాక్యంబునను వదించుచు, నాజాను మంఘలుకరోద్యోగంబును, దత్పూర్వవృత్తాంతంబును, బున రుక్తంబుగావించె; నంత, నంతకాంతకుండు చండోద్దండక్రోధో ద్రేకంబున సంరక్తనేత్రాంతకాంతికల్పితాకాండసాంధ్యరాగా కాంతదిగంతుండును, సద్యస్సంభూతప్రభూత స్థూలముక్తా ఫలోపమానస్వేదబిందూపబృంహితగాత్రుండునయ్యె; నంత ॥

మ॥ ఫణికేయూరవిభూషితంబు, దనుజప్రభ్రష్టబృందారబృం
దనితాంతప్రభుతాతదీయవిభవోద్యన్నిత్యశోభాపునః
పునరంతస్స్మరణకుధ్రాదారుణిత, ముదుర్భూతప్రభూతశ్రీమాం
బునికాయూనవ్రతమొప్పశంకరుభుజంబున్ జూడనుద్దండమై 97

ఆ॥ వ్యాఘ్రచర్మధారి, శీఘ్రంబుగస్వబాహు
దండమందుగానొకండుపుట్టె
నట్లొనర్చెరాక్షసాంతకుఁ, గృష్ణాజి
నోపవీతకుండలోపశోభి॥ 98

ఆ॥ కోటిసూర్యతేజుఁ, గ్రోధదూను, జితేంద్రి
యునిఁ, దిప్రుఁడ్రశధారి, నున్నతాంగుఁ,
గాంచనాభు, శాంతుఁ, బంచాక్షరీపరా
యణుని, సింహాసంహానునిఁ, బవిత్రు। 99

ఆ॥ విపులవక్షుఁ, జంద్రబింబాస్యు, శష్కులీ
శ్రీశ్రవున్, యుగోరువృత్తదోర్యు
గాఢ్యుఁ, గంబుకంఠహారి, శ్రీరుద్రాక్ష
మాలికాభిశోభి[సనాథు], మానినాథు॥ 100

ఆ॥ పారిజ్యసనస్మహత్త్వ, రాజ్ఞరిలక్షణో
పేతుసృష్టిఁజేసెభూతనాథుఁ;
డతని జూచిమునులు, నమరులుఁ, దత్రిత్వ
లకులకుతుకమందిరద్భుతంబు॥ 101

వ॥ అని, తెలిపిన, విని, యవ్వాలివృత్తాంతంబెట్టిదని, పీ ణాహూనివాణీ
జానినడుగు-ఎయును॥ 102

ఆ॥ సిరిమగండు, నలువ, సురపతి, క్రతుభుజుల్
గొలువఁగొలువుఁదీరి, చెలువమమరు
గరిమనీకెతెగుర; కపిలమల్లేశ! గౌ
రీశ! నరసపురవరేశ!! యీశ!॥ 103

ఇది, ఆంధ్రీకృతము క్తీశ్వరోపాఖ్యానంబునందు,
మాక్తికమాన్యావిర్భావమను
పంచమాధ్యాయము.

శ్రీరస్తు

# ఆంధ్రకృతము క్తీశ్వరోపాఖ్యానము

## షష్ఠాధ్యాయము

ఆ॥ సిరులువొలయునోడలగరగరిబూదిపూఁ
తయును, జడఁ నమరతటిని, సామి
దేహమఁదుభూభృదీహితఫలము, శ్రీ
గౌరిపలయుదేవ! కపిలమల్ల!! 1

ఆ॥ అవధరింపుమ వలిదగుకథ;సురముని
నలువకనియె "నిట్లు బలియుఁడయిన
ముక్తహాని చరితమును వినంగను నాకుఁ
గౌతుకంబు వృద్ధిఁగాంచు దేవ!॥ 2

ఆ॥ విస్తరింపు తత్ప్రశస్తిని నాకు; ము
క్తర్షి యేమి సేసె? హర్షమునను;
దత్ప్రభావ మద్భుతంబు; మహాదేవు
మహిమ నాకుఁ గూర్చె బహుకుతుకము"॥ 3

వ॥ అని, సవినయంబుగా, సకుతుకంబుగాఁ బ్రతివచనంబుఁ గోరి యడి
గిన నిజసుతునకు శతధృతి యిట్లనియె:॥ 4

ఆ॥ "వినుము; వత్స! ముక్తముని చరిత్రము మహా
ద్భుతము, మహితమహిమ యుతము; సతము
హరుని బాహునందమందుద్భవించి, ము
క్తర్షి మొక్కె శివుసకమరులు విన ॥ 5

ఆ॥ అని మొవినయవినమితాననుండయి, యుమా
ప్రియునకధిక హార్ద హృదయునకును;
మృత్యుమృత్యునకును, మేఘగంభీరభా
షణుఁడు, ముక్తహాని, సాధుమూర్తి ॥ 6

కం॥ "త్రిణయన! త్రిపురాంతక! స
జ్జనహితమహితావదాన! శైలసుతాస
ద్గుణయధన! ప్రణవసదనా!
నినుఁ దెలియఁగ లేరు దేవ! నిర్జరులు, మునుల్ ॥ 7

ఆ॥ ఈ చరాచరంబదెల్ల నీయందె ని
ష్ఠి ప్తమూను; జీజగుప్తమైన
మఱ్ఱిమాడ్కి; దేవ! మఱియూర్ణనాభకా
నాయమట్లసృష్టి, నష్టి నూను ॥ 8

ఆ॥ స్యందమానమైనసరిదుత్కరము సము
ద్రిమునంజొచ్చునట్లుత్పత్తిలీన
మానుభూతజాతమంతయు; బ్రహ్మవి
ష్ణ్వాదులెల్లనీదునంశభవులె ॥ 9

ఆ॥ సర్గరక్షణములు, సంహారమునొనర్తు
వీవెయష్టమూర్తులెసంగ, దేవ!
నీవులేక, యేవిలేవ; చరాచరా
వళులు, సర్వలోకములునులేవ ॥ 10

ఆ॥ కపిలివెపలునలలవడువున, దినకరు
కిరణములయములకరణి, జనులు
నీదుదేహమందునీలకంధర! సము
త్పాదితులనుగారె? పార్వతీశ ! ॥ 11

ఆ॥ ఏషలంబుఁగోరి, యీభూతజాతంబు
సృష్టిజేయుచుందువష్టమూర్తి !
నీవెగాక, యెఱుఁగరేవారుఁగాని, స
ర్వజ్ఞసంజ్ఞనీకెవఱలుఁగాన ॥ 12

ఆ॥ సర్వభూతములకు సార్వకాలికముఁ, గా
రోప్యపకారకంబు, యుక్తియుక్త
మైనపజ్ఞత్తుఁనైనఁ, దదూర్ఖాతముల్
హుంకరించుదాన, శంకలేక ॥ 13

ఆ॥ దేవ! త్వత్ప్రసన్నదృక్ప్రసారములేక
కదలఁజాలదయ్య! గడ్డిపోచ
యైన; నీవొసంగుదఖిలజీవులకుఁ దే
జంబు, ధృతియు, బలము శైలచాప! ॥ 14

ఆ॥ ఆటకాఁడు బొమ్మలాడించునట్టులీ
వీ చరాచరాళినెల్లఁ గర్మ
సూత్రవశతనుంచి, సొరిదియాడింతువీ
వీశ! పాపనాశ! కృత్తివాస !! ॥ 15

ఆ॥ ఇప్పుడేలనన్ను సృష్టించితీశ! నే
నేమిసేయువాఁడ? వ్యోమకేశ !
బ్రహ్మవిష్ణులోకపాలాదులకవశ్య
మైనదాని, డేనినొనుదీర్ప?" ॥ 16

చం॥ అన, విని, శంకరుండు కరుణాంతరుఁడందఱు నాలకింప, ని
ట్లనియె "మహానుభావుఁడు గుణాఢ్యుఁడు ముక్తమహర్షిచంద్రుఁ డ
త్యనుపమసత్త్వుఁడీతఁడు, మదాత్మజుఁ డార్యనృపాగ్రగణ్యుఁడీ
తనినిసహాయుఁగాఁబనిచెదన్ భవదాపదపాయకాంక్షినై ॥ 17

ఆ॥ ఇంద్రతుల్యవీర్యుఁడితఁడగ్ని తుల్యతే
జస్కుఁడనిలబలుఁడహస్కరప్ర
తాపుఁడద్రిధైర్యుఁడై, పాఱఁద్రోలుసా
మాత్యమిత్రపుత్త్ర, మాసవాదు ॥ 18

ఆ॥ తొంటియట్లమీరలుంటకు, స్వర్గలుం
టాకు, దైత్యునొంచుటకును ముక్త
హానివలఁతియెంతయేనియుఁజూండి! యీ
నాదుమాటకల్లగాదుసుండి!" ॥ 19

ఆ॥ అనఁగ, ననఘమూర్తి, యూర్యాసహాయుఁడా
దిత్యులున్, మహర్షులత్యుదాత్త
ఫణితిఁ బ్రణతిఁ జేసి, ప్రణుతియుఁ గావించి
యుంచుకంతచింత యెఱుఁగకుండిరి ॥ 20

వ॥ ఇటులనిటలనయనునియ సునయవచనములకమరవరులు హృదయములనుగుదురుపఱచుకొని, తమతమ నెలవులకుఁ జనిరి. పిదప, హిమగిరిదుహితృపరిబృంహితుండును, గరతలపరిమృదితపృథుతర నిజభుజజనితమునివరకరతలుఁడగుచు, నతనికిట్లనియె॥ 21

ఉ॥ "ఓయి, కుమార! నీదగుమృదూక్తిసుధాప్రవదుత్తమస్తుతి
ప్రాయశుభంయుభావపరిపాకమనోహరవాక్యసైపుణిన్
నాయెదతుష్టి జెందెఁ, గరుణావరలాంఛనమున్, బహూకృతిం
జేయఁదలంచి, యిచ్చెద; నజేయపరాక్రమ! స్వీకరింపుమా!"

ఆ॥ మదినిగనకమయంబును
మణిమయంబునయిన మకుటమొకటి
కోటిసూర్యకాంతి, పాటవాభేద్యమౌ
కవచమొకటియొసఁగె శివుఁడతనికి ॥ 23

ఆ॥ మఱియుఁ, బాశుపతముఁ, గరుణించె నానాస్త్ర
శస్త్రముల్, భుజంగరిసంభవునకు
భద్రదాత్రినిచ్చె రుద్రియగాయత్రి
మహాశక్తికాఖ్యమునికుమారప్రియుండు ॥ 24

ఆ॥ ఇటులొసంగి, యస్మి, నిటలాక్షుఁడనియె ని
ట్లో కుమార! నాదువాక్కు వినుము;
త్రిభువనావనార్థసృష్టుండవీవు నా
చేత; నీవు దానిఁ జేయవలయు ॥ 25

ఆ॥ ఈయభేద్యకవచ, మీకిరీటంబు, నీ
పాశుపతమహాస్త్ర మీశుభప్ర
దాయియైన రుద్రగాయత్రిమంత్రంబొ
సంగినాఁడనీకు సాయపడఁగ ॥ 26

ఆ॥ జానుమంతుఁడనెడుదానవుండొకఁడుగ్ర
తపమొనర్చి, యవ్విధాతవల్ల
నన్యదుర్లభంబులౌ వరంబులఁగాంచి
తీవరించెఁ గండకావరమున ॥ 27

ఆ॥ ఆవరించివానినా తేజమెల్లఁ
నెండవోలె ర్నిరీక్ష్యమై, దు
రంతచింతఁగూర్చు సంతాపకారియై
లోకములకుపాత్రశోకములకు ॥ 28

ఆ॥ యాగకర్తలకు, ననాగసులగుయోగు
లకు, మునీంద్రవర్యులకు, నమర్త్య
లకును, భూసురేంద్రులకును, స్త్రీలకు, గోపు
లకునుగీడొనర్చురక్కసుండు ॥ 29

ఆ॥ తోఁకచుక్కవోలె, లోకములకువాఁడ
రిష్టదాయి యూచుఁ, గష్టములకు
గ్రించు, రక్కసుండుకించిత్కృపావృష్టి
లేక, తెచ్చి పెట్టుఁగ్లేశకారి ॥ 30

ఆ॥ కూంశ, రక్కసుండుక్రూరత్వమునయజ్ఞ
నాశమాచరింప, నాశుమార్గ
గామివౌచు, రుద్రగాయత్రిపుష్టపా
శుపతశక్తివానినపనయింపు ॥ 31

ఆ॥ యూగరక్షణంబునాచరించుపరస
హస్రసంఖ్యనెప్పుడస్రపాయి
సైన్యముల్ భజించుజానుమండలు; పొంత
వఘ్నుడపన్యశస్త్రవర్గములకు ॥ 32

ఆ॥ భద్రదాత్రిసుమ్మ! రుద్రగాయత్రి త
జ్జపము సల్పు వారి కెప్పుడు; దీని
సాటిమంత్ర మేది? చాటిచెప్పెద వేద
టంచు, నుద్భుజుండనై; కుమార ! ॥ 33

ఆ॥ భద్రదాత్రిపుత్ర ! రుద్రగాయత్రి; స
ర్వార్థసాధనము; జయప్రదంబు
సత్యమూర్ధ్వబాహుశాఖుండనై, చెప్పఁ
గలను; జయముహస్తగతముకీన ॥ 34

ఆ॥ ఎపుడు భక్తి దీనిజపియించునెవ్వఁ, డా
తనికిమ్రొక్కు దేవతాగణంబు
సంభవించుఁజూవె, సంభద్రమతనికి
సర్వతోముఖంబఖర్వశుభము ॥ 35

ఆ॥ ఓయి, మౌని! రుద్రగాయత్రి దీని జ
పించుచోటనుండి పెట్టివ్యాధు
లెల్లక్షామములును, గట్టిడిచోర బా
ధలు, పడీతులున్ ధుతంబులౌను ॥ 36

ఆ॥ వనమునన్, రణంబునను, శత్రుజలవహ్ని
మధ్యమునను గాని, మహార్తికర్షి !
భద్రదాత్రియౌనురుద్రగాయత్రిజం
జప్యమానమైనఁజాలుఁబుత్ర ! 37

ఆ|| త్రాణమిచ్చు గాత నిర్మలోరుమం
త్రంబు; గాన, దీనికింబవిత్రి
మై, యెసంగు సంజ్ఞ గాయత్రి నా; మంత్ర
మనఁగ, నర్థశేమొ, వినుము-పుత్త్రి ! || 38

ఆ|| మననశీలి "మంత" యనఁజనుఁ, డా త్రాణంబు
మంతకిచ్చుఁ; గాన, మంత్రమయ్యె
నిర్మలాత్మ! వేదనిశ్చప్రచంబు, దే
వర్షి భావితంబు, హర్షనంబు || 39

ఆ|| దాహనంబు సేయు; మోహనంబును జేయు
శోషణమును జేయు; ద్వేషి వర్గ
మునకు; బాశుపతము నవనంబొనర్చిన
మాత్రిఁ బాలుభీతిశత్రుసేన || 40

ఆ|| తొల్లి నాదు భక్తులుల్లసిల్లిరి గుహ్య
మై నదీసఁబొంది, మానవి! రుద్ర
దేవతాక మంత్రదివ్యశక్తి నిసర్వ
తో జయంబుఁ గాంచి కీడ గాన || 41

కం|| గుహ్యంబగు మంత్రంబిది
గుహ్యంబగునస్త్రమిదియు; గుహ్యతమంబుల్
గుహ్యతిగుహ్యములు వో
గుహ్యకములుకునునివియ గోచరములె యౌ || 42

వ|| నీవు నాకు భక్తుండవును, నా భుజాగ్రంబు నందుద్భూతుండవును గావున
నేనవీని నీకనుగ్రహించినాఁడ; నీవు వీనిం బరిగ్రహించిన వాఁడవై
యోజానుమంత్రలు, నా జ్ఞానచంత తాపిచండిలు, లీలా మాత్రంబునం
బాఱఁద్రోలి, శాలీనతా హీనతా ఉద్ధీనదీనతా శాలుభైనమా

నిలిపు పులకింపు గింపి, తెంపరి సైన, సొంపైన కీర్తి మల్లికామతల్లికా
మాలికాజాలికావాసనావాసితదశదిశాఽఽభోగశోభాయమాన
త్వంబు సంపాదింపుము॥ 43

ఆ॥ ఈవు గాక, వానినెవ్వారు సంహరిం
పంగనశక్తులౌ ధ్రుర గణితోరు
సత్త్వ! నీవు వాని, జానుమంతుఁ భుజం
పంగవలంతివయ్య! పరమ జయ్య!! ॥ 44

ఆ॥ ఇందువల్లనిన్ను సృష్టించినాఁడనే
నిదుగ్ర హ్మహేతువేమి లేదు
గాన, నీవుదైత్యు, జానుమంతుఁభుజం పఁ
జాలుదయ్య! లేదు సందియంబు ॥ 45

ఆ॥ సర్వలోకములను శ్లాఘ్యుం డవైతివ
నన్యసాధ్యమైనయట్టి కృత్య
మే; యశస్కరంబు నృగణంబునకు వత్స!
యోగమయ్య! వేగమే, కుమార! ॥ 46

ఆ॥ కాశికాశ్రమంబుఁ గాంచి, యచ్చటఁ గాశు
పతమహావ్రతంబు వత్స! సల్పు
మయ్య! యందుఁ గౌశికర్షి, బుత్విజునిఁగా
స్వీకరించి, మఖముఁ జేయుమయ్య! ॥ 47

ఆ॥ "విష్ణుమాయ" నాఁగ, విశ్వవిశ్రుత, "నిమి
షాఽఽఖ్య", దేవి, త్వత్సహాయధుర్యాను
జగములకును జనని, శక్తి, యౌవత్స! సం
కల్పసిద్ధి యౌనుగాక, నీకు! " ॥ 48

ఆ|| మహితమహిమ ముదముగను మౌనినాథుని వాక్య మా
లించి, మహా కార్తిక స్మరియించు వేడ్క
నిష్ఠపట్టి మ్రొక్కి, యీశునిఁ, గైలాస
వాసుఁ, గృత్తివాసు, భక్తిగల్గి || 49

ఆ|| "వామదేవ! నాదు వైరాగ్యము నుత్క్రమిం
పుము; పురారి! నీపరిభూతహార్ద
మును నుబోధము దాని; ననఘ! కర్తయుఁ, గార
యితయు నీవెగాన నెల్లకృతుల || 50

ఆ|| జానుమునుండిల యభిధానుఁడై పుగవాకు
భారమేమి? దానవచ్చు కీర్తి
యేమి? నియతివశము నైమరణింప, వాఁ
డెట్టి ఫలితముల్ ఘటిల్లె నాకు? || 51

ఆ|| స్వామి! నాదు వంశనామంబదేమి? కీ
ర్తిశులు దాన సంభవింతురో, భ
విష్యమన్న నియతవిహతంబు గాదె; గౌ
రీశ! భక్తపాపనాశ! యీశ!!" || 52

కం|| అని, పలికిన యామహా కార్తిక
ముని గని, త్రిపురాంతకుండు భూరికృపాస్ఫూ
ర్తి, నిటుల్ వచియింపఁ దొడం
గెను మృదుమధురంబుగాఁగ, నిశ్చపరిచమున్ || 53

కం|| "ఆర్యక్షత్రియ నామక
మార్యస్త్రాత్రిర్మహా మహావంశముగా
మర్యాదఁగాంచు; ధారం
ధుర్యంబుగఁ జేయు నుర్వి ధర్మాచనమున్ || 54

ఆ|| హా! క్షితీశ! వారు మద్బాహుజాతులౌ
కారణమునఁ జేసి, గౌరవంబుఁ
బడయఁగలరు పుడమి బాహుజక్షత్రియా
న్వయము, విస్మయాఢ్యమస్మయులయి|| 55

ఆ|| వేదపుణ్యమార్గచోదితంబగుధర్మ
మే, వినయమానమై, విశిష్టు
లైననీదువంశ్యులౌక్షత్రియులకెల్ల
గణనుగా ప్రమాణ బ్రకటితముగ|| 56

ఆ|| విశ్వవిశ్రుతులయి, వేదోక్తమార్గాను
యాయులౌచు, జాతమాదకర్మ
జాతమెల్ల వేదసరణియథాయోగ్య
కాలమాచరింపఁగలరువారు|| 57

ఆ|| జిహ్మవృత్తి లేక, బ్రాహ్మణదేవతల్
గాఁగలారు; ధర్మగాములౌచు;
శ్రితవిశిష్టమార్గసుప్రవిష్టులు, విశి
ష్టులుఁ జతుర్ద్యాన్ విశుద్ధులౌచు|| 58

ఆ|| వేదమార్గచరులు, వేదశాస్త్రైకని
రతులు, దేవపితృనిరంతరార్చ
నాదికములఁ, దర్పణాదికములఋషీ
శ్వరులఁ దన్పుచుందురిత్వత్తనూజులు || 59

ఆ|| హరిహరాహ్వయద్వయాద్వైతసద్భావు
లై, భవచ్ఛుభాన్వయప్రసిద్ధు
లెల్ల, సజ్జనుల్ సముల్లసద్ధర్మత
త్పరులు, మఱియు శ్లాఘ్యవర్తనులును || 60

ఆ॥ బ్రాహ్మణుండు నీదు వంశీయులకు దైవ
మౌను గాక! కర్మవర్ధమాను;
బ్రాహ్మణుండు లేక, ప్రతిపాదితంబైన
యద్దియెల్ల మౌక్తికాఖ్యమౌని!॥ 61

ఆ॥ వైదికముల కెల్ల వేదాక్షరాళికి
వక్తఁ బ్రేరకుండు బ్రాహ్మణుండు
నాఁడు సృష్టి బ్రాహ్మణక్షత్రియులు, వైశ్య
శూద్రులనఁగ, వారు క్షోణియందు॥ 62

ఆ॥ అగ్నిమౌను వైదికాచారమాధ్యత్రి
యంబునకును మౌక్తికాఖ్యమౌని!
శూద్ర వైశ్య బాహుజులు, బ్రాహ్మణులుత్త
రోత్తరుల్ వరీయులాత్తపుణ్య!!॥ 63

వ॥ బ్రాహ్మణునిఁ బూజించియే సుమీ — వైదికకృత్యంబులుపక్రమింపం
జెల్లు; విప్రులం దశ్లీల కీర్తనంబును, వాక్పారుష్యంబును
బ్రవర్తింపం బోలదు; పురోహితు నతిలంఘింపరాదు; త్రిశంకు
నకుం బ్లవత్వంబు ప్రాపించుట పురోహితు నతిక్రమించిన దోషంబు
చేతనే గదా! యశక్తుండైనను, రిక్తుండైనను, విద్యాశూన్యుండైనను,
గలితేంద్రియుండైనను, బ్రాహ్మణు నవమానింపరాదు.
బ్రాహ్మణుండు ప్రామాదికంబగు ధర్మభ్రంశంబునకుం బూను
కొన్నను, తద్ధర్మభ్రంశంబన్యులకు ద్ఘాటనీయంబుగాదు సుమీ
యట్టులుద్ఘాటించువాఁడు ధర్మచ్యుతుండుగాఁ గలండు॥ 64

ఆ॥ వత్స! ధర్మమిది త్వద్వంశ్యులకు సనా
తనము సూ! పురోహితప్రదిష్ట
మార్గమునను గృత్యవర్గంబు నాచరిం
చుట మహోమహా! విశుద్ధసత్త్వ!!॥ 65

వ॥ మఱియు, గర్భాధానంబును, సీమంతోన్నయనంబును, పుంస
[సు]వనంబును, సన్నప్రాశనంబును, చౌలంబును గాయత్రీగ్రహ
ణంబును, ప్రాజాపత్యసౌమ్యాగ్నేయ వైశ్వదేవాఖ్యంబులైన
వేదవ్రతంబులు నాల్గును స్నానంబు, నుద్వాహంబు, నౌర్ధ్వదైహి
కంబును ననునీ శాస్త్రీయసంస్కారంబులు శ్రుతిస్మృతి విహితంబులై,
త్ర్యద్వంశీయుల కెల్లరకును క్షత్త్రియులకున్ యుక్త ప్రకారంబున నే
యాచరణీయంబులౌను వైదికకృత్యంబులు ఋషిగోత్రాంక
పూర్వకంబుగాఁ జేయందగు గోత్రకర్తలైన పరాశరుండును
శాండిల్యుండును గౌతముండును గౌండిన్యుండును గుత్సుండును
భార్గవాదుదులును ద్వత్కులంబునకుం బురోహితులాదురు 66

ఆ॥ క్షత్త్రమెల్లఁ దొల్లి చంద్రసూర్యసముద్భ
వంబు; ధర్మరక్షణంబు; తత్ప్ర
వృత్తి యుర్వియల్లె వృథివీద్భుజోద్భూత
మార్యసంజ్ఞ, క్షత్త్రియానుమాని!॥ 67

ఆ॥ సాధుశీల! యద్విజైకధర్మాచారసం
బద్ధమూచు, ధర్మబద్ధమూచు
వటలు మండునుర్విఁ దద్వంశమూన్నత్య
మొందునెల్లకాలమో మహాత్మ!॥ 68

ఆ॥ శస్త్రధారణంబు, సజ్జనావనదుర్జ
నప్రణాశవితరణములు, యజన
దానధర్మములు, శ్రుతంబుఁ దద్వంశమం
దెప్డు నిల్చునో మునీంద్ర! నిజము॥ 69

ఆ॥ ఎపుడుగలుగకుండునృపులకు మానసం
త్యాగభైక్ష్యజీవనంబులుర్వి
శౌర్యమునను, బాహువీర్యంబునను క్షత్త్రి
యులకు జీవనంబు గలుగుఁగాత!॥ 70

ఆ॥ శిల్పములను, వివిధచిత్రంబులరచించి,
ధరణిధన్యులమెప్పుఁదద్దఁగాంచి,
గౌరవార్హులై, యపారసౌఖ్యంబులొం
దుదురు; నిజము, పెక్కనుడువ నేల?॥ 71

ఆ॥ మత్ప్రసాదజనితముత్ప్రకర్షాఢ్యమా
ర్యావనీశ్వరాన్వయంబు, సర్వ
రాజలోకముందిరస్కరించుమహత్త్వ;
ముత్తమోత్తమంబు, సూపపనము॥ 72

ఆ॥ సూర్యచంద్రవంశ్యసుక్షత్త్రియులుసైత
మాత్మరాజ్యదూరులై, కలిప్ర
భావమునను, ధర్మబాహ్యులై, యూసఁబే
రునునశింపనుండిరనుటయెల్లు?॥ 73

ఆ॥ ద్విజ ద్విదూర! యీభవద్వంశ్యులుపురోహి
తానుయాయులై, మహానుభావు
లౌచు, జాతకర్మలందు నిష్ఠితులై, వి
పత్తులందునైనఁబాయరెందు॥ 74

ఆ॥ వేదవిహితకర్మలాదటఁజేయుచు,
వఱలుచుందురిదియ వరమునీశ!
చిత్రకర్మలందు, శిల్పంబులందుఁద్వ
ద్వంశ్యులధికకృతులఁ సదా,జగాన॥ 75

ఆ॥ పేరుఁగలరువారుపూర్వత్వమవరజా
తులను; యజ్ఞశాలికాంజపాల
కాద్యులూఖలాదియజ్ఞోపకరణంబు
లెల్లఁజేయుచున్,మనఁబ్రథితులు॥ 76

ఆ॥ వారొసర్చవిగ్రహారాధ్యులైకల్చి
దేవతల్ ప్రసన్నతావిభూతిఁ
బొల్తు, రెంతయేనిముక్తర్షి! త్వద్వంశ్యు
లెల్లమాత్రికాఖ్యులేయగుదురు॥ 77

ఆ॥ మద్భుజాగ్రజాగ్రదుద్భాతిఁగాంచి, యా
ర్యాఖ్యులైనక్షత్రియాన్వవాయు
లెల్లచిత్రకర్మనుల్లసిల్లుటఁజిత్ర
కారులాదురో వికారదూర!॥ 78

వ॥ వారెల్లరును, వేదోక్తాచారాదూరులును, బ్రాహ్మణభక్తి యుక్తులును, ఋషిగోత్రప్రవర్తకులును, సౌందర్యనిర్జితకందర్పులునై ప్రవర్తిల్లుదురు. నీవును, మత్ప్రసాదాసాదిత పాశుపతదీక్షాదక్షుం డవై పాశుపతాఖ్యంబైనదివ్యాస్త్రంబును బొంది, తన్మహాశక్తిం జేసి జానుమంతునంతమొందించి, జనస్థలకంబైనయశోవైభవంబున శ్లాఘనీయుండవౌదువు మనయిరువురసంవాదంబియ్యదియైహికా ముష్మికఫలప్రదంబు శ్రద్ధాళులై, దీని విన్నవారు సంభ్రమంబు నొంది, సర్వాభీష్టలాభంబులుగాంతురు. మద్వచనమ్ము నమ్ము మని, పరమశివుండానతిచ్చిన॥ 79

చం॥ నిజహృదయమ్మునందితరనిందితవర్తనుఁడైనమాత్రికా
ఖ్యజపిత్రముఖ్యుఁడెంతయును హర్షముఁబొంది, స్వకీయపుణ్యకం
శజులభవిష్యదభ్యుదయసంశ్రవణమ్మునభక్తిమైవృష
ధ్వజునకుఁబ్రాంజలిహృదయవర్తికొనర్చెనమస్సహస్రముల్॥ 80

వ॥ అని, తెలిపిన, విని మఱి యవ్వలివృత్తాంతంబెట్టిదని, వీణాపాణివాణీ జానినడుగుటయును. 81

ఆ॥ సిరులుమించుచేన సరులు పెన్గాలిచే
పరులు,బూదిపూఁతపటలునంగ
రాగమెన్న,బాఁగ నూగంగసిగదండ
కరమునమరునీకుఁ గపిలమల్ల!॥ 32

ఇది, ఆంధ్రీకృతముక్తీశ్వరోపాఖ్యానంబునందు, షణ్ముక్తికకుల
ధర్మనిరూపణంబనుషష్ఠాధ్యాయము.



శ్రీరస్తు

# ఆంధ్రీకృతముక్తీశ్వరోపాఖ్యానము

## సప్తమాధ్యాయము



ఆ॥ సిరులకునికియయిన నరసాపురమ్మున
వెలసి,లసితశుభవములనుబడసి,
బలసికొలుచుభక్తవరులకోర్కెలుదీర్చు
కపిలమల్ల! రిపునికాయభిల్ల!॥ 1

ఆ॥ అవధరింపుమనలిగుకథ సురముని
నలువకనియె"వినఁగఁగవలెఁతు; విస్త
రంబుగాఁగ,సర్వముంబురుషాసనా
సీన! యాకథావిశేషమేను॥ 2

కం॥ సెలవీయవె"యని, నారదుఁ
డెమినడుగఁ,బలుకఁదొడఁగెనీకీతినజుం
"ఫలఘుమహిమాన్వితంబును,
లలితంబిది; వినిన, బహుఫలప్రద"మనుచున్ 3

వ|| అత్తఱి నంగున నమ్ముక్కంటిం జూచి, యిట్లనియె—"దేవా!
తావకీనసేవకుండనైన నాకుం గర్తవ్యంబు సర్వంబు నాజ్ఞాపింపుము
సర్వకార్యంబులు, సర్వమార్గంబులును వ్యక్తసిద్ధిం గాంచువాఁడ;
నేను జక్కంజేయంగల దేవతాకార్యం బెద్దియో సెలవీయవే"
యని, యడిగిన, నతనికి మృడానీవల్లభుం డిట్లనియె|| 4

ఆ|| "ముక్తహాని! సర్వముక్తంబు కర్తవ్య
మీవు ధ్యానశక్తి భావితత్వ
మెల్ల నెఱిఁగితిప్పు డెల్ల మానీంద్రుల
తోఁ దపోవనస్థితుండ వౌచు||

ఆ|| వత్స! సత్యవాది, బ్రహ్మర్షి కౌశికుం
డాచరించినట్టు లాచరింపు
వ్రతము నిష్టపంబుఁ బాశుపతాభిధా
నంబు; దాననే జయంబు నీకు|| 6

ఆ|| నిగమనిగదితంబ యగు విధిఁ గౌశిక
మతము, నవ్వసిష్ఠమతముఁ దప్ప
కగ్నిహోత్రమందు హవ్యముల్ వేల్వ, నం
దుద్భవించు వత్స! యద్భుతముగ|| 7

ఆ|| తప్తకాంచనాభము స్వర్రత్నంబు స్యం
దనము మేటి తుల్యమన, నభేద్య
కవచ మొండు రత్నకాంతికాంతము, శ్వేత
వాహముల్, మనోజవంబు లార్య!|| 8

ఆ|| దృఢము ధనువు వాఁడిమి, దీర్ఘతగల్గి, య
క్షయ్యబాణతూణ సహస్రరాజ
నపాశుపతము, ననన్యాయుధంబులు
జయములును, శత్రుభయదము ఖను|| 9

ఆ॥ వత్స! స్వీకరించితత్త్వధనమ్ముల
నీవు జానుమంతుఁ జావమోది,
యుద్ధభూమిసర్వసిద్ధులన్ బొందెద
వరుగుమనఘ! కాశికాశ్రమంబు॥" 10

వ॥ అనిన, మృడునకు మునిపతి వినయవినమితుండయి, యిట్లనియె- "దేవా! నీవు రాజనకుండవు; కారణకారణుండవైననీవునన్నుం గాశికాశ్రమంబునకేగుపొమ్మెనకారణంబుగాఁ బల్కుదువని యెట్లు భావింతుఁ? దత్త్వానంబునకుమత్ప్రస్థానవిధానంబునుమత్కర్తవ్యంబునునాకుబోధింపవే"యని, మఱియు, "నాకుఁ బ్రభూ! భవత్సంకల్పమాత్రంబునం జేసియే, కృత్స్నంబైనయసాధ్యకృత్యంబుసాధ్యంబు గాదె! యట్టిచో, నగ్నికార్యంబేనేలతీర్పఁగావలయుఁ? దత్త్వజిజ్ఞాసువానుండనైన యీనాప్రజల్పితంబునకుమన్నించియజ్ఞుండనైన నన్ననుగృతార్థుంగాఁ జేయఁగారుణికత్వంబునం జేసి, నాకుంబ్రతివచనంబనుగ్రహింపవే"యని ప్రార్థించుటయునిటలనయనుండును క్షణంబుధ్యాననిశ్చలుండైముక్తమునీంద్రునితోసవిమర్శంబుగా నిట్లనియె॥ 11

ఆ॥ "వత్స! తెల్పువాఁడఁదత్సర్వమును గోప్య
మైనదానితత్త్వమేననుగ్ర
హింపసర్వసిద్ధులిట్టిసంకల్పమా
త్రానఁగల్గు; సత్యమైనఁ గాని॥ 12

ఆ॥ కల్పనమ్మెనర్తుఁగార్యకారణబంధ
మేన; దాహశక్తియెల్లనగ్ని
యందు; వృక్షజన్మమల్లబీజమునన్; క్షు
ధాఽపనుత్తియన్నమందుఁ; దూప॥ 13

ఆ॥ అడఁగునుదకమునను; బుడుతలుబుడమిపైఁ
బడుదురయ్య! యన్య పరిభవకరణ
మిలను ;బంటవానవలనఁ; గాలులఁజెట్టుల
ల్లాడుచుండుఁ; గారణాళియిట్లె ॥ 14

ఆ॥ సర్వకార్యములకుసంకల్పమన్నది
యమ్ముముఖ్యకారణమ్ము వత్స!
యదియుఁగానరాక, యంతయుఁ జేయు;నిం
తైనఁ, దెలియఁడహహా!యజ్ఞుఁడిద్ది॥ 15

ఆ॥ నీదుపుట్టువునకునాదుసంకల్పమే
కారణంబు వత్స! కాఁడొకండు;
శీఘ్రగామివై, విచిత్రంబుగాసాధు
కార్యమాచరించి, క్రమ్మరంగ॥ 16

ఆ॥ దితిజవరునిఁజంపదివ్యాస్త్రలాభంబు,
నొంది,నీవుత్రిజగులోహా యనఁగఁ
బొగడఁగనఁగ, నార్యభూమీశవంశక
ర్తృత్వలబ్ధభాగ్యరేఖఁగాంచు ॥ 17

ఆ॥ కాదు-కాదు; వత్స! నాదుబోధనకన్య
థాత్వసిద్ధిఁగోరుతలఁపుగాదు
"దుష్టశిక్షణంబు, శిష్టరక్షణము నె
జ్లానో" యంచు, నెంతునేనుమదిని ॥ 18

వ॥ నిన్నుత్పాదింపక, సేనసూజానుమంతలాభిధానయాతుధాను
సంహరించితినేని, లోకంబునంగీర్తినీకుంబ్రాపించు టెట్లు?మత్సం
కల్పసంభవంబైనచారిత్రంబునాకర్ణించి, యెల్లరుదుఃఖసంతా
రణంబుఁగాంచి, సంపత్సంతానంబునొందుదురు. సూక్ష్మశక్తిక

గల్గినమనోదృఢత్వశాలులకుంగాని, యీపరమరహస్యంబు గోచరంబుగాదు. మదాజ్ఞావర్తివైన మహర్షీ! నీవు శీఘ్రంబుగాం బోయి మదాదేశం బెఱ్ఱిఁగింపు" మనినవిని యామహాక్షేత్రకమౌనీశ్వరుండును

ఆ|| "ధన్యుఁ జేసె నన్నుఁ దేవ కాదేశ" మం
చతులనుతులొనసి లనాచరించి,
యరిగెఁ గొండ్రుకాశ్రి) భోగమాశ్రమం
బనసుస్వశక్తి, ముక్తమౌని|| 20

శా|| ఏలాజాతిలవంగపూగమరిచాహింతాలసౌదుంబర
శ్రీతాలిత్యముహుర్విజృంభిమధులిడ్బృందోరుగానంబు, తాం
బూలీపాటలి నాగకేసరలసత్పున్నాగసౌభాగ్యలీ
లాలాస్వాద్యము, నిత్యశోభనము, ఖేలత్ఖేచరీసేవ్యమున్|| 21

శా|| శుంభన్మత్తమతంగజప్రకటితస్ఫూర్జత్సముత్సాహమున్,
జృంభారంభవిశాలసృక్వయుగసందృష్టోగ్రదంష్ట్రాంకురో
త్తుంభత్తీవ్రనఖాగ్రనిర్దళితవేదండోరుకుంభస్థలీ
గంభీరోత్పతనోద్యమానుభవదీక్షాదూరహార్యక్షమున్|| 22

మ|| పవమానప్లవమానమానితదరఝరాంభశ్ఛటాళితానోకహ
ప్రవిశుద్ధద్రుమమూలశోభితము, విభ్రాజన్నదీమాతృక
త్వవిశాలాఖిలసస్యశస్యధరణీధారేయతారాధితం
బవిశంకప్రతిభాప్రభావము, నపేతాతంకనిష్పంకమున్|| 23

మ|| సవధూమావళిసంవృతద్రుమమహాశాఖోపశాఖంబు, హా
నివరేణ్యాచరితాఖిలోపచరణాంతేవాసిపాపత్యమా
నవిగాయేత్రసామసంశ్రవణసానందాగతాగంతుకం
బవిసోఢాదిహావిర్విరుద్ధబహువస్వాభీలతాశూన్యమున్ 24

ఆ॥ సన్నికృష్టశోభము, భిన్నదర్భాంకుర
స్థానసంచరత్సుతర్ణకంబు;
నతిశతబ్రిసీసమాసీనమహారా
ష్ట్రపతపోవిశేషవిపులతరము ॥ 26

వ॥ మఱియును, గుశాసనపరిక్షిప్తసైకతాంతజలాశయంబును, దపస్య
ద్భర్తృశుశ్రూషాసజ్జనమ్రనిపురంధ్రికంబును, బశ్యజ్జనసర్వతో
ముఖహృచ్ఛాంతిసంధాయకంబునుబుణ్యాగణ్యమాహాత్మ్యంబును
నశుభశమనంబును, నగునయ్యాశ్రమంబును దర్శించి, యమ్మా
క్షికమహానీంద్రుండు వెండియుండనగౌంటవసిష్ఠవా దేవకౌండిన్య
శాండిల్యగాలవభృగుకశ్యపజైమినిభరద్వాజాత్రిధౌమ్యగమ్యక
రోమశకణ్వగౌతమకపిలసుదముశ్రుతకీర్తిశ్రుతిధరలోమశచ్యవన
భార్గవవిశ్వామిత్రశౌనకకలవింకపరాశరగార్గ్యమార్గణ్యాత్రేయ
శ్రీవత్సప్రభాతభరతచిత్రకపులస్త్యాగస్త్యమార్కండేయసుశ్రుతసుపర్ణ
మాగధిబకదాల్భ్యకుత్సనారద మాండవ్యపింగళకపిలశుభ్రకీర్తి
సుమందసుధర్మరోమముండకిందమప్రస్కణ్వఋశ్యశృంగపారా
శర్యవాలఖిల్యచిత్రాంగసేనజాబాలియాజ్ఞవల్క్యమండపావరజీవన
గోపకగోపగోకులాదులైనమహానీంద్రులు, వేదవేదాంగవేత్తలును
సత్కర్మకర్మఠులును, సత్యవ్రతపరాయణులును, బ్రహ్మజ్ఞులును
బ్రాహ్మణప్రజ్ఞులునుజపతపోనుష్ఠాననిష్ఠాగరిష్ఠులునై నవారెంద
ఱెందఱేసిబలసికొలువందదాశ్రమంబునశ్రమంబునంబ్రవేశించి॥

ఆ॥ యోగివర్యుఁ డంత, యాగదీక్షాదక్షుఁ
డోచు, విశ్వకర్మ నంతరంగ
మందుఁ దలఁచుకొన్న, నాతఁడు సాక్షాత్క
రించి, యంతవిన్నవించె నిట్లు ॥ 27

కం॥ "ఈ నఘ! ననునీవుదలఁచిన
క్షణమున భవదీయ దివ్యసన్నిధిఁ బె
ల్లున నిల్చినవాఁడ; మహా
మునివర! నీవల్ల లోకములు మేలొందున్ ॥ 28

కం॥ నిను నెఱుఁగుదు; మునుగౌరీ
శునిభుజమునఁ బొడమి, రక్కసుల నుఱుమాడం
గను, ఘనయశమును గనుదని,
యనిమిషులనుదనిపి, తనియుదని యు మహాత్మా! ॥ 29

ఆ॥ నిర్లయుఁ బుచేదినేఁ జేయఁగల్గున
కార్యమార్య' మౌనివర్య" యంచు
విశ్వకర్మ విన్నవింప, ముక్తర్షిరి యి
ట్లని యెనాపరమున నతనితోడ ॥ 30

వ॥ మహాభాగా! నీకు స్వాగతంబు. మేమీశానుశాసనంబునన్ దత్ప్రీతికై పాశుపతవ్రతంబాచరించుచున్నవారము. వ్రతానంతరంబు నందాత్మసిద్ధ్యర్థంబగు నొక్క జన్నంబొనర్పఁగావలయుం; గావున, నీవు గంగాస్రోతోంతరంబునం దొక్క యాగశాలను రమ్యాతిరమ్యంబైనదాని వేవేగ నిర్మించి, యీవలయు. వేద వేదాంగపారంగతులైన మునీంద్రులందీవ్రతదీక్షంబూర్తిగా నిర్వర్తింతు" మని విని యనంతరంబు । 31

మ॥ పరమార్థజ్ఞుఁడు, విశ్వకర్మయు, మహాప్రాజ్ఞుండు, స్వర్గాపగాం
తర పుణ్యస్థలి యాగశాలనుపనూత్నంబున్, మణిస్తంభగో
పుర వేదీశుభహేమభిత్తికలితంబున్, రత్నసంస్తీర్ణమం
దిరగాయత్మ తతోరణాన్వితము, విస్తీర్ణంబు నిర్మించినన్ ॥ 32

చం॥ అదియును, రత్నకంబళశతాంచితమున్, గమనీయపద్మరా
గదివసకల్పితాప్రతిమగాఢరుచిప్రతతిప్రకీర్ణశుం
భదమలహోమకుండలసమానము, ముక్తమహర్షిహర్ష సం
పదవధిగాఁగనంబడెశుభప్రదమై, సుమనఃప్రియంబునై ॥ 33

ఆ॥ అట్లువిశ్వకర్మ యాగమలదిగము ని
ర్మించి, ప్రశ్రయంబుమించి, యించు
వేడ్కనిట్లువిన్నవించెము క్తసూరికి
రంజలించి, భక్తినమనశిల్పి ॥ 34

ఆ॥ "యాగశాలలోన వేగఁబ్రవేశించి
యాచరింపుమార్య! యాగతంత్ర
మహహా! లోకపూతమగుఁగాదె, నీజన్మ!
నీదుకృత్యమల్లనీప్రవృత్తి ॥ 35

వ॥ మహామహా! నీవులోకక్షేమార్థంబత్యర్థప్రవృత్తుండవైనంతనే,
మాబోంట్లాచరించుచున్నయ్యేకార్యంబులుకుఁడ, లోకకళ్యాణభాజ
నంబులౌనుగాదె! మహాత్మా! యీమందిరంబునకీదిగూపర
ణంబు. ఇదికుడ్యంబు. ఇదిస్నానమంటపంబు. ఇదిప్రప. ఇది
హోమస్థానంబు. సర్వసంభారసంపత్సంపాదనశుభదారంభ
సంభాసమానంబై, యసమానంబై, యసమానంబైనదీనన్ బ్రవే
శింపు" మనుచు, సమర్పించిన, నతండునుదానినట్లస్వీకరించె;
నంత, విశ్వకర్మయు, "సార్యా! నేనింకనునేమిసేయంగలవాఁడ?
నాకానతీయవే" యనునాతనిచూతీయనివేడుకోలునువెనుదీయక
యాపూలిక మౌనీంద్రుండమ్మహాశిల్పికిట్లనియె- "నచార్యా!
యియ్యాగమందిరంబత్యంతమనోహారంబును, సర్వకృత్యాను
కూలంబునౌను; నీవిద్దానినర్ధక్షణమాత్రంబునునిర్మించియుచ్చుట

యనన్యసామాన్యంబు; నీకే యయ్యది సెల్లె. దీనిఁ జూచిన
యెవ్వనికేనిగాని నీయీనిర్మాణకర్మతత్త్వచమత్కారంబులు
మెచ్చఁ గూర్పకుండునే? యేనత్యంతసంతుష్టాంతరంగుండనై తి.
మెఱమెచ్చులకయి యిచ్చకంబుల బిచ్చికబుచ్చికంబ చరించితి నను
కొంటివో! వంట! యింక నాకేమియు వలదు. నీవింక యథేచ్ఛం జను"
మనిన, నమ్మహర్షి విశ్వకర్మ యిట్లనియె ॥ 36

మ॥ "మహితాత్మా! విను; లేదు లేశమయినన్, మత్కౌశలం బిందు ధూ
ర్వహమయ్యెన్ భవదాజ్ఞయున్, గిరివరాపత్యప్రభూత్థప్రభూ
తహితాపాదికటాక్షవీక్షణమహత్త్వప్రాప్తియున్, దీని ని
ర్వహణంబున్ బహుభంగులం గడపె శుంభచ్ఛంభుభక్త్యున్నతా!"

క॥ అని పలికి, విశ్వకర్మయు ననునికిఁ జేరెను; క్రతుపతాంవరుఁడా
తని పనివిని యజ్ఞీయంబును సంభారోత్కరంబు మునియుస్మరించెన్ ॥

క॥ తాఁ దలఁచిన తతియజ్ఞీయంబులు సంభారంబులంత, ముక్తక్షికీముం
గలరాశీభూతములై, కలిగించె ముదంబు పారికాంక్షికిమివురన్ ॥ 39

వ॥ అప్పు డప్పుడమి నచ్యుతనికరుణ కలిమి గోక్షీరధేనుదధ్యాజ్యాది
కంబులత్యధికంబులు, విమలతమంబులు, సుగంధగంధిలంబులునై
యూష్మోదంబుఁ గూర్పయవప్రియంగుశ్యామాకతిలసర్షపముద్గాది
ధాన్యంబులు పోగులై, మేలు సూప, బదరీపనసామ్రనారికేళ
ఖర్జూరకోవిదారాది బహువిధఫలంబు లతంపరంగబునంబువిడంబింపఁ
గుంకుమహరిద్రాచూర్ణాదికంబులైన శోభనద్రవ్యంబులు మంగళ
సూచకంబులు గాఁగ, సుక్స్రువాదిపాత్రంబులు నేతిపర్వంబులై
యొప్ప, రసాలనారికేళాదిపత్రగ్రీవాగ్రిత్పల్లవజాలంబు లుల్లం
బులకుల్లాసంబు పల్లవింపఁజేయ, నయ్యాగంబునఁ నియాగమంది
రంబు శోభాభాసమానంబై, యసమానంబై, సర్వసుపర్వసంతోష
సంధాయకంబయ్యె — నయ్యెడ ॥ 40

ఆ॥ "వామదేవ! తులితవామదేవ! మహాత్మ!
యారగింపు మీశ్వరాత్మములను
భక్ష్యభోజ్యలేహ్యపానీయచోష్యంబు
లైనయీమహాపదార్థములను॥ 50

ఆ॥ స్వచ్ఛమనస్సంతుష్టియు
క్షుచ్ఛాంతియకాదు; శంభుశుంభత్కారు
ణ్యచ్ఛవిచ్ఛాయైన
స్తుచ్ఛేత్సేకంబుగల్గుఁజూ! భక్షింపన్॥" 51

వ॥ అని, సవినయంబుగా విన్నవించుననుక్తనామకమౌనీంద్రునివాక్యం బులాకర్ణించి, యవ్వామదేవమౌనిమౌళియు, నాపదార్థంబు లన్నియునాపోవ, నాపోఽశనంబెత్తుబెయాలస్యంబుగా నాహ రించి, సంప్రీతచేతస్కుండై, యిట్లనియె॥ 52

కం॥ "మునికులతిలకా! సంతృ
ప్తినిజెందెమనంబు; నీవ త్రిభువనసంర
క్షణమొనరింపవలంతివి;
ఘనతవహించితివిసూ! జగంబులమిగులన్॥" 53

ఆ॥ అనఁగ, మౌనియుత్తరాపోఽశనంబిచ్చి,
వామదేవునకును బాణిపాద
శౌచవారిఁగూర్చి; స్వయముగానంతనా
చాంతుఁడైనఁజూచి, శాంతిశాలి॥ 54

వ॥ ఉన్నతాసనాసీనుంగావించి, కోమలంబులైనపూగఫలంబులతో మెత్తమెత్తని తెలనాకుమడుపులు, మంచిముత్తెంబులసన్నసున్నం బుఁగూర్చి, యందీయ; నాసందీసుఖోపవిష్టుండైనవామదేవుండు తాంబూలచర్వణంబుఁగావించి, యిష్టగోష్ఠీసల్లాపంబులన్ గొంత ప్రొద్దువుచ్చి; ముక్తర్షిచేననుజ్ఞాతుండై, యథేచ్ఛన్ జనియె॥ 55

మ॥ ఇటులా హానిసనంగ, మాక్షికేశ మహాక్షోండాద్రిదరశ్రీల,ది
క్తటులందెల్ల గువామదేవువసేఁ సన్ హోమాస్థమైవినన్, సా
జటివర్యుల్ సకుటుంబులై, జనఘనార్చ్యాశ్వంబుగావచ్చి, ము
చ్చటమీఱన్ గుములై భుజించిరియథేచ్ఛాభోగులై,యచ్చటన్,

ఆ॥ భక్తియుక్తుఁడౌచు, ముక్తిరినిత్యసం
తర్పణముల, దీప్త్యహార్వతులను
యతులనెందఱేనిఁగుతుకాన్వితులఁ జేయ,
సంతసించి, వారుసాగిరిచ్చ ॥ 57

ఉ॥ పోయినపోకలంగుశికపుత్రుని హాశ్రమసీమఁ జేరి, స
ద్ధేయులు, హానిపుంగవులు దీర్ఘసమంతతఆహుతికిద్రియల్,
గాయనభూమగానములు, " ఖాదత-మోదత! "యన్ వచోవిశే
షాయతకంఠమిశ్రచతురాగమపాఠములున్ వినంబడన్ ॥ 58

శా॥ గాధేయాశ్రమసీమ, హానులుసర్వమార్గశాంతివాయంగ, నెం
తే,భృత్యన్నతిఁబొంది;రంతట,మహాక్షోండుద్రిండు,గాధేయుఁడున్
గాథానాంతరుఁడాత్తదీక్షుఁడయి, యజ్ఞంబొండుగావించి,ని
ర్వైఘుండై, సహధర్మచారిణియుఁబార్శ్వాగ్రసీనమైయుండఁగన్

ఉ॥ ఐదవనాఁడుతాకుతలయంటుక, కౌశికుఁడున్,స్వపత్ని యు
య్యైదువరాలునూతనశుభాంబరముల్ ధరియించి, యర్ధచం
ద్రోదయశోభఁగేరునిటలోపరి, గంధయుతాక్షతాళితా
రాదరణీయదీక్షితనిహావళిఁదాల్చి, మనోముదంబునన్ ॥ 60

మ॥ మణిభిత్తిప్రచురంబు;స్వర్ణమయరమ్యస్తంభభా[సం]భాసురం
బును, రత్నోజ్జ్వలమంటపాంతరమునన్ ముగ్గుల్ విచిత్రంబులై,
కనరా, గోమయుగోముఖంబులను, రంగత్పంచవర్ణాంచితా
భినుతాష్టచ్ఛదపద్మశోభితము•సంప్రీతాత్ములై,[లా]యాల్మగల్

ఆ॥ హోమకుండములను నొప్పుగాఁ బశ్చిమ
భాగమందు రత్నభాసురంబు
హేమపీఠ మొండు శ్రీమీఱ నిల్పి నూ
త్నంబు శుభవస్త్ర మింపుఁ గూర్చె ॥ 62

ఆ॥ ఆస్తరించి, యుత్తరాగ్రంబుగాఁ గ, సా
ష్టాంగ మెఱఁగి వినుతు లాచరించి,
సంసదాస్థితర్షి జనముసకంత, వా
రానతీయఁ, గౌశికాఖ్యహాని॥ 63

ఆ॥ శుభ్రముఁ గోరుచుండి రుభయపార్శ్వస్థులై,
మునులు కాశ్యపాదిపుణ్యనాము;
లట్టి బ్రహ్మవాదు లంగీకరింపఁ బు
ణ్యాహ మాచరించె నామహర్షి ॥ 64

ఉ॥ అంత, నరుంధతీసతి, యహల్యయు వహ్నులఁ దెచ్చెఁ గౌశికుం
డెంతయు సంతసంబున గ్రహించి, తదగ్నులు ప్రజ్వలింపఁ, గుం
డాంతరభూమిఁ జేర్చె, సకుశాస్తరణాష్టదిగుజ్జ్వలంబుగాఁ
బొంతల స్రుగ్జుహూపజుహువుల్, స్రువముల్, ప్రణీధుల్ విరాజిలన్

వ॥ వసిష్ఠోపదిష్టవిధానంబు సంతుష్టిం గూర్చుచుండ, విశ్వామిత్రుండు
సపత్నీకుండై, యభీష్టసిద్ధిం గోరి, యగ్నిసంస్కారంబులు, గుండ
సంస్కారంబులుం గావించి, సంస్కృతకుండంబులందు శ్రోత్రి
యాగారానీతంబులైన సంస్కృతాగ్నులం బ్రతిష్ఠాపించి, ప్రాగు
త్తరాగ్రంబులుగా బర్హిః పరిస్తీర్ణంబులు చతుశ్చతుర్దర్భలం దీర్చి
యగ్న్యుత్తరంబునం బ్రాగంతంబుగాఁ బ్రణీధాన్యాజ్యచరుస్థాలీ
ప్రోక్షణీశరావదర్వీస్రువజుహూపజుహ్వాదులన్ ద్వంద్వంబులుగా
నాసాదించి, ప్రోక్షణాపోక్షణాభ్యుక్షణంబులు యథాసంభవం
బుగా నాచరించి, యుత్పవనాభిమంత్రణోత్తానీకరణపాత్రదాన
ప్రోక్షణసంస్కారణాపూరణాక్షతాధానకుశాచ్ఛాదనోత్తరస్థాపనం

బులుగావించి, వసిష్ఠుండు ఋత్విజుండుగా, నగ్నులకు దక్షిణంబున దర్భాసనాసీనుండైయుండ, నా బ్రహ్మర్షిని సర్వోపచారంబులం బూజించి, ప్రార్థించి, యంతట, నాజ్యవిలాపనసపవిత్రతత్పాత్రనిర్వపణోదగంగారాధిశ్రయణజ్వలత్తృణసందర్శనత్రిఃపర్యగ్నివిధానోదగుద్వాసనాంగారప్రత్యూహాజ్యోత్పవనస్రుగ్గ్రంథివిస్రంసనాప ఉపస్పర్శనకుశద్వయప్రహరణస్రువాద్యగ్నితాపనదర్భమార్జనపునస్తాపనపరిధిపరిధానాఘారసమిద్దానేధ్మయుధ్యపరిషేచనాలంకరణాజ్యభాగాగ్నిప్రతిష్ఠాఽభిధానాగ్నిముఖకృత్యంబులు నిర్వర్తించి, వసిష్ఠానుజ్ఞాతుండై, "మత్కృతపాపనివృత్తినిమిత్తంబుగాఁ బాశుపతహోమంబు నాచరించువాఁడ" నని, సంకల్పించి, దృఢమనస్కుండై. విశ్వామిత్రుండు సుస్వరాక్షరభాస్వరంబుగా రుద్రగాయత్రి నుచ్చరింపుచు, నిత్యశుద్ధుండై, వేదోక్తమార్గంబున హోమంబు సేయనుద్యోగించి, వెండియు॥ 66

కం॥ కుశికసుతుండును ముని సూ
ర్యశేయుఁడున్ శక్యమెత్తిరేఁగి, వక్కాణింపన్
బశుపతిభుజజనిముని ము
క్తశుభాఖ్యాశోభితుండు తద్దయు దీక్షన్॥ 67

ఆ॥ వ్రతము పాశుపతముఁ దతశుభఫలదాయి యాచరించె క్షేమమర్థిఁ గోరి
జానుమండలాభిధానదానవజైత్రికాంక్షఁ జేసి పారికాంక్షి మౌళి॥ 69

వ॥ అని, తెలిపిన వినియవ్వలి వృత్తాంతం బెట్టిదని విజ్ఞానహాని వాణీజాని నడుగుటయు॥ 69

కం॥ సిరులిరవొందెడు నరసాపురమున నివసించు భక్తముఖ్యులకున్ ని
త్యరమావైభవముల్ మోక్షరసానందమును గూర్చు కపిలమహేశా

ఇది, ఆంధ్రీకృతము క్షీరేశ్వరోపాఖ్యానంబునందుఁ బాశుపత
వ్రతారంభవర్ణనము నను సప్తమాధ్యాయము.

శ్రీరస్తు

# ఆంధ్రీకృతముక్తీశ్వరోపాఖ్యానము

## అష్టమాధ్యాయము

ఆ॥ సిరులుమించుమేనసరులుపెన్గాలిచే
పరులుబూదిపూఁతవఱలునంగ
రాగ; మెన్నఁగాఁగయాగంగసిగదంత
యమరలింగ! నీకవిమతభంగ!! 1

ఆ॥ అవధరింపు; మవలిదగుకథ; సురముని
నలువకనియె— "వినఁగవలఁతువిస్త
రంబుగాఁగసర్వమంబురుహాసనా
సీన! యీకథావిశేషమేను ॥ 2

మ॥ అమరారాతియెటులుంగనేయెటులుఁగఁడా? యమహాత్ముక్తికళిప్రసి
ద్ధమహాదీక్ష, దృఢవ్రతాచరణవృత్తాంతంబు, దీన్నిన్; మహా
త్మ్రం! మకోదిర్క్షుఁడు, జానుమండలుఁడు; శుంభద్రాక్షసానీకవి
క్రమముఖ్యమాక్తికహానియెట్లుపఁచె? విఘ్నధ్వంసమెట్లయ్యెనో!"

కం॥ అని, యడిగినతనతనయుని;
ముని, నారదుఁజూచి, తమ్మిపుట్టువుపొలివో
వని నరుసర "సవత్స"
మని, వినిచెఁగథావిధానమవ్వలిదిట్టుల్ ॥ 4

మ॥ మునిముఖ్యుండగుమాక్తికాఖ్యుడువ్రతంబుల్గౌశికక్ష్యాశ్రమం
బునమైత్రావరుణిప్రదిష్టపథవిస్ఫూర్తింబ్రవర్తింపఁజే
సినవృత్తాంతముజానుమండలునివిన్నాన్దుర్నిమిత్తాళి; వాఁ
డును, డిల్లంపడి, తేఁటి, పంపెఁజరుఁదోడ్తోశుక్రురప్పింపఁగన్॥

చం॥ పనివిని, దూతవేగఁజని, భార్గవునాశ్రమసీమఁజేరి, శు
క్రునిఁగని, మోకరిల్లి, సుముఖుండగుటన్ మదిగుర్తెఱింగి, యే
లినదొరకప్పుడేర్పడిన క్లేశము లేశముగామి, "సుంతదె
ల్పిన, నపచారమేమొ"యని, విన్నఁదనంబున మిన్నకుండినన్॥ 6

కం॥ శుచియుఁ, ద్రికాలజ్ఞుండును,
బ్రచురతరతపఃప్రభావభావితభావ
ప్రచయగమనుండు, శుక్రుం
డుచితఫణితి, దూతఁజూచి, యూఱ్కొనుకృపతోన్ ॥ 7

ఆ॥ సంభృతాస్థ, నాత్తగాంభీర్యుఁడై, శుక్రుఁ
డంత, మందహాససహారిణోర
ణీప్రశాంతసూక్తిదీప్రాస్యుఁడౌచుఁ, ద
త్ప్రేష్యుఁజూచి, పల్కెఁ బ్రీతినిట్లు ॥ 8

కం॥ "దైత్యకులాధ్యక్షుఁడు, సా
మాత్యాత్మజభృత్యమిత్రమండలబంధుం
డాత్యక్తపదీత్యోద్ధ
త్యాత్యయుఁడేకద! యనామయంబేకదరా! ॥ 9

చం॥ మముఁదలపోయునేమదిని? మాప్రియశిష్యుఁడు, జానుమండలుం
డమరవిరోధి, స్వీయవిభవాతిశయంబునఁ దానుమూఁడులో
కము లనజయ్యుఁడై, మెలఁగి, కామితముల్ మితముల్, హితంబులై
తమినడఁపంబ్రభుండు నిజధర్మము నిత్యము నిల్పుచుండునే?॥ 10

కం॥ నీవెఱుఁగుదునే; యేపనిమావల్ల నతండుదీర్ప మదినూహించెన్?
లేవేమియుఁగోర్కులు రక్షోవీరున"కనుడు వాఁడుగొంకుచు ననియెన్

ఆ॥ "బుద్ధి-బుద్ధి; సామి! బుద్ధులుస్వామివి; యేనెఱుంగ నేరనింతయైన
మిమ్ముఁదోడితేర మేలైనయానయొక్కటియుఁదక్క, తక్కుకతలెఱుంగ

కం॥ సేఁ వోసఁగినఁబోయెద; మి
మ్ములరమ్మనినాఁడుతేఁడు; మునివర! మీవా
పలుకులెఱిఁగింపఁగోరకను
సెలవిండువియేమొ, దేవ! చెచ్చెరనాకున్ ॥ ” 13

మ॥ అనినన్, దానవదేశికోత్తముఁడు, శుక్రాచార్యుఁడాదూతకి
ట్లనె-“నోరి,నను డెంచుచుంటిమనుమా దా మాటమీతేనితో
డనులెస్సన్ వినిపింపఁబో”మ్మనఁగ, వేడ్కన్ వాఁడునుఁబోయి,వి
న్ననుశుక్రానుమతంబు,దైత్యుఁడును,బ్రస్ఫీతాత్ముఁడయ్యెన్ గడున్॥

వ॥ అసురగురుండును,సచ్ఛాత్రుండై, జానుమండలునిరాజధానిన్
జేరె; నంత, నక్కడ ॥ 15

ఉ॥ అంతకుమున్న చారుఁడురహస్యములన్ గ్రహియించుపొంటె దే
వాంతకుపంపునంజనినఁగాతఁడువచ్చి, నిజాధినాథుది
వ్యాంతికసీమఁ జేరి, వినయంబునదోసిలియొగ్గినిల్వ, నా
గంతుకు,వానిఁజూచి, సురఘాతుకుఁ డిట్లనురాచఠీవితోన్॥ 16

వ॥ “ఓహోరి ! నీవెచ్చటెచ్చటంగ్రుమ్మరివచ్చితివి? నీవేమేమి
చోద్యంబులుచూచితివిరా ? నీచూచినచోటులనెవ్వరుంగాని,
మారాచఱికంబుమన్నింపక నన్నుమన్నినిగానెన్నని వారులేరుగా!
లోకపాలురైనంగాని, మాడాకకుంజీకాకుఁజెందుచుందురేకదా!
నరసురకిన్నరగరుడోరగయక్షరక్షోబృందంబండఱునందందతంద్రి
తులై, నక్తందివంబుమాయాజ్ఞమీఱక, మా కిష్టంబులైన
కార్యంబులేసూచరింపుచున్నవారే? ఎచ్చటెచ్చటివీరాధివీరులున్
వీరోచితాత్మకృత్యాపదానంబులుతదేకతానంబుగా, గానం
బులుసేయుఁబుచున్నవారోకో! ఇఁక, మునిముఖ్యులైనమునులు
మునుకలు-గినుకలువిడిచి, మనసులుకుదురుపఱచుకొని, తప

స్వమాసాదితంబైనమా వైభవంబుం బ్రస్తుతించుచుండుట మానరుగాక మానరుగా! సకలచరాచరసముదయంబులు మాశౌర్యవీర్య ప్రాభవవైభవాదికంబులనధికంబుగ నభినందించుచు, మాయను గ్రహంబునకుం బాత్రంబుగాఁ గోరుచుందురే? యేదీ నీనైపుణిం జూచెదముగాక; నీవారసివచ్చిన లోకవృత్తంబంతయు మావీనుల విందుసేయుమనపుడు, వఱవుఁడగువాఁడును, కృతాంజలియై, యిట్లనియె ॥ 17

ఉ॥ "భృత్యులు జీతబత్తెములు తేండ్లొసఁగన్, సుఖజీవులౌచుఁ దా
మత్యయమేమిలేక, కడుహాయిగనుందురు; వాండ్లు తేఁడ్లకున్
బ్రత్యయఘాతుకత్వమున వర్తిలరాదుగదా! "ప్రభుల్ భువిన్
నిత్యము చారచక్షులని" నీతివిదుల్ వచియింపరే? దొరా!॥ 18

మ॥ భవదాజ్ఞం "దలపూవుగా" నిలిపి, శుంభద్భక్తి, యుత్సాహమె
ప్ప, వడిన్ నేభువనత్రయాటనరహోవ్యాపారమే పారఁ, బో
యి, విశేషంబులు సూచివచ్చుటయు కా; దెన్నో రహస్యంబులుఁ
వివరింపంజగియున్నవన్నిటిని మన్నీఁడా! వినంగోరెదన్ ॥ 19

ఉ॥ అన్నియు విన్నవించెద, యథార్థములయ్యవి; నమ్ముఁడయ్య! నేఁ
జన్నప్రదేశముల్ భవదసాధ్యమహత్త్వమహత్త్వభాగ్యకీ
ర్త్యున్నతిగా, నపూర్వములు, నూర్జితహర్మ్యవిశాలముల్, ప్రభా
వోన్నయనప్రకాశములు నొప్పెము నివిస్త్రమతాఽఽర్థ్యముల్॥

ఉ॥ తైజససంజ్ఞికంబులును, దామససంజ్ఞికముల్ జగంబులే
నోజఁజరించి చూచితి; మహోన్నతముల్ గద, మీయశోమహ
శ్రీజయముల్ మనోనయనహృద్యములయ్యెఁ దలంప మీ ప్రజా
శ్రీజుషముల్, కటాక్షముల రేఖలు గోరుదురెల్లరున్ దొరా! 21

శా॥ ఉద్యోగించియు, దేవరక్షగనక, నేనొక్కమ్మడిందొందఁగన్
సద్యోజృంభణమాచరించుటదికర్జంబౌనొ, కాదోయటం
"చాద్యావాపృథివీసుహోఽంతరమునందామందులెందున్నఁదా
ముద్యత్సాహసులౌచుఁగీడ్పఱతు''రంచూహించి, నేనాఁగితిన్

చం॥ అదియటులుండనిమ్ము ప్రియుఁడా! యటుమీఁదటముక్తహాని''గా
భ్యుదయముఁగూర్చి దేవతల, మూఁడుజగంబుల, హా! ముఖ్యుల న్
జదురుఁబొగ్రితునే" యనుచు, శక్తినొకింతగడించుపొంటెఁదా
గదలెనుగౌశికాశ్రమముఁగాంచి, తదాజ్ఞహవంబొనర్పఁగన్॥
తదాజ్ఞను యజ్ఞకర్తగాన్॥ [పా]

శా॥ విశ్వామిత్రుఁడుహౌత్రికాఖ్యుఁగని, సంప్రీతిన్ శుభాశీర్వచ
శ్శశ్వద్దివ్యభవశోభితాస్యుఁడయి, దీక్షాయుక్తుఁగావించి, య
జ్ఞశ్రేయసభాజిఁజేయుటకునై సన్నాహముల్ దీర్పఁగా,
విశ్వాస్యంబనివార్యమౌ; దితిసుతున్ బీడించునంచాపఁడున్॥

ఉ॥ నెమ్మదినమ్మియుండిరి; గణింపరుమిమ్మొకిమీఁద! కౌశికుం
"గిమ్మని"కుడఁజేయుటయుఁ, గ్రించుఁదనమ్ము నమిఁచుహౌత్రికా
ఖ్యుమ్మునిముచ్చగ్రిచ్చుటయు, నొక్కతఱింబచరింపఁగావలెన్
జుమ్మి! వసిష్ఠుఁడొక్కఁడు ఘనుండఁట! యజ్ఞమునిర్వహింపఁగన్

కం॥ ఇదిపాశుపతవ్రతమఁట!
విదితమహాదీక్షయఁట' వేల్పులు, మునులున్
" గుదిబంపగా " దలంపరు;
సదువఁడఁజేయంగమనము, చాకుఁదురో! కో!॥ 32

కం॥ ఏమైనంగానిండో ధీమద్వర! హౌత్రికర్షి, దేవతలున్, దా
మాహానులుగుంపై, విశ్వామిత్రాశ్రమమునందుశ్లాఘింతరోగిన్

కం॥ ఆశ్లాఘా వాక్కులు నా కశ్లీలంబులు గదోఁచినంతన్, ధీస
త్త్వశ్లథతకు గుఱియయి మది సుశ్లోకా! యిప్పుడు నిన్నుఁ జూడన్ దేఱన్॥

వ॥ ఇదియ, నేఁబోయి నూచివచ్చిన వృత్తాంతంబు. దీనిన్ విన్న
మీఁదట దేవర చిత్తంబునకు వచ్చిన తెఱంగున మీఁదికర్జంబు నిర్ణయింపం
జను. ...యొక మనవి. నా యన్న మాటలయందో యన్న!
యే దేసికానిడి మీ వీనుఁగన్ జేరినల్లైన, దానిం గానినుండా నిహోసి భావంబు
గాని నాఁడగా భావింపఁగాఁడని మాటిమాటికి తెంక విన్నవించు
కొనుచున్న వాఁడనని" చెప్పి, యూరకుండె; నంత నజ్ఞానమంతుండును
జ్ఞానవంతుండును గాఁడు గావున; దుష్క్రోధాంధకారంబునన్ గన్నుఁ బొ
చిమ్మ చీఁకట్లు గ్రమ్మ దంష్ట్రాతాడితోరగంబు తెఱంగున, నున్న చోట
నున్నట్టుండి, యువ్వెత్తుగ లేచి, పండ్లు పటపటుగాఁ గొఱుకుచు,
నుద్రిక్తుండును, నుత్సిక్తుండును నై, వెండియు॥ 35

మ॥ అరరే! మహాక్షత్రకమానియెవ్వఁడుర? క్రవ్యాదోద్యధులారా! కళే
బరమున్ వానిది ప్రాతరాశముగ సంపాదించి తెండోరి! యు
ద్ధురులై; వాఁడొక వేళ నింగి కెగసెన్, దున్నుమ్మఁడు; క్షోణీధ్రకం
దరలీనుండగుడున్, వధింపుఁడు; దిగంతంబుల్ వడిన్ జేరినన్

ఉ॥ వారిధిలోన డాఁగిన, నవారితవేగమునన్ వధింపుఁడా
శౌరిని, వారజాతభవు, శంకరుఁ జేరినఁగాని, కొంకు లే
కారసి, పట్టి చంపుఁడు; నయంబున వానికి దుష్టరక్తమున్
బోరనఁ ద్రావి తేన్చుఁడిఁకఁ బొంగుఁడు; జయంబును గొందు రక్కసుల్!॥

ఉ॥ దండిమగండె, వాఁడకట! దానవనాయకు, నన్నుఁ బూరికిం
గొండికసేసి, నొంచునఁటె! కూళలు, వేల్పులు నన్నుఁ జంప, ము
క్తుండొకఁడుండెమా కనుచు, ధూర్తతఁ బొంగుచునుండ్రి; నేన కా
లుండను వారి పాలికని, లోకమెఱుంగునె సుంతయేనియున్?॥ 36

వ॥ అనిన, విని, మిగిలినదనుజులు సహామహామికలు ప్రకటించుచు,
స్వాంభక్తితత్పరులై, మహోత్సాహంబుం జూపుచు జానుమండలుని
సంతుష్టచిత్తుంగావింపుచుం, బ్రస్థానోద్యోగంబుం జూపుచుం డిరంత॥

మ॥ కనవచ్చెన్ బ్రియశిష్యశుక్రుఁడును, ద్రాక్కార్యంబునొక్కంతసం
తసనూహించియు, "జానుమండలుని చిత్తంబుత్తలంబొందెనో!
యనిమిత్తంబుగ భృత్యునంపునె? యతండం"చున్ విచారించి, తా
ననుమానించినయట్లె యయ్యెనిట దైత్యస్వామి యుద్యోగమున్

ఉ॥ వచ్చియు, రాకముందె తనపాదములంబడు జానుమండలున్
గ్రుచ్చి కవుంగిలించుక, భృగుప్రవరుండు మృదూక్తిఁదన్ని "య
భ్యుచ్చయసిద్ధిరస్తనుచు" నుత్కలికోన్నతిదైత్యునాదునా
సచ్చరితుండెఱుంగుచుఁ, బ్రశాంతునిఁ జేయుచు, నల్లనల్లనన్ 47

శా॥ "ఓయీ, దైత్యకులావతంస! సమరోద్యోగంబుగాఁదోఁచెదున్
నీయీవైభవమున్, బ్రభుత్వమును మన్నింపన్ సురల్ ధిక్కృతిన్
జేయన్గా! భువనంబులెప్పుడును నిశ్శేషంబుగా, నీకృపా
మేయాపారదృగంచలప్రసరణీమ్రార[గంభీర]ప్రభాఽఽఢ్యంబులే?

ఉ॥ నీదునవక్రవిక్రమమనింద్యనిజక్రమమంచు, మాపయిన్
భేదములేనిభక్తియు, వినీతియు లెక్కకునెక్కనంచు, స
మ్మోదముఁ జెందియుందుము; మముంబిలువంబనియేమి? మేమెశి
ష్యాదరబద్ధబుద్ధిమెయి, నాత్మఁదలంతుమునిన్ గనుంగొనన్॥ 51

సీ॥ జానుమండల! దైత్యచక్రవర్తీ! మదం
తేవాసులందెల్ల నీవమాకుఁ
గూర్చువాఁడవు; మనఃక్షోభంబు నీకేల?
నీపిల్పు తుష్టిఁబొందించె మమ్ము;
సెప్పుమిప్పుడు నెందు సేమంబె కద! నీకు
సప్తాంగసామ్రాజ్యచక్రమందు?
మంత్రివర్గమును, సామంతరాజులు విధే
యులుగనుందురె? నిజోద్యోగమందు

ప్రవర్తింపుచుందువే? సేవితంబె
ధర్మకామార్థవర్గంబు? ద్వాదశారి
మండలపరీక్ష లొప్పగునే ? భాండవృద్ధి,
సైన్యవృద్ధియుఁ జేయుదే? మాన్యశీల!॥ 54

తురంగసైన్యంబుఁజతురుండవౌచు, సం
పాదనసేయుదే? మంత్రవేత్త

గుణోత్తముల, నిష్ఠాగరిష్ఠులఁగుల
క్రమమునవచ్చువారఁ భజింతె?

వస్త్రనిర్ణేజకుల్, పాచకుల్, శిల్పులు,
శస్త్రాధికారులు, శాలలందు

ధికృతుల్ యోగ్యులే? విధినిర్వహణదక్ష
శీలురే? శుద్ధవంశీయులే క

! మదంతికశుశ్రూషచేమహిష్ఠ
ంభములునీకుఁ జేకూరునే? భవిష్య
ంతఁగివర్తింతె? యొందుఁదొందఱయులేక,
నుమండల! రాక్షసచక్రవర్తి!!॥ 55

నురప్పించిన హేతువేమి? దితిపుణ్యపరిష్ఠ! నిష్ఠాగరి
! నినుంబొందెదుఁజుమ్మ! దిగ్విజయదీక్షాలక్ష్మి; రక్షస్సమూ
నితాంతస్థిరశోభ. నీకగుపరిభుహైన్యాకాప్తి "శ్రీరామర
ను"గాంచుంజుమి! వేఱుగాదుప్రియసిప్పా! శంకలన్ దక్క మాం'

ని, యూపాధ్యాయనంబుగాఁ జేతో మోదమేదురంబుగాఁ, గర్తవ్య
స్థాసంబ్రస్ఫుటంబుసేయుచుం. బల్కెనగూాచార్యునకు నైర
హ్యండిట్లనియె॥

శా॥ "సప్తాంగంబులయందుమల్ల మొదలన్ స్వామీ! శివంబేసుమీ!
దీప్తోద్యోగమునన్ నిరంతరముఁ బ్రీతిన్ మీరుమాక్షేమసం
ప్రాప్తింగోరుచునుండఁ, దద్విషయ మెయ్యన్యత్వ మెట్లేర్పడన్?
గ్లప్తప్రక్రియరాజకృత్యములు పెర్వించున్ భవద్బోధముల్॥ 56

శా॥ త్రైలోక్యాధిపతిత్వ మెల్లపుడుహస్తప్రాప్యమై నాకుఁ గ్రీ
లాలాలిత్యము, సర్వదిగ్జయమహోల్లాసంబు మీ యాజ్ఞన్, మదో
ద్వేలస్ఫూర్తిచమూసమూహముతో దీపింతు నిన్నాళ్లు; ది
క్పాలుర్ ప్రహ్వశిరస్కులై, సలువ, నాకారుణ్యమున్ గోరుచున్

ఉ॥ ఐనను, దుస్స్వప్న మొకఁడాత్మఁ గలంచెనుఁ; గృత్యనిర్వహా
ధీనుఁడనై, యుపీనతగలించిన రాత్రి మెఱుంగుటో వరిన్
జానుగ రాణివాసములచానలునన్ను పరీపఁ, జాలసే
పేనువినోదముల్ సలిపి యించుక పాన్పున మేను వ్రాల్చితిన్ 58

వ॥ అంత, నల్లనల్లననిద్రకువశుండనై; పన్నుంటినేగాని; చిత్తంబ వ్యా
లోచనాయత్తంబుకావుటయు॥ 59

ఉ॥ వెంగలి నొందునో, హృదయవీథికళంగఁగఁ; దత్ప్రభావవే
శం గనుఁగొంటిఁ జాగురె! కలన్; గడు నద్భుతమయ్యె; నందుఁ దోఁ
చెం గఠినాత్మమాయుధవిశేషవహంబు భయావహంబునై.
బంగరువన్నె గల్గి, బహుభావములొప్పిన పేర్వారమున్॥ 60

ఉ॥ వారలు వీరులో యెవరో! భార్గవముఖ్య! యెఱుంగఁగాని, పీ
నోరుభుజోరువక్షులు, మహోగ్రశరీరులు జన్నిగల్గులా
హా! రుద్రాక్షలన్ గళమునందు, విభూతివిశేషమంతటన్
దీర్చి యాయుధావళులదీధితులున్ మిఱుమిట్లుగొల్పఁగన్॥ 61

ఉ॥ రక్కసులన్, మదీయులఁ బరశ్వధశక్తిముఖాయుధంబులన్
స్రుక్కఁగఁ జేసి రాజనగరున్ పడిఁ జొచ్చి చికాకొనర్చన
ల్దిక్కులఁ గానవచ్చుచుఁ, బవింబదిగార్దభవాహనంబులం
దెక్కి, యవాగ్దిశాభిముఖులేగిరి వేగఁబల యనఁబుఁన్॥ 61

ఉ॥ అంతట, వారినాయకుఁడునాదటఁబట్టగళగ్రహంబునన్
సుంతయుమానకప్పుడునసుక్ఖరదంష్ట్రుఁడవాగ్నిశిఖోజ్జ్వలజిహ్వచేఁదాఁ
గుంతనిశాతఖడ్గములఁగ్రుచ్చుచు, బ్రేవులుదాల్చి, వల్లనో
బొంతనుగట్టి, వాఁడుభృగుముఖ్య! తలంప, భయంబుఁగొల్పెడున్

శా॥ ఈ దృశ్యంబులఁజూచి, మేల్కొని, హాహాదీర్ఘశ్వాసముచ్ఛ్వాసతత
త్త్వాదృష్టాతిభయాద్భుతంబులు మదిన్ దబ్బిబ్బుగావించె; నా
కీదుర్లక్షణవన్యమానాఫలితమే యేరీతులన్, గాఱియల్,
ఖేదంబుల్ గలిగించునోయని, మనఃక్లేశంబునన్నొచ్చెదున్॥ 64

చం॥ సదయమతీ! గురుప్రవర! శాంతికపౌష్టికముల్ సదా మద
భ్యుదయముఁగోరి, పేయుఁడు, ముహుర్ముహురున్నదుద్ధురద్విష
న్నదపరిహారినైజజనమంగళకారిభుజప్రతాపసం
పదభినుతుండ; నాకొకయమంగళమే? హృదయానుతాపమే? ॥

వ॥ ఇది తమకునుఁగాదే?"యని, మఱియు, నంతలోననసంతనసంతత
రంగంబు సంతరించుకొని, యూకిరించు పుయిలోడి, యల్లనల్లన
నిట్లనియె 66

మ॥ "భ్రుకుటీకింకరులై, సురాసురులు గారూక్షప్రతాపాగ్నియిం
చుకసోకోర్వక, నేనుగోరకయె, నన్నున్ మంచిగావించుకొం
టకుఁద్రైలోక్యనివాసులెల్లపుడు, ధార్ష్ట్యంబేమి యుకా లేక, లె
క్కకుఁదామెక్కుడుకానకలంపుదురుమీకారుణ్యపుణ్యంబునన్।"

వ॥ అని, భయంబును, వినయంబును, ననుమానంబును, నభిమా
నంబుననమానంబులుగా, భావశాబల్యంబు మీఱ, నాదేవ
లోకవైరియాకీలింబల్కుచు, "దుస్స్వప్నదోషశాంత్యర్థంబు
కర్తవ్యందాదేశింపుఁడని" ప్రార్థించినంత, నాదేశికోత్తముండైన

శుక్రేందుని స్తరంగసముద్రంబు తెలంగున నొక్క ముహూర్తంబు
నిశ్చలధ్యానముద్రాముద్రితుండై, సాంద్రాదరనిస్తంద్రంబుగా
నిట్లని యుపదేశించె ॥ 63

మ॥ "వినుమో యీ, దనుజాధినాధ! విను; దోర్వీర్యంబ వార్యంబుగా
ననుమానంబును లేక, లోకముల హాహాకారముల్ పర్వఁ జే
సిన నీ దార్ఢ్యములన్ భరింపఁగల యక్షీణ ప్రతాపంబు లే
క, నినున్ గెల్చుటకై సురల్, మునులు లోకత్రాణపారీణులై। 69

ఉ॥ శంకరు, లోకశంకరు, వశంకరుభక్తికి, సర్వదుష్టనా
శంకరుఁ జేరి, నీదయిన చండిమఁ జెప్పఁగ, నాలకించి, "యీ
సంకటమెల్లఁ బోనడఁచు; జానుమదాశరుసంహరించు; నే
శంకలు లేక, యుండుఁడని," చయ్యన, ముక్తమహర్షి నొక్కఁడన్ ॥

ఉ॥ దక్షిణబాహుసంభవునిఁ, దన్ముని, దైత్యనిషూదనార్థమై
యీక్షణమందె యాజ్ఞనిడి, ఘోరతరులైన సురద్విసంఘమున్
రక్షణసేయుమంచును, బురప్రవి రాశివచించి, వానిన్
రాక్షసునోపఁగాఁ బ్రహరణంబులు పెక్కులను గ్రహించుచున్ ॥

అ॥ వానితోడఁ గూడ పాశుపతాఖ్యది
వ్యాస్త్రమిచ్చి, యొక మహావ్రతంబు
పాశుపతమనంగ, నాశరనాశక
మ్మాచరింపుమని యెనా పురారి ॥ 72

ఆ॥ అప్పుడు మునులు మహాకీర్తికాఖ్యుని సాహాయ్య
మొంది, పాశుపతము నొయ్యఁ జేసి
యోగమొందు, సువ్రతాఖ్యులై, పూర్తిఁగా
వించి, మించి, నిన్ జయించు కాంక్ష ॥ 73

కం॥ యుద్ధము సేయుట కై నన్నుద్ధునిఁగా వారు ముక్తసంజ్ఞుని నీపైఁ
గ్రుద్ధతఁ గల్గించి, మహోద్వృద్ధధైర్యుఁ ముహోషఁ బంపిరదైత్యేంద్రా!

కం॥ శివవీర్యసముద్భవు, దానవచయసంహారకారణప్రభవుని, నీ
వవితథవిక్రమవిభవుని, నవనవగాఁ జూచితే, విచారవిదూరా! ॥75

శా॥ ఆర్యాక్షత్త్రియసత్తమున్, దితిజవంశాగ్నిప్రఖ్యుఁ, ముక్తర్షి, దో
ర్వీర్యాఢ్యుం డెయి. భవద్వినాశమునకై శ్రీకంఠుఁ డేపంపెఁగా!
ధైర్యాధఃకృతమేరుమందరు, సముద్యత్త్రాప్రభవున్ నీపయిన్,
గార్యాలోచన లేల? హా! క్షత్తిృకుఁడు నిన్ ఖండించుఁ జుమ్మాజిలోన్॥

మ॥ అసురప్రఖ్యుఁడు, విష్ణుతుల్యుఁడగు నార్యక్షత్త్రియుం డాతఁడున్
సమరోత్సాహమునన్ నినున్ గనకఁగా సంరంభశుంభద్గతిన్
గమలప్రోద్భవుఁ డిచ్చినవ్వరములున్నన్, లెక్కసేయండు; ని
న్ను మదాంధుంగని యెంచి, నొంచుట యెసంతోషంబు సూ! హానికిన్

ఆ॥ ఇదియు నెల్ల నీకు విదితంబ; తన్ని మి
త్తమున నేఁ జేసితాడెఁ, యమరవైరి!
స్వప్నదర్శనంబు; వలదన్యకార్యచిం
తనము, మాఱు సేఁతయును హుళక్కి॥ 78

తే॥ జరుగఁబోవుదాని గుఱించి యాలోచింప
వ్యర్థమౌను; దప్పదదియు; నీకు
నిశ్చయం బెవండు నేర్పఁ దప్పెడునట్లు,
నన్యథా కరించునట్లొనర్ప ? 79

ఉ॥ హానుఁగాసి పెట్టి, యవమానముఁ జేయుచు, యజ్ఞశాలల
న్మానమహోగ్రహంబున, మదోద్ధతి, నాశముఁ జేసి సాధ్వులౌ
మానినులన్ బలాత్కరణపూర్వమునన్ వెతఁ బెట్టి, కేరుచో
దానవనాథ! నీవు గురుదైవములన్ దలపెట్టినావె? ॥ 80

ఆ॥ పౌరుషమ్ముఁ జూపఁగా, రహింపనులాభ
సంభవంబు; లాతిసమ్మతంబు
గాదు; నీతిగాదు; కావునఁబౌరుష
మ్మునకుఁబూనుమయ్య! దనుజముఖ్య!॥ 87

ఆ॥ ముక్తహాని యజ్ఞమునకుభంగముఁగూర్చి
తద్వ్రతంబుఁజెఱుపఁదలఁపుసేయు'
మనుచుఁబలికి, శుక్రుఁడనుపమకారుణ్యుఁ
డేఁగెస్వాశ్రమమునకాగురుండు"॥ 88

ఉ॥ శుక్రునిసాగనంపి, దనుజుండిటులన్ దలపోయుచుండెని
ర్వక్రపరాక్రమక్రముఁడపారమనఃప్రియతన్,గురూపది
ష్టక్రియమంతయున్ శ్రుతిపుటంబులనిండినవాఁడుగాన,"నే
నీక్రియనింతవాఁడనగుటీగురుసత్కృపగాదె, చూడఁగన్!॥ 89

ఉ॥ ఈమహనీయుబోధమున నేగద, నేఁదపమాచరించి,పై
తామహశక్తిమన్వరతతప్రథఁగాంచి, యవక్రవిక్రమో
ద్దామత, మూఁడులోకములదాటునఁగైవసముల్ పొనర్చి, సు
శ్రీమహితుండనై,యిపుడు"రిత్తగురూక్తి" యనంగలాఁడనే?॥

చం॥ అపశకునంబులెన్నొ హృదయంబుఁగలంపఁదొడంగుచుండెఁ;దా
నపలపనంబులుండునె, మహాత్ములయందెపుడైనఁగాని? నా
కిపుడిదె, సవ్యబాహువిది యేలొకొ కంపమునొందుచుండెన
న్నపహసనంబొనర్చునటులక్షియుసవ్యముస్పందితంబగున్। 91

వ॥ మఱియును, కాకఘూకకంకగృధ్రాదిపక్షిసంఘమ్ములొక్కుమ్మడి
వికృతరుతంబులు వినిపించుచు, నన్ను వెఱపించుచు, గర్త
వ్యంబు మఱపించుచున్నయవి ఘోరవారవంబులకు మేరయే లేక,
సకలదిశలవినంబడుచుండు. హృదయమదిమదీయంబెందులకో

గాని, మాటిమాటికిక్షోభంబునొందుచున్న యది. ఐనం, గానిమ్ము. నేనేమి లేతవడియుండుట కంత చేతఁగానివాఁడనే? ధీరులెందైన, ధైర్యంబులోపించియుండుదురోటు! నేనిప్పుడమహాక్రీకహానిచేయు నమ్యాగః ప్రధానంబైనయయ్యాగ విధానంబుసాగకుండ, నంత రాయంబుఁగల్పించెదన్‌గాక! యజ్ఞవిఘ్నంబైనంత, నాతండేమి సేయంగలండు? మహర్షివర్యాలుదైనమదీయసైనికనికరంబు పెల్లు రేగి యమ్మునిముచ్చుమ్రిందించు గాదె!" యని, నిశ్చయించు కొని, జానుమంతలుండుతత్క్షణంబ, మంత్రివర్గంబుతో మంతనం బులు సాగించి, కార్యఖడ్గధురంధరులును, సచివప్రవరులునయిన సర్వబాహుచండశౌర్య దేవాంతకఘనోదరులను వారిని రావించి, వారితో నిట్లనివక్కాణించె॥ 92

మ॥ “వినుఁడో మంత్రివరుల్! సమగ్రసమరస్ఫీతప్రతాపాఢ్యులై,
చని, మీరల్ చతురంగసైన్యములవిశ్వామిత్రపాపాశ్రమం
బున నాహూత్కికహానిఁదునిమ్మ, క్రతువున్ బూర్ణంబుగాకుండఁ జే-
సి, నిరోధించి, సహాయులౌమునుల నిశ్శేషంబుగావింపుఁడా!॥

మ॥ అనలాధీనమొనర్పుఁడా మునులమూర్ధాళిన్ వడిన్ వ్రచ్చి, యె
వ్వని నేనిన్ క్షమియింపరాదచట; విశ్వామిత్రసాహాయ్యమా
మునిముచ్చున్ దనియించునే? హితవరుల్ యుక్తర్షి యొక్కండు స
చ్చె ననంగా; వినుఁడందఱున్; దితిసుత శ్రీ శాశ్వతంబేసుఁడీ!॥ 24

ఆ॥ సుహితులార! మీరుబహుబహుమానముల్
వొందఁగలరు మత్కృపందనర్చి;
నాదుమాటలెల్ల నమ్ముఁడు; పొందు; వి
క్రమముఁజూపిరండుగండుమగలు!॥” 95

అ॥ అనుష్టం. జానుమంతలాఖ్యంతుల తైన్యస్య
నాయకుల్ మహాగ్రాగ్రయతులైయి,
మనవివర్ధమానహృదయులై, యిట్లు వ
చించిరందఱంతఁ గ్రించులాచు॥ 96

ఉ॥ "దేవర సెప్పఁగావలెనె? శ్రివ్రితరాస్మదపారపౌరుష
శ్రీవాగడ్గాందదే? మునువిరించివరప్రవరప్రసాద! యే
మీవఱకైనపోరుంనహీనపరాక్రిమ మొప్పఁ బోల్గొనన్
దేవచమూసమూహములు "చిక్కను, మొక్కను లేక" పాఱవే?

మ॥ సెలవిండో యొడయండ! యేమిపుడు నిస్సీమప్రతాపంబులన్
సెలవిండ్లన్, జుఱకత్తుంన్ గొనును, నిస్సీ! వేల్పులం జెండమో!
కులశైలంబులఁ బిండిసేయుదుమొ! సంక్షోభంబుఁ గల్పింతుమో,
జలధిశ్రేణికి! వజ్రమున్ విఱిచి, నక్షత్రింబులన్ డుల్తుమో!॥ 98

ఉ॥ మార్తికుఁడొక్కమానియఁటె, మాకొకలెక్కయె? వానిఁ జంపిత
ద్రక్తముజుర్రితేన్చెదము; తత్క్రితువున్ నశియింపఁ జేసి, స
మ్యక్తదుపాస్యదైవముల, నాతనియాశ్రితులన్ హఠాద్గ్రహ
వ్యక్తముగాక, వ్యక్తమును నానటులన్ గడతేర్తుమిప్పుడే॥" 99

వ॥ అని, యసురులు వీరాలాపంబులాడుచు, శస్త్రపాణులై, వీర
వారంబుతోఁగూడి యత్యంతప్రశాంతంబైన మార్తికమౌనీం
ద్రుని యాశ్రమంబుఁ బ్రవేశించిరదియును. 100

సీ॥ మునిగణాంచితము, నిర్ముక్తవిరోధనా
నాపక్షిజంతుసంతానకీర్ణ
మశ్రాంతవేదఘోషశ్రావ్యలోకశాం
త్యర్థపుణ్యాత్మక్రియాఽన్వితంబు
హూయమానాగ్నికంబుత్తమబ్రహ్మవే
త్రిగేసరాశ్రాంతమాత్రపుణ్య

మిద్ధాజ్య చరుసమిచ్ఛాలుశిమ్యసం
భృతజుహూస్రుక్సువాన్వితము, శంఖ
సీ॥ దారుతామ్రసువర్ణపాత్రియుతము, కుశ
పల్లవోల్లాసి, పావనమల్లనల్ల
నల్లద్రావుడుమూఁకలుగ్రోల్లుచుకుచు,
భయము, భక్తియులేక, సంభ్రమముతోడ॥ 101

ఉ॥ ముక్కడిరక్కసుల్ మునుల, ముక్తమహర్షి నిగాసివెట్టుచున్
న్యక్కృతయజ్ఞకృత్యులయి, యచ్చటినైనసమస్తవస్తువుల్
గొక్కిసలాటలోనలగఁనొక్కి, పవిత్రితరాగ్నికుండముల్
గ్రక్కునరక్తమాంసములరాసులుజేసిరికూరులక్కటా!॥ 102

శా॥ కోపాటోపమునన్ నరాశనులు, హుంకుర్వాణులై, మానులన్
బాపాత్ముల్ పరిహరించి, కొంచక, కడున్ బాధించి, వేధించి, దూ
రాపాస్తస్వమహత్త్వభాక్కులుగనొయ్యం జేయఁగా, హవ్యభు
గ్వ్యాపారంబులుమాని, బెగ్గడిలి, కింకర్తవ్యతామూఢులై॥ 103

సీ॥ జానుమండలదుర్ధర్షసైనికాళి
స్వామిమూర్ఖజ్ఞను బాటించి, చండవృత్తి
మాక్త్రికాదులబాధింప, మాఱుసేత
చేతగాక, మునుల్ కాందిశీకులైరి॥ 104

వ॥ అని తెలిపిన, వినియవ్వలివృత్తాంతం బెట్టిదని, శీనామోహనవాసో
జానినడుగుటయును 105

ఆ॥ సికనుజంద్రరేఖ, వికటంబుగుమూఁడు
కన్నులందునొకటఁగానుపింప
కత్తికత్తి, చేనసగజతొమొప్ప శ్రీ
కపిలమల్లి! రిపునికాయభిల్ల!! ॥ 106

ఇది, ఆంధ్రీకృత శ్రీశైలోపాఖ్యానంబునందుఁ బాశుపతవ్రతభంజన
వర్ణనమను నష్టమాధ్యాయము.

శ్రీరస్తు

# ఆంధ్రీకృతముక్తీశ్వరోపాఖ్యానము

## నవమాధ్యాయము

కం॥ సిరులిరవొందెడు నరసా
పురమున నివసించు భక్తముఖ్యులకున్ ని
త్యమహావైభవముల్, మో
క్షరసానందమును గూర్చు కపిలమహేశా ! 1

ఆ॥ అవధరింపుమవలిదగు కథ; సురముని
నలువ కనియె- "వినఁగవలతు; విస్త
రంబుగాఁగ, సర్వమంబురుహాసనా
సీన! యీకథావిశేషమేను ॥ 2

వ॥ అట్లు యాగభంగప్రవృత్తులు, నున్మత్తులు, మత్తులునైన యా
రాక్షసయోధులు పిశాచావేశంబున విజృంభింప నహోత్రికుండును,
తత్సహచరులగు మునివరులు నప్రతీకారం బెట్లు గావింపఁగల్గి
రని," సురముని యడుగుడు, శతధృతి యిట్లు చెప్పందొడంగె ॥ 3

మ॥ అటులా దైత్యులు హోత్రికర్తృకృతయజ్ఞాఖండసద్వైభవో
త్కటశోభన్ జెఱుపంగఁ, "దత్ప్రకటభంగంబన్యదుర్వారము
త్కట! మాకున్నదె, నీ"కటంచు, మునిసంఘంబెంతయున్ వంతసం
కటపడ్డన్, గుశికాత్మసంభవుఁడు ముక్షరిన్ బ్రబోధించు చున్ ॥ 4

వ॥ రక్షస్సమసంహారోపాయంబుఁ జింతించుచున్న యాతనికిట్లనియె

గీ॥ శంభుదక్షిణబాహుసంజాత! మహార్త్రి
కర్షివర్య! నీవిట్లు దుర్ధర్షదైత్య
దౌష్ట్యములనాఁగ, యజ్ఞవైశిష్ట్య మొప్ప,
హర్ష మొడవించునాదు వాక్యమ్ము వినుమ ! ॥ 6

శా॥ అత్యాదిత్యమహాప్రభావ! మునివర్యా! వేగ సేవింపుమా!
దైత్యధ్వంసిని, విష్ణుమాయ; విభునిద్రాయోగముద్రాత్మికన్
నుత్యాకృతిశ్రియ మహానుభావ, శివవిష్ణుబ్రహ్మసాహ్యన్, శివన్
గృత్యజ్ఞత్వమునన్ వచించితిని; బ్రార్థింపంగదే, మాయమన్ ॥7

గీ॥ ఆదిశక్తి మహాకాళీయర్థసాధ
నప్రయత్నకృతాఖండదీప్రశక్తి
దైత్యసంరంభ మడంచి, యుగ్యఛ్వత్రికా
తాత్తమంబిదిరక్షింపనుత్సహించు ॥ 8

శా॥ మున్నొకకల్పరమాధినాథుండుదధిన్ భోగీంద్రశయ్యన్ మిన్
బన్నుండెన్ మధుకైటభుల్ వొడమి యూబ్రహ్మన్ బ్రతారించి, తా
మున్నట్టుల్ చతురాగమాపహరణోద్యోగంబునన్ మించ నా
పన్నుండై పరమేష్ఠిలోకజననిన్ బ్రార్థించెస్వాంతంబునన్ ॥ 9

గీ॥ ధ్యానమాత్రప్రసన్న, యయాద్యదిశక్తి
విష్ణుసంయుక్తయైవచ్చి, వేగ, దైత్య
సోదరులఁజంపి, బ్రహ్మకు వేదరాశి
యిచ్చి, తత్క్లేశమావలఁబుచ్చి, తన్ప ॥ 10

ఉ॥ అంత, రమాధినాథుఁడు, హయాననుఁడన్న వతారమొప్పఁదా
నెంతయుసంతసంబున మహిష్ఠకృపన్ నిగమోపదేశమున్
సంతనఁజేసి, వేదవచనంబులభూతప్రపంచనంబు, త
త్సంతతనామరూపములు, శాశ్వతముల్ త్రిదశాదిసంజ్ఞలున్॥

ఆ॥ మున్నొకప్డు నేనుభూరితపోనిష్ఠ
మండరాద్రినుండ, మంత్రమొకఁడు
బ్రహ్మయిచ్చె; దానిగ్రహియింపుమిచ్చెద;
నన్న, మార్కికర్షియంతఁదాను ॥ 12

మ॥ అదియున్, దుష్టపిశాచనాశకముగా నాతండు సెప్పంగ, నె
మ్మదినుత్సాహమ్మోర్చ్యగ్రైక్యసిద్ధియైనమ్మంత్రంబుగా ధ్యేయుఁడై
య, దురూహంబు తత్ప్రియసనామమహిమ; సత్యంబంచు, ముక్తిశ్రీయ
భ్యుదయాకాంక్షజపించె రాక్షసవధోద్యోగంబుముఖ్యంబుగన్॥

వ॥ జపంబు సార్థక్యంబుఁ గాంచుటకై యూహాత్తికమనీందుఁడంత విష్ణు
మాయని ట్లని, ప్రార్థింపందొడంగె॥ 14

సీ॥ "ఆదిశక్తిని దేవినఖిలలోకైకమా
తనుదయామయి దేవతలకు దేవ
తామూర్తి దేవవంద్యను బరాత్పరతర
ప్రతిసిద్ధఁబద్మాక్షిఁబద్మఁబ్రహ్మ
వాదినిబ్రహ్మణ్యన్నాది దేవినిజంద్ర
ముఖిఁజంద్రశీతలభూతధాత్రి
భువనేశ్వరిని విశ్వభువనవంద్యను భూతి
మయిభాస్కరప్రఖ్యజయవిధాత్రి

గీ॥ భాస్వరను, భాస్కరిని, శశిప్రభను, జంద్ర
సూర్యవహ్నిత్రినేత్రిను, శుద్ధిమత్త
రను, నసామాన్యగర్వాపహను, శివప్రి
యను, శివంకరి, విశ్వోదయనుదలంతు॥ 15

సీ॥ భూతిప్రదను, విద్య, భూవ్యోమభాసిని,
భూతేశ్వరిని, శివస్ఫూర్తి, హృద్య
విద్యాఽతిగను, వేదవేద్య, విధింద్రాద్య
శర్వాణి, శర్మద, సర్వదేవ
వంద్య, విశ్వోదయ్య, బద్మనాభానుజఁ
బద్మిని, శాంతను, భవ్యరూప

విశ్వభర్త్రిని, స్ఫూర్తివిశ్వేశ్వరిని, విశ్వ
నాథానుగను, మహానయ, గుణోద

సీ॥ యను, మహాకాళి, మహితమహాస్విని, బర
పుష్టనీశాని౯బుష్ట౯బ్రహ్మాష్ట, భద్ర
మూర్తి౯, గన్యాకుమారిని బుణ్యగణ్య
బద్మగంధి, భద్రప్రద, భద్రనెంతు ॥ 16

సీ॥ భద్రదంతికరస్నానవ్యభ్రదశ్రుత్ప్రి
యను, సుభద్రను, బుష్పాంగి, హైమవతి శు
భాంగి, శ్రీమతి, శ్రీకరి, నంబ, దివ్య
ధర్త్రధర్మసంవర్ధిని, ధాత్రి౯గొల్తు ॥ 17

సీ॥ శ్రీవివర్ధని శ్రీదను శ్రేయసి శివ
సిద్ధి సమ్మాన్యను, బ్రబుద్ధ శ్రద్ధ భద్ర
కాళి హేమాంగి మంగళాకార; హేమ
శైలవాసినిభావింతుసంతతంబు ॥ 18

వ॥ ఇట్లు ప్రార్థింప నప్పరమేశ్వరియు నమ్మార్కండేయమహాసిందుక్ కనకాత్మ
రూపంబుబ్రత్యక్షీకరించె నెట్లన॥ 19

సీ॥ సంపూర్ణపూర్ణిమాచంద్రబింబమునవ్వు
నవ్వుమోమును, దేంట్లనవ్వల౯జన౯
దళుముముంగురులు౯ గొప్పెమ్మెయు౯గారుమణిదర్ప
ణమ్ముల౯ గేరుగండద్వయంబు
పక్వబింబఫలంబు౯బరియాచకంబాడు
తొగరువాతెఱయు, సంపఁగినిబోని
చారునాసికయు, శ్రీకారమ్ముల౯బోలు
శ్రోత్రద్వయంబు౯జక్షుః ప్రియంబు

గీ॥ కంబుసుష్ఠానమోదుకంఠంబు, కమ్ర
వృత్తపీనస్తనద్వయమాత్తరత్న
భూషణవిభూషణాంగంబు, ముష్టిమేయ
మధ్యమును, జకఘనంబు మంగళంబు॥ 20

సీ॥ అనఁటిబోదెలబీదలనిపించు పెంగొడల్,
గిలుకుటందెలుమ్రోయుకులుకుసడలు,
కటకకేయూరాదిపటుమంజుమంజీర
శింజానసౌభాగ్యమంజుళంబు.
కర్ణాంతవిశ్రాంతఘూర్ణమానాక్షులు
లలితసౌవర్ణలాలాటికాతి
కాంతికాంతలలాటకంబు, రత్నకిరీట
సంశోభిమస్తకసంయుతంబు,

గీ॥ కర్ణికాకాంతిభూయిష్ఠకలితమావ
నాతిశయకవ్యకాఽఽకార, యాక్షణంబ
విష్ణుమాయ, యశస్విని, భీమ, గౌరి,
శూలధారిణి, భైరవిమోదనయ్యె॥

వ॥ మఱియును॥ 22

కం॥ హస్తంబులనాదేవిప్ర
శస్తంబుల సుపరిశస్తశస్త్రాస్త్రంబుల్
ధ్వస్తామరరిపుబహుసై
న్యస్తోమంబులుతళుక్కురని మెఱయంగన్॥ 23

కం॥ ప్రత్యక్షంబయ్యెనుసాతత్యమహాగ్రిస్వరూపసాహానాదో
[illegible]

సీ|| శల్యకరవాలశరజాలశతఘ్నికోటి
భయదతోమరగదాపరశ్వధసుసజ్య [జ్య]
చాపములఁదాల్చి, నేత్రత్రయోపగూఢ
రక్తరేఖలుజెలఁగ, హస్తకంబు ॥ 25

వ|| భయవినమ్రభక్తిసంభ్రమసంతోషంబులు దనుఁ బిక్కిరిబిక్కిరి
సేయ, నొక్కింతసేపు నిశ్చలనిస్తబ్ధాంతరంగుండై, తేఱుకొని,
యవ్విష్ణుమాయ నిట్లు నిస్తోత్రంబు సేయ నారంభించె ॥ 26

కం|| "దేవాదిదేవదయితా! సేవకసేవధి! మహేశి! శ్రీదేవి! శివా
భావాశ్రితాత్మమహాత్మ్యావిర్భూతైధితా త్రిగుణమయమ్మభవా! ||

కం|| ధన్యాత్మయోగిహృత్పద్మస్థస్వానుభావ! త్రైగుణ్యాతీ
తా! న్యక్కృతరక్షోవరసైన్యోద్ధతాతిశయ! యనామాన్వయశ్రా

కం|| ఇంద్రాదిదేవవంద్యా! సాంద్రకృపారససుధావిసారికటాక్షా!
చంద్రాగ్నిసూర్యనేత్రా! మంద్రస్వస్వరవిభీతమాయావ్యసురా!

కం|| వందారుబృందవాంఛితమందారలతా! నితాంతమానితలోకా!
బృందారకనాథోపగతామందయశోహేతుభూతమహితకృపాఽఽఢ్యా

కం|| వేదాంతవేద్యనిజమహి
మా! దుర్గా! ప్రథితసన్మహత్త్వ! మహామా
యా! దారుణదుర్వార
ధాత్ర్యాదిమహాదోషదూరతోఽపాకరణా! || 31

కం|| త్రిభువనభవనవినిర్మితి! విభవమహేంద్రాదిసర్వదేవాభయ
తీ! భయపలాయనమాత్రపరిభవిష్ణుసురారిముఖ్యరప్రస్కన్నా

కం|| నారాయణకృతసాద
రార్యాతేప్రేమార్హా! సత్కృపామృతపూర్ణా!
యారాధకహృదయధ్యా
నారూఢాయాత! యాయతాయతిదాత్రీ! ||

వీని కైదెన్న, నిర్విఘ్న మహానటుల్ స
హాస్తిఁ గూర్పించి, రక్షింపుమ్మలక! లోక
కంటకుం, వీండ్రినొక కంటఁ గనుచు, శాంతి
సుధఁ వర్షింపు భువిని రక్షోసహాంతి! 46

వ॥ అని, ప్రార్థించి, కౌంతి ధైర్యంబవలంబించి, యవహార్య శక్తిక మహాని ప్రముండు విశ్వామిత్రోచ్చారిత కరితూపయోగమంత్రంబులా కర్షించుచున్, దదుక్తప్రకారంబున; బాశుపతవ్రతంబాచరించు చుండునంత॥ 47

ఉ॥ అప్పుడు రాక్షసుల్ శరనిరంతరవర్షముఁ బర్వఁ జేయఁ, దా ముప్పర వీదినుండికరకోత్కరముల్ గురియన్; క్షణంబునం దప్పర మేశి శోషణమహాస్త్రముచే వడగండ్లమాన్పఁగా, నప్పిశితాశనుల్ వెఱఁగు, వేదురునొంది, గతాశులైరొగిన్॥ 48

ఉ॥ అంతట, దైత్యమంత్రిమహాపాసురుఁడున్, నిమిషాంబమీఁదదు ర్దాంత మొకండు శైలశిఖరంబునుదాఁగుఁటెవెట్టి వేసెల దే వాంతకులంపఱున్ గహాకహార్భటులన్, జెలఁగన్, మహామహా నంతపరశ్వధాసివివిధాయుధముల్ ధరియించి, మించుచున్॥ 49

శా॥ సింహవ్యాఘ్రవరాహవాహులును, నక్షీణప్రభోత్సాహులున్ రంహాస్ఫూర్తిమదంతరుల్, మదభరప్రాగ్భారధిక్కారఘో రాంహోరూపులు నిష్ఠుమాయపయివీ రావేశముల్ పూనుచున్, "హంహో! గండరగండలుద్ధవిడిసంహారార్థమైరండురా"॥ 50

చం॥ ఇదియొక వీరవారియఁటయిందఱఁ దీవరకత్తైయె, పెనం గి, దురమునందు గూల్చునఁట!. కీడిక మానెనిజంబుదీనిఁ, క ష్యుడయముగల్గుతేనికిని; హుంకృతినుష్టానిదీనినూఁదివే చుదమగ్రిహింతము త్తమబహూకృతులన్ దారమెచ్చి యీయఁగన్

ఆ॥ అనుచు, నొకరి నొకరు ననుచుఁ గోకిలలఁ జెప్పు
కొనుచుఁ బిలుచుకొనుచుఁ, గూడి శస్త్ర
పాణులై, విజృంభమాణులై, యా దేవిఁ
జుట్టిముట్టి రౌర! పట్టపగలు!॥ 52

వ॥ అంత॥ 53

శా॥ ఆమాయామయి యున్నదదీమమును స్ఫూర్జత్త్వము జూచి, యు
ద్దామంబౌ పటుహుంకృతిన్ బఱపి, క్రోధంబగ్గలంబై, బహు
వ్యామిశ్రంబుగఁ గన్నులందలము, సింహాశ్రేష్ఠవ హస్తయై,
భీమాటోపమునన్ నిశాటుల పయిన్ బిట్టుత్ప్రహించెన్ వడిన్॥

ఆ॥ అక్షిగోళములను శశ్వన్నివర్షించి యూని మేషికాంబ, తాని నీమ
మాత్రముననొనర్చె మహిషప్రయుక్త మహాశైలశృంగమంతశకలములఁగ

ఆ॥ మహిషుఁడప్పుడసహమానుఁడై, శృంగభం
గమునకంత మాటిగజవిభుఁడుగఁ
దలసువిసరికొనుచుఁ, దాఁకెనా దేవిహుం
కారమాత్రమాయ, వారినొంచె॥ 56

కం॥ దశదిశలకుఁ బాఱిన యా
పిశితాశులు మఱలి వచ్చి, విష్ణునిమాయన్
సశరీర నిరోధించిరి
కుశలము లాక రోలుపుషయుమాఁగిన మాడ్కిన్॥ 57

మ॥ నేఁడగొండన్ బురుడించు నాకృతిని గొండల్ దండిన్ బెట్టుసు
వ్యాపించి నానేనుఁగుడూ పురకట్టుసుఁడు దురాత్వరోగ్ర వేగంబున
గడిమిన్ మించి, పయించియిందబడఁగ, హుంకారంబునన్ విష్ణుమా
యుసిగుంతదోఁ జెదదీయుదుర్మదమునొయ్యన్ దొంపమున్ దుంపుచున్॥

ఉ॥ మాయయు, నుగ్రమూర్తియయి, మాహిషరూపసహస్రబాహు తా
శ్రీయుతుపైఁ ద్రిశూలము మఱిన్ గడిమిన్ గుఱిపెట్టినైవ, నా
నాయుధమాసురారినిభయంబుఁ జేసెఁ దనంతరంబ, "యా
మాయ మహాప్రభావయని," మానసమందుఁ దలంచి, వెండియున్

క॥ అసుర యపుడు మృగరూపం
బసదృశబలయుతిముఁ దాల్చి, యానిమిషాంబన్
గనిమసఁగఁ దలచి, విసవిస
నసహ్యహావిక్రమంబునాదటఁ జూపెన్ ॥ 68

క॥ జగదంబికయును, దైత్యుని
సగర్వుఁ, దత్సైనికుల సుక్షణమునఁ దానా
శుగజాలములన్ గప్పెను;
గగనపరిక్షిప్తుఁ జేసెఁ గ్రవ్యాదధమున్ ॥ 69

క॥ ఆశరజాలాచ్ఛన్నము,
సాశరపాశసముదయు నదవదఁ జేయ
భూశయితుల్ గొందఱు, మూ
ర్ఛాశాంతులు గొందఱైరి క్షణమున దైత్యుల్ ॥ 70

మ॥ శరసందోహము కాఱువానయయి, రక్షఃపక్షహంసావళిన్
విరజిమ్మ్రవ్ వాసియించుచున్, మునివరుల్ విశ్వాసముం గల్గి, సా
దరులై విద్యుదుదారగౌరతనుకాంతన్, మాయఁ గొండాడుచుం
డిరి; మున్నుండిన తీఱు మాఱ, నిజహృన్నీరేజముల్ వొంగఁగన్ ॥

ఉ॥ "అంబ! మహేశి! బ్రాహ్మి! సకలాగమవాఙ్నుత! విష్ణుమాయ! ది
వ్యాంబర భూషణాయుధనిరంతరశోభిత! రాక్షసాధమా
డంబర సంతరంప, నికటప్రకటానుపమాదరంబునీ
నుం బరితోఁ గరుణాంబులు కనుల్ బహుశోకనదోద్ధృతదుస్థితుల్ ॥ 72

సీ|| భాగ్యవశమున నీ కృపాభరమునను, జ
గంబు క్షేమంబుఁ గాంచెను గలకుట సురు
లందఱుఁ బలాయనం బొందిగంబ! యైన
వీరినిప్పుడ కడతేర్పవే మహేశి! 73

కం|| దనుజులనూర్థితులై, యో
జననీ! మమ్మిప్పు మృత్యుసాత్కృతులం జే
సి, నశించినఁగాని, త్యజిం
పని చలమున వ్యవహరింత్రు; పాపులు వీరల్. 74

చం|| జయ; జయ; విష్ణుమాయ! త్రిదశ ప్రకరర్ష్యభయ ప్రదాయినీ!
జయ; జయ; బ్రాహ్మి! భక్త చయసంతత భావుకవర్షిణీ! రమా!!
జయ; జయ; వేదశీర్ష బహుశః ప్రతిపాదితనైజ వైభవా!
జయ; జయ; ధర్మవర్ధని! విశంకటదానవలోకమర్దనీ!! 75

వ|| అని, ప్రార్థించుచుండు నమ్మహర్షులన్ జూచి, యమ్మహేశాని సాదరంబుగా నిట్లనియె. 76

ఆ|| విప్రులార! భయము వీడుండు! మీకు భ
ద్రంబుగల్గు; మాని తల్లడుండు,
శంకరాత్మజుండు శంకావిహీనుఁడై,
క్రతుఫలంబుఁ బడయుఁ గుతుకమునను. 77

వ|| అనుచు, నిమిషాంబ గగనంబున విహరించుచుండఁ, దత్క్షణంబ.

కం|| క్షణదాచరముఖ్యులున్
బునరుత్థితులై, క్రుధాసముత్సిక్తత గ
ర్జనములఁ, దర్జనముల ముని
జనముల భయపెట్టి, దీనిఁ జంపుదుమనుచున్. 79

ఉ॥ కొందఱు కొంతలన్ గొనుచుఁ,గొందఱుశస్త్రములస్త్రముల్,మఱిం
గొందఱు ముష్టిఘాతములఁ గొందఱు, కొందఱు పాశపాణులై,
కొందఱు వక్రదృష్టులను గొందఱు హుంకృతులన్ బ్రగల్భతన్
గొందఱు చండధిక్కృతులఁ గొందఱునై, యమరారులందఱున్॥80

కం॥ సంక్షుభవించివారలు
సంఘృష్టాస్ఫాలితులును, సంహృష్టులునై,
లంఘితమర్యాదులునై,
సంఘటిత క్రూరశస్త్రజాలోద్ధురులై॥ 81

వ॥ సావష్టంభంబుగా, సంరోధించిరంత నామెయు. 82

ఉ॥ కొందఱ బాణపాతములఁ, గొందఱ ముద్గరతోమరాదులన్,
గొందలమందఁ జేయకయ, క్రోధపరీతముఖారుణత్వమా
ధ్యందిన భానుబింబ మహితా సహతేజముఁ బర్వఁజేసి, వా
రిం దిలకింప, భీతివిపరీతపరీత తిరోగతిన్ రిపుల్॥ 83
(విపరీతపరీతపురీతదుష్ప్లుతిన్) (పాఠాంతరము)

కం॥ వెనుదిరిగి చూడఁజాలక,
యని మొనదిగ విడిచి, వెడలు నాత్మీయులఁ జూ
చి, నరాదుని మంత్రులు, "ఛీ"
యని సైనికులను వెనుకకు నాదటఁ బిల్వన్॥ 84

కం॥ సమకట్టి సర్వ బాహ్వా
దిమనుష్యాదుల, బలా! విదితమకదా, ధ
ర్మము; శుక్రాచార్య ప్రబో
ధము నేఁడిటు పొల్లవోయె; దాయలునగరే? 85

సీ॥ దేవగంధర్వ విద్యాధరావళీ మ
హాహవములందు జయమిట్టె గూచికొన్న
మీకునేఁటి యీయల్ప సమీకమొక్క
లెక్కయే ? వీరశేఖరుల్ ! లెండు ! రండు !! 86

కం॥ బలియు రెవరెందుఁగానీ,
యలబలమునఁ బాఱుటొప్పరదిగాక, యశం
బు లభించు రిపులఁ జంపఁగఁ;
గలనన్ మరణింప, స్వర్గగాములె యౌదుర్॥ 87

సీ॥ మాంస మస్తిష్క భూయిష్ఠ మంగళేత
రము కళేబరమీ యది; ప్రాణభీతిఁ
బాఱిపోయిన, నశియింపదా ? రహస్య
మొక్కఁడిద్దాననే యబ్బునురు యశంబు॥" 88

మ॥ అని, యుత్సాహముఁగొల్పి పల్కఁగ, మహాదాకృష్టులై, సర్వబా
హు నరాదాదులు తెచ్చికోలుసమరోద్యోగంబునన్ వచ్చి, ఖ
డ్గనిశాతోగ్రశరాదిసాధనములన్ గైకొంచుఁ, దీండ్రించి, ని
ల్చి,నితాంతాతభటిన్,మహోగ్రహమతిన్, లేలిహ్యమానోష్ఠులై॥ 89

చం॥ కడఁగిరిపోర భీకరముఖ ప్రకట ప్రచుర ప్రతాపమొ
క్కడఁబటు భేరికాహళాది రవమేచిన శంఖనాదమే దుర
త్విడురుతరాతి భీషణ పటిష్ఠ శరాసిముఖాయుధ ధ్వనుల్,
కడుకొను సింహనాదములు, లాతుల బెండువడంగఁ జేయుచున్॥ 90

మ॥ చతురంగ ధ్వజినీ సమేతులయి, రక్షః పక్షగుల్ హస్తిబృం
హితముల్,సైంధవ హేషితంబులు, రథాహీనోచ్చలన్మంద్ర ఘో
షితముల్, వీనులవ్రీల్ప, విశ్వమది నిశ్చేష్టంబుగా, నట్టహా
స తతాశాకుహరావకాశులయి, పిల్చెన్దాఁకిరమెన్ వడిన్॥ 91

చం॥ మహిష మహాసురుండు, సుషమా కలితాయుధపాణియై, మహీ
మహీధరముల్ చలింపఁ, బరమంబగు పౌరుషమొప్పఁ, బోరఁగాఁ
గహకహనాదముల్ వెసలఁ గ్రమ్మఁగఁ దా నిమిషాంబ, దాఁకెన
య్యహి, నకులిన్ గణింపక, యహంకృతిమై, నెదిరించుచాడ్పునన్॥92

ఉ॥ వాని విజృంభణంబుఁ గని, వాఁడిన మోములఁ దెల్వి దోఁపఁగా,
దానవవీరులుద్దవిడిఁ దాఁకిరి చావఁగఁ గోరియేమొ! తా
మానిమిషాంబ; నామెయు, శ్రవోఽంతరఘాల దృగంతరోమజా
జానమహామహోఽనల విశంకట కోటిగణా నిరీక్ష్యయై॥ 93

ఉ॥ పెల్చనఁ దగ్గణంబును సువీక్షణ నామక నాయకాత్తమై,
నిల్చి, జగద్భయంకరుననన్ మహిషాసురుఁ, దద్వరూథినిన్
జీల్చి, జయంబుఁ గైకొని, విజృంభణమైఁబునరాగతిన్ ననున్
గాల్చిన మెత్తుఁ; బొంకని యకుంఠనిజాజ్ఞఁ జరింపఁబంపినన్॥ 94

చం॥ బహురణ సాధనోగ్రులయి, వారుఁబయింబడి కాసరాసురా
ద్యహితగణంబుఁగూల్ప, నసహాయ మహోద్యమ వీరమూర్తులై
యహహ! జయేందిరాపరిణయత్వరమాణ మనోవినోదులై,
కుహకులుగాక, పౌరుషమకుంఠముగాఁ బ్రకటించిరొయ్యెసన్॥ 95

వ॥ సురాసురులకుఁ బ్రవర్తిల్లిన ద్వంద్వ యుద్ధంబనిరుద్ధంబై, శస్త్రిశస్త్రియుఁ, జక్రాచక్రియు, గదాగదియు, దండాదండియు, ముష్టాముష్టియుఁ, గేశాకేశియు, బాహూబాహవియు, నూరూరవియునై, హస్తినిహస్తియు, వాజినివాజియు, రథినిరథియు, బదాతినిబదాతియున్ దాఁకి, నిర్విరామంబై, యనిర్ణేయాన్యతర జయాపజయంబై, సింహంబును సింహంబును, వ్యాఘ్రంబును వ్యాఘ్రంబును, వరాహంబును వరాహంబును, బర్వతంబును బర్వతంబును నొండొంటిని డీకొనిచేయు చాడ్పునన్ బెద్దకాలము బ్రవర్తిల్లె - నంత. 96

శా॥ ఘోరాకారుఁడు, కాసరాసురుఁడు దా(గ్రూరాత్ముఁడై, మించి,వి
స్మేరాగ్నిప్రభు, నాసువీక్షణు మహర్చిష్మత్త్వ విద్యోతిత
స్ఫారాత్యుత్కట బాణపాతమున నొంపన్ జూచుడున్,నవ్వి,యు-
ర్వీరశ్రేష్ఠుఁడు నమ్మనర్చిదనుజావేల(ప్రయత్నంబొగిన్॥ 97
వ. ఇట్లొక్కవాఁడి యమ్ముకనమ్మహిషదనుజునణంచి, రథరథ్య
సూతుల ననేకసాయకనికాయంబులన్ జేసి మహామేఘంబు
నిరాఘాటధారాఽఽసారంబున మహీధరంబును ముంచెత్తు నబ్బం
గిని గప్పి, సువీక్షణుండు వేఱొక్కనిశాత బాణపాతంబునస్సై రి
భాసురుభాసుర కార్ముకంబును ఖండించి, యార్చిన- 98
ఉ॥ వాఁడు మఱొక్కవింట వసివాడని పౌరుషమొప్ప, (వేల్మిడిన్
వాఁడి శరావళిన్ బఱపి, వ్రిచ్చెసువీక్షణు, వీరశేఖరున్;
నేఁడువిరోధి యీల్గుటది నిక్కము నిక్కమటంచుఁ బొంగుచున్,
బోఁడిమిసూపి, చూపఱుదనుంబొగడన్, క్షణమాత్రతుష్టిమై 99
॥ అమ్మహా వీరయోద్ధ దానంతఁ దేఱ,
యమ్మహిషదైత్యుపై సముద(త్ప్రతాప
రూపితౌద్ధత్యమునమించి, (త్రుంచెవాని
దీర్ఘశృంగద్వయంబు నుద్దీపితుఁడయి. 100
॥ అంతటనాగక 101
॥ తనదృఢ దీర్ఘశృంగముల దారితదేహునిఁజేయఁగా, సువీ
క్షణుఁడు, క్షణక్షణంబున నిశాతశతాధిక సాయక(ప్రయో
గ నిపుణతన్ లులాయ ముఖు(గక్కునఁగుత్తుక నుత్తరించి, యా
ర్చిన, నమరారి వీరులవిచేష్టత (మాన్పడినిల్చి చూడఁగన్. 102
॥ నిమిషాంబాఽలిక నే(త్రరోమ జనితుల్, నిర్నిద్రతేజోఽధికుల్,
క్రిమశోవ్యాప్త దిశాఽవకాశులు, నవ(క(క్రూర శౌర్య(క్రముల్,
గుములై, యేడ్తెఱఁగై బయిం బడుచు, రక్షోవర్గవారాశికా
ర్వములై, సాయుధపాణులై, గెడపి, దర్పంబేర్పడన్ మించినన్.

ఉ॥ ఆమెనెదిర్చి ప్రమగ్గిరిరణాంగణమందు ఘనోదరాదులు
ద్దామపరాక్రమక్రములు, తద్దయుఁ గూర్చునమాత్యుఁ డదఱున్
ఆమునఁ జేర్చి పోరియు, సురారి సహాయులు; దేవి యగ్గి, కెం
దామరఱేకులన్ నగు క్రుధాకలితారుణ దృష్టిఁ జూడఁగన్. 104

ఉ॥ ఆ నిమిషాంబయట్టులు మహాగణ వీరసహాయయై, రణ
క్షోణి నిశాటసైన్యములఁ జూర్ణముఁజేసి, జయంబుఁగూర్చ, గీ
ర్వాణులు పుష్పవర్షములవారిత మోదముతోడ, దుందుభి
ధ్వానములన్ వెలార్చిరి దివంబున నప్సరల్ నటింపఁగన్. 105

చ॥ మునులు, సురల్ మనోముదమువొంది నుతించిరి; ముక్తహానియున్
మును, ముని, గాధిసూనునినినూతన యాజ్ఞికతన్ క్రతూత్తమం
బును నియతాత్ముఁడై, వితతమున్ బొనరించు పవిత్రదీక్షనుం
డి, నుతులఁజేసి, యంజలి ఘటించె నిమేషమహాంబకామెకున్ ॥106

వ. అని, తెలిపిన, విని, యవ్వాలివృత్తాంతం బెట్టిదని, వీణాపాణివాణి
జాని నడుగుటయును. 107

కం. సిరిమగఁడు ములికిగా, బం
గరుగట్టదిగట్టివిల్లుగాఁ, దిగప్రోళ్ళ
బ్బురముగఁ గూల్చిన యోగం
ఉరగండఁడ! కపిలమల్ల! నరసపురేశా!! 108

ఇది, ఆంధ్రీకృత ముక్తీశ్వరోపాఖ్యానంబునందుఁ
గాసరాసురసంహారంబను నవమాధ్యాయము.



శ్రీః

# ఆంధ్రీకృత ముక్తీశ్వరోపాఖ్యానము

## మంగళాచరణాదికము

◆ దేవతాస్తుతి ◆

శ్రీరాధా హృదయాధినాయకుని, సౌశీల్యాది సల్లక్షణ
శ్రీరుక్మిణ్యధినాథు, నూర్జిత మనస్విత్వాభిరూప్యాభిజా
త్యారూఢాతిశయాశయాఢ్యయగు సత్యాదేవికిన్ జోడు, వం,
శీరమ్యున్, నరసాపురేశుఁ గొలుతున్ శ్రీరాజగోపాలునిన్॥ 1

ఉ. శ్రీమహిళా మహీసతులు ప్రేవల సేవలొనర్చుచుండ, నా
నామహితావతార కథన ప్రవణత్వచణుల్, బుధాగ్రణుల్
వేమఱుపన్యసించుటలు విన్చును, మెచ్చెడు నాదికేశవ
స్వామిని, భక్తిఁగొల్తునరసాపురపాలుని, భక్తలోలునిన్॥ 2

చం॥ శిరమున బర్హమున్, జలిదిచిక్కము మూఁపునఁదాల్చి, గోపబా
లురకును గూర్చునేస్తమయి, లోలత సెంగిలి, యంటులేక, మ
చ్చరము నెఱుంగ కాప్తమెయిఁ జల్దులుమెక్కి, త్రిభంగికస్థితిన్
మురళిని నూఁదు శ్రీమదనమోహను, గోపవిభున్ భజించెదన్॥ 3

మ॥ గ్రహముల్ తొమ్మిది ప్రాంగణాగ్రమునఁ జేరన్ వచ్చు భక్తాళికిన్
మహిమన్ దెల్పుచునుండ, గర్భగృహసన్మధ్యంబు నందీవు దే
వి హిమాద్రిప్రియపుత్త్రితో విహరణప్రీతిన్, ముహుర్దోలికా
ల హరిన్ గ్రీడలు సల్పుదో కపిలమల్లా! నీకు జోహారువుల్॥ 4

మ॥ శవణింతున్ బ్రణతుల్ శుభాస్పద వసిష్ఠా పశ్చిమాశాతటీ
స్థవిశాలా వసథ స్థిరోత్తమగృహాస్థ శ్రీకి, గౌరీ సహా
యవరఖ్యాతునకాశ్రితావనునకంహోఽరణ్యదావాగ్నికై
క్షవచాపస్మయహారికాయమరలింగస్వామికిన్ వేమఱున్॥ 5

శా॥ జ్ఞానానందమయున్, దయాహృదయు, సాక్షాద్విష్ణురూపున్ శ్రితా
ధీనున్, దీనజనావనున్, హృదయ పీఠీమధ్య సంస్థాను, నా
జానా పావన మానిదుర్లభు, హయాస్యస్వామి, లక్ష్మీ విభున్,
ధ్యానింతున్, సిత పుండరీకమణిపీఠావాసు, విద్యాఽధిపున్॥ 6

సీ॥ ఏమహామహుఁడు శ్రీరామాదులకు మున్మొ
దలి వాఁడనంగ సద్యశముఁగాంచు,
నే దేవుఁగొల్చి మహిన్ రోగపీడితు
లారోగ్యభాగ్యంబు నందుచు(కొ)ందు,
రే ప్రభుండని నీల్గునెల్ల పోటరిగమి
కయనమ్మె, ముక్తికాంతాఽఽప్తిఁగూర్చు,
నే జాణపద్మనీహృదయ పద్మోద్భ్రమ
కృత్సహస్రోస్రను శ్రీవిలాసుఁ,

గీ॥ దట్టి మహిమాధికునిఁ గొల్తు హర్షమునను
గాఢతమతమః పాంథతస్కరుని, భక్త
జనతతియశస్కరుని, నమస్కరుని రథాంగ
యుగమనస్కరు, భాస్కరునుల్లమందు॥ 7

సీ॥ మౌక్తికనీల హేమప్రవాళశ్వేత
దీప్తి సందీప్తత్రిదృగ్యుతాస్య
పంచకాన్వితమిందుబద్ధ రత్నకిరీట
శోభితం బబ్జయుగ్మాభయవర
శంఖచక్రగదాకశా కపాలాంకుశ
భరణ దక్షకరాబ్జ భాసురంబు,
ప్రమదా(శు)మధులలబ్ధా(ఘ్రా)ణ చంపకచల
ద్భ్రమరక భ్రమర విభ్రాజితంబు,

గీ॥ నశ్రుతాదృష్టపూర్వ మత్యంతదుర్ని
రీక్ష్యతేజో విశేష సంలక్ష్యమూరి
రాధయిషు భద్రదాత్రుకృపైధమాన
దివ్యగాయత్త్రిరూపంబుఁ, దెలిసి కొలుతు॥ 8

మ॥ నలువొందన్ ప్రణమిల్లుదున్ మివులఁగొండాలమ్మ,నయ్యప్ప,శ్రీ
లలితాంబన్,వనులమ్మ, రామవిభుఁ, జల్లాలమ్మ,దుర్గమ్మ,మ్రొ
క్కి, లసద్భక్తిని, వేంకటేశ్వరులకున్ గేల్మోడ్తు, భక్తాంజనే
యుల, గంట్లమ్మను, రాధఁ, గృష్ణుఁ, నరసింహున్, సాయి
షిడ్డీప్రభున్॥ 9

కం॥ ధ్యేయాంఘ్రిద్వయు, నద్వయు,
శ్రీయుతమహా సత్యసాయి సేవాసమితిన్
బాయని దైవముఁ గొల్తును
సాయీశున్ భుక్తిముక్తి సద్భక్తులిడన్॥ 10

కం॥ ఉడయవరులకును మనమున
"నడియేన్ దాసోఽహ"మంచు, ననవరతంబున్
బడిబడి మ్రొక్కెద; నేఁగే
రడములుపచరింపనొల్ల, రామానుజులన్॥ 11

♦ గురుస్మరణము ♦

కం॥ సుకళోపాఖ్యానాం
ధ్రకృతిగ్రథన ప్రశంసిత ప్రజ్ఞుఁ, జికి
త్సకతా ధన్వంతరిఁ దం
డ్రికిఁదండ్రిని, వేంకటార్యునిన్, మదిఁదలఁతున్॥ 12

మ॥గణితాంభోనిధి కుంభసంభవునిఁ, గ్రదిస్కంధ ప్రవీణున్,మదిన్
మనుహేమాద్రి పరాశరాది వచనాంతర్మర్మ ధర్మజ్ఞునిన్,
బణినాపత్యకణాద జైమినివచో వ్యాసోక్తి వేత్తన్, జనా
ర్దన కవ్యగ్రణిఁ,దండ్రిఁ కన్నఁ,దలఁతున్ రమ్యావధానోద్ధురున్ 13

శా॥శ్రీ తస్వీవిభుపాదపద్మయుగ సంసేవా మహాసేవధిన్,
శ్రౌతస్మార్తవిధిజ్ఞు, పౌరికమణిన్, గావ్యప్రణేత్రగ్రణిన్,
జేతోమోదమునన్ మహాగురువరున్, సేవింతున శ్రాంతమున్
సీతాఽంబాహృదయాధినాథు,జనకున్, శ్రీవేంకటాచార్యునిన్ 14

గీ॥ అపరవిఖనసు, వైద్యవిద్యాఽనవద్యు,
గలమధురగాన నైపుణీకలితుఁ గేశ
వార్యుఁ, బినతండ్రిఁ, గవనచాతుర్యధుర్యు
భక్తితాత్పర్య యుక్తిమెఁబ్రస్తుతింతు॥ 15

కం॥ దర వికసన్నళిన దళాం
తరుదితమధు మధురపదయుత ప్రథితకవి
త్వరసు, మదగ్రజుఁ గరుణాఽఽ
కరుఁగొలుతుజనార్దనార్యకవిద్ధాంతిన్॥ 16

శా॥శ్రీమద్భార్గవ గోత్రు, సర్వపురవర్తిన్, భావరాయణ
స్వామిశ్రీ పదపద్మ సేవకుని, విద్వత్తాఽనియత్తాఽఽఢ్యు, వి
ద్యా మర్మంబుల నీడవోవకయ ఛాత్రవ్రాతమున్ దన్వు స
త్ప్రేమస్థేము, గురున్, భజించెదనెదన్ బెద్దింట్య నంతార్యునిన్ 17

మ॥విఖనస్సూత్రగురున్, సుదర్శన మహావిఖ్యాత వంశ్యున్, భిష
క్తృఖనిన్, గొల్చెద జోగయార్య విబుధున్, వాల్లభ్యలభ్యశ్రియు
స్సఖపాదార్చన భాగ్యవైభవుని సాక్షాద్దైవమస్మద్ధితో
న్ముఖు, నాత్రేయపవిత్రగోత్రుని,మహాత్మున్ యాజ్ఞికోత్తంసునిన్

కం॥ హయ వదన మంత్రదేశికు,
నయత్నసులభ ప్రసాదు, నంతర్వేది
ప్రియనిలయుని, నరసింహా
హ్వాయుఁ, బెద్దింట్యన్వయున్, మహామహుఁదలఁతున్. 19

♦ బంధుసంస్తవము ♦

మ॥ చిరభక్తిన్ బ్రణమిల్లుదున్ సతతమున్, శ్రీమానినీ మానసాం
బురుహాంతశ్చల చంచరీక చరణాంభోజాత నిత్యార్చనా
స్తరమాఽఽరామనిరామయత్వసుత విద్యాధోరణీ ధాటికిన్
గరుణాఽఽద్యర్హగుణాళిపేటికిని, వేడ్కన్, బంధుసత్కోటికిన్॥20

♦ ఉభయకవిస్తవము ♦

మ॥సరసాళి ప్రమద ప్రదాయిపద పుష్పవ్రాత సౌరభ్య(గంధ్య)వి
స్ఫురితానేక సువృత్తరత్న గుణసంస్ఫూతాఖిలేలాతలే
శ్వరమూర్ధోపరిసేవ్యభవ్యతర కావ్యప్రస గ్విర్మాణకృ
త్సురభాషాఽఽంధ్రకవీశ్వరప్రవరులన్ స్తోత్రంబుఁగావించెదన్.21

♦ కుకవి నిరసనము ♦

సీ॥ పూర్వకవిరాజ విరచితాపూర్వసత్ప్ర
బంధములఁ దప్పులెన్నుచు, నంధుపతిత
దర్దురములట్లు తమకవిత్వంబునంచె
కొట్టుమిట్టాడు కుకవులఁదిట్టనేల? 22

వ. అని, యిట్లు విశిష్టేష్ట దేవతా క్షేత్రపాలక నమస్కారణంబును, గురువరచరణనళినయుగళపరిచరణంబును,బంధువర్గ బంధురపురస్కరణం బును, ఉభయగపీకవి వరవిసర సంస్మరణంబును, అపగతకవి కవన ధర్మమర్మ గౌరవులగుకుకవి కౌరవులుపేక్షా మాత్రదంష్ట్యలాటసూరి సూర్యుల సూటిమాటగాఁ దత్తిరస్కరణంబును, ప్రారిప్సితమహాంధ్ర

ప్రబంధ నిబంధన నిష్ప్రత్యూహవ్యూహ పరిసమాప్తి ప్రచయ గమనావిచ్ఛేద సంప్రదాయార్థినై, యత్యర్థంబ వ్యర్థంబు గావించి, మంగళాచరణ రూపమంగళాభరణ పరిష్కరణానంతరమ్మునఁ గృతి యువతి ముఖకళ్యాణ తిలకాయమానంబుగా, నాత్మీయాభిజాత్యకాయ మానంబు సంతరించి, సుస్థిరస్థాపన సుస్థితంబొనర్చెద-నెట్లన. 23

♦ వంశ ప్రశంస ♦

మ॥ అలరెన్, శ్రీలలనాధినాథు హృదయాఖ్యంబైన కుండంబునం
దల ఘూర్జస్వలమై, జనించి, విఖనాఖ్యన్ గాంచు బ్రహ్మంబనా
విలసా సూత్రమనన్య సాహ్యము, జగద్విఖ్యాతమున్ గూర్చి, ని
స్తులవిస్తారయశోభిశోభితము, సంస్తుత్యంబు, నిత్యంబునై॥ 24

వ. విఖన విఖనో విఖనస వైఖానస శాఖే యైకాయన శాఖీయాది వైష్ణవగర్భ వైష్ణవ విప్రనారాయణ పంచకాల పరాయణ పరమై కాంతి ప్రభృత్యాఖ్యాఖ్యాతంబైన తద్విప్ర వర్ణంబున గోత్రంబులెన్నేనియు, నెన్నికఁగాంచె; నందు- త్రిపంచ సప్తార్షేయ ప్రవరాన్వితంబైన కాశ్యప గోత్రత్రయంబునన్ గశ్యపావత్సారనైధ్రువ త్ర్యార్షేయ ధ్రువంబొనస్మద్వంశంబునందుఁ గొందఱు గృహస్థుల త్తిల్యుపనామవ్యవహారంబుఁ గల్గియుండిరి. వారి యందెందఱందఱు వంశ విస్తారకులై, యెందెందెంత ప్రఖ్యాతిఁగాంచిరో, యేయే ప్రదేశంబులందెట్టి ప్రసిద్ధి నొందిరో-కాని, యేతత్కుటుంబుల త్తిలి యను గ్రామంబునందెప్పుడో యుండెడివా రేమో! గ్రామనామంబులేయుపనామంబులుగాఁ గల్గియుండుట తెలుఁగునాఁట నేనాఁటినుండియో నేఁటిదాఁక వచ్చుచుండిన యాచారంబు. కావున, నత్తిలి వారిట్టియ నూచానమైనయా ప్రాచీనాచారంబుచేతనే, ఖ్యాతిఁగాంచి యుందురనుట వక్తవ్యాంశంబు. అతులితమతి యయిన యత్తిలి పంతులనువ్యక్తి కోరుకొండ గ్రామమ్మునన్ గరణమ్ముగా నుండినట్లు కొన్నియాధారమ్ము

లుండె. పిమ్మట, రామాచార్యుండను పేరు మొమ్మొదట వినంబడియె; ఈమహామహుని కుమారుండు కృష్ణమాచార్యుండు. ఈయనకు-రామాచార్యుండు, పెదవేంకటాచార్యుండు, చినవేంకటాచార్యుండునను పుత్త్రత్రయంబు గల్గె; ఈ మువ్వురియందగ్రజుండె వంశకర్తయై, వేంకటాచార్యుండను నొక్క-కుమారుంగాంచె; నామహాత్ముండు నరసమాంబయందు వేంకటాచార్య తిర్మలాచార్య రామాచార్య లక్ష్మణాచార్యులునా నల్వురుకుమారులన్ గాంచె. వారియందగ్రజుండు ధర్మపత్నియైన రామాంబయందు మువ్వురు కుమారులను, అయిదుగురు కుమార్తెలన్ గాంచె. తిర్మలాచార్యుండు పుట్టుగ్రుడ్డియు, దీర్ఘరోగియు, బ్రహ్మచారియునై, బ్రహ్మంబుఁజేరె. రామలక్ష్మణాచార్యులిర్వురును, (కవలలయి యుందురేమో!) ఒకరి వెనుక నొకరు మండపేట గౌతములైన వింజరపువారికి దత్తులైరందు లక్ష్మణాచార్యుండే వంశకర్తయై, మువ్వురు కూతుండ్రను భార్యాద్వయంబునన్ గాంచె. అందగ్రజకొక్క- కుమారుండును, ద్వితీయకొక్క-కుమారుండును, తృతీయకొక్క-కూఁతురున్ గల్గిరి. ఇఁక రామాంబా వేంకటాచార్యపుణ్యదంపతులకు- నరసమాంబ, విజయవేంకట జనార్దనాచార్యులు, వేంకటాచార్యులు, శేషమ్మ, పెదరామమ్మ, కేశవాచార్యులు, కవలలగు చిన రామమ్మ-లచ్చమ్మ యను నెన్మండ్రు సంతానంబైరి. అందు- నరసమాంబ భార్గవ పెద్దింటి బృందావనోప నామక రాఘవాచార్యుల కర్ధాంగియై, పుత్త్రత్రయంబును, పుత్రికా ద్వయంబునుగాంచె. విజయవేంకట జనార్దనాచార్యుండు నిజనివాసంబైన జయగురు పురంబున (జేగురుపాడున) సిద్ధాంత విజ్ఞానరత్న ప్రదీపజ్యోతిర్నామక సంస్థా సంస్థాపకుండై, చలివేంద్రోప నామక సూర్యనారాయణశాస్త్రి వర్యాంతేవాసియై, యంతేవాసింజెంది, పంచాంగకర్తృత్వ సర్వశాస్త్రవేత్తృత్వ సంస్కృతాంధ్రభాషా కావ్యకర్తృత్వాష్టావధాన విద్యావైశారద్యంబులం దారితేరి, దారద్వయంబున నొక్క-కూఁతును,

దారకత్రయంబునుగాంచి, ముప్పరెండేండ్లకే నూరేండ్లు నిండినవాఁడయ్యె. వేంకటాచార్యులు - బృందావనోపకామకలక్ష్మాంబా గోపాలాచార్యుల పుత్త్రికయు, భ్రాతృచతుష్టయ సోదరీత్రయీ లాలిత్యలాలితయునైన సీతామహాసాధ్విని సహధర్మచారిణిఁగాఁ బరిగ్రహించి, పుత్త్రికాసప్తకంబును, పుత్త్రసప్తకమ్మునుగాంచియు, దుహితృత్రయియు, తనుజత్రయంబును శిష్టసంతానంబుగా, సంతుష్టిఁగాంచె. తిర్మలాంబయు, సత్యవతియు, రామమాంబయు, విజయ వేంకట జనార్దనాచార్యులు, ప్రకృతకృతి రచయిత యయిన గోపాలకృష్ణమాచార్యులు, సుందరాపరనామధేయుండైన వేంకటరమణమూర్తి యను మేమార్వురముగాక, యామహామహునకు స్వీయకావ్యసంతానంబెంతేని నిండుఁదనంబుఁ గూర్చె; నందాంధ్రగర్గసంహిత, హీరసేనచరిత్ర, విఘ్నేశ్వరచరిత్ర, కేశవజనార్దన రాజగోపాలశతకంబులు, ఆంధ్రభగవద్గీత, రామాయణ రత్నపాంచాలికా పార్వతీపరిణయ నాటకాంధ్రీకరణంబులును సుప్రసిద్ధంబులు. వీరిజ్యేష్ఠాపత్యంబైన తిర్మలాంబ పెదపూడి వారికోడలై, మేలుఁగాంచె. రెండవయామె సుదర్శన వంశీయుల యిల్లుమెట్టి, సర్వసౌఖ్యార్హయయ్యె. మూఁడవయామె-అంగరవారత్తవారుగా, సకల భోగభాగ్యంబుల ననుభవించుచుండె. పెదతండ్రి పేర్వెట్టిన విజయ వేంకట జనార్దనాచార్యులు-కవియు, సిద్ధాంతియునై, వీను మిగిలి, పేరునిలిపి, పంచాంగగణనము నలుబదియేండ్లు సాగించి, మదనగోపాల-వేంకటేశ్వర- పితృసంస్మృతి శతకంబులు, సత్యనారాయణవ్రత కథ, కలభాషిణీనాటకము, కార్తిక మాహాత్మ్యాంధ్రానువాదము వ్రాసి, వాసిఁగాంచె; నీమహామహుని పుత్త్రరత్నము మాకందఱకు బాహ్యప్రాణము - మాకు గర్వకారణమ్మైన వేంకటరమణ- సుకవియు, విమర్శకుఁడు, వక్తయు, అన్నింటిని మించి సాయిసచ్చిదానంద భక్తియుక్తుండునై, నూజివీడున శ్రీధర్మాప్పారాయ కళాశాలయందు రసాయనశాస్త్రోపన్యాసకుండుగా

నుండె. నేనో "చెట్టుపేరుచెప్పి, కాయలమ్ముకొను వాండ్రలో లెక్కకు వచ్చువాఁడనయ్యు, నించించుక విద్యనార్జించి, గార్హస్థ్యంబుగాంచి, యర్ధాంగియగు సుభద్రయం దైదుగురు కూఁతుండ్రను, నొక కొడుకును బడసితి. మాతమ్ముఁడు వేంకట రమణమూర్తి వైద్య విద్యయందు దిట్టయై, యుద్యోగ విరమణానంతరము, స్వగ్రామమైన కేసవరమునందేయుండి, కేశవదేవపాద పద్మారాధకుండై, పవిత్ర జీవనము సాగించుచుండె. మా పినతండ్రియైన కేశవాచార్యులును, కేశవదేవ చరణనళినయుగళ భ్రమద్భ్రమరాయమాణమానసుండై, యపరవిఖనసుండుగా, వైదికశారీరక యాజ్ఞికోత్తముండై, సంగీత శాస్త్రవిత్తముండై, కవిత్వతత్త్వ వేత్తయునై, వైద్యవిద్యా వైశద్యంబుగల్గి, ద్వితీయాద్వితయి యందొక్కొక్కపుత్త్రిని, నొక్కొక్క పుత్త్రిన్గాంచె. వీరందఱును సంతానవంతులు, సంతతతంతన్యమానానూనా సామాన్యమాన్యాతిమాన్య విద్యోద్యోగ యోగ్యభోగభాగ్య విద్యోతమానులునై, హాయిఁగాంచుచున్నవారు. మన్మాతృవంశీయులందఱును సుప్రసిద్ధులే. ఉభయవంశములవారలు వంశకర్తలై, మహామహులై, ప్రఖ్యాతిఁ గాంచుచున్నవారు. తక్కంగల మాకుటుంబ వ్యక్తులన్గూర్చి నవిశేషంబులెన్నోయున్నవి. వానిన్జెప్పఁబూనినన్, జాల గ్రంథంబగున్; గాన, నొక్కటి వక్కాణించి, విరమించెద. హరిహరాభేదవాదంబుచేతో మోదంబుఁగూర్పుడు, నేనీశైవేతిహాసంబును మహోత్సాహ మానసోల్లాసంబులొప్పఁ గబ్బంబుగాఁగూర్చి, జన్మసాఫల్యంబుఁ గోరినవాఁడనై, మదీయైతత్కృతి కధిపతియైన యద్దేవదేవుండు ద్వైరూప్య సంజ్ఞాద్వయీ శోభితుండై, నరసాపురంబున స్థిరపరిపాలన తత్పరుండైన యప్పరమశివుండ యాటంజేసి॥ 25

(షష్ఠ్యంతములు)

కం॥ శశిశేఖరునకు, దితిసుత
మశకార్థ ప్రచుర ధూమమాలాజ్వాలా

భృశశబల జూటధరునకు,
విశిష్ట భిల్లునకు, శ్రీకపిలమల్లునకున్॥ 26

కం॥ శతమఖముఖ బర్హిర్ముఖ
నుతనిజచరితునకు, సన్మనోనిత్యసదా
సతతానందాన్వితునకు,
ధృతశరణాగతున కమరలింగేశునకున్॥ 27

కం॥ విపులకృపామృతవర్షికి,
సపులకగిరిజాఽర్ధవర్ష్మ సమహర్షునకున్
త్రిపురామర్షికి, హిమగిరి
తపోవనస్థిర మహర్షి తా తర్షునకున్॥ 28

కం॥ కాశీముఖపుణ్యస్థల
రాశీభూతోరు పుణ్యరమ్యావిర్భా
వాశాఽంతర విశద యశ
శ్శ్రీశాంతాకృతికి, శాంకరీసాదృతికిన్॥ 29

కం॥ పేరెములువారు తత్తడి
గోరాటల గబ్బిగిబ్బ, కులుకుఁ దొడవుల
దర్యారజపువిసముదాల్పరు
లైరహిఁ జెన్నొందు కొండలయ్యకు బత్తిన్॥ 30

వ॥ నమస్సహస్రపూర్వక సమర్పణంబుగా, నా నిర్మింపఁబూనిన
యీయాంధ్రీకృత ముక్తేశ్వరోపాఖ్యానంబునకున్ గథాప
క్రమక్రమం బెట్టిదనిన॥ 31

—(0)—

# ఆంధ్రీకృతముక్తీశ్వరోపాఖ్యానము
## దశమాధ్యాయము

ఆ॥ అమరలింగ! హిమనగాధీశజాసంగ!
ధూతపాప! భక్తపోతసాధ
నైకగమ్యరూప! యలకాపురీతుల్య
నరసపురనివాస! యరినిరాస!॥ 1

ఆ॥ అవధరింపుమవలిదగుకథ; సురముని
నలువకనియె – "వినఁగవలతు; విస్త
రంబుగాఁగ, సర్వమంబురుహాసనా
సీన! యీకథావిశేషమేను॥ 2

ఉ॥ అంతట, ముక్తమౌని, యజనాంతమహాఫలమేమిపొందెనో!
యంతఁ, గ్రుధాకదుష్టనయనాంతనిపాతనిపీతవైరివీ
రాంతరచ (ధై)ర్య, యార్య, నిమిషాంబ యొనర్చినదేమి యొక్కొ! దు
ర్దాంతగణప్రవృత్తి, విశదంబుగ నే వినఁగోరుదున్ ప్రభూ! 3

గీ॥ ఓమహామహా! జనక! పితామహా! జగ
దుదయకారణ! నీము ఖాభ్యుదితకథయు
వినినవారల హృదయంబులను ముదంబు
నింపకుండునె? సర్వనిలింపవంద్య!" 4

వ॥ అని, యడిగిన కొడుకునకు శతధృతి సువిశదంబుగా
నిట్లు సెప్పం దొడంగె॥ 5

కం॥ "విను; నారద! మహోక్తి కస
న్మునిచరితము, శ్రవణమాత్రమున నానంద
మ్మునుగూర్చు; దురితనికర
మ్మును నేర్చు; వెలార్చు శ్రీలు ముమ్మరములుగాన్॥ 6

మ॥ ఇటులన్ దుష్టనిశాటదుర్ఘాటములఁ బ్రహ్వీభూతనై జాంగజో
ద్భటసాహాయ్యమునన్ రణాంగణమునన్ భంజించి, యాదేవి, ది
క్తటపూర్ణోజ్జ్వలకాయకాంతికలితాత్మశ్లాఘ్యలావణ్యము
త్కటమై, వెక్కసమై, విలోకయితృదృగ్జాలాతివేలంబుగన్॥ 7

కం॥ మిఱుమిట్లుగొ, ననభ్రజ
మిరమ్మదోత్కరముఁ బర్వ, నిటులానిమిషాం
బ, రయంబున ముక్తమునీ
శ్వరునకు దర్శనమొసంగి, శాంతాకృతియై॥ 8

ఉ॥ నిర్మలమందహాసముఖనిస్తులమంగళమూర్తి, దైత్యులన్
బేర్మి వధించి, మౌక్తికమునిప్రవరున్ గని, "వత్స! దానవుల్
నిర్మథితుల్; క్రతూత్తమమనిందితదీక్ష వహించి, చేయుమో
భర్మగిరీంద్రచాపసుత! భద్రము నీకగు నిశ్చయంబుగన్॥ 9

గీ॥ జయము జగములకగును; సందియము వలదు;
సురనరమహర్షులకు మనఃక్షోభ దీఱుఁ;
గ్రతువులు పవిత్రదీక్షవిస్తృతములగును;
భవదనుత్తమచర్యయు స్తవముఁ బడయు॥ 10

కం॥ అంగజవైరియు మెచ్చు; న
భంగుర భవదీయభక్తివైభవమునకం
చుం," గడునగ్గింపఁగ, ను
ప్పొంగుచు, సాష్టాంగమెఱఁగ ముక్తీశుఁడున్॥ 11

ఆ॥ అట్లు ప్రహ్వశీర్షుఁడై, ముక్తమౌని సా
ష్టాంగముగఁ బ్రణామమాచరించి,
లేచి, పూజలెన్ని యేచినభక్తిఁ దాఁ
జేసి, యంజలించి, చేరి నిల్చె॥ 12

కం॥ తక్కుంగలపహౌనులు స
మ్యక్కల్పితభక్తిభావమది ప్రకటముగా
గ్రక్కుననానిమిషాంబకు
మ్రొక్కిరి; ప్రార్థించెనిట్లు ముక్తేశుండున్॥ 13

దండకమ్॥ "జయ; జనని! నిజానిశస్తోత్రపాత్రైకకారుణ్య
పీయూషభాండాయితస్వీయ హృద్భావరంగత్తరంగాదృతి శ్రీమహా
భాగ్య భాగ్యక్ష గంధర్వ సిద్ధోరగామర్త్య విద్యాధరానేకమర్త్య ప్రక
ల్పాగ్ర్యగచ్ఛనార్హ ప్రఫుల్లోరుమల్లీమతల్లీ స్రగంతర్వి నిర్యన్మ ధూళీ
సధూళీ ప్రపాతాతికిర్మ్మీరి తాంఘ్రిద్వయాంభోజ సంసేవనాసక్త
భక్తావనా మోదయుగ్దృగ్ద్విరేఫావళీవ్యాప్త సవ్యాపసవ్యోభయప్రాంత
తంతన్య మానేంద్ర నీలాయితాంగ ప్రభాఽత్యుజ్జ్వలే! కోమలే!
శ్యామలే! లోకమాత, ర్ధృతిస్త్వం; మతిస్త్వం; శ్రుతిస్త్వం; స్మృతి
స్త్వంహి; నీతిస్స్వధాత్వం; సుధాత్వం; పరాఖ్యాకవిద్యాత్వమేవాసి;
దేవి! త్రిలోకీపవిత్రే! సవిత్రి! త్రయీరూపిణి! త్వం జగజ్జన్మహేతు
స్త్వమాద్యంతశూన్యే! మహేంద్రాదిమాన్యే! త్వమధ్యాత్మవిద్యాఽసి;
కోఽప్యంబ! మాయాంత్వదీయాం నజానాతి; యఃకోఽపి, దేవి! త్వ
దాలోక సంపాత సంపత్సమృద్ధింవినా, స్తోతుమీషన్నపర్యేతి వాస్తో
ష్పతేస్తుల్యతామీయివా (నాకౌక ఆహారసారాయితాపారవాక్సారణీ
మీయివా) నప్యహో! త్వాంజనో; మామకం జన్మధన్యం; కృతార్థో
ఽస్మి; దేవి! స్మితాస్యేందుబింబంభవత్యావిలోక్యాహముత్సాహపూర్ణాం
తరంగోఽస్మి; నహ్యస్తిమత్తోఽన్య ఈదృఙ్మహాభాగ్యయోగ్యో; యత
స్త్వంసమక్షంమమాగత్య, మాంలాలయంతీస్థితా; దేవి! చంద్రేరుచిశ్రీ
రవౌతాపశక్తిర్గతిర్జంతుసంతానఆర్యే! త్వమేవాసివిద్వత్సువిద్యా; జగ
ద్ధాత్రి! వాగ్దేవతాకావ్యనిర్మాతృషుత్వంనిమేషాంబికే! భాసి; పద్మోద్భవ
స్సృష్టికార్యం, స్థితింవిష్ణురీశోలయంకర్తుమీశాభవత్పుణ్య కారుణ్య

భాజోధ్రువం; దేవి! దేవోహరోఘోరకాకోలతైక్ష్ణ్యాద్రక్షాంబ!లోకాన్ భవత్సాహ్యమాలంబ్య; శక్రస్త్వాపాంగవీక్షాఽఽత్తశక్త్యా దివం పాతి; సూర్యస్త్వపత్యేవమేవానిలోవాతి; వర్షత్యజస్రంసపర్జన్యఏవంచ, భూతానిపంచాపి పుష్ణంతి గంధాదికానింద్రియ గ్రామనుగ్రాహదివ్య ద్గుణాన్భూతతాహేతుభూతాన్; సదాఽస్యంబ! ధర్మవ్యవస్థాపనం, దుష్టశిక్షాం,తథా-శిష్టరక్షాంచ కర్తుంహరేస్త్వంసహాయా; జగత్కర్త్రి! శుంభం, నిశుంభం,ఊలాయాసురంచావధీర్దేవి! దివ్యప్రభావా, త్వమేవాంబ! మద్వాక్యవిన్యాససిద్ధానశేషాంశ్చ దోషాన్క్షమస్వాంబికే! దౌష్ట్య భాగ్దైత్యసంహారలీలాఽతిశుంభన్ముఖశ్రీవిలాసే! ఽలసాలోక నిర్యత్న

నిర్యత్కృపాఽహ్రాసనిర్వ్యాజహాసే। కృపాక్రోధభావద్వయీయోగ పద్యంప్రపద్యాంఘ్రిభక్తావనే, క్రూర శత్రుప్రహారే సమంశోభసే। శోభనే! త్వద్గుణాధిక్యముట్టంకితుంపంకజాతాసనాసీనఆర్యే ఽసమర్థో; న శక్రోఽపి శక్నోతి; కల్యాణి। తుల్యేతరానన్యసామాన్యమాన్యాతి మానోర్వుకారుణ్య సాద్గుణ్య షాడ్గుణ్య సాద్గుణ్యగణ్యే! శరణ్యే! వరేణ్యే। త్వమష్టాదశస్వంబ। పీఠేషు పూతేష్వధిష్ఠాయ, సంపూజ్యసే; వ్యజ్యసే సచ్చిదానందమూర్తిః, కళానాదబిందుస్వరూపే! హతోద్ధూతపాపే। ఽ నివార్యప్రతాపే। ఽనురూపే శ్రితానాం। దురాపేఽతిపాపాత్మనాం! దేవి.తుభ్యంనమోఽస్త్వంబ! పుష్పాంజలింస్వీకురుత్వత్పదాబ్జార్పితం భక్తిభావేన; నిత్యంనమస్తే; నమస్తే పునస్తే, పునస్తే నమః॥" 14

మ॥ అని, ప్రార్థించి, మహర్షిసాక్తుఁడుసాష్టాంగప్రణామంబుఁజే
సిన, నాదేవి క్రమప్రసన్నయయి, నిస్సీమప్రభావప్రియ
త్వనిరూఢాశయయై, శయాబ్జమునమూర్ధస్పర్శఁగావించి, యి
ట్లనియెన్-"వత్స! వరంబొసంగెదనసాధ్యంబున్
సుసాధ్యంబుగన్॥ 15

చం॥ హరిహరపద్మసంభవులహార్యమహత్త్వమునొంది, యిందిరా
వరతను, భక్తపోషిత, నపాతచరాచరసృష్టికర్తృతన్
వఱలిరినాకృపాభరమునన్; మహిషాదులునాతలంపునన్
మరణమునొందిరాహవమునన్; మునిముఖ్య!
యథార్థమింతయున్॥ 16

ఉ॥ నీయతిలోకపావనత, నీదృఢదీక్ష, తపస్సమాధి "చూ
చాయగ" నైన, నేనెవరిచాయనుజూచినదానఁగాను; వ
త్సా! యిటువంటిభక్తుఁడునిజంబుగలేఁడిఁకనుండఁబోఁడు; నే
నీయెడఁజాలఁ బ్రీతిమెయినిల్చితినీయెదుటన్; మునీశ్వరా!" 17

చం॥ అన, విని, యంత, పూర్తికమహర్షియు, హర్షము, తర్షమున్ మన
మ్మునఁనుబెనంగొనంగఁ, గరముల్ముకుళించి, వినమ్రుఁడై,
"జగ
జ్జనని! భవత్కృపాప్రపయుసంసృతితృష్ణనణంపదే? సనా
తని! యదిపిచ్చుకుంటిపయిఁదద్దయుఁబాఱువియత్సరిత్తుగా! 18

కం॥ స్వస్త్యయనంకురునిత్యం;
నాస్త్యంబ! భవత్కృపానుధాఽఽస్వాదేఽస్మిన్
నస్త్యానందః శ్రేయో:
హస్త్యారోహాదికంకుతోఽనాద్యంతే? 19

కం॥ ననుఁగరుణించితిగావున;
జనయిత్రీ! వరమువేడఁ, జనవొదవెఁ; గృపా
ధుని! మద్వంశ్యులవశ్యం
బును ద్వద్భక్తిన్, బ్రపత్తిఁబొల్తురుజగతిన్॥ 20

కం॥ త్వత్సత్యపరాయణులును,
సత్సంగులు, సర్వశాస్త్రసారజ్ఞులు, వి
ద్వత్సన్నుతులున్, గురుపూ
జోత్సుకులును, విప్రసేవనోత్సాహయుతుల్॥ 21

కం॥ ఆస్తిక్యశోభితాంతరు
లస్తమితాజ్ఞానులుజ్జ్వలాధ్యాత్మరహః
స్యస్తోమైకధనుల్, బహు
శస్తవిశుద్ధప్రవృత్తిసౌజన్యఘనుల్॥ 22

కం॥ అర్థిమనస్కులు, విప్రా
శీర్దాప్రాప్తాఖిలేష్టసిద్ధిసమృద్ధుల్,
స్వర్థిమధికస్ఫురన్నైజము
హార్దాభిష్టోరుదాత్మతోన్నిద్రమతుల్॥ 23

కం॥ ఉద్భూతులై, తులైకైం
ద్రదోర్బగిత్వప్రభావరాజితులౌదుర్;
తద్భూరిసత్త్వతేజ
శ్చ్యద్భద్రప్రాప్తిలోకమూర్జితమగుతన్!" 24

వ॥ అని, వరములడుగుటయకాక, యామౌక్తికహాసింద్రుండునిమే
షాంబనాలోకించి, కించిద్ధైర్యోదంచితంబైన చిత్తవృత్తిగల్గి,
"తల్లీ! విజ్ఞాప్యంబన్యంబొండుండె. నేనునీయాజ్ఞకుఁబద్ధుండఁ
గాని; నిరుద్ధుండఁగాను. నేనాజానునుండలాభిధానయాతు
ధానురణాంగణంబుననుక్కడంచుటనిక్కునఁబు. మహేశాని!
మహేశానుండునాపైఁబ్రసాదమేదురంబైన దృక్ప్రసారా
సారంబువ్యాపారింపంజేయుటెట్లట్లనుగ్రహింపవే! నానేరమి
యేదేనింగల్గుచో, వల్లత్కృపాదృష్టిమైక్షమింపఁబ్రార్థింతు"నని,
సవినయంబుగాఁబల్కె - నంత॥ 25

కం॥ నిమిషాంబయుఁ, బ్రేముడి ము
క్తమహర్షింజూచి, "వత్స! దయనొసఁగితినీయి
ష్టములన్నియుఁదీఱువరం
బములమతీ! నీదువంశ్యులౌదురుభవ్యుల్॥ 26

కం॥ నీవంశ్యులుగుదుభక్తులు
గా, విప్రారాధకులుగ, గౌరవభాజుల్
గా, వృద్ధింగాంచుచు, నా
గ్లావృక్షార్కాబ్ధిపృథ్విగా, నుండురుగా!॥ 27

ఉ॥ నీవునునిర్వహింతువుమునిప్రవరా! పురవైరిశాసనం;
బీవుసమానులందుగడియింతువనుత్తమకీర్తి; యాగదీ
క్షావిధియుంబ్రపూర్ణమయి,సత్ఫలదాయియగున్; జయంబుసం
భావితసిద్ధులిచ్చుతను; బాశుపతవ్రతమున్సమగ్రమై॥ 28

ఉ॥ ఈగణముల్రణాంగణమహిష్ఠమహంబునసాహ్యకారులై,
"దాగుడుమూఁతలాడుగతి" దానవవీరులబిట్టుబట్టి, యెం
దేగినరూపుమాపెదరహీనపరాక్రమమొప్ప, వత్స! నా
నాగతులన్నిరాగసులనాశముఁజేసినపాపకారులన్॥ 29

ఆ॥ స్మరణమాత్రవచ్చి, సాహాయ్యమొనరింప
నిల్తు9వీరుమౌని! నీదుప్రోల;
జానుమండలుండుఁజచ్చునీచేతిలోఁ,
గల్లగాదు; దీనఁబొల్లలేదు॥ 30

ఉ॥ శ్రీరమణుండువోలెజయసిద్ధినిబొందెదునీవునున్మహా
వీరపదాంకితుండవయి; పేర్మివహించిరితొల్లిదేవతల్,
పేరుగలట్టిరాజులునుబెల్లుగనన్నెభజించిమించి, వి
స్తారజయంబుఁగాంచి, విశదస్తవనీయయశోఽభిశోభితుల్॥"31

చం॥ అని, నిమిషాంబమౌక్తికమహామునితోమరలన్వచించె ని
ట్లు - "నియమిశేఖరా! వినుమలోలమతిన్; దృఢభక్తినెట్టులై
నను, భజియింపమానకుమనారతమున్భవదన్వయోద్భవుల్
నను, శుభపుణ్యకార్యచయలంపటులయ్యు,
స్మరింపనోఁజుమీ!" 32

మ॥ చరియింపన్వలెవారు సంయమి! కులాచార్యాశిసన్మానమే
దురదీక్షానియతిన్, ఘనాభిరతి, వ్యాధూతాన్యచింతన్, మహీ
సురసత్కారమహోత్సవంబరయఁ గ్రించుల్ వేరుశాలీనతో
ద్ధురులై, వీనినిమానుకొందురో, దరిద్రుల్ వారలౌదుర్జుమీ! 33

కం॥ మరణించివారు వడుదురు
నరకమునను; మునివరేణ్య! నాచెప్పినచొ
ప్పరసేయక, తప్పకయా
చరింపుమీ; వంశమొందుశ్వశ్రేయసమున్॥ 34

ఆ॥ దైవకల్పితకులదేవత నేమీకు;
నీకులంబువారు ప్రాకటముగ
నానమర్చనంబుఁజేసి, నావల్ల సం
పదలఁగాంతురంచుఁ," బల్కి, యంత॥ 35

వ॥ మాయామయియు, మహామాయయునైనయా నిమేషాఁ బయఁ త
నంతర్హితయయ్యె - నయ్యెడ, హతావశిష్టులైనదుష్టరష్టసాల
కటంక టేయకీటంబులకూటువలుసందష్టోష్ఠులై, పఁడ్లపటపటం
గీటుచుఁ, జేయునది లేక, యేకాకియైయున్న తమయేలికఁ జూచి,
యుద్ధవిశేషంబులతోపాటు, దైన్యంబుదోఁప, రక్షస్సైన్యంబు
నిశ్శేషంబైనవార్తయుఁ, దామింతకు మున్నెన్నండునుం
బడనిపాటునుం "బూస గ్రుచ్చినట్లు" విన్నవించు
కొన్నంత॥ 36

కం॥ ఆజానునుండలుండును
నాజానక్రూరభావుఁడౌడుగఁజచి, "యె
ట్టా! జోదులు, మహిపాదులు
నాజిన్దెగటారిరే, కటా! మనుజాదుల్!!॥ 37

కం॥ ఇదియగునే, నమ్మందగి
నది? యీముక్తేశుఁజంపుటదియెట్టులో! వాఁ
డు దృఢవ్రతుఁడెట్లో! నే
నదియుఁదెలియువాఁడవేగమాచార్యునిచే॥" 38

వ॥ అని, యని ననిశ్చితనిజ పరాజయ పరాభవభావకంబైన నెమ్మనమ్మునను మ్మలికమ్ము గ్రమ్మ, నమ్మనుజాశనుండాత్మనాశఁబు లేశంబైన గ్రహింపలేక, కేవలజిగీషానిష్ఠితాహంతాదుష్టమనీషా దూషితేషన్మాత్రవిజ్ఞానవిజ్ఞుండై, జానుమత్సంజ్ఞాశేషసంజ్ఞుండై, ప్రజ్ఞావన్నిర్దిష్ట నిర్దుష్టపిష్టపేషణాయితనిరాయతియుతాత్యల్పాత్మస్థైర్యప్రజ్ఞుండై, మహామనీషియు,దానవశ్రేయోమార్గోపదేశ సార్థకనైజదేశికవ్యపదేశచారుచర్యుండునైన శుక్రాచార్యుని సందర్శించి, యిట్లనివిన్నవించె॥ 39

ఉ॥ "ఎంతమహాద్భుతంబిది! యనేకులురాక్షసవీరులీల్గిర
త్యంతపరాక్రమక్రములహార్యసధైర్యులు; కానరానురుం
డెంతటివాఁడు! వాఁడుజగదేకభయంకరుఁడౌనుగాదె! దే
వాంతకుఁడున్, ఘనోదరుఁడహర్పతి, నౌర్వము
మ్రింగిత్రేన్చరే?॥ 40

ఉ॥ చండతరప్రతాపుఁడవిశాల్యదృఢాద్రిసమానదేహుఁడా
గండరగండఁడీల్గెనఁట! ఖండితదేవబలుండు, సర్పబా
హుండును, వీరలందఱుమహోగ్రరణాగ్రవిహారనైపుణిం
బండితులే; మహామహిమమండితులే; యరి (రిపు)
నాశశౌండులే।॥ 41

శా॥ ఆచార్యా! మునుపెన్నిజన్నములుమాయంజేయలే; దెండఋ
షీచాచారుల, జన్నిగట్టులనుదండింపంగలే; దెన్నిమా
ర్లో, చీకాకులువెట్టి, వేల్పుగమి "కుయ్యో" యన్న,
"మొఱ్ఱో" యనన్,
మాచేఁబడ్డబిడౌజుఁడోజచెడఁగా, మర్దింపమే? నొంపమే?॥ 42

శా॥ ఏరీ, వారలు? వారిభోగములు నేవీ? యెల్లరున్బందికా
త్రై, "రక్షింపుఁ" డటంచు, మమ్ములను
సంప్రార్థింతురెల్లప్పుడున్;
వారిన్మేముక్షమించినారముగదా! వాచంయమీంద్రా! మహా
వీరుల్, మాధ్వజినీధవుల్దురమునన్బిర్వీకులన్జెందుటా!॥ 43

ఉ॥ మౌక్తికమౌనియెవ్వఁడో, యమర్త్యులపక్షముఁజేరి, యుక్కునన్
దిక్తటముల్ప్రతాపరసదిగ్ధములంబొనరించి, యామునన్
రక్తముబాఱభీకరపరాక్రమునౌమనవారలన్ దప
శ్శక్తిమెయిన్ బళీబళి! విచారవిదూరుఁడురూపుమాపుటా!॥ 44

కం॥ అలముమతీ! గురువర! మీ
రలుకార్యజ్ఞులరు; దనుజరాజ్యరమాఽత్యు
జ్జ్వలవైభవహేతుతపో
విలసనులరనాగతాదివిదులరుమివులన్॥ 45

కం॥ కావున, రాక్షసరాజ్యం
బేవిధిమై "నేడుగాల" మిద్ధసమృద్ధం
బై, వెలయునో; కర్తవ్యము
లేవో, యుపదేశమిండహీనగుణాఢ్యా!॥" 46

వ॥ అని, యడుగులంబడి, బుడుతనివడఁపున నడలునుడువుల వెడ
వెడంబలుకుచున్న యాజానుమండలాభిధానయాతుధానునకు
శిష్యవత్సలుండైన శుక్రాచార్యుండు "వగచినట్లును, వాతపెట్టి
నట్లును" సోల్లుంఠనపూర్వకంబుగానిట్లనియె॥ 47

మ॥ "వినుమోయీ, దనుజేంద్ర! చెప్పెదను; జీవిత్వేచ్ఛ, భోగేచ్ఛవ
ద్దనుమీ; ముక్తువధైకమార్గమిపుడా! యాలోచ్యమానంబిసీ!
వినలేదో, కనలేదో! సజ్జనుఁనొప్పింపంగినౌ దుష్ఫలం
బును; మూర్ఖా! యిపుడేమిసేయుదువురా? "మొఱ్ఱో"
యనంజెల్లునే? 48

చం॥ "గతజలసేతుబంధనము" గాదె! యదోఽఫలితాపలాపమీ
వతులితగర్వమేర్పడ, దివౌకసులన్ బశుమారఘోరతన్,
మతిచెడెనో! మఱేమొకొ! విమర్దితులన్బొనరించి, కూళ! నీ
కతలుమహోఽపదానములుగా, జయగాథలుగాఁగఁబాడితే॥ 49

ఉ॥ చీ! సుజనోపహాతమున శ్రీయును, నాయువు, కీర్తి, సౌఖ్యముల్
మాసి, నశింపవో! తులువ! మాయెదుటన్ బిడియంబులేక, నీ
గాసియదృచ్ఛనిమ్మెయినిగర్గెనటంచును; బల్కెదెంతయున్;
నేనహింయింపఁ;బొమ్మవల;నిన్గనినన్,దురితంబుమాకగున్॥ 50

ఉ॥ ఏలర, నీకుడాంబికము లేలర? దౌష్ట్యము; సాధుబాధనం
బే, లసితప్రతాపమగు! యీాయపథావితథప్రవృత్తి ని
ర్మాల మొనర్పదే, నిను? మమున్బుయిలోటపెట్టి, వా
చాలతఁజూపవచ్చితివె? చాలుర; చాలు! వినంగలేనిఁకన్॥ 51

కం॥ నీవెక్కడ? యాశ్రీగా
రీవల్లభబాహుజుండు, దృఢసంకల్పుం
డై, వెలయుముక్తుఁడెక్కడ?
నీవిజయోపాయమెందు నేఁగాననురా!॥ 52

మ॥ సరియే; యీాయపలాపమేల? విను; నాశంబౌనధర్మంబు; సు
స్థిరమై, యెచ్చట ధర్మముజ్జ్వలతమైదీపించు, నచ్చోజయం
బు రహించున్ధ్రువమై, నిశాచర! భవత్పూర్వార్జితంబౌజయం
బరుదౌనీదుతపఃఫలంబెసుమి! యద్దైనన్, నశించెన్గదా!॥ 53

కం॥ ఇఁక, ముక్తమౌనిచేఁద
ప్పకనీవీల్గుట ధ్రువంబు; పనిగట్టుకపూ
నికమై నీవామహితా
త్మకుతోవైరమువహింపఁదగునే? చెపుమా! 54

కం॥ తనబలము, నెదిరిబలమును,
గనలేనిమదాంధ్యముననుగడఁగితి; విను; నీ
దనుజబలము, గిరిజావరు
తనుజబలము మించునే? యధర్మవిచారా!॥ 55

ఆ॥ కీర్తికాంక్షగల్గి, క్రిందును, మీఁదును
గానలేనినీవు "కయ్యమునకుఁ
గాలుద్రవ్వు" దొర! కాలుద్రోలికినిన్నుఁ
బుచ్చఁడొక్కొ! బిట్టు ముక్తహాని॥ 56

కం॥ ఎగిసెగిసిపడియెదేలర?
పొగరుడుగుము; నీతరంబె, ముక్తమునీందుగ్రన్
మొగి గెలువ? తులువ! నీకిది
తగునే? యిది, "తగరు కొండఁదాఁకుటగాదే?॥" 57

ఉ॥ ఇంతకువచ్చి, వెన్కఁబడుటేమియునీతియుఁగాదు; గాన, దు
ర్దాంతచమూసమూహములఁదద్దయుఁదోడ్కొని, యాజికేఁగి, కా
లాంతకమూర్తివై, కడఁగి, యాముననామునిఁజంపితో, యశ
స్వంతుఁడవౌదు; లాతియెడ స్వర్గమునీయఅచేతిదేయగున్॥ 58

ఉ॥ చింతయొంకితలేక, మునిసేనలనుక్కడఁగించితేని, మే
లెంతయుఁగల్గు; మృత్యువునకేరునుడాగినవారులేరు; దే
హాంతకుఁడున్, ఘనోదరుఁడహార్యసముండగుసర్పబాహుఁడున్
జెంతనులేకపోయిరనునెవ్వగమానుము; పూనుముద్ధతిన్॥ 59

గీ॥ బాల్యయౌవనకౌమారవార్ధకములు
జన్మమృత్యుజరారుజల్ సహజములగుఁ;
జక్రనేమిక్రమంబునఁజాగుసంస
రణము; వీనిఁగాదనఁగ, నెవ్వనితరంబు? 60

కం॥ భవితవ్యత బలవతిసుమి!
యవశ్యమనుభవింపవలయు స్వాచరితఫలం;
"బవినాశి" కర్మయనియెడు
సువచనమదివినవొ! వినియుఁ, జొరనీవొమదిన్॥ 61

కం॥ పుట్టినప్రాణులుగిట్టవె?
గిట్టియు, మఱిపుట్టకున్నె? కేవల "ముట్టిన్
గట్టుకొనియుండఁగఁ" గోరుట
తృట్టికదొట్టని విమూఢవృత్తియెసుమ్మీ!॥ 62

ఉ॥ దానవనాథ! యాగములు, దానములున్, దపముల్, వ్రతంబులున్,
ధ్యానములెన్నొ ధర్మములుదప్పకచేసినవైన, నెల్లరన్
మానక, మృత్యుదేవతయనారతమున్గబళించుచుండునే;
కాని, యొకప్పుడున్ విడువఁగానకయుండును నిత్య
కృత్యమున్॥ 63

కం॥ అస్థిరమల్పంబును, మే
దోఽస్థివసాచర్మనిర్మితానేకమలా
శిస్థానమైనమేన, న
సుస్థాస్నుస్వచ్ఛకీర్తిశోభయుఁగల్గున్॥ 64

వ॥ అటు గనుక, ననిమొన నిలిచి, యరులతలలుదరిగి, తఱుగని చిరయశమునుగడియింపు" మని, శుక్రుండు వక్కాణించి, మఱియు,నిట్లుపన్యసించె॥ 65

ఆ॥ "ప్రాణభీతిచేతరణమొనర్పకయున్న
నీదుదైన్యవృత్తిచే దురూహ,
నాశమొందెదీవు; నామాటువినుముకీ;
నాశనాథ! పోరుటే శుభంబు॥ 66

కం॥ నీచేత మును బరాజితు
లే చయ్యనఁజేవగల్గి, యీర్ష్యాళువులై,
పీచమడఁపఁబయిఁబడుదురు;
వాచాలతమాని, యరుగవలె రణమునకున్॥" 67

చం॥ అన, విని, జానుమండలుఁడహంకృతి, హుంకృతిమీఱి, యొక్కపె
ట్టున రణమున్బొనర్పఁగ దృఢంబుగనిశ్చయభావభాసురుం
డును, గురుబోధపాటనవినూత్నమహోత్సుకతాఽతిసమ్మదుం
డును, నయి, పొంగి, భీకరకఠోరతరాకృతి మించి యార్చుచున్॥ 68

వ॥ మంత్రులతోనిట్లనియె॥ 69

మ॥ "విదితంబుల్ గదా! మీకు, రాక్షసచమూవిధ్వంసమై చిత్ర్యముల్;
మదదంతుల్ హరులన్, వృషాళిపులులన్, మార్జాలజాలంబులన్
బదిపంద్రెండెలుకల్, మయూరములమిణ్ణాగుల్ విజృంభించి,ద
ర్పదరిద్రంబులఁజేసి, నొంచుటయె; దైవంబిట్లువక్రించునే?70

గీ॥ అయినదానికిఁజింతింపనగునదేమి?
చాలు; కర్తవ్యమేమొ, విచారణంబొ
నర్పఁడాముక్తనాముఁడునాశమొందు
టెట్టులనిమొనఁ? జెప్పుఁడూహించివేగ॥ 71

కం॥ సామము, దానము, భేదము
నాముక్తునిపట్లఁజూప వ్యర్థంబులెయౌ;
నోమంత్రులార! దండమె
యేమూహించితిముపాయమిదియ జయముగన్॥" 72

వ॥ అనిన, విని, యొడయనిమతంబుననుమతించుచు, దుర్మంత్రు
లైనమాయాసిద్ధమహామాయజయసిద్ధినీతిమంతులిట్లనిరి॥ 73

క॥ "దేవరతలంపుఁగాదని,
తా వచియింపంగలాఁడె, దైత్యగురుండున్?
భావింపఁగ సామాదులు
కావు ప్రయోజ్యములు; వానిఁగడతేర్పవలెన్॥ 74

కం॥ దొరయూనవెట్టినంతనె
దురమునముక్తర్షిఁదునిమి, త్రుటిమాత్రన, దే
వరఁగానఁగరారే; గం
డరగండల, రక్కసులను గడఁగుముపనుపన్॥ 75

ఉ॥ దుర్గభయంకరాఖ్యుఁడరిదుర్గముఁడొక్కఁడుసాలఁడే, ప్రభూ!
నిర్గళితాత్మధైర్య, నిను, నిశ్చలరాక్షసరాజ్యదుర్గబా
హాఽర్గళుఁగానొనర్పఁడె, క్షణార్ధమునన్?
క్షణదాఽటసాహ్యమున్
దుర్గతిపాలొనర్పదొకొ! దుర్మదు, ముక్తమునిన్ రణావనిన్॥ 76

వ॥ ఆదుర్గదైత్యుండు దినంబునకు మిక్కిలి బలిష్ఠంబులైనయేనెను బోతులను, నూఱు గొఱ్ఱెలను, నిరువదేను వరాహంబులను మృష్టాహారంబుగా నిష్టంబుమై మెక్కుచుండు. మహాశౌర్య సంపన్నుండైనయమ్మహావీరు, నయుతనాగబలోపేతునెవ్వఁడు సంగ్రామరంగంబుననోర్వంగలండు? వానిచేతముక్తర్షిముక్తానుండౌట తథ్యంబు. మఱియును॥ 77

ఉ॥ ముక్తనుహర్షిపక్షమునుబూని, సుపర్వులు దివ్యశక్తిసం
యుక్తులు, యక్షకిన్నరమహోరగసిద్ధులుపెక్కురుండినన్,
దిక్తటవార్ధిమధ్యములదీనతదోఁపఁగ, దుర్గదైత్యస
మ్యక్తతశౌర్యవహ్నితఱుమన్, దఱుమన్, గతియేదివారికిన్? 78

మ॥ మనదుర్గండరికంఠలుంఠనుఁడు; తన్మానిన్, సురానీకమున్
దనివోవన్సమయించి, మించ దనుజాధ్యక్షా! త్రిలోకాధిప
త్యనిరూఢాత్మయశస్సమృద్ధమగురాజ్యంబేలుకో; "మేలు మే"
లని, యాత్మీయులుమెచ్చ నిన్ను, శుభసౌఖ్యంబుల్ గడుం
బొందుచున్॥ 79

ఉ॥ సంతసమంది, శ్రేయములు, సౌఖ్యములున్గొను వేళనన్యమౌ
చింతయిదేల? ముక్తమునిఁజేడ్పడఁజేయుటనీకులెక్కయే?
సంతననేఁగఁజంపు; హరి సాహసశాలి, మృగాళిఁజంపుటల్
వింతలె?" యంచనన్,దనుజవీరుఁడుదుర్గునిఁబిల్వఁబంపఁగన్॥ 80

వ॥ వాఁడును,జెచ్చెరవచ్చి,వియచ్చరవైరికిన్ బ్రణామంబొనర్చి,
యచ్చేరువన్ సముచితంబగు నాసనంబున సుఖాసీనుండైన
యంత, దైత్యేంద్రుండు వానిని సమ్యగ్గౌరవాదులనాదరించి,
స్నేహపూర్వకంబుగా నిట్లనియె॥ 81

శా॥ "వీరాగ్రేసర! దుర్గ!! దుర్దమ! భుజావిస్ఫోటితాజాండ!! ని
న్నేరీ, మించఁగలారు? వింటివొకొ, యిష్టేమయ్యెనో।
దైత్యరా
జ్యారూఢాధికవైభవంబునకు దిష్టాంతంబు నేడిష్టమై,
"కారాకూరముసేయుచుండె" మనమున్;
గర్తవ్యమూహింపుమా!॥ 82

మ॥ ఇఁక, నీవే దనుజాధినాయకుఁడవై, యిక్కట్టు దీనిన్ "గకా
వికలై" పోవుతెఱంగొనర్పుము; జగద్భీతిప్రదప్రౌఢిమై
సకలోపాయసమర్థరాక్షసచమూసన్నాహమొప్పారఁ, గౌ
శికమౌన్యాశ్రమసీమ, ముక్తమునిగాసింబెట్టి, పోకార్పుమా! 83

కం॥ ముక్తునిఁ బ్రాణవిముక్తునిఁ
ద్వ్యక్త ప్రాభవునొనర్ప, యత్నింపు; బలో
త్సిక్తాయుధనైపుణి, సు
వ్యక్తంబుగ, నీకసాధ్యమదియుంగలదే?॥ 84

కం॥ కుడిబుజమవునాకీవును;
ద్విడుపవిమర్దనమునందుదీపింతువు; నా
కెడసేయక, ముక్తునిపీ
డ డిగం ద్రోయంగ, నీకటారియెచాలున్॥" 85

వ॥ అని, జానుమంతుండు తన్నగ్గించుచు, నాడినమాటలకాదుర్గ
నామకదైత్యయోధుండు దుర్గర్వావిష్కారపూర్వకంబుగాఁ,
దన్నేలినవానినెమ్మొగమ్మునన్‌జూడ్కినిల్పి,యిట్లువిన్నవించె॥

కం॥ "దేవరనాకిదిసెప్పం
గా వలెనె? మృగేంద్రమెలుక నమలునె? పుర్వున్
డా వేఁగియడంచునె? తా
ర్క్ష్యవేగముదోమకేల? యమరవిభాలా!॥ 87

ఉ॥ సేనలు-గినలేల? ప్రభు! చెన్నటిముక్తునిజంపవొంటె? నా
హీనునణంచుటొక్కపనియే? మఱి, మీరువచించునద్దియెం
తేనిఁబ్రియత్న మయ్యదియు,నేవము;హాస్యపదంబునౌను; గా
పీనమునెల్క త్రుంపమికిఁబిల్లిని, దానికి నావుమేపుటౌ!॥ 88

కం॥ జిహ్మాశయుఁడగువాఁడొక
బ్రహ్మర్షి; ఘనుండొకో! దొరా! పిచ్చుకపై
బ్రహ్మాస్త్రముసంధించుట
యౌ; హ్మాలనమ్మెల? చాలనా, నేనొకఁడన్?॥ 89

ఆ॥ ముక్తుఁడెంత? వానిమూఁకలుఁదామెంత?
వానిశక్తియెంత? దానవేంద్ర!
అల్పకార్యమునకునధికయత్నమొనర్చు
నతఁడునధముఁడంద్రుక్షితితలమున॥ 90

ఆ॥ "ముక్కుమూసికొనుచు, మూలనుగూర్చున్న"
ముక్తుఁడేమిసేయు? రిక్తుఁడెన్న;
భయము, సందియమ్ము వలదు; రాక్షసరాజ!"
యనఁగ, జానుమంతుఁడనియెనిట్లు॥ 91

మ॥ "బళిరా! దుర్గ! హతాన్నిరస్తదివిషద్వర్గా! క్షణార్ధంబులో
పల నాముక్తు, మునీశయుక్తు ననిఁజంపంజాలుపర్యాప్తవీ
ర్యలసద్బాహుపరాక్రమక్రముఁడవౌరా! సత్యమే; సందియం
బు లవంబేనియులేదు; కాసరువధమ్మున్వింటివో,
లేదాకో?" 92

ఉ॥ అంతటికాసరాసురుఁడెయాహవమందునశించె; దుర్గ! దు
ర్దాంతుఁడవౌదువైనను, యథామతిఁబోక, మదాజ్ఞ సైన్యముల్
సంతనస్వీకరించి, రణసన్నహనంబొనరించుటొప్పు; ని
శ్చింతగగెల్తువప్పుడు; వశీకృతవైరివెయాఁదువాదటన్॥ 93

మ॥ ఇఁకనాకేమియుఁజెప్పకేఁబలికినట్లేసైన్యసాహాయ్యమొం
ది, కృతజ్ఞత్వముఁజూపి, మాయెడలభక్తిన్మానకత్యంతశౌ
ర్యకృతాటోపముతో, నహంకృతిమెయిన్బలిస్థానముంజేసి, ము
క్తికునిన్, సర్షిగణున్రణాంగణమునన్గగ్గాడిఁద్రుంగింపుమా. 94

వ॥ అనిన, విని, వాఁడును. 95

చం॥ "సరి! యటులే" యటంచు, దనుజప్రవరుల్ జయవెట్ట, దుర్గుఁడు
ద్ధురరణదుర్ధరుండుధృతితోఁ బరితోబలుఁడౌచు, వేగఁ దా
నురురణరంగమందుఁ ఋకునుద్ధతిదోఁపఁగఁ బోవుచుండినన్,
బరుషశివారవంబులు వినంబడె; గ్రద్దలు వ్రాలెఁ బైఁబయిన్॥ 96

కం॥ దుశ్శకునంబులనెంచక,
దుశ్శకభుజబలయుతుండు, దుర్గుఁడునిజతే
జశ్శోచిష్కేశోరుమ
హాశ్శమితోగ్రప్రతాపుఁడై, వెళ్లొందెన్॥ 97

ఆ॥ కలకుటసుర, ముక్తక్షణమునవోడింప
నిశ్చయించుకొని, వినిద్రతేజ
మొప్పఁ గౌశికాశ్రమోపాంతమున సేన
నిలిపె; మునియు వినఁగఁ గలకలంబు॥ 98

ఆ॥ దుర్గదైత్యపాశుదుండగినితనంబు
నాకళించుకొని, మహర్షిముక్తుఁ
డంతఁదెలిసి, తెలచెనానిమేషాంబఁ; దా
నిలిచి మౌని మ్రోలనిమిషమ్మునకు॥ 99

చం॥ శరణమొసంగి, మౌక్తికునిఁ జంపఁగవచ్చిన దుష్టు, దుర్గు సం
హరణమొనర్పఁదాబహుసహస్రముఖాక్షియునై, సహస్రబా
హురయవిసృష్టశస్త్రనిచయోగ్రనికృత్తతదీయసైనికో
త్కరకరపాదశీర్షయయి, లా నిమిషంబకడున్గడంగినన్॥100

వ॥ ఒక్కసింహంబును వాహనంబుగా స్వీకరించి, యారోహించి, యాదేవి సూర్యకోటిసమప్రభాఽసమాన ప్రభాసమానయై, తోఁచినన్, జూచి, రాత్రించరవీరవారంబులు సంత్రాసంబు నొంది, పంతంబులు సంతలఁబెట్టి, బెట్టిదంబులుమెట్టఁగొట్టి పలాయనమంత్రపారాయణత్వంబవలంబించెనంత॥ 101

శా॥ వారిని హెచ్చరించి, తరవారిని ద్రిప్పుచు, దుర్గుఁడంత, న
వ్వారిగ రోషభీషణరవంబున నార్చి, పటుప్రతాపదు
ర్వారుఁడు నౌచు, వారు తనవారని యెంచక, దుశ్శ్రవంబుగాఁ
గాఁబులు ప్రేలుచున్, దివిజఘస్మరుఁడాజికిఁ
బ్రోత్సహించుచున్॥ 102

ఉ॥ వానిభయంకరార్భటిదివంబును, బృథ్విని బిండిసేసి, య
ర్ణోనిధులన్ గలంచి, శిఖరుల్ మొదళుల్ గదలించి, మించి, ఝుం
ద్రానలసూరసూనుదనుజాప్పతివాయుకుబేరశర్వులన్
దీనత ముంచె; రక్కసుఁడనిన్ నిమిషాంబను ప్రేసెఁ
బెన్గదన్॥ 103

గీ॥ అట్లు ప్రహరింప, నిమిషాంబ యాగ్రహించి,
భీకరాకారయై, వినిర్భిన్నముగ నొ
శర్చి గదను, దనుజసేన నేర్చినంత,
దుర్గుఁడును గ్రుద్ధుఁడై, యుద్ధధూర్వహుండు॥ 104

కం॥ పరిఘాయుధమున నిమిషాం
బ, రభసమొప్పంగఁ, దివిరి ప్రహరించుడు, దు
ర్ధరతరమగు తత్సంరం
భరుషాఽరుణదృగ్యుగప్రభన్ గని, దనుజుఁడ॥ 105

ఆ॥ ఉద్యమించి యందఱుద్ధతి మించినా
నాఽఽయుధోత్కరములనామెపైఁ బ్ర
యోగమొప్పఁ జేయ, వేగ దుర్గుని, వాని
సేన ముంచె దేవి శితశరముల॥ 106

మ॥ చతురంగధ్వజినిన్ గజంబులు, రథాశ్వంబుల్ పదాతుల్, శర
ప్రతతుల్ ముంచినఁ, గాననేరక సురారాతుల్ నిమేషాంబకున్
జతనంబొప్పఁగ నంతరిక్షమునఁ బెల్చన్ నిల్చి, మాయావృతై,
చతురోపాయతనైక్షవక్షితి సమాచ్ఛన్నంబుగాఁ జూపఁగన్॥ 107

కం॥ దేవియు, మాయామయియే
గావున; దుర్గాదిదైత్యకల్పితతన్మా
యావిచ్ఛిత్తిని ద్రుటిలోఁ
గావించెనిశాతసాయకప్రకరములన్॥ 108

వ॥ ఇట్లా నిమేషాంబ, తన్మాయాభేదనంబొనర్చినంత, తదీయనానాశస్త్రాస్త్రప్రహారంబులన్ విక్షతనాసికులును, వికృత్తహస్తపాదులును, విత్రుటితవక్షస్కులును, విలూనజత్రులును, విశ్లథసంధిబంధులునై, సంగ్రామభూమిని "జాపచుట్టుగఁ" బడి, కొట్టుమిట్టాడన్ జొచ్చిరంత; దుర్గుండును, దుర్గర్వంబునకున్ దోడు దుష్కోధంబగ్గలంబుగా, హతావశిష్టులైన రాక్షసులతోడం గూడి, చండవిక్రమోద్దండయైనయద్దేవింగదిసికడున్, గినిసి, యసిముసల ప్రముఖ ప్రహరణంబులన్ బరంపరగాఁబ్రయోగించి, యెట్లైనన్ గసిమసంగి, కసిఁదీర్చుకొనంగోరుచుండె; నాదేవియు, రక్కసుల నాలోకించి॥ 109

కం॥ నిమిషార్ధంబున నామె, య
నిమిషారులఁద్రెళ్ల నేసి, నిరుపమనిపుణ
త్వ మహిష్ఠ విక్రమక్రమ
మమర, నమరగణ సమర్చ్యయై, విలసిల్లెన్॥ 110

ఆ॥ కుసుమ వృష్టి గురిసెఁగుశికసుతాశ్రమ
సీమ; దైత్యులుహతశేషులంతఁ,
"జెట్టుకొకఁడు, నొకఁడుపుట్టకునై" "యట
చేతఁ బ్రాణములను బ్రాతిఁదాల్చి"॥ 111

ఆ॥ అందుఁ గొందఱేగి, యాజానుమండలు
నకును విన్నఁదనము మొకములందుఁ
దోఁప, విన్నవించి, దుర్గుదుర్మరణంబు,
సైన్యనాశమాదిజన్యవార్త॥ 112

కం॥ విని, దనుజపతియు, మనమున
వనటబెరుగఁ, కృత్యమెఱుఁగువలఁతితనములే
క, నితాంతతాంతుఁడయ్యెను
మునిపతియువశితస్థుఁడై, ప్రమోదంబందెన్॥ 113

వ॥ అనితెలిపిన, విని, యవ్వలి వృత్తాంతంబెట్టిదని, పీణాపాని వాణీజానినడుగుటయును॥ 114

ఆ॥ సిరులుకనులకొనలఁగురియు శ్రీసర్వమం
గళకుమగఁడవగుటఁగానువీన
మేనిలేని నీదుమేనిబూదియె భూతి
నాశ్రితాళికొసఁగునమరలింగ!॥ 115

ఇది, ఆంధ్రీకృతముక్తీశ్వరోపాఖ్యానంబునందు,
దుర్గాసుర సంహారమన్నది, దశమాధ్యాయము.

---

## ఏ కా ద శా ధ్యా యం ము

ఆ॥ సికను జంద్రరేఖ, వికటంబులగు మూఁడు
కన్నులందు నొకటఁగానుకింప
కత్తుకిత్తి, మేన నగజాతయొప్ప శ్రీ
కపిలమల్ల! రిపునికాయభిల్ల!! 1

ఆ॥ అవధరింపు మవలిదగుకథ; సురముని,
నలువకనియె “ముక్తనాముపృత్త
ముత్తమంబు వినఁగ, నుత్సాహ కౌతూహ
లములు నొదవుమదిని సుమహితాత్మ!” 2

ఉ॥ ఆ నిమిషాంబ యట్టులమహాబలగర్వితు, దుర్గుఁద్రుంప, నా
జానుమదాహ్వయాసురుఁడసాధ్యుఁడు చేసినదేమి? ముక్తస
న్మౌనిక్రతూత్తమంబది సమంచితమెట్లు సమాప్తమయ్యె? న
ద్దాన నతండునొందిన ప్రథాఫలితంబులఁ దెల్పుమెట్టివో,” 3

కం॥ అతికుతుకాన్వితుఁడయి, శత
ధృతితనయుఁడు తండ్రినడుగ, ఋషిచరితము, నా
దితిసంతతివృత్తాంతముఁ,
బితామహుఁడు సెప్పఁ దొడఁగెఁ బ్రీతాత్ముండై॥ 4

కం॥ “విను; నారద! శంభుభుజా
జనితుండౌ మౌక్తికర్షిసద్గాథయు, దై
త్యుని గాథయుఁదెల్పెద; దు
ర్గునిమరణానంతరము నిగూఢముగాఁగన్॥ 5

ఆ॥ జానుమండలాభిధానదానవనాథుఁ
డంత, మంత్రివరులనామతించి,
మంతనములుసలుప, సంతనసమకట్టి,
యిట్టులనియెఁగృత్యమెంచిచూచి॥” 6

శా॥ “అముక్తున్ గడతేర్చుటెట్టులతఁడత్యాశ్చర్య చర్యాప్రభా
వామేయోద్ధురమేదురాశయమహత్త్వాప్త్యేకమూలుండుగా
దే? మాటెందునులేనిజోదులముమేమేయన్న, మాధార్ష్ట్య మే
దీ? “మూలంబడె;” దుర్గుఁడున్, మహిషుఁడున్దీండ్రించియున్,
మ్రందరే?” 7

శా॥ రక్షోపీరులరాతిభీకరులు, సంగ్రామాగ్రగాముల్, మహి
ష్ఠక్షోదక్షమనై జవిక్రమకళాశ్లాఘ్యుల్, నిమేషాఖ్యచే
నక్షోభ్యుల్ గడతేర్పఁగాఁబడిరఁటే! హా; దైవదుశ్చేష్ట లి
ట్లే, క్షోభంబు,నతర్కితోపనతమున్, హేయంబుఁగల్పించుఁగా!॥8

వ॥ వేఁగన్నులవాని వేడబంబేపాటిది? వేఁడిమిఁజూపు వేల్పుపోఁడిమి నేఁబంపిన గడ్డిపోచనైనఁగాల్ప నేర్చునే? వెట్టిమొట్టితీండ్రంబే గాని - వేవెల్గుకుట్టనేఁగన్నెట్టుఁజేసినంతనే, యేదిక్కునుం

గానక, బిక్కుబిక్కుమనుచు, బిక్కమొగమ్మువైచుకొని, దక్కి
నంబునదక్కియుండెనుగదా! పొలసుఁదిండి మనకొలమువాఁడే
గావున; నోరెత్త నేరఁడనుట నిక్కువంబు. అపుడుఁబాము వోలెం
బడియుండు పగ్గంబుదాల్పు కిగ్గాడివేల్పు సిగ్గటిబెగ్గడిల్లుచుండు.
సోఁకువేలుపుమాతోఁటకాపరియై, పూలురాలుట నేఁజూచినంతనే,
మ్రుచ్చి మిమీఁదఁబెట్టి, బెట్టిదంబులువలుకుదునోయని, పుల్కు
పుల్కునంజూచుచున్,బలుకరించినను,బలుకకుండు.లిబ్బులున్న
వన్నమిట్టి పాటొక్కవ్వా ఎప్పుడో, యుండెనేమో - కాని,
యాకాయకంటిబేహారికిక్కురుమనకుండ,గ్రుక్కిళ్ళుమ్రింగుచు,
నున్నరొక్కమ్మెక్కుమ్మడిమాకప్పనమ్ముగావించి, "గ్రుడ్లప్ప
గించి చూచుచు," నేఁజూతునేమో - యని, "నేలచూపులతో,"
గోరను నేలవ్రాయుచుండుఁగాదె! ఘోమోటఁజెంది, మేఘాబోళ
శంకరునకుంగింకరులమై,రాచటికంపుతీవిమానకయే,కొల్చియుం
గొల్వనట్లుమెలంగుచుండుట మాకుందప్పకుండె. ముదిమి
మెయి పదిచెడిన మొదటివేలుపునకుమాజోలియే లేదు. వేసాల
మారియు, దోసకారియునైనయాకట్టివేల్పు, "సోఁకుమూఁకల
గొంగ"యని,పేర్వెట్టుకొన్నట్టువిన్నమాకొక్కింతవింతయౌను
గాని; వాని యాపేరు ''నేతిబీఱ" వంటిదై, బీరమునకేయని,
యెప్పుడో తేటతెల్లంబయ్యె; నేలయన, నేనువానివేయంచుల
చుట్టుఁగైదువున్ జుట్టుఁజుట్టిచక్కిలంబువోలెఁగరకరనమలివేయ
లేదె? అన్నలారా! యిన్నిచొక్కంపుటీరసంబులు లెక్కకు
మిక్కిలియున్నను, ఉన్నట్టుండి-"ముక్కు, మొగమ్మెఱుంగని"
యెవ్వఁడో, ముక్కుండఁట! వాఁడొక్కఁడు "డొక్కలు మాడ్చు
కొన్న" మౌనియఁట! విశ్వామిత్రనామకపారికాంక్షి,క్షత్రియ
పక్షక్షతిమహోద్యోగమదోద్వేగంబులకు "సొడ్డుపెట్టి" బ్రహ్మ
జ్ఞానమ్ముసుసొమ్మొనర్చుకొందునను పేరాసకు "బొమ్మగట్టి",

యాజ్ఞికంబను పనికిమాలినకూలిపనికిఁబాలుపడి, డీలు పడక పీఁటపైఁగూర్చుండ, వాఁడొకయూరు-పేరు లేని యేదోజన్నం బొనర్చుచుండెనఁట! వానికిఁదోడెవ్వతెయో-నిమేషాంబయఁట! అదియొక వీరనారియై, దానవవీరులన్ జక్కాడెనఁట! ఈ క్రొత్త మాటలు మాకుం "గర్ణశూలంబులై", యస్తిమితస్థితిని గల్గించుచు, మావ్యక్తిత్వంబునకును, శక్తిమత్త్వంబునకును, అస్తి నాస్తివికిచిత్సాకుత్సాహేతుభూతంబులై, యుత్సాహోత్సాద కంబులౌచున్నవిగా! మనవాండ్రు వాండ్రకుం "బ్రక్కలోని బల్లెమ్ములై" యున్నట్లు వాండ్రెఱుంగరో! గోటమీటినంబోవు వారైనను, వాండ్రు చీటికి-మాటికిమనపైఁ "గయ్యంబునకుఁ గాలుద్రువ్వుట" యేలొకో! మదాశయంబుపలక్షించి, కించి త్కుంచితధైర్యుండనైననాకున్ గర్తవ్యసూచనంబుఁగావించి, మీ రాజభక్తిని బ్రదర్శించుకొనుఁడు-చూతముగాక" యని, మఱియును. 9

కం॥ "బిరుదు మగలు, దుర్గమహో
దరకాసరసర్పబాహుదైవతరిపులీ
ల్గిరి; లేరిఁకవాండ్రందఱు;
కరణీయంబేదిమనకు? ఘనమతులారా!" 10

ఆ॥ అనుడు, సచివులిట్టులనిరి-"దైత్యేంద్ర! ని
ర్వేదమేలనీకుఁ? బేదకట్టు
లుజ్జగించిదాని, నుత్సాహశక్తిమై,
ముక్కుఁజంపు; వీరమూర్తి వీవు". 11

గీ॥ దుర్గమహిషఘనోదరాదులు, మఱెంద
ఱెందఱేని గతింపనీ; కొందలంబు
మాని, యీాయున్న మొనగాండ్రతోననిమొన
శత్రువులఁజంపుమోదైత్యచక్రవర్తి!" 12

ఉ॥ నీబలమున్, బ్రతాపమును నిబ్రువు(డెన్న(టికైన(బొందుటా
హా! బడబానలోజ్జ్వలమహః ప్రకర ప్రకట ప్రతాపవి
ద్యాబలమెన్న మిణ్గురులకబ్బుటకాదె! తలంచి చూడ,"నే
లాబలవద్విరోధమని," యాముని ముచ్చ్బదలంప(డిప్పుడున్॥ 13

ఉ॥ దానవనాథ! మృత్యువది, తాఁదనయంతటరాదు; కాలమే
హానియు, వృద్ధియున్జనులకబ్బ(గ(జేయును; దుర్గముఖ్యులన్
మౌనియు(గాని, యాపనికిహాలినజంత, నిమేషగాని, సుం
తైన, నణంపలేదిదియథార్థము; నమ్ము(డునెమ్మనమ్మునన్ 14

వ॥ ఒక్కొక్కప్పుడు ప్రాప్తకారణంబులై, క్రూరశక్తులు కొన్ని ప్రాప్తకాలురన్గాలుని ప్రోలికంపుచుండు;నప్రాప్తకాలురుపులి నోరంబడియును,బడలికయే లేక, బ్రతికిబయటంబడుదురు. ప్రాప్తకాలుండైనపూరుషుండుపూలపాన్పుపై(బన్నుండియు(,గుశాగ్రమాత్రసంస్పృష్టుండై, తత్క్షణంబపంచత్వమొందు. జన్మించిన ప్రతిప్రాణికిని మృత్యువభ్యాశసంచారంబు(జేయుచుండుటతదభ్యాసంబు. అంతియకాని; యయ్యదియమ్ముక్తమౌనిమాహాత్మ్యంబు ముమ్మాటికింగాదనియే, మేమేకకంఠమ్మున ఘంటాపథమ్ముగాఁజెప్ప(గలవారము. మఱియొక మనవినవధరింపు(డది యెట్టులనిన. 15

మ॥ ప్రతిపార్శ్వ ప్రభలన్యుగాంతసమయౌర్వస్ఫారకీలాఽఽవళిన్
బ్రతివీరుల్ రణరంగమందునినునోర్వన్లేక, కర్తవ్యముల్
మతికిన్రాక, విమూఢులై, దశదిశల్పాల్మాలి,చింతన్బలా
యితులౌదుర్గద! యట్టినీవిపుడుమాయిన్వానిమాయింపవే! 16

ఉ॥ దేవభయంకరుండవుగదే! యభయంబొస(గన్, జగంబులెం
తేవిశదంబునీయశమునెంచి, నుతించుచు, హాయి(గాంచున
య్యావుమదిన్ భయాకులత, నీలువుకోల్పడి, యిట్టులుంట ర
క్షోవర! చుల్కనౌదువు; విశుద్ధమతిన్ దలపోసిచూడుమా!" 17

వ॥ అని, సచివులు మనవి సేసినన్, విని, దనుజుండు నిశ్చింతుండై,
కొంతకాలంబుండె-నంత, నక్కడ॥ 18

గీ॥ ఉత్తమశ్లోకుఁడమ్మౌని సత్తముండు
నుత్తతముఁడఖిలార్యసన్నుతతముండు
నుత్తమౌజుండు, గుర్వాజ్ఞ, నాత్తదీక్షఁ
గ్రతువుమానక, కౌశికాశ్రమమునందు॥ 19

గీ॥ ఏశ్రమయు లేక, దీక్షవహించి, మించి,
యంతరాయమెఱుంగక, యంతమౌని
పాశుపతమనునమ్మహావ్రతమొనర్చి,
యగ్నులగు వ్రేల్వ, నప్పుడత్యద్భుతముగ॥ 20

కం॥ రథగజతురగభటావళి
ప్రథనసమర్థంబు పుట్టి, బహుశస్త్రాస్త్ర
ప్రథిమప్రకటంబుగను, నవి
తథభువనాశాస్యసర్వతఃకాంతంబై॥ 21

గీ॥ అట్లై వ్రేల్వంగ వ్రేల్వంగ, నగ్నికుండ
మధ్యమునఁబుట్టి, కన్పట్టె మహితతేజుఁ
డొక్కపురుషుండు; దివ్యదేహుండతండు
మౌక్తికర్షిసంకల్పసంపాదకుండు॥ 22

శా॥ విద్యుత్పింగళలోచనత్రితయుఁడావిర్భూతపూర్షుండు, భ
స్మోద్యద్ధూళనసర్వదేహుఁడు, సమాంశోద్భూతచంద్రస్ఫుర
న్మాద్యజ్జూటకిరీటశోభితుఁడు, సంవ్యాప్తోరగాస్వర్ణర
త్నద్యోతాభరణుండు, స్త్ర్యాదృతనిజార్ధస్ఫూర్తిమన్మూర్తియున్॥ 23

సీ॥ గజచర్మచేలంబు, కఱకౌత్రిశూలంబు
కటితటంబునఁ, గరాగ్రమునఁ గ్రాల,

స్ఫటిక ప్రతీకాశ చారుహాసాకాశ
ములు మొగమ్మున, శిరమ్మునవెసంగఁ;
జంద్రసూర్యాగ్నులచ్ఛస్వాత్మమగ్నులు
కనులను, శుభపదాగ్రములఁజెలఁగఁ,
గాలకూటంబు, శార్కరకృతాటనము కం
ఠమున, నిజోపకంఠమునవొప్ప,

గీ॥ వామవామాఽన్వితుండు, గంగామహాప్ర
వాహ వేగావరోధదివ్యజ్జటాక
లాపుఁడహివల్లభకలాపుఁడాపవిత్ర
దీక్షనున్న మౌనికిని బ్రత్యక్షమౌచు॥ 24

గీ॥ దివ్యము, మహాప్రభావసంభావ్యమధిక
భవ్యమౌపాశుపతమునస్త్రవ్యతికర
మహితమహిమంబుఁజూపి, యమ్మౌక్తికాభి
ధానమౌనీంద్రమౌళితోఁదానిటులనె॥ 25

వ॥ "వత్సా! సంతుష్టస్వాంతుండనైతి. నీవ్రతసుకృతంబులనితర పరిచితపరిచరితేతరంబులు. పాశుపతాభిధానంబైన యమ్మహాస్త్రంబును సహాయంబుగా స్వీకరించి, పురాకల్పంబున భవాదృశులైన మహాత్ములుకొందఱు సంగరరంగంబున శత్రువులనుబెక్కండ్రను భంగపాటొందించి, దశదిశావిశదయశో విరాజితులైరి. ఏతన్మాహాత్మ్యంబునగ్గింప, బ్రహ్మాదులకైనశక్యంబు గాదు. దివ్యాస్త్రంబియ్యదియన్యదుష్ప్రాపంబు. జైత్రంబైనయీ పాశుపతాస్త్రంబున్నచోట జయకీర్తిశ్రీసమృద్ధులు సుసంపన్నంబులౌనుగాదె! నీవు నావల్ల దీనిని స్వీకరించి, శత్రు

సంహారంబుగావింపుము. యోధయూథంబులునిన్నుంగన్నెత్తి యైనంజూడజాలవనుట నిక్కువంబు. ఇఁక, జానుమండలుం డెంత?" యని, ప్రోల్లసన్మానసోత్సాహుండై, యుపదేశించి నంత, నమ్మౌక్తికమౌనీంద్రుండును, పూర్వునివల్లనప్పాశు పతాస్త్రంబునుబొంది, యమ్మహాత్ము నిట్లునిస్తుతియింపందొడంగె॥

సీ॥ దేవదేవుని, మహాదేవుని, దివ్యప్ర
భావుని, నిన్ను బ్రహ్మవిభావ్య
మాహాత్మ్యుఁ, దాదాత్మ్యమంజుళప్రహ్వాభా
వాపూర్ణభక్తవంద్యానుభావు,
హర్యహర్యకుమారికాఽఽక్రాంతవామార్ధ
దేహు, నిరీహు, ధుతాఘమోహుఁ,
గాలకాలుని, బీతకాకోలసంప్రాప్త
నీలకంఠత్వనిర్ణిద్రకీర్తిఁ,

గీ॥ త్రిణయనునిఁ, బ్రమథాధిపుఁ, ద్రిపురహరుని,
హరు, నిరాకారు, నిర్గుణుఁ, బరమపురుషు,
సచ్చిదానందమూర్తిని, శాంతభావు,
నిత్యముక్తునిఁగొల్తు వినిర్మలాత్మ!॥ 27

సీ॥ అష్టమూర్తులతోడ నఖిలవిశ్వావలం
బకుఁడవై, పొలుచు త్ర్యంబకుఁడవీవ;
సర్వసాక్షివినీవ; సర్వరక్షివినీవ;
జగదాత్మకుఁడవీవ; జగమునీవ;
వహ్నివినీవ; హవ్యమునీవ; హోతయు
నీవ; యజ్ఞము, ఫలమీవ; దేవ!
వాచామగోచరప్రాభవవైభవుం
డవు నీవ; మాయకునవలనీవ;

గీ॥ భ్రాంతమూఢాత్మకులు పృథక్త్వంబునీకుఁ
జెప్పుదురు; మనోఽతీతు, సచ్చిత్స్వభావు,
దేవదేవుని, సురమునుల్ దెలియలేరు
నిన్ను; శరణాగతశరణ్య, నిత్య, మున్ను॥ 28

కం॥ ఏనేడ? యాగమేడ? ని
శానాథార్కాగ్ని నేత్ర! శాక్వరపత్రా!
మౌనియనిపించుకొంటకు
నేనీప్రోపానపడియె, యెనఁగితిదేవా!!॥ 29

కం॥ క్రతువిధి, మఱిపాశుపత
వ్రతము భవత్కారుణవలన వాసింగాంచెన్;
సతతము ప్రసన్నభావా
న్వితముగ ననుఁజూచి, విపులవిజయ మొసఁగుమా!"॥ 30

వ॥ అని, బహుప్రకారబులన్ బ్రార్థించుచున్న యమ్మాక్తికమానీం
ద్రునిం జూచి, యత్యంతసంతుష్టాంతరంగుండై, పరమో
దారుండైనయప్పరమపురుషుండిట్లనియె॥ 31

ఉ॥ "ప్రీతుఁడనైతినీస్తుతికరిందమ! నీకగుభద్రమెల్లెడన్;
నీతిపరుండవౌదువు; మునిప్రవరా! సమరోత్సుకుండవై,
యాతతశక్తినిర్జరగణాఢ్యుఁడవై, "సురకంటకంబు"
(భేదన బు) ని
ర్భీతనిముట్టడించి, రిపుభేదనముఁన్బొనరింపుమా! వడిన్॥ 32

ఉ॥ అంతియెకాదువత్స! సమరాంగణమందమరారినొంచి, దు
ర్దాంతుని, జానుమంతు, వితథప్రతిభున్బొనరించి, మంత్రిసా
మంతచమూసమూహ మచిరంబునఁగాలుని పొలికంపుమా!
సంతసమందులోకములసాధ్యుఁడుసాధితుఁడయ్యెనంచొగిన్॥"

మ॥ అని, సాశీర్వచనంబుగా, బహుళతేజోఽసహ్యుఁడాపూరుషుం
డును, ముక్తర్షినను గ్రహించి, గుణగణ్యున్, జూచుచుండఁగఁ, జ
య్యన, నంతర్హితుఁడయ్యెమౌనులనమస్యల్, తన్నమస్కారముల్
గొనుచున్, బావనవీక్షణంబులఁగృపాఽకూపారమేపారఁగన్॥34

వ॥ అంత, నష్టాక్తికమౌనీందుఁడును, మహిష్ఠనిష్ఠమెయిన్ గ్రతు
సమాప్తింగావించి, విధివదాచరితావభృథుండై, విజయోదయ
విషయంబున విగతశంకాఽఽతంకుండై, కవచియు, నిషం
గియు, ధన్వియు, మణిఖచితకనకమకుటవరవిరాజమానుం
డును, రథారూఢుండునై, రూఢంబై, రాశీభూతంబై, మూర్తీభ
వించిన పౌరుషంబోయనఁజొక్కంబైన నూతన రూపంబునఁ
జూపఱుచూడ్కికి మిక్కిలివెక్కసంబై, కన్పట్టె-నప్పుడు॥ 35

మ॥ పరివారించి, విరించితుల్యులు, తపస్స్వాధ్యాయసంపన్నులెం
దఱొమౌనీంద్రులు, బ్రహ్మవాదులు, నితాంతప్రాభవోపేతులీ
శ్వరబాహా ప్రభవున్, రణోద్యతుని, శశ్వత్సాధువాదంబులన్,
గరమర్థిన్ "సురకంటకంబునకు" దగ్యానంబునన్ వచ్చినన్॥36

చం॥ మునివరులన్, సహోగ్నులఁ బ్రమోదభరంబున ముక్తమౌనియున్
వినయవినమ్రుఁడౌచును, బునఃపునరాచరితప్రణాముఁడౌ
చు, నతులొనర్చి, హార్దపరిశోభితభాషణభూషణుండునౌ
చును, గమనశ్రమన్మఱచి, సుస్థిరుఁడై, పయనించి,యంతటన్॥

చం॥ శుభశకునంబులన్గని, విశుద్ధచరిత్రుఁడు ముక్తమౌని దా
నిభరథవాజిపత్తిచయమేడైఱదానవురాజధానిఁజే
ర, భయవికంపితుల్, చరులు రాజసతామసమూర్తి, జానుమ
ద్విభుదరిసించి,కొంచఱునవిస్తరమున్వినుపింప,దైత్యుఁడున్॥38

కం॥ కటములవరంగఁ, దానం
తట నువ్వెత్తుగను లేచి, దర్పముమై, "నె
ట్టెటు? మునిముఖ్యులదాటునఁ
గటకమునే చేరిరా? యిఁగన్ జచ్చిరిలే!"॥ 39

మ॥ అనుచున్,గన్నులుజేవురింపఁ,గనలాహారించి,తీండ్రించి, యా
దనుజుండున్ఘనుఁడై,చమూయుతుఁడుదగ్రాత్రిన్మహోత్సాహియై,
మునిసేవ్యుండయి,యున్నయున్నతబలున్ముక్తర్షినీక్షించి,వెం
టనె,వింటన్శరజాలముల్పయిఁబయిన్వర్షింప,నొక్కుమ్మడిన్॥40

మ॥ అసురుల్ ముష్కరులౌచుఁ, దామశనికల్పానల్పపాషాణవ
ర్షసముద్వేగులునౌచు, మౌక్తికునిఁ,దత్సైన్యంబుఁజీకాకొన
ర్ప, సమంచత్ప్రమదారేతికమున దర్పంబేర్పడన్, మౌని యే
ర్చె సురారాతులఁదామౌనునులుమహోర్చిష్మచ్ఛరాగ్నిచ్ఛటన్॥

ఉ॥ విస్మయమున్, భయంబుఁ బిరుపీకులునెమ్మదులంగలంప, నిం
ద్రస్మరఘస్మరాద్యమరనాయకులందఱు భ్రాంతిఁజెంది, కా
ర్యస్మృతిలేకయుండిరి; మహాగిరులున్జలియించె; నిమ్నగల్
భస్మములయ్యె; దైత్యమునివల్లభులెక్కటిపోరొనర్పఁగన్॥ 42

ఉ॥ ఎప్పుడు మౌక్తికర్షిస్మరియించెనో నిర్మలమానసాబ్జమం
దప్పరమాద్భుతోదయ, మహామహిమాన్విత, నింద్రదండధా
ర్యప్పతిరాజరాజవినుతాంఘ్రియుగన్, నిమిషాంబ, భక్తిమై,
నప్పుడెనెక్కొనెన్ రథగజాశ్వపదాతిచయంబసంఖ్యమై॥ 43

మ॥ పదులున్, వందలు, వేలు, లక్షలు గజాశ్వస్యందనారూఢులు
ద్యదుదీర్ణద్యుతిమద్బహుప్రహరణాహంకారహుంకారుల
భ్యుదితుల్, రత్నకిరీటకుండలులు, విస్ఫూర్జత్తనుత్రాణులా
త్తదృఢాంగోన్నతులెల్లెడన్ నిలిచిరంతన్మౌక్తికస్వీకృతుల్॥44

వ॥ వారిలోన-సువీక్షణుండును, సుబాహుండును, సుబలుఁడును, సులక్షణుండును, సులోచనుండును, ప్రజ్ఞావంతుండును, విచక్షణుండును, విద్యానిధియు, వీర్యధరుండును, ధర్మబంధనుండు నను పదువురును మహాఽభిజ్ఞత్వమహాబలత్వమహాధీరత్వాద్యుత్తమలక్షణలక్షితులు, నవక్రవిక్రమోద్దాములునై, సేనాఽధినాయకత్వనిర్వాహకులై, మౌక్తికమౌనీంద్రునిపక్షంబవలంబించి, జానుమండలాభిధానయాతుధానుని, దదనుయాయులైన సాలకటంకవేయులను మార్కొన్నయంత, మునిజనదనుజనిచయములకు మహాఘోరంబైన సంగ్రామంబు ప్రవర్తిల్లె - నయ్యెడ, జోదుల సింహనాదంబులు మేదురంబులయ్యె; శిరుల శింజినీధ్వానంబులు భూనభోఽంతరాళంబు నిండె. హయసముదయహేషితంబులును, వారణవారఘీంకారంబులును, సైనికనికాయంబుల కోలాహలంబులును ముమ్మరంబులై, "సురకంటక" పుటభేదనంబునన్ గార్భిణభ్రూణభేదనంబుఁ గల్పింప, నావిర్భవించె - మఱియును॥ 45

చం॥ హయఖురఘట్టనోద్ధతశతాంగరయోత్థితధూళిపాళియున్
వియదనులేపనంబయి, నవీనధరాతలమై, యెసంగ, భూ
మియు,మదవారణంబులయమేయతనుద్యుతి, వ్యోమమైతగన్,
రయవిచలద్భటోద్భటనినాదములుప్పతిలెన్ ప్రచండతన్॥46

శా॥ రక్షోమౌక్తికమౌనినాథకృతసంగ్రామంబువర్తిల్లె న
త్యక్షౌహిణ్యుభయోరుసైన్యము జగద్వ్యాప్తప్రతాపప్రతీ
పక్షైణ్యంబు, రజోవ్రజోర్వరితశుంభద్యోధయూథావగా
హ్యక్షుద్రేతరవైరివీరరచితాన్యోన్యోగ్రహుంకారమై॥ 47

వ॥ ఇట్లు దారుణమారణహోమాయమానంబైనమౌనిదానవాయోధనమహానాటకంబు, మౌక్తికసైనికనికాయప్రయుక్తప్రధన

సాధనసంతానసంపాతానుభూయమానయాతనాయతయాతా
యతియాతాయాతప్రాణయాతుధానయోధయూథంబును,
యూథవిచ్ఛేదనవిచ్ఛాయామేయమౌక్తికప్రత్యగ్రప్రత్యుప్త
సంగరరంగమధ్యోత్థానద్వైధీభావమాద్యద్దంతావళదానధారా
సమ్మిశ్రాసృక్స్రోతస్సమూహావిలంబును, విలంబాసహిష్ణు
వేగవత్సాగరోత్తుంగతరంగభ్రాంతికృత్తురంగదేహసందోహ
దోహలంబును, హాలహాలికాహతాదాకర్ణనోదీర్ణతీర్ణప్రతిజ్ఞా
ఽఽరాదాయాయ్యభిముఖవిరథీకృతప్రతిరథికవితథప్రథన
ప్రయతననిరవధికపరిపతితరథికనికరంబును, నికరంబగు
కనికరంబు కరంబులేక, కరకీలితకవాలాదిచాలనమాత్ర
వ్యజ్యమానప్రాణతాప్రీణితసహాయోద్ధృశ్లాఘ్యసంగ్రామ
సన్నాహసముత్సాహసాహసోపేతపాదాతంబునై, వీరరౌద్ర
బీభత్సకరుణభయానకరసవిసరప్రసరణసంకీర్ణంబై,
పర్యవసన్నాద్భుతంబయ్యె – నయ్యెడ॥ 48

మ॥ ఇఁక నీరక్కసునుక్కడంపవలెఁ; గాకీజానుమన్నామకున్
బ్రకటక్రౌర్యవిబాధితత్రిభువనున్, మాయావినంచున్, నిరూ
పకులౌఖేచరులబ్బురంపడఁ, బ్రభావస్ఫూర్తి మన్మూర్తి, మౌ
క్తికుఁడా పాశుపతాస్త్రమున్బఱపెదై తేయుల్భయంబందఁగన్॥

మ॥ మునిశార్దూలురు, తత్సహాయదనుజవ్యూహంబుపైఁగ్రూరశ
స్త్రనికాయంబుల వర్షముల్ గుఱియ, నాదైత్యుల్చలంబేది, ప
ట్టణమార్గంబును బట్టిరంతటను స్పష్టస్వావలంబుల్, మహా
మునులున్దత్పురకంటకంబునుమహోత్కల్ముక్తమౌన్యాఢ్యులై॥

చం॥ అరిగిరి తత్పురంబునకహంప్రథమత్వయుతానుభావవి
స్ఫురితులు, రత్నరంజితము, సుందరమందరమేరుశోభిసౌ
ధరుచిరమున్, శతఘ్నుల శతంబులచేఁ బరిరక్షితంబు, యం
త్రరచితవిచిత్రచర్యము, మనఃప్రమదప్రదవృక్షవీరుదు

త్కరసుమనః ప్రవాళభరితప్రమదావనరాజిరాజితో
ద్ధురశుకశారికాపికమధువ్రతనిస్వనసుశ్రవంబు, బం
ధురమధుసారణీచరదనూనసుమప్రకరప్లవంబు, మే
దురసుమరేణుగౌరము, మృదుశ్వసనస్పృహణీయమున్
మునుల్॥ 51

వ॥ విశాలరాజమార్గసంతతసమంతతస్స్వచ్ఛందసంఖ్యజనసమ్మర్దం
బును, నిరవద్యనిషద్యాప్రసారితమౌక్తికరత్నాద్యనర్ఘ వస్తు
విస్తారతిరస్కారభావశోభాదూరరత్నాకరమాహాత్మ్యంబును,
యంత్రపాంచాలికాగణాంచితంబును, నగునప్పురంబుఁబొడఁ
గని, మునిజనసముదయంబుసవిస్మయంబుగాఁన్న గరపురః
పశ్చిమభాగంబులనిల్చెనంతటు, సర్వసన్నద్ధులైన యమ్మహ
ర్షులన్‌జూచి, రాక్షసనాయకులు మహాశ్చర్యచర్యులును, శౌర్య
వీర్య సమేతులునై రి; తదనంతరంబ॥ 52

కం॥ ఆపట్టణమునఁగలకల
మేపారె; మహాద్భుతంబులెన్నేని సము
ద్దీపించెమహోర్భటి; ను
ల్కాపాతంబడరెఁబుష్కలంబుగఁజూడన్॥ 53

ఆ॥ తోఁచెఁబెక్కులైన దుశ్శకునంబులు;
రక్తవర్షపాతసిక్తమయ్యె
నేల; చూడఁజూడనిర్జరారులు భీత
భీతులైరి; దీప్త్యపేతులైరి॥ 54

కం॥ సందిహ్యమానులై, వా
రందఱు నొకరొకరిఁబిల్వనరిగిరటునిటున్;
డెందములు కుదురుపడఁగా,
సందడిఁగైకొనిరిసమరసన్నాహంబున్॥ 55

కం॥ "ఒడయఁడు తమ కెపుడేమని,
యిడునో ముదల" యనుచు, లెంక లెదురుగనుచుఁ, బో
విడిచి తమ జీవితాశలు,
కడిఁది యసురవీరు లపుడు కడఁగి కలనికిన్॥ 56

ఆ॥ ముక్త మౌనియాజ్ఞ మునినికాయము పైని
కులుగజాశ్వరథము లెలమి నెక్కి,
జానుమండలాభిధానుని రాజధా
నిని నిమేషమాత్రమున నవె నిండి॥ 57

గీ॥ సర్వసన్నద్ధులై, యుద్ధధూర్వహులయి,
సర్వశస్త్రాస్త్రపాణులై, జానుమండ
లాభిధానునిఁ బట్టి పల్లార్చు టెప్పు
డెప్పుడో యని, యుత్సాహ మినుమడింప॥ 58

వ॥ బహుళభటకోలాహలహలహలికాసముత్కలికాబలాత్కలిత
హాహాత్కృతహయహేషితకరిబృంహితభేరీభాంకారశంఖకాహళ
నాదంబులచేతను, యాతాయాతకర్తవ్యార్థనిర్ణయమంత్ర
పరాయణమేధావివర్గవాదోపవాదంబులచేతను, దత్థ్సానసందర్శ
నాభిలాషుకాగంతుకజనంబులకతి వేలంబైన విస్మయంబుఁ
గల్పించుచుండు నా సంగ్రామరంగంబున॥ 59

కం॥ దృఢధిషణుండగు మునిపరి
వృఢుఁడా ముక్తర్షి దనుజబృందనితాంత
ప్రధిమ మభిదాచణనిజసై
న్యథమామిక లెసక మెసఁగ, నాయితమయ్యెన్॥ 60

వ॥ అనిన, విని, యవ్వలివృత్తాంతం బెట్టిదని, పిణాపౌనివాఁ డీజాని
నడుగుటయును॥ 61

ఆ॥ సిరిగలాఁడు దొల్లి చేసాచె; సిరిలేని
నీవుచేయి సాచుచువృత్తివాఁడ
వైన, నీవులొప్పు మీ నెయ్యురిర్వురు,
నరసపురము నేలు దొరలు; బళిర!

ఇది, ఆంధ్రీకృతముక్తీశ్వరోపాఖ్యానంబునందు
సురకంటక పురోపరోధంబను నేకాదశాధ్యాయము

---

# ద్వాదశాధ్యాయము

ఆ॥ సిరులకిరవు, హరువుమురువులమనికియా
నరసపురము నేలు దొరతనమ్మ
బిరుదుగాఁగలాఁడ! వరద! శ్రీకపిలమ
ల్లేశ! ఘోరపాపనాశ! యీశ!! 1

ఆ॥ అవధరింపుమువలి దగుకథ; సురముని
నలువకనియె— "ముక్తనామువృత్త
ముత్తమంబు! వినఁగనుత్సాహకౌతూహ
లములువొడముమదిని; సుమహితాత్మ!" 2

మ॥ అభితోవ్యాప్తము, ముక్తమున్యమితసైన్యవ్రాతమున్ జూచి, యుం
త, భయభ్రాంతత, జానుమండలుఁడు మంత్రప్రజ్ఞఁడారీతి, సై
త్యభటాళిన్ దనవెంటఁ బెట్టుకొని, మిథ్యాశౌర్యమొప్పార, సం
క్షుభితాంతః కరణుండు పేరుకొని, యక్షుద్రప్రభావంబునన్. 3

చ॥ తొలుతఁ బలాయితుండయి, సుదుస్సహ ముక్తవిముక్త సాయకం
బులువడిఁబైఁబయిన్ బడియమోఘములై, శతకోటులై, తనున్
నలుగుడఁ బుచ్చ, ఱిచ్చవడి, నమ్మినబంటుఁ బిల్వఁబంచి, వా
రలఁగని, జానుమండలుఁడు రాచఱికంబును, శీవియేర్పడన్. 4

మ॥ "బళిరా! చారవరేణ్యులార! మదిలోభావింప, నత్యద్భుతం
బలముక్తుండను మౌనిమాత్రుఁడసురవ్యాపాదనా హంక్రియా
కలితస్వాంతతసైన్య సంగ్రహణముఖ్య ప్రజ్ఞఁడెట్లయ్యె?న
బ్బలియుండెట్లు పదామడల్ కెరలిభూభాగంబునన్ జొచ్చెరా? 5

మ॥ అరరే! యేమిది? కావిడాల్పు మునిమ్రుచ్చాకష్టముష్టింపచుం
డరదంబుల్, ద్విరదంబులున్, దురగముల్, "యంబ్రహ్మలా"
బంట్లుకొం
దఱుదన్నన్ భజియింప నెమ్మియిఁదనుత్రాణాదులన్ దాల్చి, చం
డరణోత్సాహముమైఁ బయింబడుటవిన్నన్, గన్న,నాశ్చర్యమా. 6

కం॥ మీరున్ విన్నారుగ! క
న్నారన్ గన్నారుగా! రహస్యజ్ఞులు! హా
ర్యారోహులు, హాస్తిపకుల్
చేరుటయెట్లొమునిన్! విచిత్రముగాదే? 7

కం॥ మునిజనమఁట! బహుశస్త్రా
స్త్రనికాయోపయికమార్గ తత్పరమఁట! యా
తనికి సమరసన్నాహం
బుననేర్పెట్లబ్బెనో, యపూర్వంబౌఁగా!" 8

వ. అనియడిగినతమయొడయనికిఁ బ్రతినిధులిట్లనిరి. 9

"మ॥వినుమయ్యా! యెకిమీఁడ! ముక్తముని దోర్వీర్యంబవార్యంబు; శం
భునివల్లన్ జనియించి,యాతఁడు జగమ్మున్ బ్రోచుపొంటెన్మహే
శునిచేఁబాశుపతాస్త్రమున్ బడసి, విస్ఫూర్జత్ప్రతాప ప్రభా
వనిరూఢుండయి, చీరికింగొనఁడు దేవా! మిమ్ము,మీదర్పమున్॥ 10

కం॥ అగ్నిముఖానంతరమ
త్యగ్నిప్రభ వెలుఁగు రథము, నక్షయతూణా
భగ్నప్రతాపదీప్తో
ద్విగ్నాన్యమునీశ సైన్యవిస్తృతిఁబడసెన్॥ 11

కం॥ ముక్తర్షికి. సర్వక్రతు
భుక్తతినుత, మహిమమహిత, భూమహితకృపా
యుక్త, నిమేషాంబ, మహా
శక్తిఁబ్రసాదించె దేవ! సత్యముసుండీ! 12

కం॥ ఇటుపై దేవరచిత్తము;
పటుతరకార్యానుకూల్య భావనకై, మీరు
త్కటమంత్రబోధమతిలౌ
పటులగు సచివులను బిలువఁబనిచి, తదుక్తిన్ 13

కం॥ కర్తవ్యమెఱిఁగి, రిపుగళ
కర్తనమొనరించు పనికిఁగడఁగుట,మేలౌ
వర్తనమని, మా బుద్ధికి
మార్త్తికమూర్తికినిదోఁచె; మమ్మేలువారా!" 14

కం॥ అని, చారులుతూష్ణీంభా
వనితాంతస్థితినిగనుచుఁ, బ్రిక్కొదిగిరం
త, నిశాటాధీశ్వరుఁడును,
దనసచివులనడిగెఁగార్యతాత్పర్యమ్మున్॥ 15

ఉ॥ వారక, జానుమండలుని పల్కులలోని నిగూఢభావమున్,
గారణకార్య భావమునుగన్గొని, ధీచతురత్వమేర్పడన్
వారిటువిన్నవించిరి, "వినమ్రులు దేవ! చరుల్; యథార్థమే
యెరుపడంగఁ బేర్కొనిరి; యేలిక! మా క్షితికుఁడంతవాఁడెయౌ. 16

ఉ॥ ఐనను, దేవ! నీవును భయంకర మారణరంగమందు న
వ్వానినిజంపఁగాఁగలవు; వజ్రధరుండొ, యముండొ, వాఁడు వై
శ్వానరుఁడో, యపాంపతియొ, జక్కులతేఁడొకొ, యాతుధానుఁడో!
మానిదివౌకసుల్ భవదమంద పరాక్రమమోర్వఁజాలిరే? 17

శా॥ దేవా! దేవరకున్ నవీనమె? సురల్, దిక్పాలకుల్ నిత్యమున్
భావత్కోన్నతసత్కృపాతిశయమున్ వాంఛించి, యెల్లప్పుద్వఁ
త్సేవాసేవధికై యహం ప్రథమికాధీనుల్ గదా! మృత్యువున్
నీవన్నన్, బ్రపలాయితంబగు; హతాన్నీతంబు, భీతంబునై. 18

కం॥ కనులఁ, బ్రభూ! నిమిషార్ధం
బునఁబగతురఁజంపుదీవు; ముక్తుఁడు గిక్తుం
డును నొకలెక్కయొకో, నీ
కును? యత్నమొనర్పమనికిఁ గుతుకమెలర్పన్." 19

చం॥ అని, సచివుల్ వచింప, విని, యాజగజెట్టియు జానుమండలుం
డనికిసముత్సుకుండయి, జయాభిరతిన్ బ్రకటించిమించెఁ బే
ర్చినరుష దావపావకముచెల్వున నేర్చెడు శత్రువంశముల్
గనఁబడెనేని" యంచును, "గకావికలైరి" దిదృక్షుతజ్జనుల్. 20

వ. తదనంతరంబ, తదంతఃపుర మందిరాంతర్భాగంబున 21

మ॥ అమరారాతియకాండతాండవము విన్నంతన్, దదర్ధాంగి, కెం
దమునందున్ గడుసందియంబున నమందప్రజ్ఞయొక్కింతమం
దముగా, మందమనోజ్ఞయానన, నయతత్త్వజ్ఞాత్రి, సమాలోచనా
భిముఖస్వాంత, "సుశోభితాంగి" యనుసాధ్వీరత్నమాయ స్తమై. 22

మ॥ జనఘోషంబు, భటాట్టహాసము, విమూర్ఛచ్ఛంఖనాదంబు, శిం
జినికాటంకృతులున్, గజాశ్వరథసన్నహ్రాదముల్, భేరికా
నినదంబుల్ విని, యూడిగంపుఁజెలువన్ బిల్పించి, "ప్రజ్ఞావతిన్"
వినయోపేతనుజూచి, పల్కెనిటులుద్వేగంబు "చూచాయగన్" 23

ఉ॥ వింటివె, నెచ్చెలీ! వివిధవీరకృతంబులు శంఖనాదముల్
మింటనునిండెఁ; వింటివె, మెండుగ విండులనాంద్రదటంకృతుల్,
వెంటనె గోముఖానకబలిష్ఠనినాదములన్ రణస్థలిన్
మంటిని రేపు విక్రమజన ప్రకరంబుల సింహనాదముల్? 24

చం॥ హృదయవిదారణంబగుఁజుమీ! విని నంతనె, సింహనాదముల్;
సదయతమాని, దక్షిణభుజంబు, దృగబ్జము మాటిమాటికి
ట్లదరుచునుండెఁ; వెండియు శుభావహముల్ శకునంబులెన్నొతోఁ
చి, దిటవడంగఁజేయుమదిఁ; జెప్పవె, వీనినిమిత్తమేమియో!" 25

వ॥ అని, యడిగిన శోభితాంగినిన్ గనుంగొని, కనుంగొనల భయ
భ్రమ సంభ్రమ విభ్రమ విస్మయ సూచకంబులైన చాయలు
దోఁపఁ బ్రజ్ఞావతి యిట్లనియె॥ 26

శా॥ "రక్షోఽధ్యక్షుఁడునీమగండు, వరగర్వ ప్రస్ఫురచ్చౌర్యవీ
ర్యాక్రాంతి ప్రవిమోహితుండగుచుఁ, దేజోఽసహ్యుఁడై, యాసహ
స్రాక్షాది త్రిదశుల్, జగత్త్రియజనుల్ స్వావాసముల్ వీడి, ని
త్యక్షోభంబునుబొందికుంద, బహుబాధల్ పెట్టఁడే, యుద్ధతిన్?॥ 27

మ॥ అతులౌద్ధత్యముఁజూపి, నీమగఁడు దాయజ్ఞంబులెన్నేని వి
ఘ్నితముల్ సేసి, మహానుభావులగు యోగిశ్రేష్ఠులన్, మౌనులన్,
వ్రతులన్ డీలుపడంగఁజేసి, యమృతాంధశ్రేణి బాధించి, త
త్సుతులన్ బాశవిక ప్రవృత్తి మెయిహింసల్ వెట్టి, రోధింపఁడే? 28

ఆ. ఎంత శక్తియున్న, నెంత సామర్థ్యంబు
గల్గియున్న, నంతకావరంబ?
యేవరంబకానికావచ్చుఁ గాకంత
తీవరంబు తగునె? దేవి! చెపుమ!॥ 29

ఆ॥ "పడ్డవారలెప్డు చెడ్డవారలుగారు"
వారలెప్పుడేనవార్యులౌట;

"షడ్గోడపట్టై షడ్డట్టులుండవన్"
సుద్దిదెల్పుఁగాదె! శోభితాంగి !! 30

ఉ॥ తేనియవక్రవిక్రమమెఱింగి, సురల్ శరణార్థులై, మహే
శాను, త్రిశతాళ్యధీను, గిరిజావరు, శంకరు, లోకశంకరున్
దీనతవేఁడి, నీమగని తీంత్రతములెల్లను విన్నవింప, నీ
శానుఁడు పూర్తికర్షి స్వభుజప్రభవున్ సృజియింప, నాతఁడున్॥ 31

ఉ॥ పాశుపతాభిధానముఁ, బ్రభావమహత్త్వము, సద్వ్రతంబుఁదాఁ
గాశికునాశ్రమంబునఁ బ్రకామజయంబును గోరిసేయు; మా
న్యాశయముల్ ఫలింపఁగ, శతాంగిః పంగధనుశ్శరాదులీ
యాశరలోక భీకరములాదటఁ బుట్టెహుతాశకీలలన్॥ 32

చం॥ అదియునుగాక, దేవి, నిమిషాంబ ప్రసన్నతఁజూపి, మూఁకిన్
గదనములోనఁ దోడుపడి, కాసరదుర్గమహోదరాదులన్
జదిపి, జయంబుఁగూర్చె; మనసైన్యమురాక్షసరాజధానిపైఁ
గదలి, పదాముడల్ కెరలి; క్రవ్యభుజుల్ భయమందిప్రుందఁగన్॥ 33

మ॥ పటు దోశ్శక్తి ప్రపంచితంబగునటుల్ వారల్ విజృంభించి, యు
త్కటులై తోడుగరాఁగ, ముక్తముని తాగంధర్వుఁడున్, యక్షుఁడు
ద్భటవిద్యాధరమౌళిగాకయు, వివస్వత్తేజుఁడై, తేనిఁ జం
పుటతథ్యంబని, దేవతాప్రభృతులు దుర్భాతాసందులై రందఱున్॥ 34

మ॥ వనితారత్నమ! వింటివేగద! మహాధ్వానంబదేయానను; తే
దనుమానంబిసుమంతయే"ననుచు, విన్నంతన్ సఖీవాక్యము
ద్దనుజాధీశ్వరుపత్ని వర్షవరుఁడంతన్ వెంటరా, జాసుమం
తునిఁ జేరంజని శోభితాంగి భయభక్తుల్ మీఱ సేవించుచున్॥ 35

చం॥ వినయవినమ్రమై, దనుజవీరునిఁజేరి, "ప్రభూ! మదుక్తమున్
వినుఁడు; భవత్సమాదరము వెక్కసమై, పలికింపఁజేసెన
న్ననఘ!భయమ్మొ, భక్తియొ, యనర్థవిచారమొ, మోహమో, సతీ
జనసహజావివేకమొ, యసాధువొ, సాధువొ; మర్షణీయమౌ॥ 36

మ॥ ఎవ రేమన్ననుగాని, యుత్తములు నైతే్యంద్రా! ప్రభుల్ స్వీకరిం
ద్రువచోలేశము; స్వీకరించుచును, దోషోత్తేజన్ విచారించి, యం
దవిరుద్ధంబగునర్థమున్ దెలిసి, క్రౌర్యంబేది, క్రోధంబులే
క,విపశ్చిద్వరులున్ గుణాదరతఁ,జిల్కల్ వల్కు! మెచ్చొందరే? 37

చ॥ ఎఱుఁగుదునిన్నుఁ బ్రాణపతి! యెక్కటివీరుఁడవౌదమర్త్యులం
దఱకు భయంకరుండవయి, దైత్యవిభుత్వధురంధరుండవై,
తఱుగని భోగభాగ్యముఁ దన్పుచు స్వీయుఁ, దన్పుఁగాంచుచున్,
గఱటులలెక్కసేయని యఖండ యశస్వివి సాటివారిలోన్. 38

వ. ప్రాణేశ్వరా! త్రైలోక్యైకనాధుండవైన నీకున్ బాద దాసినై, యేనెన్నని యిష్టోపభోగంబులు యథేష్టంబుగాఁ బొందఁ గల్గితి; నాకంటె వేఱెవ్వతె, పౌలోమీపాణిపద్మానీ తంబులైన కల్పక పుష్పగుచ్ఛంబులచేఁగల్పితధమ్మిల్ల బంధనయై, చెన్నొందెఁ? నన్నుం గాదని,యయ్యూర్వశినిజకరకిసలయోపార్జితంబులైనస్వర్ణదీస్వర్ణదీప్రప పద్మంబులను వింజామరమ్ములుగా విచ్చిపుచ్చుకొని, మఱియెవ తెకు వీచుచుండు? నేనుగాక, వేఱేకాంత, యేకాంతకాంతప్రదేశంబున సర్వ సుపర్వస్త్రీణ సంస్పృష్ట పదపల్లవయై, మెత్తమెత్తన నొత్తంబడుచు, "మొగమ్ముమొత్తి" యంతంత సంతనవింతవింతలయొయ్యారంపుఁబాద విన్యాసంబులొప్ప, సమందహాసంబుగా మందయానంబున సంచరించు చుండు? హవ్యవాహానుని యర్ధాంగలక్ష్మియైన స్వాహాదేవి, స్వయం పరివేషణంబు గావింపుచు, భోజ్యోష్ణ సాధుస్వాదు భక్ష్యపయుక్త పంచ భక్ష్యపదార్థంబులు నేనుగాక, యింకెవ్వతెయభ్యవహారవ్యవహారం బుననాప్యాయనంబుగా స్వీకరించు? నాకుంగాక, యెవ్వతెకైన, గంధర్వరాజకన్యకా జనోపకల్పితకల్పక పల్లవమహోర్వ్యా శయన తలంబున మృదుల మృదులంబుగా శయనించి, కబరీ భరపరిలు లిత లలితకుసుమవిసరదళలవ పరిమృదిత మృణాళనాళాతి కోమలాంగ భంగయై, నీతోడంగూడి క్రీడించి, కేశంబులు వాఱునాడెంబై నవేసక

పోడిమి వేడబంబునకైనఁ దోడంబుగానేని, ప్రాపణీయంబానాకో! నిఖిల భువన శాసనచణుండవైన నిన్నుం బ్రాణనాయకుంగాఁ బొంది, నేనేడు గాలంబునిట్లే నాజీవితంబు "మూఁడుపూవులాఱుకాయలుగా" వెళ్ళింప నోపుదాననని, యుప్పొంగియుండ, నున్నట్టుండి, యిప్పుడు. 39

కం॥ కర్ణాకర్ణికగా, నా
కర్ణించితి నమ్మహర్షి గాథ; నదియునా
కర్ణోరాశిగదుఃఖము
నిర్ణుదమాధ్యార్వమై, సునిష్ఠంబా. 40

ఉ॥ హాత్తిక మాని నాయకుఁడుమాపతిదక్షిణ బాహుజుండుజుం
డుక్తవచోలవం బది ముహుర్ముహురుత్కటరీఢఁగొల్పు; స
మ్యక్త తపౌరుషోన్నతుల రౌదురుగాని; యొకింతదుస్త్యజో
ద్రిక్తతమాని, మానితమతిన్ బరికించి చూడుఁడా! 41

వ. పరమేష్ఠి సృష్టించిన యీచరాచర సచేతనాచేతన వ్యక్తి వస్తుజాతంబులువేనిచేనైనంగాని, ప్రాణహాని సంభవింపకుండ, మీరు వరంబును బొందినయమంద మేధాసంపత్సంశోభితులరే యౌదురు. కాని, మిమ్మెట్లైనన్ బట్టి పల్లార్చుట పొంటెఁగంటను విషమ్ముగల్గి, కంటక ప్రాయులైన యాదితేయులు శంభుభుజస్తంభోజ్జృంభితుండైన యమహాత్తికమానీంద్రుని ప్రాపునమీకై పాపంబనక, "కత్తిగట్టి", యుద్ధోద్ధతినిద్ధోద్యుక్తులై, యుద్రిక్తులునై, యుక్కివంబున నుక్కుసూపుచుఁ, బెక్కురొక్కుమ్మడి మనరాజధానియైన సురకంటకంబుపై దండెత్తి వచ్చిరన్న మాటవినంబడియె; నిప్పటికి నాచెప్పినచొప్పు నొప్పరికింపక, ధార్ష్ట్యంబుమాని, యమహానీంద్రుని శరణువేడుకొంట యొక్కటియెచక్కని మార్గంబనియు, నట్లొనర్చి, సౌఖ్యంబును జీవితంబును, మీరాక్షసరాజ్యంబును, బుత్త్రమిత్త్ర కళత్త్రామాత్యాదులను రక్షించుకొనుటయే మేలైన రాజనీతి" యనియు, వక్కాణించి మఱియు, నక్కాంత కాంతున కిట్లనియె॥ 42

మ॥ అమితాజయ్య పరాక్రమమమర్త్య శ్రేణికింగుండెగా
లముగా, నర్ధనిమేషమాత్రమున నెల్లన్ లోకముల్ గెల్చి, రా
జ్యము నిష్కంటకముం బొనర్చియు, జిగీషావేశముడింజేసి ద్వే
షముధాఽఽవేశములుజ్జగింపమి విశేషంబే? ప్రభూ! దోషహా॥ 43

ఉ॥ ఐహిక భోగముల్ విడుచుయత్నము మేలె? ప్రభూ! ప్రభూతశౌ
ర్యాహిత లక్షణుల్, శుభయశోఽధికు లెచ్చటనైన మెత్తురే?
సౌహృదమొప్ప, ముక్తమునిచంద్రుని దర్శనభాగ్యమంద, మే
లౌ; హితమార్గమియ్యది; మహామహిమాన్వితుఁడమ్మ
హార్షియున్॥ 44

చం॥ పతిపదపద్మ దర్శనము, భర్తృ సపర్యయు దూరమైన యా
సతి సతియే? తదీయ సహజస్థిరభాగ్యము, భర్తృనిత్య సం
గతి; గతిమాతఁ జేసతికిఁ; గావున, రాక్షసరాజ! సాధు స
మ్మతమతిమత్త్వమున్ గలిగి; మన్ననసేయుముమంత్రి యోక్తులన్॥

కం॥ పతిరహితయగుచు, బ్రతికెడు
సతి జీవన్మృతయు, దివసచంద్రకళయునౌ;
సతతము దానవపతి జూగు
ప్సిత జీవితమెట్టులో విశీర్ణంబౌఁగా!॥

చం॥అనుమరణంబునొంది, భవదత్యయవేళ నశింప,నేను, మ
త్తనయున కెవ్వరేనుగడ? త్వాదృశుఁ దండ్రిగఁబొందియుండియు
న్ననదయుఁబోలె, వీఁడెటులనాయతి,నాయువు, శ్రీయునొందెడున్?
గనికరమింతగల్గి, గడఁకన్ గడకన్నులనన్ గనన్గదే!. 47

చం॥ కటకట! ప్రాణనాయక! యఖండయశోధన! యెట్టికష్టము
త్కటమయి, దాపురించినది! దైన్యమునెంచక, దైత్యనాథ! వి
స్ఫుటఫణితిన్ నుతించి, ముని, ముక్తశుభాభిధునాశ్రయంబుఁగం
కటముగఁబొంది, యందఱిని గావుము మామకబుద్ధిపద్ధతిన్. 48

కం॥ శితికంఠభుజోద్భవుఁడఁట!
యతఁడు కృపామూర్తి యంట! యభయ మొసఁగునా
కృతలక్షణుండు ద్వాపర
మతిగాఁడఁట! నాథ! నాదుమనవిఁ వినుమా!" 49

మ॥ అని, శోభావతి పల్కు-పల్కులవి దైత్యాధీశుచేతోఽంతరం
బును గోర్వెచ్చఁగఁజేయ, ధిక్కృతి యొనర్చెన్; సూర్యపాదావపా
తనమాత్రాన, జ్వలత్స్వభావమినకాంతంబున్ దలంపించుచున్;
వినమే, పౌరుషశాలు లౌజనుల వన్నెల్, చిన్నెలెట్లుండునో! 50

వ. చండిమోద్దండతాఽఽడంబరంబు గండ మండలంబులన్ దాండవింప, నా జానుమండలుండు మాధ్యందినమార్తాండుని చందంబున మండిపడుచు, ముకుపుటంబు లెగురుటలను, గనుబొమల విఱుపులను, నయనయుగళవలితలలితంబులగు మిటకరింపులను, గనలుటనలంపుఁ బొగలెగయ, హృదయప్రియయగు శోభావతితో నిట్లనియె. 51

ఉ॥ "చాలును-జాలుఁ బల్కులివి; జానుమదాహ్వయుఁడన్న "గుండెలో
గాఁము" గాదె, యెవ్వరికి! గాంతరో! నాకును భార్యవయ్యు, నీ
బేలవతనంబదేల? మదిభీతిలమేల? తపస్వినిన్, నినున్
జాలిమెయిన్ క్షమించితి; మనఃప్రియవౌటఁ దలంచి, యిత్తఱిన్. 52

శా॥ ఆముక్తర్షికి, నాకు మైత్రియెటులౌ హా! సింహమెందేనియున్
దా మౌఢ్యంబున లేఁడిపిల్లను మదిన్ ప్రార్థించి, జీవించునే?
నే మత్తేభమనౌదు; దోమయగు మౌని భ్రష్టుఁ; డాలించితే?
నే మార్తాండుఁడఁ; మౌనియున్ మిణుఁగురౌ; నే భోక్తఁ; డా భోజ్యమౌ॥ 53

మ॥ శివవీర్యోద్భవుఁడన్ బిభీషికలనిస్సీ! మేటి వాటించునే?
శివుఁబన్ వేలకొలంది, లక్షల మహర్షి శ్రేష్ఠులన్ ముక్తనా
మవృథాఽభిఖ్యులఁజీరికిన్ గొనక, చంపన్ జాలుదున్ దత్క్షణం
బవలీలన్ దరవారిఁ దాలిచి కరంబందున్ రణాగ్రంబునన్॥ 54

వ॥ వజ్రపాణియు, నైరావణ వారణరాజవాహనుండు నైన దేవేంద్రుండు కుంఠిత బాహువీర్యుండై, నా దర్శనానుగ్రహంబులు సంపాదింపఁగోరి, నారాజమందిరద్వారంబునొద్దఁ బడిగాపులుగాయుచున్, బడియుండు; నిధుల కధిపతియుఁ, బినాక పాణికిన్ బ్రాణమిత్రుండునైన యక్షాధ్యక్షుండు పుష్పకంబును లాంఛనంబుగాఁ, గన్నులఁగప్పుకొని, నాకటాక్షపాతంబునకున్ బాత్రమ్మౌటతప్పిపోవునో యని, కేకరాక్షంబుల నీక్షించుచుండి, మించినవేడ్క-చూపకయే, నన్ను సేవించుచు, నామేదురాదరంబు "నాదరబాదరగా" నందుకొనుచుండు; నగ్న్యంతకానిలాపాంపత్యర్కాబ్జులును, విశ్వేశ్వరవస్వష్టకనాసత్యయక్షతార్క్ష్యోరగ గంధర్వ విద్యాధరాప్సర స్సిద్ధసాధ్యాదులైన సర్వబృందారక బృందంబులు నమందమద్వీర్యస్తావకులై, శ్రేయంబవళ్లు నన్నున్ బర్యుపాసించుచుందురు. అనన్యభాజనంబైన త్రైలోక్యవీర్యాలంకార శబ్దంబును నేనొక్క-రుండన కల్గియున్నవాఁడ; నట్టినాకా క్రొముక్క-డిముక్తర్షివల్ల భీతియెట్లు గల్గునని భావించితివి? మతిచెడి, తలకొలవడినతులువయెవఁడో బిడియము విడిచి, నీకీ పిఱికిమందును బోసియుండు. వాఁడెవ్వఁడో చెప్పితివేని, నా పాణికృపాణి నాప్రాణి ప్రాణంబులు వాపుదు"నని, మఱియును॥ 55

చం॥ పిఱికి తనంబుమాని, విను; ప్రేయసి! యీశ్వరసృష్టమీచరా
చరమగు విశ్వ; మట్టియెడ సంస్తుతిఁ డెట్లగుముక్తమౌని? శం
కరుఁడెగతాసుఁ జేయుటకుఁగానను, ముక్తుసృజించెనేని, స
త్వరము గఁజంపుఁగాక; భవితవ్యత కెందును భంగమున్న దే?. 56

ఉ॥ మాదృశులౌ మహామహులు మాయురె! ప్రాణచితాత్తవిత్తగే
హాదివినాశమెంతురె? దురాసవిశాలయశోఽభిశోభితుల్,
గాదె? మలీమసంబయినకాయముపోయిన, లెక్క-సేయనెం
తే దృఢచిత్తతన్ ధృతి విహీనులుఁగాక, ప్రసిద్ధిఁగాంచరే! 57

కం॥ పలు పలుకులేల ? లలనా
లలామ ! వినుమొకటి; నిశ్చలంబుగ రణదో
హలదృఢ కుతూహలంబునఁ
బలుమార్తురఁదోలి, జయముఁ బడయుదునిపుడే॥ 58

కం॥ మాన ప్రాణంబులలో
మానమనూనమ్ము సుమ్ము ! మానిని ! ప్రాణం
బేను దృణప్రాయముగా
నేనాఁడో యెంచి, త్రిభువనేశుఁడనైతిన్॥ 59

కం॥ జీవన్మృతుఁడౌనుగదా !
దేవి, మానానపేక్షి ! ధృతిమైమానం
బేనాఁడొప్పరికింపఁడొ!
జీవించినవాఁడెవాఁడు; చెలి! మృతుఁడయినన్॥ 60

ఉ॥ ఓపికవాణి! నాభుజయుగోర్జితశక్తి యెఱుంగవొక్కొ! దు
ష్ప్రాపములౌ వరంబులు కృపన్ బరమేష్ఠి యొసంగలేదె? సే
వా పరివేష్టితుండనయి, నాకులనాకులపాటువుచ్చి, సు
స్థాపిత దైత్యరాజ్యపరితః పరితోషయశంబులొందనే ? 61

చం॥ ఒకమునిమాత్రుఁడన్న,భయమొంది, తదాశ్రయమెట్లుగోరుదున్?
వికలులుగారె, మున్ను బిఱువీకులఁ బెట్టఁగనేను; వేల్పులున్
దికమకఁజెందరే? మునులు, దేవి! యొడళ్లకుబ్బాదిఘాతలున్
సికలు శిరంబులన్, మెడలఁ, జేతులఁబూసలపేరులేగదా!॥ 62

మ॥ మునుపేనెక్కటి బల్మిమైమెఱయ, సంభూతప్రతాపాభీతిసం
జనితాస్వాస్థ్యపరీతులై, సురలు పెల్చన్ జూచి, యుష్టైంతయే
ననునవ్వన్, శరణంబుఁగోరుదునె, తన్మోసన్? నినున్ వీరప
త్నినినేనేమనువాఁడ? నీవరయు దేసిన్, "సిగ్గుచేటు"ఁగదా!॥ 63

చం॥ నడివడుకంటె; మానధని చావుననేమదిసమ్మతించుఁగా!
ద్విడురు రుపాకపాయితముదీర్ణమహోఽధిక పౌరుషంబుని

బ్బడిగనుబొంది, ముబ్బడిగ భంగపడంగఁ దలంపఁడోటు! సం
దడిమెయిదండడించుటె మనఃప్రియ! నాకుమనఃప్రియంబగున్॥ 64

చం॥ ఇపుడె విరోధియూథము పయింబడివ్రచ్చిన, నస్త్రశస్త్రముల్
విపులముగాఁగ వ్రేసిన, గళేగ్రహవ్యూథము శత్రుసైన్యమే
చి, పగనుబూని, అంపములఁజిల్చిన, మెచ్చెదఁ; గాని, దేవి! పం
దపగిది వేడుకొందునె? పదంపడి వెంగలినై, రణంబునన్?॥ 65

మ॥ అవమానంబణుమాత్రమునన్ గనక, నేఁబ్రాణంబులంబాయుటే
యవధుల్ లేని మహత్త్వముంగనుటగాదా! మానవన్ముఖ్యలెం
దవనీరాజ్యభరంబుకంటె, బహుసౌఖ్యప్రాప్తికంటెన్, దురా
పవిశుద్ధాధిక పుణ్యకీర్తి శుభలాభంబున్ గణింతుర్గదా!॥ 66

కం॥ సురకంటకనగరీశుఁడు;
సురకంటక శౌర్యరాశి శోభితుఁడను; ము
ష్కరు, ముక్తర్షిని శరణన,
నరయఁగనవమానమేకదా! యండఱిలోన్॥ 67

కం॥ నేహాని శరణు వేడుట
సామంతులు విన్నయంత, సడిచప్పుడులే
కాముని యెమహత్తరుఁడని,
నామానము మంటఁగలిపి, నగరేనన్నున్?॥ 68

ఆ॥ ఒకరి వెనుకనొకరువికసన్ముఖమనోజ్ఞు
లగుచు, ముక్తహాని నాశ్రయించి,
నన్ను నేవగింతురన్నలమిన్న! యీ
నీతి, జాతిలేని లాతియెల్ల. 69

ఉ॥ గౌరవహీనుఁడై, బ్రతుకుకంటెను, జచ్చుటె మేలుగాదె! హా
భీరు! మదంతమందయిన, విన్నఁదనంబును బొందకీవు దు
ర్వార మహోన్నతున్, సుతు,నపారయశః ప్రతిభాప్రభావితున్,
మారునిఁ గేరువాని, సుగుణంబులప్రోవును బ్రోవుమా! ప్రియా! 70

శా॥ నాకై శోకము మానుమీ! రణమృతిన్ నాకంబుఁ గైకొందుఁ; బెన్
జోకన్ శత్రుచమూ సమూహములు విజ్జోడై, యపారాస్మదీ
యాకుంఠోరు పరాక్రమక్రమ మసహ్యంబై, సమీకంబువన్
ద్రేకంబై, తఱుమన్, శిరోజ్జ్వలయశశ్శ్రీఁ గాంచి, మింతున్ భువిన్॥"

వ॥ అని, బహుప్రకారంబుల నికారప్రతీకార బలవద్విరోధి ధిక్కారాత్మ గౌరవ పురస్కార వద్వ్యాహారంబుల పూర్వంబుగా నుపన్యసించి, యంచితధైర్యుండై, యా పూర్వగీర్వాణశేఖరుండైన జానుమండలుండు నిష్క్రమించినంతఁ, దత్కాంతయైన శోభావతియు, దుర్దాంతచింతాఽఽక్రాంతయై, స్వీయభాగ్యంబులు నిందించుకొనుచు, మనశ్శాంతివిఁ బొందకుండె; ననంతరంబ. 72

కం॥ ఆ మార్త్తిక మౌనియు, నిజ
సామీచీన్యమును, బ్రకృతిజప్రథితతరో
ద్దామా మేయమహోమహి
తామోఘోత్సాహ గౌరవాదృతుఁ గొప్పన్॥ 73

మ॥ మునిసంఘములతోడ మంతనము సంపూర్ణంబుఁ గావించి, త-
త్త్వనిగూఢార్థవిదగ్రగణ్యుల్ దెలుపఁ గర్తవ్యంబు నూహించి, వా
గ్మి; నఖండప్రతిభాప్రభావితుని, విస్మేరాగ్ని తేజోఽన్వితున్,
దనుజాధీశుసయొద్ద కంపె నొక దూతన్, సామభూమోదయున్॥

చం॥ అతఁడును, మౌని యానతి సురారి సభాస్థలిఁ జేరి, యచ్చటన్
దితిసుతవేష్టితుండును, వినీలశరీరుఁడు, రత్నపీఠ సం
స్థితుఁడును, గుంకుమోజ్జ్వల విశేషకచుంబి విశాలఫాల శో
భితుఁడకుతోభయుండు, నతిభీకరుఁడౌ దనుజేంద్రుఁ జూచుచు॥న్

వ॥ ఉద్ధృత దక్షిణ బాహుండై, యా జానుమండలునితో విస్పష్టం
బుగా నిట్లనియె- 76

శా॥ "నేనా పార్తికమానియానతి మెయిన్ నీ శ్రేయమున్ గోరి, వి
న్నాణంబై, శ్రవణీయమై, శుభదమై, నల్వొందుసందేశమొం
డీ నీకున్ దెలుపంగవచ్చితిని; దైత్యేంద్రా! వినంగోరెదన్;
నా, నాజానుమదాహ్వయుండనుమతిన్ దానిచ్చె నాదూతకున్॥ 77

ఉ॥ దైత్యుఁడు సమ్మతింప, బహుధా పరితోష పరీవృతుండునై,
దూత్యము నిర్వహింపఁ బరితోఽభివృతా భరణాత్మ గౌరవ
స్తుత్య చరిత్రుఁడిట్లనె; విశుద్ధయశోనిధి! జానుమండలా
ఖ్యా! త్యజనీయమౌసుమి! దురంతభవద్వ్యవసాయమిత్తఱిన్॥ 78

మ॥ రమణీయంబు, హితంబునా వచనమున్ రక్షోఽధినాథా! పరా
క్రమభూషా! విను; నేను శంభుని భుజాగ్రంబందు జన్మించి, యా
ప్రమథాధీశు నియోగమున్ బడసి, సంగ్రామంబునన్ నిన్ను దు
ర్దమదోర్దండ సముత్థచండిమ మెలర్పన్ నొంతు ముమ్మాటికిన్॥ 79

ఉ॥ శంకరునాజ్ఞ నేను శిరసావహియించి, జయింప వచ్చితిన్;
శంకయొకింత లేక, విను; సత్యముసుమ్మిది జానుమండలా!
వంకలు వెట్టఁబోక, బలవంతుఁడవైతివయేని, శౌర్యమే
యుంకువఁజేసి, రాఁగదె, రణోర్వికి నాపయి; నట్లుగానిచోన్॥ 80

శా॥ నాతోఁజాలవయేని, పోరితము విన్నాణంబుగాఁజేయ, నో
పైతే యాగ్రణి! యన్య (వక్ర) పద్ధతులకాస్థన్ మాని, వేగంబ, వి
ఖ్యాతానుత్తమ విఘ్నమార్గమునఁ జక్కన్ వేడఁగా శంకరున్,
బ్రాతే? నీకు శరణ్యుఁడౌఁజుమి! వృథావాదంబులేలా, యిఁకన్?॥81

ఉ॥ నీవతినీచతన్ బహుముని ప్రవరామరులన్ నితాంతబా
ధావిలవృత్తిఁ గిఱ్ఱులచి, యజ్ఞములన్ బొలివోవఁజేసి, వి
ద్యావిమలాత్ములన్, శ్రుతిరహస్యవిదగ్రణులన్ నిపీడనే
చ్ఛావిహృతిన్ వినష్టుల, విచారవిదూరత నొంచితే, కటా!॥ 82

మ॥ నిను మన్నించును శంకరుండు కరుణన్ నీదార్ష్ట్యమున్ సైచి, చ
య్యన, శంభున్ శరణంబు వేడుకొనుమన్నా! యట్లుకాదేని, నిన్
రణరంగంబున సంహరించు పని నేఁ గ్రార్యంబునన్ మించుటల్
దనుజాధీశ! శివాజ్ఞ తప్పదిది; తథ్యమ్మౌను ముమ్మాటికిన్॥ 83

చం॥ ఉదధినిడాగినన్, దిశల, నుగ్రవనంబులఁ జొచ్చినన్, మహా
ద్రిదరుల దూఱినన్, ఖగగతిన్ గగనంబునఁ బాఱినన్, బయో
దదృఢతరోదరంబుననదాటునలీనతఁ బొందినన్, నినున్
బొదివి, వధింతుఁ; గన్మొరఁగిపోవఁగ, నీతరమా? నరాశనా!॥” 84

కం॥ “ఇది, మాక్తికమౌనీంద్రుఁడు
విదితంబుగఁ దెల్పుమన్నవిధ; మిఁక, నీవున్
మది, లెస్స విచారించియు,
బదులువలుకు; మేనుదానిప్రతికిఁ దెలుపుదున్॥” 85

మ॥ అని, యామౌక్తికు ఘాతవల్కినఁ, గ్రుధావ్యాపారమేపారఁగా,
దనుజుండాజ్యవివృద్ధ వహ్నిక్రియ, నుద్యద్దేహుఁడై, దంతపీ
డన మొప్పన్, గనులెఱ్ఱవాఱఁగను, రుష్టక్లిష్టదష్టోష్ఠుఁడై,
ఘనసంరంభముతోఁ బనిట్లనియె వాక్పారుష్యధార్ష్ట్యాఢ్యుఁడై॥ 86

మ॥ “అరరే! మూర్ఖ! కియత్ప్రభావుఁడుర, ముక్తాముఖ్యుండు? నాముందు శం
కరుఁడేపాటి ఘనుండురా? నిశిత మత్ఖడ్గ ప్రహారంబు, త
చ్ఛిరముల్ బంతుల యట్టులిట్టియెగురన్ జిమ్మున్ జుమీ! ప్రేలితో
పరఁగన్ జీల్తును నీదునాల్కఁ; దులువా! వాచాలతన్ మానురా!”

చం॥ అనుచును, దుండగీని తనముప్పటికెచ్చఁగ, జానుమండలుం
డును, గరవాల సంగ్రహణ తత్క్షణ సంభ్రమ చంక్రమంబుగా
వినిచి, యమాత్యులిట్లు – “ప్రతివీర శిరోదళనైక కేళి! “దూ
తను వధింపరా” దనెడు ధర్మ మెఱుంగవె” యంచు, మాన్పినన్॥ 88

శా. అంతర్నిశ్వసనంబులూష్మములై, మావేగముద్రేక మె
క్కింతన్ శాంతములైన నాక్షణమునన్ గీనాశభీకేసుఁడా
శాంతంబుల్ గనుచుండ, దూతయునుడాయంబోయి, ముక్తర్షికిన్
సాంతంబున్ వినిపించెదూత్యమును నొయ్యన్ గార్యసంసిద్ధికిన్॥

ఉ॥ అంతట, జానుమండలుఁడహార్యవినిశ్చలధైర్యధుర్యుఁడే
కాంతమునన్ సమీక్షసమయాచరణీయమహిష్ఠ గోష్ఠిమె
మంతనముండి, తెల్విగలమంత్రులఁగూడి, రిపుప్రణాశ దు
ర్దాంతరుపాకపాయ వితథక్షణప్రియ వాక్కులిట్లనున్॥ 90

ఉ॥ "లోకములెల్ల గెల్చి, యతిలోక పరాక్రమశాలినైన న
న్నే, కృమికంబెఁ గీసయగుహీనుఁడు, ముక్తమహర్షి, ముక్తల
జ్జాకుఁడై దిర్చినిల్చునఁట! చావఁగనెంచెనో, యేమొ! వాఁడు జ
ల్పాకుఁడెయౌనుగాక! యపలాపమొ, వానికి బుద్ధిలోపమో!॥

చం॥ పితృవనమేనివాసమఁట! భిక్షుకవృత్తినిమానఁడంట! కు
చ్చితపుగ జాజినంబహహా! చేలచెఱంగఁట! కాలకూట సం
గతి గళనీలిమంబఁట! జగామొనగాఁడె, దిగంబరుండు; పో
రితమున వాని సాహ్యావిపరీతపురీతినిగోరె మానియున్॥ 92

మ॥ అమరేన్ "దొందును దొందె" యన్నటులు; వహ్వా! వీరిదానేస్తమె
న్న, మతిభ్రష్టులు, నష్ట పౌరుష రుషాఽఽంధ్యమ్మొక్కటే మిక్కుట
మ్మౌ; మునిన్ ముక్తుని; దత్సహాయుఁడగు శంభున్ శుంభ దస్మత్పరా
క్రమ చండాతపమిట్టిమిట్టిపడమిత్రద్వంద్వమున్ నొంపదే?॥ 93

ఆ॥ మాంసభోజనంబుమానేటి యెఱుంగఁడా
"బక్కపేగు" మాని; పిక్కబల్మిఁ

జూపువాఁడె యౌను; శూలియు నావంకఁ
జూడనైనఁ జూడలేఁడు పోర॥ 94

చం॥ కనుక, వజీరులార! తమకంబున వైరులఁ జీరి, పోరిలో
ఘనవిజయంబుఁ గైకొని, యఖండ యశోవిభవంబుఁ గాంచి, చ
య్యననగరంబుఁ జొచ్చి, విజయ ప్రకటాధిక సంభ్రమోత్సవం
బును జరుపన్ వలెన్ మన చమూసముదాయముఁ బ్రోత్సహింపుఁడీ! ।

ఉ॥ ఊహకుమించు నాహవ మహోత్సవ దోహల దోహదక్రియల్
వ్యూహ చమత్కృతుల్ బహువిధోజ్జ్వల సాధనముల్,
రథాశ్వము
ఖ్యైహితవాహనంబులు మహీస్థలినిండి, ప్రచండ వేగముల్
గా, హుడుకల్ హాళాహాళి జెలంగఁగఁ జిందములాఁదఁ జేయుచున్॥

క॥ రథ గజ తురగపదాతులు
ప్రథిత ప్రథనోత్సవంబు బహురూపముగా
వ్యథపఱుప, వైరి వీరుల
వృథా బహూత్సాహ మంతరింపనడువనా॥ 97

మ॥ రణకోలాహలమే హాలాహలముగాఁ ద్రైలోక్యమున్ భీత భీ
తనికామాత్త విహాఢ్యమై, దశదిశల్ తారాఁడ బెన్ రాయిడిన్
దనకే "దిక్కును-మొక్కు-లే"కునికి ముక్త భ్రష్టమాని ప్రభుం
డును, బీరంబు, హాళాహాళిన్ విడిచి, "చెట్టున్-బుట్టఁ"దాఁ జేరఁడే?"

మ॥ అని, యాజానుమహాబాహ్వాయుండు, సచివా యత్తుండు
గాకుండియున్,
దన మేల్గోరెడు మంత్రులందఱకుఁ గర్తవ్యంబు సూచించి, తా
ను నధిష్ఠించెను, వీరవేషమునఁ "గన్నున్ మిన్నుఁగన్గోక" శం
భుని, ముక్తర్షి నెదుర్చు పూనిక, రథమ్మున్ సర్వసన్నద్ధమున్॥ 99

చ॥ కవచ కిరీటముల్, ధనురఖండశరాళిఖరాసి తూణముల్,
వివిధ మహాస్త్రముల్, విబుధ భీతికరమ్ముల దాల్చి, దైత్యు డా
హవ జయశీలురౌ నిజసహాయులు సాయుధులై, బిరాన వెన్
దవిలి, తనున్ భజింపఁగ, ముదంబునఁ బెండిలి కేగు చాడ్పునన్॥

చ॥ వెఱ లెఱజమూసమూహము సువిస్తృత మిర్వదియైదు యోజనం
బుల నెడలేక, పొంగుచుఁ, బ్రమోదము, నాహవకేళికై కుతూ
హలము ముహుర్ముహుర్నవ నవాభ్యుదయమ్మును గూర్ప,
జాను మం
డలుఁడు రాఱెఁ దాఁ ద్రిభువనంబులకొక్కఁడె నాయకుండనన్॥

చ॥ రథ గజ వాజిపత్తి నికరంబుల ఘట్టనమాటిమాటికిన్
బృథివిచలించి, యోధ్ధృ విపరీత నినాదము మెండుగాఁ బర
శ్వధశరకుంత ముద్గరకృపాణమరీచులు ద్రష్టృ దృష్టులన్
శిథిలతనొందఁజేయఁ బయనించె సురారిచమూ సమూహముల్॥

మ॥ జయకాంక్షల్ మదినిండ, దైత్యులు రణోత్సాహంబు
వ్యక్తంబుగాఁ
బయనింపన్, రిపులున్న త్రోవునకుఁ, బైపై రాలెనుల్కల్; మరు
ద్రయమల్లార్చె; నసృక్కణంబులురలెన్; రాబందులున్, గ్రద్దలున్
గుయిపెట్టెన్; బిడుగుల్ వడెన్ వడిగరక్షోనాశహేతూత్థముల్॥ 103

ఉ॥ ఐనను, లెక్కసేయక; మనోజ్ఞ వికాసముతోడ, నాశరుల్
మానిని, దత్సహాయుల, నలంఘ్యబలాఢ్యులఁ జూచి, యంత, నా
జానుమదుగ్రసైనికనిశాచరులొక్క మొగిన్ మహోద్భటిన్
బూనికమై రణక్రియ వినోదముగాఁగఁ దలంచిరాత్మలన్॥ 104

శా॥ అత్యుత్సాహముతో బహు ప్రహరణ వ్యాపారవేత్త్రి ప్రగల్భ
దైత్యుల్ వచ్చుట జూచి, మాతృమని కర్తవ్యజ్ఞఁడై, స్వీయపై

న్యాత్మౌజ్జ్వల్యమునొర్వదీప్తులు మియున్ ద్యావాఽవనుల్
నిండఁ గా
“నితోర్జ్వస్థలమున్ బొనర్పుఁ”డని మన్నీలన్ ప్రబోధించుడున్॥

చ॥ అపుడు సువీక్షణాదుల, సహాయులఁగన్గొని హాని మౌళియున్
విపులవచః ప్రకారములవిన్చనిటుల్ - “కనుగొంటిరే” ఠథ
ద్విప హయపత్తి యుక్తుఁడయి, బీరములాడుచు, జానుమండఁడా
సరిపుఁడు, మహాస్త్ర శస్త్ర చతురత్వముఁ జూపగవచ్చెఁ జెచ్చెరన్

సీ॥ “మేరుమందరములా, తేరుల తీరులా”
యనువిచికిత్సయుయ్యాలలూఁప,
“నడగొండలా, మహోన్నత మదగజములా”
యనుననుమాన మెయ్యెన జనింప,
“రంగదుత్తుంగ తరంగంబులా, తురం
గంబులా” యను సందియంబు దోఁప,
“నీళ్ల ట్రుళ్ళింతలా, కేళ్లు వాటెడుభటా
టనములా” యను శంక మనము నింప,

గీ॥ జానుమండలు చతురంగ సైన్యమిదియుఁ
గదియుమనలను ధరణిగ్రక్కదలఁ;జడలఁ
బ్రాకు కెంధూళి వింత యెత్తైతమోవి
తానమన్ భ్రాంతి లోకులందఱును బొంద॥ 107

మ॥ మనపైవచ్చు భయంకరాసురుల సమ్మర్దంబు, దేవాంశ సం
జనితుల్, మీరలణంపఁగావలె; రహస్యజ్ఞుల్, రణోద్యోగ నై
పుణముల్ నేర్చిన దిట్టలాదురుగదా! పుణ్యాత్ములారా! మహే
శుని యాజ్ఞన్ దునుమందగున్ దనుజు, దుష్టున్,
జానుమన్నామకున్॥ 108

ఉ॥ అనిమిషాంబ, సంగరమునందు సహాయయగున్; ధ్రువంబు; త
జ్జాను మదాహ్వయాసురుని శంకటపౌరుషు, లోకకంటకున్
నేను వధింతుఁ; జూడుఁడు ముని ప్రవరుల్! భవదీయసాహ్యమున్
న్యూనముగాఁ దలంపను; మహోద్యమ మీయది మీయదేసుఁడీ!
ఉ॥ ఇంతకుమించి చెప్పఁబనియేమి? పరాక్రమభూషణుల్, రణా
త్యంతవిహార సంభ్రమ మహాకుతుకానితరాత్త సాహసుల్,
వంతునవచ్చు రాయగరువంబిఁకఁజెల్ల గరాదు; వాఁడుదు
ర్దాంత దురంతయాతనల, "అంపపుఁగోఁత" జగానబెట్టఁడే?॥" 110

వ॥ అనుమునివరు నెచ్చరికమెయి, మెయివొంగనింగికి జంగ సాచునట్టు లువ్వెత్తునలేచి, సేనానులందఱు శంఖభేరీ గోముఖమర్దళ మడ్డుక కాహళజయఘంటాద్యనేక మహావాద్యంబుల ఘోషంబులు భూనభోఽంతరాళంబునిండించుచు, దిగ్గజంబులు బెగ్గడిల్ల, లోకపాలురు తల్లడిల్ల, బ్రహ్మాండఋు భేదిల్ల, కులాచలంబులు మొగ్గతిల్ల, గ్రహ నక్షత్రి తారాగణంబులెల్లడుల్ల, వీరవిహారంబులన్ విజృంభింపుచు, నిలింపులకింపుసంపాదింప, వారును, గోరికలీరికలెత్త, వియత్తలంబునన్ విమాన యానంబులవచ్చి, బారులు దీరి నిల్చి, మహాత్త్విక మహాని మాళికి జయంబుగల్గుపొంతె స్వస్తివాచనంబులు గావింపుచుండి రప్పుడు. 111

సీ॥ జానుమంతుఁడు, ముక్త మౌనియు విజగీష
భూషగాఁ గల్గి, యాస్ఫోటనముల,
విస్ఫూర్జిత పరాక్రమస్ఫూర్తులు జెలంగ
స్పర్ధాళులై, పరస్పరము దాఁకి,
తృప్తులుగాక, సందీప్తులై, దృప్తులై
యుద్ధురోద్ధతి బహు వ్యూహములను
రచియించి, రణరంగ రంగన్మహోత్సాహ
సాహసోపేతులై, మోహరించి,

న్యాత్మోజ్జ్వల్యమునౌర్వదీప్తులు మియన్ ద్యావాఽవనుల్
నిండఁ గా
"నిత్యోర్జస్వలమున్ బొనర్పుఁ"డని మన్నీలన్ ప్రబోధించుడున్॥

చ॥ అపుడు సువీక్షణాదుల, సహాయులఁగన్గొని మాని మౌళియున్
విపులవచః ప్రకారములవిన్చెనిటుల్ - "కనుగొంటిరే" రథ
ద్విప హయపత్తి యుక్తుఁడయి, బీరములాడుచు, జానుమండలా
సరిపుఁడు, మహాస్త్రశస్త్ర చతురత్వముఁ జూపగవచ్చెఁ జెచ్చెరన్

సీ॥ "మేరుమందరములా, శైరుల తీరులా"
యనువిచికిత్సయుయ్యాలలూఁప,
"నడగొండలా, మహోన్నత మదగజములా"
యనుననుమాన మొయ్యన జనింప,
"రంగదుత్తుంగ తరంగంబులా, తురం
గంబులా" యను సందియంబు దోఁప,
"నీళ్ల త్రుళ్ళింతలా, కేళ్లు వాతెడుభటా
టనములా" యను శంక మనము నింప,

గీ॥ జానుమండలు చతురంగ సైన్యమిదియుఁ
గదియుమనలను ధరణిగ్రక్కదలఁ జదలఁ
బ్రాకు కెంధూళి వింత యెఱ్ఱతమోవి
తానమన్ భ్రాంతి లోకులందఱును బొంద॥ 107

మ॥ మనపైవచ్చు భయంకరాసురుల సమ్మర్దంబు, దేవాంశ సం
జనితుల్, మీరలణంపఁగావలె; రహస్యజ్ఞుల్, రణోద్యోగ నై
పుణముల్ నేర్చిన దిట్టలాదురుగదా! పుణ్యాత్ములారా! మహే
శుని యాజ్ఞన్ దనుమందగున్ దనుజు, దుష్టున్,
జానుమన్నామకున్॥ 108

ఉ॥ ఆఁ మిషాంబ, సంగరమునందు సహాయయగున్; ధ్రువంబు; త
జ్జాను మదాహ్వయాసురుని శంకటపౌరుషు, లోకకంటకున్
నేను వధింతుఁ; జూడుఁడు ముని ప్రవరుల్! భవదీయసాహ్యమున్
న్యూనముగాఁ దలంపను; మహోద్యమ మీయది మీయదేసుఁడీ!
ఉ॥ ఇంతకుమించి చెప్పఁబనియేమి? పరాక్రమభూషణుల్, రణా
త్యంతవిహార సంభ్రమ మహాకుతుకానితరాత్త సాహసుల్,
వంతునవచ్చు రాయగరువంబికఁ జెల్లగరాదు; వాఁడుదు
ర్దాంత దురంతయాతనల, "అంపపుఁగోఁత" జగానబెట్టఁడే?॥" 110

వ॥ అనుమునివరు నెచ్చరికమెయి, మెయివోంగనింగికి జంగ సాచునట్టు లువ్వెత్తునలేచి, సేనానులందఱు శంఖభేరీ గోముఖమర్దళ మడ్డుక కాహళజయఘంటాద్యనేక మహావాద్యంబుల ఘోషంబులు బూన భోంతరాళంబునిండించుచు, దిగ్గజంబులు బెగ్గడిల్ల, లోకపాలురు తల్లడిల్ల, బ్రహ్మాండము భేదిల్ల, కులాచలంబులు మొగ్గతిల్ల, గ్రహ నక్షత్రతారాగణంబులెల్లడుల్ల, వీరవిహారంబులన్ విజృంభింపుచు, నిలింపులకింపుసంపాదింప, వారును, గోరికలీరికలెత్త, వియత్తలంబునన్ విమాన యానంబులవచ్చి, బారులు దీరి నిల్చి, మహార్త్విక మహాని మాళికి జయంబుగల్గుపొంటె స్వస్తివాచనంబులు గావింపుచుండి రప్పుడు. 111

సీ॥ జానుమంతుఁడు, ముక్త మౌనియు విజగీష
భూషగాఁ గల్గి, యాస్ఫోటనముల,
విస్ఫూర్జిత పరాక్రమస్ఫూర్తులు జెలంగ
స్పర్ధాళులై, పరస్పరము దాఁకి,
తృప్తులుగాక, సందీప్తులై, దృప్తులై
యుద్ధురోద్ధతి బహు వ్యూహములను
రచియించి, రణరంగ రంగన్మహోత్సాహ
సాహసోపేతులై, మోహరించి,

గీ॥ యంచితాత్మ ప్రతాపదీవ్యత్ప్రభావ
భావితౌన్నత్య సాతత్య భవ్యరవ్య
నలతిరస్కారకారి సోష్మల సదాయు
ధ పరియోగ సన్నైపుణీదీప్తులైరి। 112

చం.తదుభయసైన్యముల్ బహువిధంబులఁజిత్రవిచిత్ర చంక్రమో
ద్యదురుశరాసితోమర ముఖాయుధపాతములన్యవీరవా
ర దృఢతరప్రయుక్త ముఖరప్రఖరాఖిల శస్త్రఖండన
ప్రదరములున్ జెలంగ, సమరంబొనరించె భయంకరంబుగన్॥ 113

వ. అట్టి ఘోట్టిదంపుఘట్టనంబున నిరువాగునన్ గల జగజెట్టులన్యోన్య శస్త్ర సంపాతశాతితులై, పుష్పితాశోకంబులును, బుష్పితకింశుకంబులునుబోలె, రక్తసిక్తాంగులై, వీరావేశంబులుఁలేశంబైనమానక, తురంగంబులను నిర్భిన్నాంగంబులను, శతాంగంబులను శతాధికాంగ భంగంబులను గావించుచుండిరప్పుడు సర్పరోమనామకాసుర వీరుండు సువీక్షణుని, ఖడ్గరోముండు సుబాహుని, జయబుద్ధివిలోచనుఁ, మాయామేయోపాయుండైన మహాకాయుండు మహాబలుని, గరాళ నాముండు మహారాజసునిన్ దాఁకి, వీ (యీ) డహోవని పౌరుషంబున ద్వంద్వయుద్ధ సన్నద్ధులైరి. తదనంతరంబు॥ 114

ఉ॥ చండ పరాక్రమక్రముఁడసాధ్యుఁ డరుధ్య శరప్రయోగ ద
క్షుండ తిరూక్షతన్ గదిసి, క్రోధము మిక్కిలి హెచ్చ, సర్ప రో
ముండు సువీక్షణున్ శరసమూహనిమగ్నుఁ బొనర్చి, సారథిన్
గండడఁగించి, గుఱ్ఱములగాసిలఁజేసెలఘుత్వ మేర్పడన్॥ 115

ఉ॥ అంత సువీక్షణుండును, మహామహిముండు, తదా శరున్ శరా
త్యంతనిదాఘతైక్ష్ణ్యము సహస్రముఖంబుల భూనభోఽంతరం
బంతయునిండ, బెండువడ, నాహవదోహలతావ్యపేతు, భీ
తాంతరు, లజ్జితాశయు, క్షణార్ధము నెవ్వగముంచె; ముంచినన్॥

ఉ॥ వాఁడును నీఁడవోవక, యవక్రపరాక్రమ మొప్ప నెన్నియో
వాఁడి శరౌఘముల్ బఱపి, వైరిపయిన్ జయకాంక్షమించినన్,
బోఁడిమిమీసమేఁబోలివోని సువీక్షణుఁడోహటించి, కి
గ్గాడి సురారికార్ముక ముఖండితమున్ బొనరించె వ్రేల్మిడిన్॥ 117

ఉ॥ వెంటనె సర్వరోముఁడును వేఱొక వింటిని గేలఁదాల్చి, "ని
ష్కంటకుఁడయ్యెదున్; బ్రభువఖండ జయంబును బొందుగాక; యీ
తుంటరి యెందుఁబోగలఁడు? దోమకు నేన్గులు బెగ్గడిల్లునే?
రెంటెము దాల్పు ముక్తమువి మృత్యువుదంష్ట్రలఁ జిక్కినట్టులే!"

క॥ అని, యిటులన్ దనలోఁ దా
ననుకొనుచున్, సర్వరోముఁడాఁ సజ్జధనుం
ర్ధ్వనుండయి, నిశితశర
ప్రణిపాతంబులను రిపుల వడిముంచెత్తెన్॥ 119

శా॥ ఆగ్నేయాస్త్రము వింటఁదొడ్గి. దనుజుండా సర్వరోమాఖ్యుఁడున్
భగ్నప్రజ్ఞుఁడుగామి నెంతయు మదిన్ గాటంబుగా నమ్మ, యు
ద్విగ్నుండౌచు, సువీక్షణున్ జఱచుఱన్ వీక్షించి, "తత్సేన భీ
భుగ్నంబై, నశియించుఁగాత" మని, విస్ఫూర్తిన్ బ్రయోగించినన్॥

శా॥ దానిన్ మాన్పఁగా, సువీక్షణు నాస్థన్ వారుణాస్త్రంబు, న
న్యూనాసహ్య మహత్త్వజిత్వరరిపువ్యూహాతి భీతి ప్రదం
బై, నైష్ఠుర్య మహిష్ఠనిష్ఠమెయిఁ, బ్రత్యాలీఢపాదస్థుడై,
సేనల్, హార్తిక మౌనియున్ బొగడ, నేసెన్ విక్రమావక్రుఁడై॥

వ॥ మఱియును, సువీక్షణుండు విపక్ష దుర్నిరీక్ష్యుండై, సర్వరోముని రథ్యంబుల నేడేసియు, సారథిపై నేడును, సంధిబంధములను బదేసియు, ముఖమున నాలును నారాచరంబులు గాడనేసియు, నొక్క వాలమ్మున వానిచేతి చాపంబును, నొక్కని శాతశిలీముఖంబునఁ డెక్కెంబును నేలఁగూల్చిన, సర్వరోముండును రక్తసిక్తాంగుండై, క్రోధవిహ్వలుండై, సువీక్షణుని గదాఽఽఘాత శాతితుంజేసె-నంత॥

మ॥ నెఱజోదాగదఁదీక్ష్ణ సాయకములన్ భిన్నంబుఁగావించి, వాఁ
డరికంఠచ్ఛిదకుంత కుంతశరశక్త్యాద్యాయుధంబుల్ పరం
పరగాఁ బర్వఁగఁజేయ, మానియును శుంభద్భక్తియుక్తాత్ముఁడై,
స్మరియించెన్ నిమిషాంబ, దానవజిఘాంసా
నిశ్చయోల్లా (ద్భా) సియై॥ 123

మ॥ నిమిషాంబా కరుణాకటాక్ష నిబిడానంద్య ప్రభావాప్త శ
క్తి మహాశక్తి మదాయుధ ప్రవరమున్ దీండ్రించి, వక్షోంతర
ప్రమథోద్యత్ప్రఖర ప్రహారముగఁ దీవ్రప్రక్రియన్ మించి, నై
వ, మృతుండయ్యెఁ దదీయఘాతమున నవ్వాఁడున్ క్షణార్ధంబునన్॥

ఉ॥ జానుమదా శరుండవనిచండిమ, తన్ గెలిపించునంచు, గం
డాన, దృఢంబుగా, యదవదానవిశేషము లెంచి, నమ్ముచున్,
దా, నముచిద్విడాదిని బుధప్రకరంబు, బహుప్రకార సై
న్యానిత సత్త్వహాననుచు, నువ్విళులూరుచునుండఁ జచ్చెలన్॥ 125

సీ॥ అట్టి జగజెట్టి, సర్వరోమాభిధాన
యాతుధానాధముఁడు నిమిషాంబచే, సు
వీక్షణుపరాక్రంబుచే, నాక్షణంబ
నేలఁగూలె, రక్షస్సేననీల్వ లేక॥ 126

క॥ హాహాకారముఁ జేయుచు,
నాహవభూమికిని దూరమైఁ కర్తవ్యం
బూహాలకందకపోఁగాఁ,
“హాహా” యనుచు, సేనికాళ్లపైఁ బడినంతన్॥ 127

ఉ॥ మౌనివరుల్, “సువీక్షుని మానిత శౌర్యమవార్య”మంచు, సై
న్యానికవారముల్, మునియు మాక్తికుఁడున్ ముదమంది, స్వస్తివా
చా నిరవద్య నిర్మల నిజప్రకట ప్రచురానురాగ యో
గా నితరాభిగమ్య హృదయ ప్రమదాతిశయాఘస్యులై, కడున్॥

గీ॥ సాధువాదముఁ జేసిరి సంతసించి;
ఖడ్గరోమ సుబాహులు ఖండ శౌర్య
చండిమోద్దండులౌచుఁ, గేసరియుఁ గేస
రియును దాఁకిన యట్టి కారీతి దోఁప॥ 129

క॥ అన్యోన్యముదాఁకి రసా
మాన్య ప్రాభవముమీఱ, మైవెంచి, మహో
మన్యు స్వరూపులౌచును,
జన్యోత్సాహంబుతో నజయ్యులు పోరన్॥ 130

ఉ॥ ఒండొరు వేయు బాణముల నొండొరు మధ్యపథంబు నందె యు
ద్దండత, ఖండఖండములతాదృశవీర రసైకమూర్తులై,
చెండుచుఁ, జండ శౌర్యులయి, శీఘ్రత, లాఘవమొప్పఁబోరఁగన్,
గండరగండలై, ముఖవికారము దోఁపఁగనీక, వీఁకమై॥ 131

వ॥ఇట్లు కొంతసేపు వారిద్దరును నొండొరులుతీసి పోని వీరా
వేశంబునన్ బోరాడి రంత, సుబాహుండును, ఖడ్గరోముని రథ్యంబులన్
గూల్చి, విరథునిఁ గావించిన, వాఁడును, రణరంగంబువీడి, ఆవ్వాన
నింగి కెగసి, ధనుర్ధరుండై, శరపరంపరలన విచ్ఛిన్నంబుగాఁ బఱపినన్,
బిఱివోని మగతనంబున సుబాహుండును, సహసోత్పాతంబునన్ మించి,
వానికవచంబుఁ జించి, యర్ధచంద్రాకారంబైన సాయకంబున్ బ్రయో
గించి, తద్ధనుశ్శింజినీ భంజనంబుఁగావించె-ననంతరంబ॥ 132

మ॥ హరికాణ్డః పతనాళునై పుణరయవ్యాధూనన త్రాస కృ
చ్ఛ్రతోద్దాముఁడు, ఖడ్గరోముఁడవకాశంబెట్లొ చిక్కన్, గడున్
గఠినంబౌ పరిఘాయుధంబుఁగొని, యాకాశంబుపై కేగెఁదా
"మతనిద్రాళుత, సత్రభోజనత"యన్ మాడ్కిన్ బరీహాస్యుఁడై॥

చ॥ "ఇప్పుడె సుబాహుఁజంపవలెనెట్లయినన్, మదమోఘశక్తి నీ
చపుఁ బ్రబధనోద్యమంబిది ప్రచండత జానుమదాధి పత్యమున్
విపులతరంబొనర్పవలెఁ; నిశ్చయమిద్ది"యటంచు, నాఁడు న
ష్టు పరిఘునైచెపై రిపయి ముష్కరుఁడైఁ, ప్రతిఘా ప్రకృష్టుఁడై॥

చ॥ అయిదునిశాతసాయకములాశరపాశమదాపహృజ్జగ
త్త్రియభయకృత్ప్రపాతముగ, దైవవచోఽనుగృహీతుఁజేసె; "ని
శ్చయమిఁక, ఖడ్గరోముఁడని, శాతితుఁడో"నని, సంతసింప, నెం
తయును వియచ్చరోచ్చయమ నారతముత్కలికేరితంబుగన్॥ 135

ఉ॥ అంతట, హీనసాధనతనాశరుఁడా ప్రతివీరుఁజూచి, యా
శాఽంతములన్ గనుగొనుచుఁ, "జాలును-జాలు! సుబాహువీర! నీ
వంతల, నింతలన్ రిపు, నిరాయుధు, నన్ను వధింపఁజూతువే?
సుంత దురంబుమాను"మనుచున్, మఱియొక్కశరాసమున్ గొనెన్॥

మ॥ అటులన్ గైకొని, ఖడ్గరోముఁడు, రణవ్యాపారమే పారఁగాఁ,
బటుబాహూజ్జ్వలుఁడై, సుబాహుపయిఁదృష్టప్రక్రియన్, దా విశం
కటుఁడై, బాణపరంపరల్ గురియ, ముక్కల్ సేసి యావ్వాని, ది
క్తటముల్ మార్వ్రలుకన్, మహామహుఁడు వక్కాణించెనిట్లాతఁడున్॥

ఉ॥ "ఓరి, నిశాఽటకీట! వినవో, మదవశ్యవచశ్చయంబు! మీ
నేరములే మెఱుంగమె? మునిప్రకరంబుల, బ్రహ్మవేత్తలన్
దారుణరీతిమై బహువిధంబుల బాధలువెట్టి, యజ్ఞముల్
మారటలేక, మీరలు చలంబునఁ బాడరఁజేయలేదొ కో!" 138

చ॥ అనుచు, సుబాహుఁడా శరు, గతాసునిఁ జేసినయంత, ఖడ్గరో
మునిపతనంబుతోనసురుమూఁకలు విచ్చి, యితస్తతః పలా
యనపరులైరి; వేల్పులు, మహర్షులుమెచ్చిరి జేతయౌ సుబా
హుని; బహుశంఖదుందుభిరవోల్బణమయ్యె దిశాఽవకాశమున్॥139

ఉ॥ అంత, విరోచనుండు భయదాహవ వీరవిహారహారి, దు
ర్దాంత పరాక్రమక్రముఁడరాతినిరాస పరాయణుండు, కా
లాంతకమూర్తి, పౌరుషజయాధికలబ్ధయశః ప్రకాశుఁడ
చ్ఛాంతరుఁడక్షయోద్యతజయంబుఁగొనన్, జయబుద్ధినుద్ధతిన్॥140

చ॥ ఎద్రిచిరణాంగణంబున జయేచ్ఛ మెయిన్ జయబుద్ధి నెమ్మెయిన్
జిద్రుపలుగాఁగఁ జేయుడు, విశృంఖలతన్, ఖలతన్, గులాచలం
బద్రువఁగపేఁచువీవలిక్రియన్, సివమెత్తి, దిదృక్షుసైన్యముల్
విద్రిచితోలంగఁగా, రణభువిన్ విహరించి రుదంచితోద్ధతిన్॥ 141

చ॥ అసురుఁడు, మానిమాళియు గదాభిహతి ప్రవణుల్ రణస్థలిన్
విస్మృమరకౌశలంబమర, ప్రేయుచు, నొండొరు ద్వంద్వయుద్ధమం
దసకృదపార పౌరుషరుషాతిశయంబున మించి, నొంచి, తా
రసదృశవీరశేఖర మహత్త్వమహాస్త్వముహుస్సత్త్వులై॥ 142

కం॥ "అనతర సుకరమ్మగు"నని,
యనిమిషులగ్గింపఁ దగినయని యొనరుపఁ, బా
యని పగనసురయు, మునియును
ననిచిన కనలగ్గియై, యనాశ్వస్తముగాన్॥ 143

శా॥ వీరావేశముతో విరోచనుఁడు దద్వీడ్వీర్య హార్యస్త్ర శ
స్త్రౌఘాఢ స్థిరసంప్రయోగ నిపుణుండై, యర్ధచంద్రాంచితా
కారంబైన శరంబునన్ గుణధనుః కంఠంబులన్ జెండి, బ్రం
దారారాతినొనర్చె నెక్కటిక్రియన్ నామావశిష్టున్ రిపున్॥ 144

మ॥ ఇటులీలన్ జయబుద్ధి, తత్సహచరుల్ హీనక్రియోత్సాహులై,
విటతాటంబుగ పిడిపోయిరసురుల్ వెన్ జూడకంతంత, నె
ట్టెటులో; గంగరగండలయ్యెను, సురల్ హెచ్చించు, భావించి, హ్రా
త్స్ఫుటముల్ బీతున "బిక్కుబిక్కు"మన, నుద్యోగింపలేకయ్యెడన్॥

కం॥ మాయా సిద్ధాసురుఁడును,
మాయావియు, ద్వంద్వయుద్ధ మాయాధ్యాత్వా
మేయాత్మీయాన్వతో
గ్చాయాకారంబులొప్పి, రణమొనరింపన్॥ 146

మ॥ దశతాళోన్నతవిగ్రహుండు, కుహనా ధార్ష్ట్యాతిదాష్ట్యాదిదో
ష శతావిష్ట దురాశయుండు, వికృతా శాంతస్వరూపుండు, స్థూ
ల శిరోధి ప్రతిమందరుండు దరి, ష్వేళంజేసి, వ్యాత్తాననుం
డు, శృతక్ష్మీరదనార్యమాననుఁడు, పోటుంబంటు, దైత్యుండొగిన్॥

వ॥ పెచ్చురిల్లిన మచ్చరంబున హఠాత్పాతంబున మాత్రికమాని
మాళిసేనలన్ జిందఱవందఱఁజేయం దొడంగినయంత; దన్నియంతయు,
మాయావియునైన మహాకాయుండు విజృంభింప, మహాబలుండు నిమే
షాంబను స్మరియించె; నంత నమ్మహామాయయు, నిమేషార్ధంబునన్
బ్రసన్నయై, "వత్సా! భయంబు వలదు. వీనిన్ జీల్చిచెండాడు"మని,
యుపదేశింప, నాతండాయాతుధానుమేనెల్లభల్లంబులన్ గ్రొచ్చి,
యార్చిన, వాఁడా యాకారంబునుజ్జగించి॥ 148

శా॥ సింహవ్యాఘ్రవరాహవాహరిపు విస్మేరాకృతుల్దాల్చి, ఘో
రాంహోవ్యూహ దురూహమోహ కుహనావ్యాపారపారీణుఁడై,
రంహః ప్రక్రమవక్ర విక్రమ ముహుర్హ్రాంకారహుంకారుఁడై,
"హంహో! జియ్య! హసాదటంచు," నిజసైన్య వ్రాతముల్
మెచ్చఁగన్॥ 149

శా॥ పోరంబోర, మహాబలుండపుడు నిర్మక్రోగ్రనారాచదు
ర్వారుండై, రణరంగమందుఁగపట ద్రాఘిష్ఠదార్ఢ్యాఘుఁ, దే
వారాతిన్, జమువీటఁదత్కృతము, నూత్నాతిథ్యమున్ గైకొనన్,
ధారాపిళ్ల మహాఽస్త్రశస్త్ర నికరద్రాక్పాతితున్, బంపినన్॥ 150

శా॥ భీతాత్ముల్, హతశేషులా సురరిపుల్ బిర్వీకులన్ జెంది, దు
ర్జాతుల్ "కాలికిబుద్ధిసెప్పిరి" మునుల్ సంతోషితస్వాంతులై
రాతోద్యద్ధ్వని, జేతృసైనికనికాయోధ్మాత శంఖధ్వనుల్
చేతోమోదముఁగూర్పఁబర్వె; సుమవృష్టిన్ దేల్చిరుర్విన్ సురల్॥

ఉ॥ రంగదభంగశౌర్యుఁడు, కరాళముఖుండును, లక్ష్మణాఖ్యుఁడున్,
సంగరరంగచంక్రమణ సంగతులై, యతులైకతాన భం
గిం, గడిఁదిన్, బరస్పర జిగీష సజేశులకాస్థఁ, దృప్తి, దీ
ప్తింగలిగించుచున్, డెలివి, తేటయుఁ జూపి, రణంబొనర్పుడున్॥152

శా॥ ఉన్నట్టుండి కరాళ వక్త్రుఁడు, రణోద్యోగంబు రెట్టింప, ద
ర్పోన్నత్యంబున శత్రువర్గమున కొయ్యన్ "గుండె గాలంబుగా",
మిన్నన్ దాఁకుననంగ నేచి, రణభూమిన్ లక్ష్మణాఖ్యున్ ముహు
ర్భిన్న స్థైర్యు నొనర్చె; సారథిని, దేరిన్, వాజుఁన్ నూఁకుచున్॥

ఉ॥ ఐనను, లక్ష్మణాఖ్యుఁడు రణావని నిల్చి, విచక్షుణుండు ర
క్తాననుఁడై, రణోగ్రుఁడు శరాగ్రము తాఁకియుఁ దాఁకకున్న, ము
న్నే నగుబాటుకోర్చి, రిపులేత్తెఱఁ బాఱునటుల్ విచిత్రచే
ష్టానితరానుగమ్యచతురాహవరంగవిహారహారియై॥ 154

సీ॥ ఆకర్ణకృష్ట వృత్తాకార కోదండ
దండుండై, విక్రమోద్దండుఁ డౌచు,
గండరగండలా చండ దుశ్చర్యర
క్షస్సైన్యనాథుల జక్కడంచి,
ప్రతివీరుని, గరాళవక్త్రుఁదనుత్రాణ
నిర్భిన్నుఁజేయు పొంటెనునురంబుఁ
జీల్ప, సారథిని, దేజీలఁగూల్ప, నిశాత
సాయకంబుల సప్తసంఖ్యనేయ,

గీ॥ ఱొమ్ము వగిలె; సూతుండును సొమ్మసిల్లె;
రథ్యములు పాఱిపోయెను రథము విడిచి;
యైన, వీడని ప్రౌఢి, నయ్యాతుధానుఁ
డాలమొనరించె లక్షణ జ్ఞాఖ్యుతోడ॥ 155

శా॥ వక్షశ్చ్యుతదసృక్ప్రవాహములు పర్వన్, లెక్కయే లేక, త
ద్రక్షోఽధ్యక్షుఁడు తీక్ష్ణభల్ల శరవర్షం బొప్ప, శత్రుక్షయా
పేక్షన్ బోరొనరించి, మించెనసమాహీనోజ్జ్వలాటోపుఁడై,
యక్షీణోత్కలికాదిదృప్తజన సత్యస్ఫారదోస్సారుఁడై,॥ 156

చం. అపుడు కరాళవక్త్రుని గతాసునిఁ జేయఁగ, లక్షణజ్ఞుఁడున్,
విపులతరప్రతాపమున నిశ్చల నిస్తులనిర్భరార్భటిన్
గపటనట ద్భ్రుకుట్యధికనాట్యకరంగ విశాలఫాలప
ట్టపృథుల భీకరహారాద్వికట ప్రకటాట్టహాసుఁడై 157

చం. "నిలు-నిలుమోరి! మూర్ఖ! రజనీచరనీచ! రణాంగణమ్మునన్
ఖలు, నినుఁదున్మి, లోకమునకంటకమున్ బొనరింతు; మీరుని
చ్చలుసురలన్, మహర్షుల నశంకితచిత్తులరై, విశంకటో
జ్జ్వల బహుహింసలన్, దురితవర్తనలన్ గడుగాసివెట్టరే?" 158

మ॥ అనుచున్, దైత్యుఁగరాళ వక్త్రుఁగనిఁ లక్ష్యంబొప్పఁగా, లక్షణ
జ్ఞ నిరూఢాఖ్యుఁడు చూపఱెల్లవొగడన్, సమ్యగ్ధనుః కర్షణం
బునముయ్యేడుశరంబులన్ బఱపి, సమూర్ఛాఽఽలసున్ జేయఁగా,
దనుజుల్ భీతిలి, పాఱిపోయిరి భృశాధశ్శీర్షులై, యత్తఱిన్॥ 159

చం. ఎదిరిబలంబు, స్వీయబలమెంచక, జానుమదాహ్వయుండును
న్మదుఁడయి, దుష్క్రుధాఽఽంధ్యము, మనఃప్రభవంబు
తమస్కరంబుగాఁ,
"గదనమొనర్చి, సైనిక నికాయముతో మునిముచ్చు, మాత్రికున్
విదళితశీర్షుఁ జేసెదననిన్ ద్రుటిలో"నని, విఱ్ఱవీఁగుచున్॥ 160

ఉ॥ "కొంచకెదుర్పవచ్చు తనకున్ త్రిజగజ్జయ వైభవాతి శో
భాంచితమూర్తి కెవ్వ రెదురై, దురమున్ బొనరింత్రు? బాపురే!'
యంచును, జానుమండలుఁడహంకృతిమై, నెసకేఁగి, "రండు; రా
త్రించర వీరులార! వెనుదీయక, పోరఁగడంగుఁడుద్ధతిన్॥" 161

మ॥ అనుచున్, దానవ సైనికావళికి వీరావేశమున్ గూర్చుచున్,
దనవారిన్ బురికొల్పి, మార్త్తికమునీంద్రద్రాగ్ర యోత్కంఠ, నె
మ్మనమున్ నిండఁగ, జానుమండలుఁడు తన్మోనీంద్రు సైన్యంబుపై
ఘననారాచ పరంపరల్ గురిసెఁ దైత్యక్రౌర్య స్ఫూర్తి నై॥ 162

శా॥ తత్సంరంభము, యుద్ధసన్నహనమాద్ధత్యంబు, దోఃప్రౌఢి,త
త్రోత్సాహంబును నూఁతగాఁగొని,నిజవ్యూహంబులన్ గూడి,య
త్యుత్సేకంబునజానుమండలు, మహాంహో మోహమోఘేహుతోఁ
దత్సైన్యంబులు మౌనిసైన్యములపై దర్పంబుమైఁదాఁకినన్॥ 163

ఉ॥ "రక్కసులుక్కుమీఱుచు, శరప్రముఖ ప్రధనోపయోగిస
మ్యక్కరణంబులన్ బఱపి, యూహవదోహలతన్ జెలంగ, నీ
యుక్కివులొక్క లెక్కయె? రహోలసితంబుల వేల? రండు - రం
డొక్కటఁజీల్చి చెండుదము; యుద్ధమిఁ కెప్పటికంత మెందెదున్?॥"

వ॥ అనుముని వరుని పసుపుననని యొనరుప మిగులఁగుతుకము లెదలఁ
బొదల, నొడయని ముదల గయిగొని, మునినికరములు నికరములగు
మగతనములు మెఱయ, రయమునఁగదిసి, యసురుల యుసురులు
గొనఁదలఁచి, దురమున నెదురు వడిన యరిసము దయముపయి విసవిస
వినిశితశర పరంపరలు గురియ, బెగడుఁగడుఁ గుడిచి, చిడిముడివడుచు,
దనుజులు సమర తలమును విడిచి, తోకముడిచి, వెనుదిరుగుట యె,
యదను మెయిఁదమకుచితమయిన పనియని తలచి, మగిడిచనుటఁగల
తమతమకమునుగనుఁగొనినదనుజవిభుఁడుతనయనుచరులదిగులుడుపుచు
నొడువుఁనగనుఁగొనల నలుపుఁబొగలు గలుగుకఱకుఁజూపు

లను గనలనలమయి, నెఱసులుమియుటఁ దెలిపియుఁ, దెలుపక, యనువు మెయి గడుసుఁదనపుఁబలుకులు పలుకుచు, దనతలబిఱుసుఁ దనము తఱుగుట తలదఱుఁగుట యగుననని, యదిబయలు పడనీయక, సావహిత్థంబుగా, సావహేళనంబుగాఁదెచ్చికోలు బింకంబున నాగ్రముక్కఁడి రక్కసుండిట్లనియె॥ 165

ఉ॥ "ఏను జగద్విజేత; నెదురెవ్వరు నాకు? ధనుర్ధరుండనై,
పూనిరణాంగణంబునను ముక్తునిఁ బ్రాణవిముక్తుఁజేయనే ?
జాను మదాహ్వయుండనఁగ, శంభుఁడు, శార్ఙ్గియు, శక్రుఁడున్, సురల్ఁ
మానులుభీతిబొందరె? "పలాయనమంత్రము" మానుఁడియ్యెడన్॥

శా॥ రక్షోరాజ్యమకంటకంబుగ నొనర్పన్ బూని, సర్వాసురా
ధ్యక్షత్వంబువహించి, మించి, సమరవ్యాపారమేపార, శ
స్త్రాక్షీణోజ్జ్వల సంప్రయోగతతధైర్యస్థైర్యసచ్ఛౌర్యలీ
లాక్షోదక్షమలాలసాఽనలసనోల్లాసోద్యమోద్భాసినై॥ 167

ఉ॥ వీరవిహారహారినయి, విస్ఫురదాహవకేళిలోలతన్
మారుతులన్ జయించి, యసమాన పరాక్రమశాలినై, మహో
ఘోరతఁజూపఁ గోరెద; నకుంఠ శరాద్యఖిలాయుధ ప్రయో
గోరు తరోద్యమోచితసముత్సుకతన్ జనుదెంచు మీరలున్॥" 168

చ॥ అని, యనుయాయులన్ దఱిమి, యాహవదోహలులన్ బొనర్చి, య
య్యనిమిషవైరిముక్తమునినాదటఁగన్గొని, "యోరి, మార్తికా!
మునికులపాంసనా! విగతబుద్ధి! యెఱుంగవునన్ను, జానుమం
తునిఁ, ద్రిజగద్భయంకరు; నినున్ గడతేర్చెదఁ బోరవేల్మిడిన్॥

చ॥ ఎఱగలిఁ జేర్చితో తులువ! తృణ్యాః నగణ్య పరాక్రమక్రమ
స్ఫురితుని, నన్నె దుర్పఁగలప్రోడయెవండుర? యుండి-యుండి, చి
చ్చుఱుకు పతంగమైతివి; మహోగ్రమదీయ శరాగ్ని ప్రమగ్గవే?
పఱచ! నినున్ బడల్పఱచ ప్రాతియె? నీవొకపోటుబంటవే?॥ 170

చ॥ మదను చరుల్, భయంకరులుమర్త్యుల, మర్త్యుల లెక్కసేయరు
ద్యదరినిరాసలాలసులతాంతలతాంత సహోదరుల్, నిర
స్తదరులు, సంగరోద్ధురులు, తత్పరులాయుధవిద్యలన్నిటన్;
విదితచరుల్ త్వదాప్తులకు; వీఱిఁడి వేడబమేలనీకిటన్? 171

చ॥ విను; పిశితాశనుల్ నమలివేయుదురోటు నినున్; దురాత్మ! నే
నునుదునుమాడుదున్; మతిమునుల్, సురలున్
"సురకంటకంబుఁ" గం
టను గనుఁగోఁగలారె? వికటప్రకటావితథ ప్రలాపముల్
మును వినిపించి తెల్లెడల; మొక్కల మేలర ? హూత్తికాహ్వయా!॥

కం॥ నీవెందేఁగినఁగానీ,
వావిరి నినుబట్టుబట్టి పల్లార్చెద; నా
దేవళ్లను విని, నీపా
టా విమ్కృతదీనభావులై , చెడరోకోఁ!॥" 173

వ॥ అని బహువిధములగు బిభీషికలఁ దెగడుచుఁ, దనకొలఁది యెఱుఁ
గక, వదరుటలు విని, దరహాసిత వదన కమలుఁడగుచు, మునివరుఁడు
దనుజున కిట్లనియె॥ 174

మ॥ "విను; హూరా! నినునేనెఱుంగనె? మహావీరుండవేయూడు; వే
యనుమానంబు లేదు; జానుమదభిఖ్యా! విక్రమఖ్యాత! నీ
ఘననిహా చరిత్తోత్తమానితరశక్యంబౌతపశ్శక్తియున్
వినియున్నాఁడ; బహూక్తులేమిటికి? బృవ్వథిన్ నీకుమాఱున్న దే?॥

ఉ॥ ఐనను, నిన్ వధించుటకుమాఽధిపుఁడే సృజియించెనన్నుఁ; ము
న్నా నముచిద్విడర్థపతులాదిగఁగల్గు దివౌకసుల్ భవ
త్సేనల ధాటికెంతయును దీనత జెందుటయే నెఱుంగుదున్;
గాని, భవద్వధార్థమిఁక, నన్ శివునానతి దొందరించెడున్॥ 176

మ॥ వధియింతున్ నిను, లోకకంటకు; మహావ్యాఘ్రేంద్రసంపృష్టు, ను
త్క్షుధితద్వీపిముఖాంతరాళపతితున్, గృద్ధద్విపోద్భిద్యమా
ను, ధరిత్రిన్ గరుణాళురెవ్వరయినన్, సోఁకోర్వఁజేయంగలా
రు; ధుతాస్మద్వివిధాయుధక్షతశరీరున్ బ్రోవఁగా, శక్తులే?॥ 177

మ॥ అయినన్, నీకొకమాటఁజెప్పెదను, శ్రేయస్కమౌనతన్; దానవా!
పుయిలోటన్ దెగనాడి (దిగఁద్రావి), భక్తిమెయి శంభున్,
సర్వలోకేశ్వరున్
గయిమోడ్పుల్ ఘటియించి, వేఁడుము కృపాఽగణ్యున్,
శరణ్యున్ బదా
శ్రయమున్;దప్పక, బ్రోచుశంకరుఁడునిన్; సందేహమేలా,మదిన్?

మ॥ నినునేఁజంపఁదలంప; నాశగలదేనిన్ నీకు జీవింప, శం
భుని పాదాశ్రయమొక్కఁడేగతి; యనుస్మక్తోత్కటాహంయుతా
జని పూర్ఖ్యంబున నీకవశ్యము వినశ్యత్వమ్ముఁ బ్రాపించునో
దనుజా! బింకములేల? యేలచెడఁ? గర్తవ్యంబు యోజింపుమా!॥

ఉ॥ చాల తపంబొనర్చి, బహుసంపదలన్, బ్రభుతా ప్రభావము
ద్వేలపరాక్రమక్రమము విస్మృతపూ యశమున్, విశాలరా
జ్యాలసతాఽవిదూరవిజయంబునుబొంది, ప్రసిద్ధిఁగాంచు నీ
కేల శివాపరాధమున నిట్టె నశింపఁదలంపుపుట్టెనో!॥ 180

చ॥ ననువినవైతివేనియు, క్షణంబువఁ జంపెదనిన్ రణంబునన్;
మనముననెంచిచూడుము; వినష్టులుగారొకో! దుర్గకాసురా
దినిజభటోద్భటుల్! వృథగఁ దీవరకాఁడవుగాక, మంచినెం
చి, నమదమర్త్య, శంభుని విసిశ్చలభక్తిసమాశ్రయింపుమా!॥ 181

చ॥ ఎవఁడు శివున్, రమాధవు, దినేశు, రమన్, నగజన్, సరస్వతిన్
భువిఁ దెగడున్ విరోధిత, విమూఢతవాఁడు నశించుఁజూఫె! నా
యవితథవాక్కులన్ విను, మహార్యవిభూతియుఁ, బ్రాజ్యరాజ్యమున్
ధ్రువములు గాఁగ నిల్పుకొను; ధూర్జటిమానుమి! రాక్షసాధిపా!॥

మ॥ కనరెప్పాటనుగల్గి, కయ్యమునకున్ "గాల్దువ్వ దేనిన్" క్షమిం
పనునిన్నున్; నిధనమ్మెవాం దెదవా, జీవంబెంచెదో; నీవె, చ
క్కనమాహించుకొనంగదే, మరణమున్ గైకోక, (గాకల్ల) కాకోలకం
ఠునిగాఢంబుగనాశ్రయింపుము; వృథాటోపంబులన్ మానుమా!"

మ॥ అనుము క్తేశుహితోపదేశ మధురవ్యాహారముల్ విన్నయా
దనుజుండంతటఁ, బాదతాడితమహాదర్వీకరంబున్ బలెన్,
గనులన్ నిప్పులురాల్చుచున్, ధనువునన్ మార్వీన్ గుదుర్కొల్పి, యి
ట్లనియెన్ వాక్పరుషత్వమొప్పఁగనలాహారించి గర్వాంధుఁడై 184

మ॥ "అరరే! ముష్కర! ముక్తనామక! యిదేరా, మృత్యుఘోరాననాం
తర సంపాతమ్ముఁ గోరివచ్చితివి? సుత్రామాగ్ని యక్షేశత
ద్వరుణామర్త్యచమూ సమూహముల మద్బాహుప్రతాపంబు వి
స్ఫురితంబౌచును, విస్ఫులింగముల విప్లోషింపదే, యాజులన్?॥ 185

శా॥ దేవళ్లందఱుఁగింకరుల్ గదర! మద్భుజప్రతాపంబు ప్రబ
స్తావంబందు వినంబడన్, జడిసి, చేష్టల్ దక్కి, "గ్రుక్కిళ్లు ప్రిం
గే వాజమ్మలు" గారె? యెమ్మెలి విమన్నింపన్ జుమీ! యింక నీ
యీవాచాలత చాలుఁ-జాలుస్మర! ముక్తేశా! నిరాశాపశా!॥ 186

శా॥ "ఫాలాక్షుండు", "పినాకపాణి" యను శబ్దంబుల్ యథార్థంబులే?
లోలాత్ముల్ హరియున్, హరుండు, (విరించి) శశి సూర్యుల్
నన్నునిన్ నొంచువా
రా? లీలాచలనోచ్చలచ్చరణు, నన్నాలించినన్, ద్రుంది, ప్ర
త్యాలీఢాంఘ్రి యుతిస్థితున్ గనిన, మూర్ఛాక్రాంతులౌ
దుర్గదా!॥ 187

మ॥ వినియున్నారము రెండు—మూఁడుతడవల్ కాట్టీ! త్వదారాధ్య, సుం
త, నిమేషాంబపమున్ రణాంగణమునన్ దార్కొన్నమాత్రాన, ము
క్తుని, నిన్నా జగజంతనమ్ము కొని, ధూర్తుల్ మెత్తురా; "కాట్టిదీ
తె; ఇఁకన్ ఆఁకలిఁజుట్టుఁడీతలకు" నాఁగ్రించుందనంబియ్యదే!" ॥

మ॥ అని, పారుష్యమువాక్కులన్ బ్రకటితంబాలించి, యజ్ఞానుమం
తుని ధూర్తత్వమదోద్ధతత్వముల, ముక్తుండున్ గ్రుధావేశము
ప్ప, నితాంతారుణనేత్రకోణుఁడయి, చాపంబంది, సజ్జ(జ్య)ంబుఁజే
సి, నిమేషాంబను, శంకరున్, ఋషులనెంచెన్ భక్తియుక్తాత్ముఁడై ॥

మ॥ అరదంబెక్కి మహోన్నతమ్ము, ముని, ప్రత్యాలీఢపాదస్థుఁడై,
కఱకౌ బాణము క్రూరరాక్షసుని వక్షఃపీఠమున్ దావగు
ల్ప, రుషారుణ్యముబిట్టు కన్నుఁగవఁబెల్చెన్ దట్టమై, కానరా,
నురుకీర్త్యున్నతపౌరుషంబులలరెన్ యుద్ధోచితోత్సాహమున్॥ 190

ఉ॥ కంకటముచ్చిపో, భువనకంటకుఁడా దనుజుండు మానిపై,
గొంకక, నూఱుబాణములకుంఠగతిన్ బఱపన్, రయంబునన్
శంకరకింకరుండు వదనంబున హాసము తొంగిచూడ, నా
శంకరుఁడై, తదీయశతసాయకముల్ విదళించె వ్రేల్మిడిన్॥ 191

చ॥ అది తలఁపంపుగాఁదలఁచి, యా జగజెట్టి (నెఱజోదు) గభీరగర్జ బె
ట్టిదముగఁజేయఁ, గొండలు బెళిల్లునప్రీలె; జగత్త్రియంబు దా
విదళితమయ్యె; సంద్రములు వేగమె సంక్షుభితమ్ములయ్యె; ది
గ్విదిగిభబృందమొక్కమొగివేదురునొందె క్షణార్ధమాత్రలోన్॥192

మ॥ ప్రళయాభ్రంబు భయంకరారభటిఁ గుంభద్రోణపాతంబుగా
జలధారల్ గురియించునట్లె వడిని, రక్షః పక్షకాధ్యక్షుఁడు
జ్వలబాణౌఘములొక్కపెట్టరిపుతైక్ష్ణ్య క్రౌర్యహార్యుత్కటో
ష్మల శౌర్యప్రకటంబుగాఁబఱపెశుంభద్దంభసంరంభియై॥ 193

మ॥ ఎకిమీఁడిట్లు పరాక్రమింపఁగ, బలాహీనుల్, తదీయుల్ లయాం
తకమూర్తుల్ సరిలేనిమూర్తురకుసై తమ్మూర్తిఁగూర్పంగనెం
చి, కృతాటోపులు పోరొనర్చిరురుముష్టీముష్టినై నార,ని
ల్చి, కడున్ జాకచకిన్ గచాకచి, నసన్మ్రష్టోక్తిశస్త్రంబుగన్, 194

ఉ॥ రాక్షసవీర పౌరుష పరాక్రమమున్ సహింపలేక, యా
త్ర్యక్షభుజోద్భవోద్భట భటావళిహావళి మీఱఁబోర; బ్ర
త్యక్షముగా సమిజ్జయసహస్రగుణ ప్రకటంబుగా, విమ
ర్దాక్షమనైజతేజముగ, నార్చిరి సార్చిరుషాగ్న్యుదగ్రులై. 195

చం॥ ఉభయబలంబులిట్లు కృతఘోగ్రసమగ్రజిగీషఁ జేసి, దుం
దుభిపణవానకాదులధ్వనుల్ భువనంబుల బ్రీలఁ జేయఁ, గా
కుభమిభయూథమూఁగెఁ; గలగుండువడెన్ జలరాసు లేడుఁ; పే
ర్చి, భృశవిహారులై, రిపులఁ జేకొనరై రసురుల్, మునీశ్వరున్. 196

చం॥ కలన, మహర్షి దానవులొకళ్లొకళ్లను దీసిపోక, సం
కులశరపాతముల్, పణవగోముఖ దుందుభిముఖ్యనాదతుం
దిలభటసింహనాదములు దీర్ఘములై, చెలఁగన్, రణాంగణో
త్కలికవెలార్పఁ, బోరిరి జిఘాంస, జిగీష మదిన్ మెలంగఁగన్. 197

వ. అట్టి యుద్ధంబున మార్త్తిక జానుమండలు లిర్వురునుర్వరగ్రక్క దలఁ, జదల జలదంబులకాండకాండ పటంబులై, యొడల జలదరింపఁ జేయఁ, గిరిఁగిరియు, గిరిగిరియుఁ, గరిఁగరియు, హరిహరియుఁ, బులిఁ బులియుఁదలపడినవడువునఁ బెనఁగుచు, బెడిదపుటడిదములఁ జదియుచు, నిశితశరపరంపరల ముమ్మరమ్ముగా ముంచెత్తుకొనుచుఁ, బెద్దయుం బ్రొద్దుతద్దయునుడ్డామరంబుగానొడ్డారించి, విజృంభించిరంత, వివస్వం తుండంతర్హితుండయ్యె - నయ్యెడ. 198

శా॥ సంధ్యాదేవతపశ్చిమాశదనరెన్ సంరక్తయై, పుష్పసా
గంధ్యాఢ్యంబులు, మంద మందములు, కాఁకల్ లేనిశీతానిలా

వంధ్యానింద్య విలాసమానములు శుంభద్భక్తిమైఁగొల్వఁగ
ర్వాంధ్యమ్మేమియులేనిమౌక్తికుని, లోకారాధ్యుదర్శింపఁగన్. 199

చం॥సురరిపుఁజంపుజంపుగల శుద్ధచరిత్రుని, మౌనిఁగాంచి, తా
వరుణ్ణుఁడు మోదమేదురతఁ బ్రత్నచిరత్న మహార్ఘ్యరత్నవి
స్తరవివిధోపదాఽర్పణ విధాన వధానపథీనుఁడయ్యెనా,
సరగఁదనర్చెఁబశ్చిమదిశన్ జరమారుణ సాంధ్యదీధితుల్. 200

వ॥ అంత, మౌక్తికమౌనీంద్రుండును. 201

శా॥సాయంసంధ్యనుపాస్తిఁ జేయుటకు నుత్సాహంబుఁ, గర్తవ్యస
త్త్వేయత్వంబును జూపుమౌనులకుఁ బ్రీతింగూర్చఁ బొంటెన్ సురా
ర్యాయుఃకర్తన కృన్నిశాత శరవర్షామోఘు మేఘాయిత
జ్యాయస్సజ్య(జ్ఞ)ధనుర్ధ్వనిస్తనిత సమ్యగ్వ్యాప్తిఁగల్గింపఁగన్. 202

చం॥జడిసి, సురారులజ్జడి, సిషాధయిషాఽవగతి ప్రహీణతా
జడిమఁ, బలాయనౌపయిక సాధనసద్ధనులైరి; దృప్తచి
త్తుఁడు, దనుజాధినాథుఁడు నుదుంబరసత్ఫలసత్త్వుఁడై, నడల్
తడఁబడ, రాజధానికిఁ బలాయితుఁడయ్యె "బలా" యనన్ జనుల్. 203

కం॥ సురకంటకులందఱువడి
"సురకంటక" రాజధానిఁజొచ్చుటఁగని, శం
కరభుజసంభవుఁడిట్లనెఁ
బరమాదృతినంజలించి, బ్రహ్మజ్ఞులతోన్. 204

చం॥"వినుఁడు; మునుల్! మదీయమగువిన్నపమున్; నియమాభిషేకసాం
ధ్యనతిముఖ క్రియాఽఽళి సమయంబును మీఱక, మీరలాచరిం
ప, నరదమస్మదీయము భవద్వహనక్షమ మిందునందఱన్
గొని, విమలోదదేశమునకున్ మిముఁజేర్తుక్షణార్ధమాత్రలోన్."

చం॥అన, విని, "యట్లొనర్పుమని, యందఱువల్కఁగ, మౌక్తికుండుస్యం
దనమునమౌనిబృందముముదంబునఁగూరుచునుండఁ, బెక్కుయో

జనములు వేగ నేఁగి, యొకచక్కిని జక్కనఁ దేరు నిల్పి, త
జ్జనములు మెచ్చ నేర్పఱచె సాయక ఖాతముఁ జెర్వు వింతగన్॥

వ॥ అదియును, మధురమధురజల భరమధురిమాధరిత సుధంబును, స్ఫురితకమలకువలయ విసరరజః ప్రసరసురభిళ మృదుల మృదులానిలవిలసనంబును, భృంగీమంగళ సంగీతభంగీ సంగాభంగ భంగాంగీకారకోలాహల సంకుల సంచలత్సిష్ణాసు కుతూహలహాలహాలికావిజృంభితంబును, పులినతల సమాసీన కలహంస సంసద్గళ ప్రసంసక్తేంకారాంకూర శృంగార సాగర తరంగమాలికా డోలికాందోళిత పాంథలోకమానస ప్రతిబింబాయిత నిష్పంకరోధోంతరాళసోపాన పరంపరాపరిదృశ్యమానా సమానరామణీయకంబును, బకక్రౌంచ బలాకాజలకుక్కుట కారండవ చక్రవాకసారస కోయష్టిక ప్రముఖ నిఖిల జలవిహంగమ విహరణ హృదయంగమంబును, ముక్తేశముక్త సాయకపాతోత్పాదితంబైన యక్కాసారంబులోచన గోచరంబైన యంత, నంతర్వాణులును, బ్రణతగీర్వాణులును, రోమాంచ కంచుకితసర్వాంగీణులునైన యమ్మౌనిగ్రామణులత్యంత సంతోషిత స్వాంతులై, యందుఁ జొచ్చి, యఘమర్షణ సూక్తంబులుచ్చైస్స్వర సంయుక్తంబుగానుచ్చరించుచు, ముక్తేశునిన్ గీర్తించుచు, సుస్నాతులై. సమగ్రావ్యగ్రబ్రహ్మవర్చస సందీప్తులై, పునఃపునస్సంతృప్తులైరి. మఱియును, 207

సీ॥ అఘమర్షణస్నానమాచరించుట యొకా
దపరసంధ్యోపాస్తి నాదరించి
రపరసంధ్యోపాస్తి నాదరించుట యొకా
దుపదిష్ట మంత్రముల్ జపమొనర్చి

రుపదిష్ట మంత్రముల్ జపమొనర్చుటయొకా
దగ్ని కార్యంబుల నగ్ని దీర్చి
రగ్ని కార్యమ్ముల నన్ని తీర్చుటయొకా
దంచితభక్తి నర్చించిరీశు;

సీ॥ నడుగడుగున మునీశులత్యంత భక్తి,
ముక్తమౌనిఁ గీర్తించుచుఁ, బుణ్యమూర్తి,
యామమాత్రంబుగడపిరి ధీ మహితులు;
మౌక్తికర్షియుఁ దీర్చె సంభావ్య విధులు॥ 208

కం॥ పరశివచరణ సమర్చా
పరపరమమునీశ్వరులకు ఫలకుసుమసమి
ద్వరవస్తు ప్రదుఁడయి, ము
క్తఋషి, ప్రహరసమయమునొక క్షణముగఁగడపెన్. 209

వ॥ అనిన, విని, యవ్వలివృత్తాంతం బెట్టిదని, వీణామౌనివాణి జాని నడుగుటయును. 210

ఆ॥ సిరియునీకుఁజెల్లి; సిరిగలాఁడవుబావ;
సిరిగలానిచెల్లి చెలువనీకు;
సిరియునీకుఁ జూడఁగొలఁదైన, సిరులీఁగ
లాఁడవాఁడువౌర! ప్రోడవాఁడు!. 211

ఇది, ఆంధ్రీకృతముక్తీశ్వరోపాఖ్యానంబునందు
సంప్రహరాంతరిత ముక్తకాసారవర్ణనమను ద్వాదశాధ్యాయము

—0—

# త్రయోదశాధ్యాయము

ఆ॥ సిరులు కనులకొనలఁగురియు(శ్రీ) సర్వమం
గళకుమగఁడవగుటఁ, గానుపీస
మేనిలేని నీదుమేని బూదియె భూతి
నాశ్రితాళి కొసఁగునమరలింగ!॥ 1

ఆ॥ అవధరింపు మవలిదగుకథ; సురముని
నలువకనియె-"వింత గొలుపుముక్త
మహానిశిష్టగాథ; దీనిశిష్టావధే
యంబునమృతమధురిమంబుమించు. 2

ఆ॥ వినఁగవలతు; దేవ! వివరించి తెలుపఁగా
వలయు;నెటుల సాగెఁగొను? దాని
ఫలితమేమి? భక్తపక్ష! రక్షోఽధ్యక్షుఁ
డాగ్రహించి, యెట్లు నిగ్రహించె?" 3

కం॥ అని, యడిగిన, విని, కమలా
సనుఁడునుఁదనతనయునకు విశాలహృదయుఁడై,
వినిచెనిటులు; "ముక్తమునీం
ద్రునిచేనపజయముఁబడసి, తొలఁగియసురయున్. 4

ఉ॥ ముక్తమహర్షిసాయక సమూహముద్వ్యూహముఁజీల్చ, ధైర్యని
ర్ముక్తతజానుమండలుఁడురోఁజుచు, సన్నకసన్న పాఱెను
ద్వ్యక్తతఁ; బ్రాణరక్షణసముత్సుకతన్"సురకంటకంబు"ను
ద్రిక్తత,రిక్తతంగని, పదింబదిజేసె మనోభయంబునన్. 5

శా॥ దుష్టాత్ముండగు జానుమండలుఁడిటుల్, "దుష్కాలదుర్దైవదు
శ్చేష్టల్ నష్టముఁగష్టమున్ దనకునిస్సీ! కల్గఁగాఁజేసె;వి
స్పష్టంబయ్యె"నటఁచు, నెంచుచును, సావష్టంభుఁడై,యంత,సం
దష్టోష్ఠుండు, సహోపవిష్ట బహుమిత్రభ్రాత్రమాత్యేష్టుఁడై. 6

ఉ॥ సభ్యులతోడ ముక్తముని సంహననోపయిక ప్రకారముల్
బిభ్యదమర్త్యమండలుఁడు, విస్తృతచర్చ యొనర్చి; సోదరుం
డభ్యధికాతిసూక్ష్మధిషణాఽతిశయుండని, విశ్వసించెన
స్తోభ్యతరప్రభూతనయ శోభితు, నక్షుభితున్, సుమండలున్. 7

ఉ॥ ఆదరమేదురేక్షణ కృశాశయుఁడా శరసేతయిట్లనెన్—
"సోదర! వింటివే, యిపుడు సూడులుమాక్తికుఁ బ్రోత్సహింప, నా
తోదురముంబొనర్ప, నభితోమహితోత్సుకుఁడా విమూఘుఁడున్
ఖేదముఁగూర్చెరా! మన యనీకినికిన్, మనకున్ మదాంధతన్ 8

చం॥ క్షణమున విశ్రమించి, మనసైన్యము దైన్యమునొందఁజేసి, ని
ర్ఘృణత, ఘుణాక్షరా యితమరిందమ నామము, మందుఁడాతఁడా
యణఁగిమణంగియున్న యమరావళి, మానికులంబు, లోకముల్
బ్రణతులొనర్ప, బిట్టెగసిపాటున, నన్ దృణతుల్యుఁజేసెరా!

ఉ॥ దాఁపురమేల, తమ్ముఁడ! యథాయథలైరి సురారివీరులా
హా! పరిఘాయితాయతభుజాధికసత్త్వుఁడనైన నన్నెరీ
ఘాపరితప్తమానసుఁగటా! మునిప్రముచ్చనిశాతసాయక
ప్రాపితవేదనున్ బొనరుపన్ గలిగెన్ రణరంగమందొగిన్. 10

ఉ॥ ఏమిర! మాటలాడవదియేఁమి? "ససేమిర" మాననాతలం
పామునిఁబెక్కు బాములకు నాదటలోఁగొనఁజేయుటొక్కటే
నామదికిష్టమైనయది; నాకు నుదమ్ముఁడవౌటనాయశ
శ్రీమహినిల్చిపొంటె, రిపుశిక్షయొనర్పఁగనూహసేయురా! 11

మ॥ మను పింద్రాగ్ని యమాసురాప్పతిమరుద్భూతేశ పౌలస్త్యది
వ్యనిశాతాయుధ సంప్రహారములనొయ్యన్ దూరధూతంబులన్
బొనరింపన్ జగజెట్టినై, యిపుడహా! ముక్తేశుఁడన్నన్, దదీ
యనిరాఘాటపతత్త్రప్రహారముల తైక్ష్ణ్యంబన్న, భీతిల్లుదున్॥ 12

ఉ॥ కావున, ముక్తహానినిఁకఁగాలునిప్రోలికిఁ బంపుపెట్టులో
నీవెయెఱుంగుదోటు! రజనీచర! యోచనసేయురా! కడున్
దీవరకాఁడనై, మెలఁగితిన్; గతమయ్యెనితాంతగర్వమున్;
లావరివౌనినున్ గన, మనఃపరితాపము కొంత యీఁగెడున్॥ 13

కం॥ "మనలోమనమాటసుమా"!
మనమేలాకో, యళుకుఁదెందుహానియనంగా;
ననుజన్ముఁడ! ననుఁదేర్పర;
నినుఁబడయుదునగ్రజన్మునిఁగ జన్మములన్॥" 14

వ॥ అన, విని, సుమండలుండు జానుమండలున కిట్లనియె॥ 15

కం॥ "కొండఁదలక్రిందఁబెట్టుక,
బండ్రకై "దేవులాడు" పామరునివలెన్
గండుమగల దండించిన
గండరగండఁడవు; పిఱికికండయిదేలా? 16

శా॥ ఇమ్మై బమ్మైరవోవఁజెల్లునె, భవాదృగ్ద్వార సందర్శికిన్?
"గిమ్మ"న్నన్, "జనులున్-గినుల్" బ్రతు(దు)కఁగా,
నేరగ్గదా! యన్న! శూ
రమ్మన్యుండు, వృధాఽఽత్తమన్యుఁడు, వచఃక్రౌర్యైక
శౌర్యుండు, స
త్యమ్మమ్మాత్తికి మానికిన్ మరణమత్యాసన్నమైనట్టులే!॥ 17

మ॥ నినుఁగర్తవ్యపరాయణున్ బొనరుపన్ నేనెట్లు నేర్వంగలాఁ
డను? నాత్రోఁచినయూహఁదెల్పెదను; గంద్రశల్ గాక, ధిక్కారముల్,
గనలున్ గన్నులఁగాననీక, పెలుచన్ "గాండారిమాండారిప్రో
ద్దున" నస్మచ్చతురంగ సైన్యములు తోత్తోఁ జుట్టుముట్టన్వలెన్॥

ఉ॥ ఈనడిరేయి దాయపయి నేఁడె అస్సైన్యముఁ బంపి, వ్రేల్మిడిన్
దానవనాథ! వారలనణంచుటకర్జము; రాత్రివేళన
మ్మానవులున్, దివౌకసులు మాంద్యముఁ జెంది, వ్యపేతశక్తులై,
న్యూనతఁ గాంచియుందురు; దనుప్రభవుల్ గెలుతుర్ ధ్రువంబుగన్”

చ॥ అన, విని, జానుమండలుఁ “డహర్పతి మ్రింగెద; మిత్రి మొత్తెదన్;
వనభవవహ్నిఁ బుక్కిటను బట్టెద”నంచెసకేఁగి, సోదరుం
డును, జతురంగసైన్యమునిటుల్ ప్రధనోచితసాధనంబులన్
గొని, వెనువెంటరా, మదిని గోరిక లీరికలెత్తఁ గ్రొత్తలై॥ 20

శా॥ ఆ రాత్రించరు లామిషాదులయి, తామాకంఠదఘ్నంబుగా
మైరేయంబులు గ్రోలి, మత్తిలి, మహాఽమర్షంబునన్ యుద్ధకాం
క్షారంహస్స్థిరగత్వులై, నడచిరుత్కంఠాఽసహోద్రేకులై,
వీరాలాప మహాట్టహాసములు విన్వీథిన్ విజృంభింపగన్॥ 21

శా॥ యుద్ధోద్యుక్తులు జానుమండల వివృద్ధోద్రేక రేఖోక్త్య సం
బద్ధాలాపులు, బుద్ధిజాడ్యజనితోన్మాదుల్, ధనుర్బాణ ఖ
డ్గాద్ధాబద్ధదృఢోద్యముల్, దనుజులు ద్యత్సిద్ధసన్నద్ధులా
రాద్ధేద్ధ ప్రభువైభవుల్ నడచిరుగ్రక్ష్వేడభీత్యావహుల్॥ 22

మ॥ అసురానీకినులిట్లనేకములు, మాద్యద్దంతియూథంబు వె
క్కసమౌ వేడుకఁ గ్రీడకేఁగు క్రియ, నక్షయ్యప్రతాపంబు, సం
తసమున్ బంతములాడ, “దాయలపయిన్ దార్కొంచు,
మార్కొంద”మం
చసమీక్ష్యాచగణప్రియత్వమున నొయ్యన్ మాత్రికున్ జేరఁగన్॥

మ॥ పొలసుందిండులు కండకావరముమై, ముక్తేశుఁ, దత్సైన్యమున్
గలఁతంబెట్టి, తొలంగఁ జేయు దృఢసంకల్పం బనల్పంబుగాఁ
బెలుచన్ బైఁబడి, బాణపాతములచే భీతిల్లఁ జేయంగ, వా
రలు తత్కాల పలాయనోపయికమంత్రప్రక్రియాఽవక్రులై॥ 24

చ॥ పసిచెడి పాఱిపోవుతనవారి యవారిత భీతిఁ జూచి, తె
క్కఁ సమగు పౌరుషంబునను, బ్రకామమనోముదమున్ జనింపఁజే
య, సుదృఢభక్తి, మౌని, నిమిషాంబ స్మరించినయంతమాత్ర, నా
మె, సదయహృత్సరోరుహ, నిమేషములోనఁ
గృతావతారయై॥ 25

శా॥ వేయున్ మోములు, వేయుఁగన్నులు, సహస్రవిఖ్యాతశస్త్రాస్త్రయు
క్తాయస్తంభసదృగ్భుజార్గళసహస్రాఖండనైపుణ్యమున్,
వాచామేయనిజానుభావమును, శుంభత్సాహసోపేతరం
హోయానంబునుగల్గి, రాక్షసుల వ్యూహోచ్ఛేదమున్ జేయఁగన్॥

మ॥ భృశవిత్రస్తులు, ముక్తమౌన్యనుచరుల్, శ్రీమన్నిమేషాంబికా
నిశకారుణ్యకటాక్షవీక్షణ ముహుర్నిర్యత్ననిర్యత్సుధా
కృశధారావళిసిక్తులై, వివిధ ధర్మప్రేష్ఠ గోష్ఠీస్థితి
ప్రశమాసక్తులునై, భజించి మునివర్య స్వాంతసంతుష్టిగన్॥ 27

ఉ॥ అంత, నిశీథమై, కువలయాప్తుఁడు వెన్నెల గ్రుమ్మరింప, న
త్యంతము, శాంతమౌచు, భువనాంతర మొప్ప, మహర్షులంద "ఆ
క్కాంత, కుశాస్తృతావనిపయిన్ శయనించి, సుషుప్తి సౌఖ్యమున్
గాంత"మటంచు, నెంచి, తమకంబున సుత్సుకులై, పరుండఁగన్॥ 28

శా॥ మేనుల్ వాల్చిరో, లేదో! మౌనులు; మహోర్మివ్రాత సంక్షుబ్ధని
ధ్వానానూన విశాలసాగర తతౌద్ధత్యంబు నిందించు సే
నా నానావిధ భీకర ధ్వనుల మంచప్రక్రియన్ వీను లెం
తే, నిండింప, హఠాత్సముత్థితులు, ప్రహ్వీభూతచేతస్కులై॥ 29

మ॥ "ఇది రక్షోధ్వజనీతతధ్వనియయా; హ్రీవర్జితుల్ వాండ్రటం
చు," దృఢక్రోధము గన్నులందరుణరోచుల్ సూప, ముక్తీశ్వరుం
డు, దయాపూర్ణ మనస్కుఁడై, మునులకిట్టుల్ కార్యనిర్వాహమ
భ్యుదయోపాయము సూటిగాఁ దెలిపెనుద్యోగింపవారందఱున్॥ 30

ఉ॥ “పూజ్యులుమీరలందఱును; బుణ్యజనాహవమేలసేయఁగా ?
సజ్యధనుర్ధరుండనయి, చయ్యన నేనెయజయ్యవిక్రమం
బాజ్యసమిద్ధవహ్నియుఁగ, నా శరవంశవనాళిఁ గాల్తు; న
త్యాజ్యవిభజ్యమానపరితః ప్రసృతావితథప్రతాపినై॥ 31

చం॥ అసురుని, జానుమండలు, నహర్పతిసూర్పునఁదోఁచునంతలోఁ
గసిమసఁగన్ రణావని, జగత్త్రియమల్లలనాడ, నేఁడునే
నసదృశవీరవిక్రమవిహారమొనర్చెదఁగాక! మీరు సం
తసమున మీఱుచుండి, శయనంబులహాయిగ నిద్రఁజెందుఁడీ!”

మ॥ అని, ముక్తేశుఁడు విన్నవింపఁగ, వసిష్ఠాత్ర్యాదులా మానులున్
జనితామోదులు,మేదురాదరులునై,“స్వస్త్యస్తు తే!”యంచుఁ,“దే
స్త్వసిశందిగ్విజయో; జహిత్వరితమేవారీ” నటంచున్, “బ్రభో!
పునరాయాహిజయశ్రియా”యనుచుఁ, దామున్ బల్కిరుత్కంఠనై॥

కం॥ “మంథాద్ర్యాయితభుజ! పరి
పంథిబలాబ్ధింవిమథ్య, పాలయలోకాన్;
పంథానస్సంతుశివాః!
గ్రంథింహృదయస్యభింధి కరుణామూర్తే” 34

వ॥ యది భవతి, తథా-తదాఽవితథమ్ 35

సీ॥ వృత్రశత్రు ప్రియా వీటికాపేటీషు,
సప్తజిహ్వాంగనా స్తనతటీషు,
దండభృత్ప్రియవధూధమ్మిల్ల బంధేషు,
నిరృతిసతీశిరోధ్యురుపథేషు,
పాశపాణ్యవరోధవరగండపాళీషు,
పవనకాంతానితంబస్థలీషు,
యక్షేశపత్న్యలాక్ష్యాక్రీడకేళీషు,
హరమహేలాకరాగ్రావళీషు,

సీ॥ సారఘనసారశకలంతు! చందనంతు!
విచికిలంతు! హీరంతుచ! విశదహాసల
వంతు! మృదులదు కూలంతు! ప్రసవకందు
కంతు! ముకురంతు! తావక ఘనయశాంసి॥'' 36

చ॥ అని, వచియించు వారి వచనాంతర సారమెఱింగి, మౌక్తికుం
డును, జయశీలుఁడై, తతమనోజవవాయుజవాఢ్యమై, పలా
యనపరమై, విముక్త వివిధాయుధమౌ నిజయోధయూథమున్
బునరుదయ ద్రణోద్యమచమూ ఘటమానముఁజేసెఁ; జేసినన్॥ 37

ఉ॥ అంతటవింతజోఁప, నిమిషాంబ మహర్షికి సాహ్యకారులా
కుంతపరశ్వధాద్యఖిల కోవిదులన్ సృజియించిపంప, వి
భ్రాంతి యెఱుంగనట్టిముని వారలఁజూచి, తదేకదీక్షు, నొ
క్కింత విచేష్టుఁడై, తెలిసి, ''యెవ్వరుమీ''రని, వారినడ్గినన్॥ 38

ఉ॥ వారలు పల్కిరి''ట్లనఘ! ''వారక మీరు రణాంగణంబునన్
గోరకయే, సహాయతఁగనుంగొనుచుండి, జయంబు, మోదమున్
గూరుచుపొంటె ముక్తసుముఖున్ బొనరింపు''డటంచుమమ్ముసా
ధారణసాధనాఢ్యులను దైవతమానిమిషాంబ బంపుడున్॥ 39

మ॥ తదలంఘ్యాజ్ఞసు జానుమండలుఁపయిన్ దండెత్తు ముక్తేశ మౌ
ని దరిన్ నిల్తుము; తెల్పుఁడాయనఘుఁడున్నిద్ర ప్రభావుండు, యో
ద్ధృ దృఢప్రజ్ఞుఁడు మీకుఁగన్పడియెనే? ఋష్యగ్రణీ! తెల్పుఁ డ
భ్యుదయమ్మున్, జయమున్, యశమ్ము, శుభదోద్యోగమ్ము
మీ కబ్బెడున్॥'' 40

చ॥ అనుడు, వచించె మౌక్తికమహర్షి; ''మహామహులార! యిప్డు మీ
రనిరిగదా! జగత్త్రియ హితైషిని, మౌక్తికమౌని నేన; యీ
దనుజుల నుక్కడంతును; యథాయథలై, తదనీకినుల్ పలా
యన మొనరించు మద్ధనురుదగ్రమహోగ్రరవ శ్రుతిన్ గడున్॥ 41

మ॥ రవి పూర్వాద్రికి రాకమున్నె, పటు శౌర్యంబొప్ప, రక్షోఽధిప
ప్రవినాశంబొనరింతుఁ; దద్రథగజాశ్వవ్రాతపత్తి ప్రకాం
డ వధోద్యోగ విజృంభణోద్భట పటిష్ఠ ప్రౌఢతాఽఽఢౌకనా
త్త విసర్పత్పరిపంథినిర్మథన విత్తస్వీయ సత్త్వార్భటిన్॥ 42

క॥ ఇది స్మరఘుస్మరుశాసన
మదియున మోఘుంబు; దానికి తథాత్వంబె
ట్టెయ్యది, యేలకల్లు?" నన, "మం
చిది"యని, వారెల్ల సంతసించిరి మిఫులన్॥ 43

ఉ॥ అంత, సహస్రవక్త్రియు, సహస్రవిలోచన, దోస్సహస్ర, దు
ర్దాంత పరాక్రమక్రమ నిరాకృతశుంభని శుంభముఖ్య, యే
కాంత నిజాంఘ్రి భక్తివశయా నిమిషాంబయు, ముక్తమౌని నా
వింతగఁజూడఁ; దోచెరణవీథిఁ దదీయసహాయయాటకున్॥ 44

వ॥ నానా సాధనోపేతులైన మౌక్తిక మౌనీంద్రుని సైనికులు భయ
రహితులయి, నవనవోత్సాహదోహలులై, నిమిషాంబా సాహ్య
దోహదులైరి. నిమిషాంబయు, నానాఽఽయుధోపేతయు, నానాఽఽ
భరణ దేదీప్యమానయు, బహు సహస్రముఖనయన శ్రవణయునయి,
దర్శనంబిచ్చుటయే గాక, హుంకార మాత్రంబునన, రాత్రించర
సైన్యంబునుదైన్యంబునొందించియు, హతాన్మూర్ఛితులఁగావించియు,
మౌక్తిక మౌనీంద్రునిఁ, దత్పక్షంబువారిని గంటికిఱెప్ప వోలె సంరక్షించు
చుండె-నంత, మౌక్తికుండు భక్తియుక్తుండై, యమ్మహాశక్తిని యఽఽ
శక్తి నిట్లు స్తోత్రంబుఁగావించె. 45

మ॥ "భువనేశీ! భువనావనా వితథవిస్ఫూర్తి స్ఫురన్మూర్తి! యీ
భువనంబుల్ పదునాల్గు నీ వలననే, పుష్టంబులౌ; దేవి! నీ
వు వినా, స్థావరజంగమాదులివి నిల్పంగాంచుటల్ దబ్బఱల్;
స్తవమున్ గాదిది; వాస్తవమ్ము జననీ! శశ్వత్ఫలన్మజ్జనీ!! 46

క॥ సర్గంబు, స్థితియు, లయము, ని
ర్గళనిర్గళితయుష్మదద్భుతశక్తిన్
గీర్గో గారిపాలురు
దుర్గమములుగాక, తెలియుదురు సర్వేశీ!

ఉ॥ మేమననెంత? దేవి! పరమేష్ఠియు సృష్టి యొనర్ప నేరఁడా
తామరసాక్షుఁడున్ స్థితికిఁ దత్తఱపాటునుజెందు; రుద్రుఁడున్
మైమఱచున్ లయంబునకు; మానుగ రాజససాత్త్వికంబులున్,
తామసమున్ త్రిశక్తులమ దారుగ్రహింపక, తావకంబులన్॥ 48

ఉ॥ అమ్మరో! జానుమండలముఖా సురసంహరణంబొనర్ప, నీ
విమ్మయి యుద్ధభూమికిటు లేలవడిన్ జనుదెంచితమ్మ! నీ
నమ్మిన భక్తులుర్వర ఘనమ్మగు కీర్తిఁ బ్రతిష్ఠఁ గాంచ, నీ
వమ్మనుజాళి నాశమురయంబున మావలనన్ ఘటిల్లెడున్॥ 49

మ॥ దితిజుల్, వారిచమూ సమూహములు పెల్లింజెంప నిత్యమ్మ నీ
యతులాపార కృపారసామృతకటాక్షావాప్తి మాపాలమే
లితరంబై, యితరానపేక్ష శుభముల్ జేసేతఁ గూర్పంగ, మే
మతిలోకాహితదండ నాత్తజయకీర్త్యభ్యున్నతుల్ వొందమే?. 50

ఉ॥ అంచితపుణ్యమూర్తి! నిమిషాంబ! సమాదృతసత్కదంబ! శాం
తించి, రిపూత్కరోద్ధరణతీవ్రతయన్ వ్రతమున్ దగన్ విస
ర్జించి, శ్రితావళిన్ గనికరించి, తదుద్యమమేముదీర్ప, మ
న్నించితివేని, సద్యశమునించి జగంబుల, మెప్పులొందమే?. 51

కం॥ అదియును, నీదయగాదా?
విదితమహాశక్తినీకు వింతయె? లోకా
భ్యుదయంబునాశ్రితావళి
కదియు, యశోదాయకంబయగునో, కాదో!" 52

చ॥ అని వినయంబుదోఁపఁగ, మహర్షి సహర్షముగా వచింపఁ, దా
విని, నిమిషాంబ యిట్లనియె-“వింటిని నీదు పరాక్రమక్రమం
బును, భవదీయ జన్మవిధమున్, దనుజోద్ధతి భంగకృత్త్వమున్;
మునివర! జానుమన్మఖరిపుప్రకరంబునడంతువాజిలోన్॥ 53

శా॥ రక్షోఽధ్యక్షుఁడు, జానుమండలుఁడు, పుత్త్రిభ్రాత్రమాత్యేష్టస
త్వక్షాశేషరణాగ్రకర్కశులు; త్వత్సంరంభశుంభన్మహాః
ప్రక్షిప్తాయుధ దీర్ణదేహులయి, ప్రభ్రశ్యన్మహోత్సాహులై,
ప్రక్షీణాంతరహంయుతాయుతులు, మర్త్యవ్యూల్ క్షణార్ధంబునన్॥54

మ॥ మునిముఖ్యా! విను; నేనెనీకునని లోఁ బ్రోత్సాహమున్ గూర్చుచున్,
నిను రక్షించుచు, రాక్షసాధముల ప్రమందింపంగ, సాహాయ్యమున్
బొనరింతున్; బరవీరభీకర ధనుర్ముక్తాశుగానేకశ
స్త్రనికృత్తారిశిరశ్శిరోధివనుశశ్వత్కీర్తిసీ పాలిదా॥ 55

చ॥ త్రిభువనవంద్యవిక్రము, సుదీర్ణగభీరిమనర్ణవోపమున్,
శుభశుచిచిత్తవృత్తి, సుమనోమునిమోదకరావదాన శో
భి, భృతభృశాశ్రితున్, నిను ద్రవీభవదంతరనై, ముహుర్మహా
రభసగతిన్ గృపాసుధ విరాజిలుకన్నులఁగానవచ్చెదన్॥ 56

ఉ॥ వత్స! భవత్సమీకమున వర్తిలు సైనికులెల్ల, మానసం
బుత్సహనంబుఁ జూపునటులూర్జిత విక్రములై, సురారులన్
బ్రోత్సరణంబొనర్చి, విజయోత్సవమొంద, జగజ్జిగీష, క్ర
వ్యాత్స ముదాయముద్దనిడి యవ్వలఁబుచ్చ, సహాయనయ్యెదన్॥

చ॥ ఇఁక, నొకజాము రేయిగల దీవిపుడే రణరంగమందు సై
నికనికరంబులన్ భవదనీకినిఁ జేర్చి, విజృంభణంబునన్
బ్రకట భుజాబలమ్ము మెయిరక్కసులుక్కఱియుండ, నెంతయున్
వికలులఁజేసి, వారిఁబిఱుపీఁకులఁబెట్టి, యణంపు మెమ్మెయిన్॥”58

వ॥ అని, యిట్లుపదేశవ్యపదేశంబున నాదేశించి, యా త్రిదశేశియంత నంతర్హితయైనంత, నమ్మార్తికమౌనీంద్రుండును, మహోత్సాహంబున యామమాత్రావశిష్టయైనయయ్యామవతిన్ జానుమండలుని సైనికులన్ జుట్టుముట్టెన, వారును బీరంబులు బీరువోవక, హోరాహోరిన్ బోరాట కుద్యుక్తులైనంత॥ 59

చ॥ ఉభయబలంబులున్ గదిసి, యుక్కున నొక్కట హుంకరించుచున్,
సభయపలాయనోపయికచంచలతాచణతాపరాయణుల్,
విభవవిదూరులై, జనులు విస్మయమొందఁగ, జానుమత్పలా
శి, భృశజిగీష, భీషణ విశృంఖల వీరవిహారహారియై॥ 60

శా॥ తామ్రాక్షుండయి, దుర్నిరీక్షుఁడయి, యుద్దామక్రుధాక్రూరతా
ధూమ్రార్చిర్నిబిడోన్ముఖేక్షణముహుర్దూరప్రసారంబుగాఁ,
నమ్రాత్మీయ చమూసమూహము, మహాసంబాధిమగ్నంబుగాఁ,
దా, ప్రమాన్పాటొకయింతలేక, యమృతాంధస్తోమముల్ భీతిలన్॥

శా॥ జ్యానాదంబు జగద్భయంకరముగా, ద్యావాపృథివ్యంతర
స్త్యానంబై, వెలయంగఁ, బేర్చన శరప్రాకస్సంధ, భ్రూభంగతై
క్ష్ణ్యానూనక్రుధమై, మహర్షిపయిసద్యఃపాతమౌద్ధత్యమున్
గానన్, జానుమదాహ్వయుండు రణరంగంబందు నిల్చెన్ ధృతిన్॥

ఉ॥ నిల్చెనెకాదు; మార్తికముని ప్రవరున్, దదనీకమున్ జనుల్
పెల్చనఁజూడఁగా, మదమలీమసచిత్తత "నెట్టులైన, నే
గెల్చెద"నంచు, మూర్ఖతనికృష్టనిజాశయుఁడై, "రిపూద్ధతిన్
డుల్చెద"నంచుఁ, బల్కుచుఁ, బటుప్రదరంబులు వింటఁదొడ్గుచున్॥

మ॥ కడుసంరంభమునన్, విజృంభణమునన్ గన్గొనకే, జానుమం
తుఁడు పైఁబై శరముల్ నిగుడ్పఁగను, ముక్తుండా నిమేషాంబన
ప్పుడు ధ్యానించుచు, నానిశాంతమున నిర్వ్యాజప్రతిజ్ఞాభర
ద్విడనీకిన్యపరోధనిర్వారణుఁడై, దీపింప, భాసించుచున్॥ 64

శా॥ ఆకర్ణాంతము సింగిణి (శింజిని)ందివిచి, వాలమ్మున్ సుసంధమ్ముగా
నాకీనాశులనాశముంబొనరుపన్, హాళిన్ మహామానియున్,
వ్యాకీర్ణంబుగ నేత్రజాలంబులప్పె దివ్యప్రాభవోపేతుండై,
యాకంఠంబుగఁ గ్రోధమెచ్చ, విశద వ్యాపారమే పారఁగన్॥ 65

ఉ॥ అంత, సుపీక్షణుండు విజయావహమాశుగమున్, సువర్ణప్రా
ణ్ణాంతరపుంఖమున్ దొడిగి, జ్యారవమొక్కటఁ బిండి రోదసిన్,
సంతతకీలలంతటను సంతసనించె సహాసలీల, దు
ర్దాంత నిజప్రతాపమతిదారుణమై, యరివంశదావమై॥ 66

శా॥ తద్బాణాగ్నికి రక్కసుల్ బహువిధైధస్త్రౌఘముల్ గాఁగ, సం
సద్బాహ్యస్థితిమై మెలంగుటొకరక్షాసాధనమ్మంచు, ను
ద్యద్దోర్బధంబునఁ గొందలంపడుచుఁ, గొందర్నేఁడిరూహల్; వృథా
సద్బాధాగ్ని, కుపూరుషాంగచయరక్షా సాధనంబే కదా! 67

మ॥ బలముత్పాదితమై, సుపీక్షణునివిస్ఫార ప్రతాపాగ్నియు
జ్జ్వలమై, కన్నులు రెండువోయినటు దెల్పన్ జాల, నాజానుమం
డలుతమ్ముండు, సుమండలుండును, నిశాటవ్యూహమొప్పన్, గనల్
గొలుకుల్ నిండఁ, గనుంబొమల్ ముడివడన్, గ్రూరాకృతిన్
ప్రేల్మిడిన్॥ 68

వ॥ పండ్లు పటపటంగొఱుకుచు, ముహుర్ముహుస్సందష్టోష్ఠుండై, నిష్ఠు
రంబుగ సుపీక్షణునీక్షించుచుఁ, బ్రావృషేణ్యవారివాహంబులు ధారా
పాతంబుగ వర్షించుచాడ్పునన సంఖ్యాకంబులైన శరపరంపరలు గురి
యించిన, నాసుమండలుని లెక్కసేయకున్నంత॥ 69

గీ॥ దైత్యదైవత్యమైన యస్త్రంబుఁ దొడ్గి,
యసుర నేసెసుపీక్షణుండంత, వాని
వేడబంబుమైఁ బౌరుషంబీడవోక
యసురులెంచక, కొంచక, యసురసురయి॥ 70

కం॥ అత్యుద్ధతిమై వచ్చిన
దైత్యాగ్రేసరుని విశ్వదాహకవహ్నిన్
నత్యర్క తేజమున్, దై
త్యాత్యయకృద్వైష్ణవాస్త్రమాతఁడువఱపెన్॥ 71

చ॥ అదియును, లీలమైఁ దదసురాస్త్రముభగ్నమొనర్చె; వాఁడు వి
న్నఁదనముఁద్రోచి, గ్రన్ననఁ గనజ్జ్వలనాస్త్రముదై చెలోకభీ
తిదము; సువీక్షణుండును ధృతిన్ వరుణాస్త్రమునన్ మరల్చెదా
నిదృఢతరార్చులన్; సురముని ప్రకరంబులుదన్ను మెచ్చఁగన్॥ 72

మ॥ అటుపైఁదాను, సుమండలాసురుఁడు బాహాశక్తియుక్తుల్ నటిం
చుట వ్యక్తంబుగఁగాననీక, కుహనాశూరత్వమే పారఁగాఁ,
గుటిలాహ్వాస్త్రముదైవ, గారుడమునన్ గూల్చెన్ సువీక్షుండు;వాఁ
డటుగాంధర్వముదైవ,మోహనముమాయన్ దానిమాయింపఁగన్॥

మ॥ పరమక్రుద్ధుఁడు, జానుమండలుని సౌభ్రాత్రంపుఁగాఁ జూచి, యా
శరపాశుండు, సుమండలుండపుడు, విస్ఫారంబసంఖ్యాకమా
శరజాలంబు, మహాద్భుతంబును విలాసప్రాయసృష్టంబొన
ర్ప, రిరంసావిధిమై సువీక్షుఁడు హరింపన్, బ్రాహ్మసంధిత్సమై॥ 74

ఉ॥ బ్రాహ్మమహాఽస్త్రమయ్యెది, నిరర్థకమెప్పుడుగాక యుండుటన్
జిహ్మపథప్రవృత్తుని, నిశీథచరున్, బలుగాకి, జాల్మ, నెం
తే, హ్మలచిత్తు, మత్తుని, బ్రహీణ నిజాత్మని నేలఁగూల్చెఁద
ద్బ్రహ్మవిదగ్రణీగ్రథితపాటవమై, భువనైకభవ్యమై॥ 75

వ॥ అట్లు నేలంగూలిన సుమండలుండు మృతప్రాయుండై, మూర్ఛా వస్థనొంది, యొక్కయామమాత్రంబుచ్ఛ్వాస నిశ్వాసంబులు లేక, యట్టికట్టివో లెనుండి, లేవక పోవుటంజూచి, యానీచునిసైనికులు ద్విగ్నులై, యార్తధ్వానోల్బణులై, హతావశిష్టులై, "కాలికిబుద్ధి సెప్పి"పోయిరంత॥ 76

ఉ॥ అంతట, జానుమండలుఁడహంకృతి, హుంకృతితోడునీడలై,
పంతము, కూర్చుచుట్టమయి, వక్రిమ, పౌరుషమాయుధంబులై,
సంతతసైన్యమొక్కటియొగి సంగరరంగముఁగూర్చి పొంకెఁద
స్స్వాంతయుఁ దొందలింప, మతిహీనుఁడు మూర్ఖతమానుఁడద్దిరా! 77

ఉ॥ ఎట్టెటులో రణాంగణము నిట్లుచొరంబడి, జానుమండలుం
"డట్టకటాంకు, మౌక్తికు, నహంకరణాభరణున్ జయింతునేఁ
గట్టెడిదయ్యమయ్యెధనుఁగంటికిఁ గానకదాఁచిపెట్టెఁగా!
"యట్టుడికింతు" లోకముల నన్నిటిఁ ద్రేల్మిడి; నేనలంతినే?. 78

చం॥మునిజనమంట! యెక్కడనొ "ముక్కునమూసిక"యుండలేక, యీ
యనికిఁజొరంగనేల? యిది, యమ్మునిలోకకృతాతికైతవం
బె; నిజమెఱింగితిన్; మునులుహీనులొకో! "చలితేళ్లు"గారె? యీ
మునులను, వేల్పులన్ బ్రతికిపోవఁగ, నొప్పరికింతునే,యిఁకన్॥?79

చం॥వికృతపువేసగాండ్రుసుమి! వేల్పులమూఁకలు; కాళ్ళుఁ, జేతులున్
మొకములు, నాల్కలున్,మఱికనుల్, చెవులున్ వికటంబులౌ;సరే!
"తికమకఁ"జెందనేల? కడతేర్తును హీనుల, వేల్పులన్ నిజం
బిఁక, ననునేమిసేయఁ గలవీనటనల్, నయనాననాదులున్?. 80

ఉ॥ పిండ్రడకు,వాండ్రడకా "పగటివేసపు"మాయలకూళ్ళ, "బోళ్ళయై"
తిండ్రడముఁజూపు చేదొకట తీవరకాఁడయి, మ్రింగుశక్తియున్
గండ్రలు"నూఱిపోయుటయె"గాక, తమంతటఁదాముగానరా
కుండ్రిడి; బలా! రణంబున జయోత్సుకునన్నెదురింప నొక్కఁడున్॥

మ॥ సరి; కానిమ్మరి కంఠలుంఠనకళా చాతుర్యధుర్యుండనై,
సొరిదిన్ జొచ్చి రణాంగణంబున, రిపుక్షోభంబుఁగావించి, చె
చ్చెరఁగుంభోదరు, సర్పబాహుని, మదోత్సిక్తున్ సఖున్ దుర్గఁగా
సరు,సోదర్యుసుమండలున్ ద్విషదస్మత్కాస్ఫరత్సుతిన్ దన్పుదున్"82

చం॥అని, తనలోనఁదానెయిటులాచరణీయ మనూహసేసి, పే
రినరుష, కన్నులందరుణరేఖలఁదీఱుప, జానుమండలుం,
డనికిహుటాహుటిన్‌జని, మహామహులన్, మునులన్, దపోధనా
గ్రణులను సంహరించుటయె కర్జముగా, దృఢనిశ్చయంబుగాన్. 83

చం॥అనుచరులౌనిశాచరులహంకృతిఁ దామెసరేగి, తేఁకిన్
గినుకరగిల్చి, రాఁజుకొన, నెమ్మదిఁదాముగుకూలమధ్యగా
గ్నిని బహుధావిజృంభణమనీష విస్తృత్వరసత్వరానుధా
వనకృతకృత్యతంగలుగు వైఖరికిన్ బురికొల్పిరత్తఱిన్॥ 84

ఉ॥ అప్పుడు జానుమండలుఁడు వ్యాత్తఘనాహి కరాళలీలయో,
దెప్పరమైన విక్రమవిదృప్త మృగేంద్రవిహారహేలయో,
యొప్పరికింపరాని పరుషోరురుషాత్త సదృప్త పౌరుషం
బొప్పఁగ, హత్తికర్షి పయికుద్దవిడిన్ వడిదూకి, యుద్ధతిన్. 85

మ॥చతురంగధ్వజినీ విస్తృత్వరమహాసంరంభమొప్పారఁగా,
ధృతినాయోధనముంబొనర్ప, నిజయోద్ధృవ్రాతమున్‌బ్రోత్సహిం
చి, తతవ్యూహములన్‌రచించుచు, మహర్షిన్ ముక్తుఁ, దత్సైన్యమున్
మతిహీనుండెదురింపనెంచి, క్షణశుంభచ్ఛౌర్యమున్‌జూపుమన్. 86

చం॥హయముల, వాయువేగపరిహాసిజవంబులఁజీల్చి; హస్తిసం
చయములఁ, బర్వతాకృతులఁ జాలఁగఁగూల్చి; రయోచ్చలద్ధ్వజో
చ్చయములడుల్చి; భగ్నముగస్యందనబృందము రాల్చి; పెక్కుసం
బయిన పరాక్రమక్రమము నాదటఁజూపి, సురారిపోరఁగన్. 87

ఆ॥ సమరసమయవేత్త, సంపూర్ణవిద్వత్త
పెచ్చుగాఁగలాఁడు, ఋషియుఁదీవ
రించి, జానుమంతుఁ, గ్రించునొంపందలం
చియును, బలికెనిట్లు సేమమెంచి. 88

మ॥ "వినవో, శ్రేయముఁ గూర్చునా పలుకులన్; వెఱ్ఱీ! చమూనాశమున్
గనవో; మత్కరముక్త పాశుపతభగ్నప్రాణతన్ గోరకే
మనవో; శంకరునాశ్రయించుటది సమ్యఙ్మార్గమంచెంచున్,
జనవో; చెచ్చెర! యింతగాఁ జెడియు, ధార్ష్ట్యంబేల, నీకిమ్మయిన్? 89

ఉ॥ తమ్ముఁడు గూలెనే; వితథపథనానుచిత ప్రయత్నమిం
కమ్మిడిమేల మేల? పలుగాకులు కాకులు మూఁకలై, నినున్
సమ్మతుఁ జేయఁ జూచెదరు సంగరరంగవిహార కేళికిన్;
"గిమ్మననీకు" వారిని; నికృష్టజడాశయమేల, నీకిటన్? 90

శా॥ సైన్యాధ్యక్షులు, దుర్గకాసరముఖుల్ జాకుండిరే? తక్కువార్
దైన్యంబెంచక, వెన్కఁజూడకయ, నీదారిన్, నినున్ వీడి, తా
మన్యోన్యంబును గూడకాడకయ, ప్రాణాపాయమెట్లో తొలం
గన్యుద్ధావనివీడి, పాఱిరిబుభుక్షామాత్రదీక్షాఽఽశయుల్. 91

చం॥ విడుమిఁక నైన, నీదునవివేకము; మామక బుద్ధిపద్ధతిన్
నడువుము; నీకుఁగావలసెనా - యిపుడే కలిగించుకోవడిన్
మృడుని పదాశ్రయంబు; విపరీత పథంబు నువీడు; "మున్నతిన్
దడయక, పొందుమూరక, వృథాచెడిపోవు తలంపులేలొకో!. 92

శా॥ రక్షోఽధ్యక్ష! జగత్త్రయాపకృతి సంరంభైకలీలాఽఽస్పదా!
యక్షాంకాంఘ్రులె యానయానుజామి! నిన్నాహింపఁజంపంగ; నే
నక్షీణత్వదదోఽవశిష్ట చతురంగాక్షౌహిణీనాశమున్
దాక్షిణ్యంబునఁజేయ; నీవెఱఁగినన్ దాక్షాయణీశాంఘ్రులన్ 93

చ॥ అటులొనరింపవేని, నసురాధిప! నిన్నిపుడే వధింతు; మ
చ్చటులనిశాతసాయకవశంవదుఁడౌ నినుఁగావరెవ్వరె
చ్చట నిలువంగఁబోయిన; విచారవిదూర! నశింపనెంచెదో!
కుటిలతమాని, నిండు బ్రతుకుంగని, శ్రేయులహాయిఁదేల్చెదో!!

మ॥ టకటాంకుల్, పలుగాకులైన పలువల్ టాటోటులన్ బల్కి, యి
చ్చకముల్, నీ కపకీర్తి (శ్రీ) సకల నాశంబిట్లు గల్పించి; రా
వెకలుల్ సెప్పినదెల్ల వేదమనుచున్; విన్నంతనే, యిట్టులై;
తకటా! యిప్పుడు మించిపోయినదిలే; దాయీశు సేవింపుమా!''

వ॥ అనిన, విని దనుజపతియును మునిపతితో నిట్లనియె॥ 96

శా॥ "ఓరీ, నక్కలరాయఁడా! కపటనీచోక్తుల్ పచారింతువే
లా? రానిమ్ము ర, శంకరున్, హరిని, దేవాధీశు, దేవాళి; నే
భీరుండున్ బలెఁ బాఱిపోవుదునె? నీ బింకంబులింకేలరా?
యేరే, నాకెదురై, దురాసమని రే? యీనైన, రారమ్ము రా!''॥97

మ॥ అనుచున్, జానుమదాహ్వయాసురుఁడు, ముక్తాభిఖ్య మానీంద్రుపై
ఘననారాచపరంపరల్ బఱపఁగా, గర్వోన్నతిన్ జెందుచున్,
మునియున్ వానిని శాతసాయకములన్ ముక్కల్ వొనర్చెన్; మఱిన్,
దనుజున్ వక్షముగాడనేసెనొక బాణంబగ్ని సందీప్తమున్॥ 98

చ॥ అయినను, లెక్కసేయక, భయంకరనైక శిలీముఖంబులన్
బయిఁబయి వేసె "వైరిమరణంబిఁకఁ దథ్య''మటంచు, నెంచి, ని
శ్చయమతి, జానుమండలుఁడు; శంభుభుజప్రభవుండు, వాని, మా
నియును ద్విధాకరించెనటనీ ఘటనైక నైపుణిన్॥ 99

చ॥ అదిగని, జానుమండలుఁడహంకృతిమై ముని పై, సువీక్షుపైఁ,
దదితర సైనికాళిపయి దర్పమెలర్ప, శతాధికోజ్జ్వల
ప్రదరములన్ నిగుడ్చ రణరంగ విహారవిలాసహారి, యా
చదురుఁడు రెండు బాణములఁ జాపము, వక్షముగాడనేసినన్॥ 100

ఉ॥ ఇంకొకవిల్లుఁగైకొని, యహీనపరాక్రమ మొప్ప, రక్కసుం
డంకిలిలేక, మౌనివరు, నాతని సైనికులన్ శరావళిన్
గొంకక, ముంచినైచెఁ దదకుంఠ ధనుర్నిపుణత్వమెంచి, యా
శంకరసూను సైనికులు జానుమహాస్త్రిశితులన్ వధింపఁగన్॥ 101

మ॥ హతశేషుల్, దనుజాశ్రితుల్ జడిసి దూరాపాస్తులై రంత, నా
దితిసూనుండసహాయశూరుఁడు మదోద్రేకంబునన్ విక్రమో
ద్భత వీరోచిత సంగరం బొనరుపన్, దూరాననీక్షించి, సు
స్థితుఁడై, హాత్తికమౌని నాయకుఁడు తూష్ణీంభావమునన్
జూపఁగన్॥ 102

ఉ॥ ఆప్తులు దెల్పిరేమొ! యెవరైనను, దానవపక్షమూని, సం
శప్తకవీరవారమతిసాహసవృత్తిఁ గడంగెఁ బోర, సం
దీప్త శరాదిసాధనతతిన్ బ్రహరింప, మహర్షి యెంతయున్
దృప్తనిజాశ్రితావళికిఁ దేఁకువఁ జూపుటకాన పెట్టెనన్॥ 103

వ॥ ఇట్లయాచితోపలబ్ధ సంశప్తకసాహాయ్యంబు తన్న జయ్యున్ జేయు
నను పేరాసమై, జానుమండలుండును, దైవాజ్ఞ యనుల్లంఘనీయం
బగుటను, భవితవ్యతయతి బలవతియగుటను గ్రహించిన మహామహుం
డాహాత్తికమౌనీంద్రుండాత్మస్థైర్యంబుతోడను ముమ్మరమ్ముగా మరలఁ
బోరు సాగించిరంత॥ 104

మ॥ వరుణాశా ప్రమదాప్రమోదగళిత ప్రాగ్వార్ధ్య పాత్రోత్థ బం
ధుర కార్తస్వర (జాంబూనద) రత్నకుంభము,
కయూధూనస్త్రృ పాత్రాళిగ
త్వరతాసత్వరుపాదపీఠము, త్రయీధామంబు, మూర్తిత్రయ
స్ఫురణంబున్, ద్రిగుణాత్మకంబయిన తేజోరాశితోఁచెన్వడిన్॥105

శా॥ ఉద్యద్భానుమహామహోఽధికతరవ్యతోఽచకోశంబులై,
మాద్యద్భృంగసహస్రమాలికలకున్ బాల్పొంచి, మారంద సం
పద్యావత్ప్రభవంబు, పద్మములు సద్మంబుల్ మహాలక్ష్మికిన్,
సద్యోమోదముఁ గూర్చెఁ జూపఱకు, నాసద్యోగిపూర్ణాళికిన్॥ 106

ఉ॥ ఆతతరీతిపీచెఁ గమలాంతర సౌరభసార చోరముల్,
శీతలశీతలంబులు, వశీకృతనైకజ నాళులైన ప్రా
భాతికవాయుపోతములవారితమంద మనోజ్ఞయానశో
భాతిశయంబుమీఱ, మునియాశయముల్ ఫలియింపఁజేయుచున్॥

చ॥ "ఇది సమయం"బటంచు, ముదియెంచి, నిమేషనిమీలితాక్షుఁడై,
యుదితు, దివాకరున్, మునిజనోత్తములన్, నిమిషాంబ, శంభునిన్
మదిస్మరియించి, దానవవినాశముఁ జేయుటపొంటెఁ దామహా
భ్యుదయముఁబొంది, పొంగి, నిశితోగ్రశరంబులపైరి నేసినన్॥ 108

ఉ॥ వాఁడును, నీడవోవకరవాయిగ మౌక్తికదాని నొక్కటన్
బోఁడిమిదక్కి, పాఱునటు పొంపిరివోయిన ధైర్యమూని, క్రో
వ్వేఁడిమి చూపుచున్, దఱుమఁబెంచెను మేను; మనోముదంబునన్
వాఁడి శరావళింబఱపె వైశమలస్తకశస్త్రహస్తుఁడై॥ 109

వ॥ మౌక్తికమౌనీంద్రుండును, జానుమండలుని యాటోపంబు నోర్వ
నేరక, సమాయత్తుండై, కర్ణాంత పర్యంతాకృష్టశార్ఙ్గుండై, వినిశిత శర
పరంపరలు గురియించుచు, వానిరథ్యంబులు వధ్యంబులుగా, సారథిమారి
తుండుగా, శతాంగంబు భగ్నాంగంబుగా, రథికుఁడగురక్షోఽధ్యక్షుని
మూర్ఛానిమీలితాక్షునిఁగాఁ జేయ పొంపె స్థిరీకరించుకొని, సిద్ధ
సంకల్పుండయ్యె; నయ్యెడజానుమంతుండును, క్షణార్ధంబున బహుధా
భగ్నుండయ్యును, డయ్యుట యియ్యకొనక, "క్రిందఁబడ్డను, మీఁదఁ
బడ్డట్టే" యన్నమాడ్కి నున్నట్టుండి, యుట్టె యుప్పరం బెగసి, కసిమ
సంగినంగాని-కసితీరదని, మునివరుపయి బహుశరనికంబులంబఱపె;
నమ్మౌనియు, మౌనంబుననే, వాని బాణంబుల నన్నింటిని సద్యో
మహోద్యోగంబున, నైంద్రాగ్నేయాదిత్య వాయవ్యగాంధర్వబుభు
దైవత్యవారుణగారుడవైష్ణవ వసుదైవత్యంబులైన బహ్వస్త్రంబులం
బ్రయోగించియుఁ, బ్రయోజనంబుఁగానక, యాతుధానకథాపసాన
విధానంబుగా నప్పుడు 110

ఉ॥ మార్తికమౌని చేసెవడి, మౌనుల, బ్రహ్మమహేశవిష్ణు స
ద్వ్యక్తరుపాఽఽదిమట్ల బహుధాపరిశుద్ధుల, నానిమేష, స
మ్యక్తత భక్తి వైభవత, ధ్యానమొనర్చి, మహేశ్వరోపదే
శోక్తము, నస్త్రరాజము, ముహుర్ముహురుత్సవదాయి,దాయపై॥

వ॥ అదియును, జ్వాలాజాలవ్యాప్త సమస్త దిగంతరంబై, రంహ శ్చాలితకులాచలంబై, ముహుర్మహీమండలాకస్మిక కంపసంపాదకంబై, సంక్షోభితసప్తవారాశియై, సంపాతితతారాశ్రేణియై, శ్రోతృ శ్రోత్రవిదారి దారుణతర తారారావ మేదురంబై,యున్మూలితపాదప రాజంబై, విద్రావితపలాశిరాజియై, జానుమద్దానవు మూర్ధంబు ఘోరపాత జర్జరితంబుఁ గావించుటయు, నావంచక చక్రవర్తి పంచత్వంబు నొందె - నంత॥ 112

ఉ॥ పాశుపతాస్త్రమయ్యది, యభంగుర తైక్ష్ణ్యముగల్గి, తక్కున
య్యాశరపాశులన్ జదిపి, యందఱరూపఱఁజేసి, శాంతమై,
నాశముఁ బొందకుండ, భువనంబులఁ బ్రోచె జనస్తవంబులెం
తే, శివసంస్తవోజ్జ్వలవిధి ప్రథితంబులుగాఁ జెలంగఁగన్॥ 113

వ॥ మార్తికుంజేరి, యథాపూర్వంబుగాఁ బ్రవర్తిల్లె; నచ్చట నాహవోర్విన్ ఝావఁగా మిగిలిన యిర్వురు-మువ్వురు దానవ సైనికులు పలాయితులై, యొక్కింతసేపుండి, తారుదారెయుపలాలితులై, "సురకంటకంబుఁ" జేరి, శుద్ధాంతంబుఁజొచ్చి, యచ్చటివారికెల్ల యావద్వృత్తాంతంబు విన్నవించి-రంత, మార్తికుని విజయంబునకు మహోత్సాహ సూచకంబుగా, దేవదుందుభులు మ్రోగె; సురలు సురభిళ సుమనస్సముదయంబులు గురిపించిరి. గంధర్వ గానంబులుద్దామంబులయ్యె; నప్సరోనర్తనంబులు ప్రవర్తిల్లె; భూతప్రేత పిశాచ

డాకినీ శాకినీ ప్రభృతిభూత జాతంబులు యుద్ధభూమి నాప్యాయ నంబుగా, నానంద సందోహదోహల దోహదకోలాహలహాళహాళికల వెలయించుచు, సంచరించె. మౌక్తిక మౌనీంద్రుండును, రథారూఢుండై, మునుపుమునులు విడిసియున్న "కోమలసరోవర" తీరంబుఁజేరి, యాత్మీయులతో మిక్కిలి కలఁవుగోష్ఠనంబుగల్గి, "పిచ్చపాటి"ముచ్చటించుకొని, కాల్యకృత్యంబులు నిర్వర్తించి, జపపరాయణుండయ్యె-ననిన, విని, యవ్వలి వృత్తాంతంబెట్టిదని, వీణామౌనివాణీజానినడుగుట యును॥ 114

ఆ॥ సిరిగలాఁడు దొల్లి చేసాచె; సిరిలేని
యీవుచేయిసాచు వృత్తివాఁడ;
వైన, నీవులొప్ప మీానెయ్యరిర్వురు
నరసపురమునేలు దొరలు; బళిర!॥ 115

ఇది, ఆంధ్రీకృత ముక్తీశ్వరోపాఖ్యానంబునందు-
"జానుమండల సంహార"మను త్రయోదశాధ్యాయము.

—(*)—

# చతుర్దశాధ్యాయము

ఆ॥ నేల, నీరు, నిప్పు, గాలియు, నింగియుఁ,
ప్రొద్దు, నెలయు, జన్మ పున్వజీర్ణ
ననఁగఁబఱఁగు నెనిమిదగునొాదళులుగల్గు
వేల్ప! కపిలమల్లు! విసముదాల్ప!!. 1

ఆ॥ అవధరింపుమవలిదగు కథ; సురముని
నలువకనియె-"వినఁగవలతువిస్త
రంబుగాఁగ, సర్వమంబురుహాసనా
సీన! యీ కథావిశేషమేను. 2

మ॥ భువనారుష్కరు, ముష్కరున్, దితిసుతున్ ముక్కర్షి సంగ్రామమం
దవలీలన్దునుమాడ, మూఁడుజగముల్హర్షించె; గారీద్భుజో
ద్భవుఁడా మౌనియనంతరస్థితియుఁ, దద్దారాత్మజాదిస్థితి
వ్యవహారంబులు విస్తరించి వినిపింపన్ వేడెదన్మిమ్ములన్. 3

కం॥ సెలవీయవె" యని, నారదుఁ
డెలమినడుగఁ బలుకఁదొడఁగెనీరీతినజుం
"డలఘుమహిమాన్వితమ్మను,
లలితమ్మిదివిన, బహుఫలప్రద"మనుచున్. 4

మ॥ "రణరంగమ్మున జానుమండలుఁడు తూర్ణంబీగ్రముక్తేశుని
ఘ్రుణదోర్వీర్యముచే" నటంచని, భటుల్కీనాశుదేవేరికిన్
వినిపింపన్, విని, శోభితాంగియు, శుగుద్వేగంబునన్ గుండెప్రీ
ల, నిమేషార్ధముచేష్టదక్కి, కడువైక్లవ్యమ్మునన్ స్తబ్ధయై. 5

ఉ॥ ఎట్టెటొ, కొంతసేపటికి నించుకయించుక తెప్పరిల్లి,యు
(తెల్వికల్గి; నించుక తెప్పరి, తెల్వికల్గి-పాఠాం)
న్నట్టులెయుండి, యట్టివివశాత్మయునై, మఱితేఱి,పైత్యస

ప్రమాట్టుని ధర్మపత్ని రణరంగముఁ జేరి, కనుంగొనెన్ ప్రియున్,
గట్టెనుబోలి నేలపయిఁగ స్రియెఱుంగని జానుమండలున్(త్రుటిన్). 6

వ॥ విస్ఫురద్రత్న కుండలరోచిర్మండల తాండవ మండితగండస్థలుండును, సంత్రోటితకరోటి కుండును, రక్తధారాఽభిషిక్త సర్వాంగుండును, జర్జరీభూతకంకటుండును, పాంసుదూషిత దేహుండును, ధరాఽంతరగతుండునైన ప్రాణేశ్వరున్ జూచి, శోభావతి కన్నీరు మున్నీరుగాఁ, గంటికి మంటికి నేకధారగా, దుఃఖించుచు, శోకమోహ పరిక్లిష్టయై, "నాథా! రక్షోఽధ్యక్షా!! త్రిదశాంతకుండవును, త్రిజగద్భయంకరుండవు ననగు నీవు నీయంతః పురకాంతాఽగ్రేసరనైన నన్నేకాంతంబున భవదంతికంబున దుఃఖాక్రాంతస్వాంతనై, నీయాదరంబుఁ గోరుచుండుదానినేల పల్కరింపవు? నీకీయకారణ కాలుష్యంబేల? బేలనైన యీదాసురాలిపైఁ గోపించితే? ప్రణయకలహముననయినను, నను బలుకరింపక, నిలుచువాఁడవు గావుగదా! దేశాంతరంబేగునప్పుడైనను, బునరాగమనదివస పరిగణనం బొనర్చెడివాఁడవే! ఇప్పుడిట్లు నాతో ముచ్చటకైనను ముచ్చటింపక, లోకాంతరంబెట్లేగితి? కట్టా! నా హృదయంబెంతగట్టిది! ఆకట్టిడిదైవంబు దీని నేలోహమ్ముతో నిర్మించెనో గదా! గదాఽభిఘాతంబుకంటెను, వజ్రపాతంబు కంటెను దారుణంబైన యీశోకాతిరేకంబునన్ గూడ, నియ్యది వ్రయ్యలుగాకున్నయది. ప్రభూ, ప్రభూతంబులును, భూతపూర్వంబులునైన నీతోడ విహారాది వినోదానుభూతి విశేషంబులనెట్లు విస్మరించుదాన? నేనిప్పు డెందుఁబోవుదు? నేమిచేయుదు? నా ప్రాణంబులు పోకున్న వేమి? ఛీఛీ! నా జీవితంబెంత నిష్ప్రయోజనంబు! నేనెంత పాపాత్మురాలను! నాకిప్పుడీ లోకంబంతయు నాలోక శూన్యంబుగదా!" యని, పరిపరి విధంబులం బనవిపనవి యేడ్చుచున్నను, జ్ఞాతిబాంధవాత్మీయులెల్లరును దీనులును, నిశ్చేష్టులునై, మూకీభావంబునొంది, యాశోభావతికించుకంతయు దుఃఖోపశాంతిం గల్గింప లేకుండిరంత నా సమయంబున. 7

ఉ॥ అజ్ఞమనోవికాసకరణాతిచణ ప్రతిభుండు, ధర్మమ
ర్మజ్ఞుఁడు, ధర్మవత్సలుఁడు మౌక్తికమానిజనైకమాళి,యా
త్మజ్ఞుఁడు, కాల్యకృత్యములఁదద్దయుఁదీర్చి, మునీంద్రులెంతయున్
విజ్ఞత వెంటరాఁగ, నదవీయముఁ దత్పదమున్ గనన్ జనెన్. 8

కం॥ "అతఁడెతనపతిని మృతునిగ
జతనమ్మొనదురమునన్ విచారవిదూర
స్థితినొనరిచె" నని, శోభా
వతి మిన్నులన్ గుంది, మ్రానుపాటొందెఁదగన్. 9

ఉ॥ ఆసతి, జానుమత్ప్రియ, మహామతి, భర్తృవిపత్తిచేననా
శ్వాసితదుఃఖతాంతరఁ, బ్రసన్నను జేయుటపొంటెగాఢవి
శ్వాసముదోఁపమౌక్తిక విపశ్చిదపశ్చిమబుద్ధి, సద్దయాఽఽ
శ్వాసవచోలవంబులను సంహితముల్ వొనరించుచిట్లనెన్. 10

ఉ॥ "ఈవు పతివ్రతామణివి హీనగుణాస్పదవౌదువీవు; శో
భావతి! వీరపత్ని! బలపౌరుషదిగ్జయశాలులైన పూ
ర్వావళికిన్ ధ్రువంబులు, జయాపజయంబులొ కళ్లొకళ్లకున్;
నీవిది క్రొత్తయందువె? గణింపవె లోకము, ధర్మమార్గమున్?. 11

వ॥ జననమరణంబులకును, జయాపజయంబులకును,లాభాఽలాభంబులకును
మోదఖేదంబులొందుట ప్రాజ్ఞ సమ్మతంబుగాదదియుగుం గాక.

ఉ॥ నీపతి క్రూరుఁడై, మదమనీష జిగీషకుఁదోడొనర్చి,సే
నాపరివేష్టితుండయి, వినాశముఁజేయఁడె, ముజ్జగంబులన్?
గోపపరీతుఁడై, మునులఁగ్రొవ్వఁడె? యజ్వలఁ బ్రువ్వఁదిట్టఁడే?
దాఁపురవెట్టఁగాఁ దెలియదా, తదనార్యనికార్యకార్యమున్? 13

ఉ॥ సాధుల గస్తిగుడ్పుట, విచారదూరత, వేదనింద, వి
ద్యాఽఽధికతాఽఽధికారితల యందలిపెద్దతికంబుఁడెక్కు,దు

రోష్బధము, మున్ను గాఁగలవి రోగములాచు, యశశ్శరీరమున్
బాధలఁబెట్టవే? యవివిపద్దశకున్ సరిగల్ దలంపఁగన్॥ 14

ఉ॥ పూర్వమునన్ హిరణ్యకశిపుండును, రావణుఁడున్, బలింద్రుఁడున్
గర్వితులైన వృత్రమధుకైటభులున్, మఱికాలనేమియున్
సర్వను పర్వులన్ దఱిమి, శర్వదహం కృతిఁ దీవరిం చియున్,
గర్వముఖర్వమై, తుదకునాశముఁబొంద రె? నీవెఱుంగవే?

మ॥ ఇఁక దుఃఖంపకు, వీరపత్ని! పతికై; యేతచ్చరిత్రంబుస
ర్వకకుద్వ్యాప్తమునూ! తదీయ విభవప్రఖ్యంబుగా, నౌర్ధ్వదై
హిక కృత్యంబులు, నుత్తర క్రియలుసేయింపన్ బ్రయత్నింపుమీ!
వికలత్వంబునుమాను; నీపతియుస్వర్వీథిన్ భజించున్ జుమీ! 16

కం॥ బాలుఁడు, యశోవిశాలుఁడు
పాలించున్గాక, పిత్ర్యభాజియునై, యీ
సాలకంటకట రాజ్యము;
మేలుగనీపుత్త్రుఁడనుపమేయగుణుండై ॥ 17

కం॥ వానిన్ గనిపెట్టుక, నీ
వాననమున ఖేదరేఖనత్తక, యిల్లే
మానసమున దుష్క్రోధం
బూనక, చరియింపుమోనయోన్నతచరితా!" 18

వ॥ అని, మార్తికమానీంద్రుండు శోభావతి నూరార్చి, కర్తవ్యంబుప
దేశించి, యామెకున్ జెప్పి, సపరివారుండై, సకల భువనాధినాథుం
డైన శంకరుస్థానంబుఁజేర నుద్యుక్తుండయ్యె; నమ్మహామహుని
వెంట దీక్షిత పోమహాస్వమహత్త్వశోభితులైన మహర్షి శ్రేష్ఠులెంద
ఱేని ప్రస్థానంబుసాగించి, వారందఱును మున్ను ముక్తర్షియాగమ్మొన
ర్చిన పుణ్య ప్రదేశంబైన విశ్వామిత్రునా శ్రమమ్మునన్ బ్రవేశించి
రప్పుడు సర్వతత్త్వార్థవేత్తలైన పెక్కురుదివ్యర్షులు తదాశ్రమంబున
మార్తికమౌనీంద్రుని సందర్శింపవచ్చిరంత, నచ్చట వారందఱుంగొన్ని

మాసంబులుండి, యిష్టగోష్ఠీవిశేషంబులన్ బ్రొద్దులు పుచ్చుచుండిరి.
తదనంతరంబ, నిమేషాంబయయ్యందఱికును సాక్షాత్కరించిన, వారు
నామెకుభక్తి ప్రపత్తులొప్ప సేవలుగావించిరి. మౌక్తికమౌనీంద్రుండును,
బ్రహ్మశీర్షుండై, యానిమేషాంబకున్ బ్రణామంబులాచరింప, నాసర్వేశ్వరి
మౌక్తికమౌనీశ్వరుతో నిట్లు వక్కాణింపందొడంగె॥ 19

ఉ॥ "నీకుఁ బ్రసన్ననై, భవదనీకినిఁ జేరి, సహాయనై, రణా
స్తోక జయంబుఁ గూర్చితిని; సువ్రత! మౌక్తికమౌని! నీవమో
ఘీకృతయోగదీక్షఁ గృత కృత్యతఁ గాంచుట కోర్వలేక, పా
జౌకృతశత్రు లాదనుజనాయకు లెందఱొ చుట్టిముట్టిన్॥ 20

మ॥ నినుఁ గాపాడఁగఁ గేశవుండపుడు సందీప్తప్రభాభాసియౌ
చును, బ్రత్యక్షముగాఁగ, శంకరుఁడు దాఁ జూచెన్ బదేన్గన్నులన్;
దనుజధ్వంసి తదింగితంబెఱిఁగి; నూత్నప్రక్రియన్ విష్ణుమా
యనుగా, నన్ను సృజించిపంచెమునివర్యా! నీకుఁ దోడ్పాటుగన్॥ 21

ఉ॥ శంకరునాజ్ఞఁ జేసి, ననుఁ జాలఁగఁ జేరెవిరించి శక్రధూ
మాంక యమాప్పతి త్రిణయనాప్తవసూరగ యక్షరాక్షస
స్వాంకమహాజముల్ దృఢత(స)మాశ్రయమున్ బడయంగ; శత్రునా
శంకరినై, మెలంగి నినుసంగరరంగజయాఢ్యుఁ జేసితిన్॥ 22

ఉ॥ పాశుపతాధ్వరావసరవర్తన దీక్షవహించియున్నని
న్నాశరపాశులుద్ద విడినాపదఁ గూర్పఁగఁ జూడ, వారినే
నాశమొనర్చి, దారుణరణంబునఁ దోడయి నిల్చి నీకుఁ గీ
నాశవినాశచాతురి ఘనంబుగఁ గూర్చితి; వత్స! వింటివే?॥ 23

మ॥ ఇఁకమీఁదన్ ద్వదభీష్టసిద్ధికయి యెన్నేరీతులన్ గల్గుమా
మకసాహాయ్యము నీకుఁ జేయుటకు సమ్యగ్యత్నమున్ జేసి, ని
న్నొకకన్గిల్పయనన్, బ్రమాదపడకే, యుత్సాహిఁ గావించెదన్;
బ్రకటాటోపముహుర్ముహుఃకలన సంగ్రామాదులన్ గొల్చెదన్॥

క॥ భవదీయ భావివంశో
ద్భవులకు భవికంబుఁ గూర్తు భవదర్థము; నీ
దవు కర్తవ్యము విను; వా
రివి వారిరి వినుమవశ్యకృత్యము లార్యా!॥ 25

వ॥ త్వద్వంశ్యులెల్లరున్ గర్భాష్టమవర్షంబునందొండె, దశమమందొండె, నేకాదశంబునందొండెఁ బుత్త్రులకు గాయత్త్రీగ్రహణాధికార సిద్ధ్యర్థంబుపనయనయనంబు సేయవలయుఁ; బదునాల్గేండ్ల యీడునన్ గాని, యాపైనిగాని వారికిఁ గులకన్యలతోడ వివాహంబాచరింపవలయు. నిత్యకర్మంబులన్నియును, వేదోక్తమార్గంబున క్షత్త్రియకల్పానుసారంబుగా నిర్వర్తింపవలయుఁ; గన్యావివాహంబు సప్తమాష్టమవర్షంబులందొండెఁ జేయవలయు. వివాహంబైన ఋతిమతియగువనితనుగవయవలయుఁ; గన్యలనూఢలై యుండరాదు. మను పరాశరాది మాన్యులాదేశించిన యాచారంబుల ననుసరింపవలయుఁ; బితృదైవ కర్మంబులయందు బ్రాహ్మణుండు పురస్కార్యుండు. విప్రవేదపురస్సరంబుగాఁ, బురోధస్సమ్మానంబవశ్యకర్తవ్యంబు. విప్రవర్జంబుగాఁ జేసిన కర్జంబునిష్ఫలంబె కాదు-వత్సా! నిరయకారణంబునౌనుసుమీ! నేను నీకుల దేవతను. వాసిష్ఠాదులు నీకులాచార్యులు. శుభాశుభకర్మల యాది మధ్యాంతంబుల యందు నన్నును, గులగురునిఁ దప్పక పూజింపవలయు. మమ్ముఁ బూజింపక, బ్రాహ్మణులకు ధిక్కరించిన, వంశనాశంబౌను. కర్మ నిష్ఫలంబుగాకుండ, నన్నును గులగురువును బూజించిన నాయు రారోగ్యసంపద్వంశ సమృద్ధి యౌను. ధనధాన్యదానాదిసత్కారమ్ములచేఁ గులగురువు సంతుష్టుండౌనట్లుగాఁ జూడలగ్గగుఁ; దొలుత గణపతిని, బిదప నన్నును బూజించుట విస్మరింపఁ జనదు. కులగురుననుమతిఁ బడయక, కర్మాచరణంబునన్ బ్రవర్తిల్లినన్, దత్కర్మ గోవధంబె యౌను. దానికి

నిరయపతనంబ ఫలితంబు. కులగురూపదేశానుసారంబుగా, గాయత్రీ గ్రహణంబు కర్తవ్యంబు. కులగురువును, గులదేవతనైన నన్నునుఁగాదని చేసినవాఁడు శూద్రునికంటె నధముండౌట తథ్యంబు. అట్లుచేసిన మాంగళ్యంబువివాహాదులందమాంగళ్యం బేయాను. ముక్తర్షి! నాచేసిన సాయమ్ము ను విస్మరించుటదోషంబు. ఈనాయుపాఖ్యానకంబును బ్రత్యాఖ్యానంబుఁగావించినవాఁడవశ్యంబు పూయశోణితకర్దమంబున దుర్గమపతనంబుఁజెందు. భక్తిశ్రద్ధాసక్తులన్ దీనిని విన్నవారికి సత్యకళ్యాణంబులు గల్గింతు" ఇని, వశవీకరించిన యానిమేషాంబన్ జూచి, మార్తిక మౌనీంద్రుండు ప్రశ్రయ ప్రహ్వశీర్షుండై, మరలనిట్లని ప్రస్తావించె. 26

మ॥"కులదైవంబవు నీవునాకు; జననీ! కూర్మిన్ననున్ జూడఁ,గో ర్కులుపండెన్; నిజమమ్మరో!యిఁక,మదస్మద్రప్రవృత్తిన్,దయన్ దెలుపంగోరెద; దేవశక్తిమయి! నీదివ్యస్వరూపంబునా కెలమిన్ జూపి, కృతార్థుఁజేయఁగదె, విశ్వేశీ! నిమేషాంబ!" నాన్.

వ॥ విని, యమ్మహామాయయు, నమ్మహామహునితో నిట్లనియె. 28

మ॥"విను; ముక్తర్షి! భవద్భవిష్యమును సంప్రీతిన్; మహాత్మా!నియత్తను; బెండ్లాడెదుమౌనికన్య నొకతెన్, ధన్యాత్మకన్, సువ్రతన్; ఎనమంద్రన్ మగబిడ్డలన్ గనియెదాయిల్లాలి యందొక్కతెన్ దనయన్ గాంచెదవాచరించెదవు పుణ్యంబుల్, పుమర్థంబులున్. 29

మ॥విదితంబై, త్వదపత్యమెల్లెడల నుర్విన్ నిండి, "వేయిండ్లకున్ మొదలై," "తామరతంపరై"విభవవిస్ఫూర్తిన్,యశోవైభవా స్పదమై, యార్షములైన గోత్రములె యొప్పన్, బ్రాజ్య సామ్రాజ్య సం పదఖండాధిపతిత్వ మాయుధధృతి ప్రాశస్త్యమున్ బొందెడున్. 30

ఆ॥ విత్తవృద్ధి, వంశవృద్ధి, యశోవృద్ధిఁ
బొంది, "చిత్రవిద్యయందు నేర్పుఁ
గాంచి, త్వత్కులీను లుచిత కులవిద్య
గాఁగ, దానినెప్పుఁగలరుధాత్రి॥ 30

వ॥ మఱియును, నీవంశీయులెల్లరు వైదికాచార పరాయణులును,
గురుబ్రాహ్మణపూజకులును, సుక్షత్రియులునయి, సిద్ధిఁగాంతురని,"
యా నిమేషాంబ మౌక్తిక మౌనీంద్రునకు మిక్కిలి యనూపాయనంబుగా,
నిజస్వరూపంబును దృగ్గోచరంబు గావించిన॥ 32

కం॥ అందఱు సందడిఁ గొన, ముని
బృందమ్ములు, మౌక్తికర్షి, పృతనాధీశుల్
బృందారకులున్, బహుజన
సందోహము, దేవిమూర్తి సందర్శింపన్॥ 33

కం॥ ఉత్సుకతయు, నత్యధికబు
భుత్సయుఁగొని, చూడలేకపోయిరి బహు బీ
భత్సంబునంతలోన
త్యుత్సాహమువారి డెందముయ్యేలలూఁపన్॥ 34

వ॥ అదియును, సర్వతః పాణిపాదంబును, సర్వతోఽక్షిశిరో
ముఖంబును, సర్వతేజోమయంబును, సర్వదిగ్వ్యాప్తంబును, సర్వ
సౌగంధ్య సమ్మిశ్రంబును, సహస్రాదిత్య దీప్తి సంకాశంబును, సర్వ
స్వరూపంబును, సర్వాద్భుతంబును, సర్వోజ్జ్వలంబునునై, వస్వింద్ర
రుద్రాదిత్యగుహ్యక విద్యాధర గరుడోరగ కిన్నరమూర్తిత్రయీ
బ్రహ్మర్షి సప్తర్షి సప్తలోక సప్తద్వీప సప్తపర్వత సర్వారణ్య సర్వ
సముద్రాది సంపూర్ణ విశ్వ విశ్వాంతరాళ ప్రదర్శకంబునునై, యత్యా
శ్చర్యంబుఁగొల్పె నంత, నమ్మౌక్తిక మౌనీంద్రుండు నా విశ్వేశ్వరి
నిట్లని భక్తియుక్తుండై, స్తుతింపం దొడంగె॥ 35

సీ॥ "దేవాధిదేవత! దేవి! సర్గస్థితి
నాశకారిణి! జగదీశి! సర్వ
తేజోమయీ! సర్వదేవమయీ! సర్వ
భూతమయీ! కృపాపూర్ణహృదయ!
ప్రకృతివీవె మహేశి! వికృతివీవె సురేశి!
విద్యావిభూతిరూపిణివి నీవె;
శ్రద్ధయునీవెగా; సర్వార్థ సాధని!
లక్షణాఢ్యవునీవె; లక్ష్మి వీవె;

గీ॥ సర్వసౌఖ్య ప్రదాయినీ! సర్వజంతు
చేతనత్వ విధాయినీ! చిత్కళాప్ర
దీప్యమాన స్వరూపిణీ! దివ్యశక్తి
సంపదుపపన్న! నిన్ను వశంబె యెన్న?॥ 36

శా॥ నీసాహ్యంబునఁగాదె, రక్కసులమన్నీకన్ క్షణార్థంబులో
నేసంహారమొనర్పఁగాఁ గలిగితిన్; దేవేశి! దుర్గాదులన్
గాఁచిం బెట్టుటమాటలా? జనని! శక్యంబె? భవత్పూర్ణహా
ర్దాసారంబులుపైఁబయిన్ ముసరకున్నంతన్, జయంబందుటల్?॥

ఉ॥ ఈవువచించినట్టులె మహేశి! చరింత్రుమదీయులందఱున్;
దేవతగా నినున్ దలఁచి, దీప్తినెసంగి, క్రియాదుళినెల్లమై
త్రావరుణి ప్రదిష్ట విధిఁదప్పకచేయఁగలారు; నీ కృపా
భావముఁ దప్పనీయకుము; వారిపయిన్ నిమిషాంబికాద్వ
హ్వయా!"॥ 38

మ॥ అని, ప్రార్థించి, మహర్షిమూర్తికుఁడు, "విశ్వాధీశి! యీరూపమున్
గన, శక్తుండనుగానుదల్లిరో! మహానందస్ఫురన్మూర్తివై,
నను మన్నించుచుఁ, గోమలాకృతిని సందర్శింపఁగాఁజేసి, యీ
తనయున్, వీతనయున్ క్షమించి, కరుణాధారాప్లుతున్ జేయవే!"

వ॥ అని, విన్నవించునంతనాలోన, నాలోకమాతసహజకరుణాసుధాఽఽ
సారసారప్రపాతప్రపూతయు, భక్తలోకపక్షపాతసముపేతయుంగావునఁ
దత్క్షణంబ, తద్రూక్షరూపంబుపసంహరించి, సముంచితసౌకుమార్యాంచి
తాకారంబునమ్మౌక్తిక మౌనికి సాక్షాత్కారమున్ జేసె; నదియును,
బూర్ణచంద్రోపమాస్యంబును, బల్లవతుల్యపాణిపాదంబును, నీలనీలాల
కాంచితాకుంచన ప్రపంచంబును, హారాభిరామవక్షోదేశ సంశోభితం
బును, వేదివలగ్న లగ్నకంబును, గంభీరవేదిత్రపాఽఽపాదిగమన
కమనీయంబును, జంచత్కాంచన కాంచీకనన్నితంబ బింబాంచనోదంచి
తంబును, బాదాబ్జాతాజహన్మ్రత్యహంసక రూపహంససంసత్సం
సేవితంబును, దాటంక రత్నకుండలద్యుతివిద్యోతిత గండమండల విటం
కంబును, బ్రవికసిత వదనకమల సవిభ్రమభ్రమద్భ్రమరక భ్రమర
భ్రమణ శిక్షణ దక్షసభ్రూవిభ్రమంబును, మందస్మిత చంద్రికా
పరిపూరసంతర్పితదిదృక్షుదృక్చకోరకంబును, శిఖరిదశన పరంపరా
పరితః పరితస్మితసిత ద్యుతిమౌక్తిక స్థగితబింబోష్ఠ విద్రుమ సంభ
ద్రింబున్నై, మౌనముద్రాఽలంకారస్వాభావికంబుగాఁ జూపట్టె-నంత,
నమ్మౌక్తిక మానీంద్రుండును, భక్తియుక్తుండై, యమ్మహామాయా
మయికిం బాదాభివందనం బాచరించి, నిల్చెన॥ 40

కం॥ నిమిషాంబయుఁ, దచ్ఛిష్యం
బమిత కృపాఽఽపూరితాత్మయౌచు, నిమిరి, "వ
త్స! ముహుర్విజయంబులఁ దన
రుము; చను"మని పలికి, తాఁదిరోహితయయ్యెన్॥ 41

ఉ॥ అంతట, మౌక్తికర్షి గరుడామర కిన్నర సిద్ధసాధ్యులం
తంత, వసిష్ఠముఖ్యులు మహర్షులు హర్షులు వెంటరాఁగఁ, జే
తోఽంతరమంత సంతసపు దొంతరలన్ గళులన్ విదుర్చుచున్,
సంతన, నంతకాంతకునజస్రపదాబ్జమిళిందముగ్ధమై॥ 42

వ॥ తొందఱింప, దండడింగొని, మునులును, సురనికరంబులును,
దానును కైలాసశైలంబుఁజేరి, శైలజామాతను, మాతృభూతమహా
మూర్తి, నర్ధాంగీకృదాంపత్యసాంతత్యావైయాత్యుఁ, వైయాఘ్ర
చర్మాంబరకృత్యుఁ, గృత్యపంచకసమంచితసత్యకృత్యు, నంబకేశుఁ,
ద్ర్యంబకు, నిర్జిత పుష్పాంబకునిఁ గన్నులారఁ గన్గొని, సాష్టాంగదండ
వత్ప్రణామంబు లాచరించినంత, సర్వసుపర్వులు నమ్మహేశ్వరు
నిట్లని స్తుతియించిరి॥ 43

(శ్లో) శా॥ "శ్రీకైలాసగిరీంద్ర శృంగవిహ(చ)రత్సింహాయ,
రంహోముహు
ర్వ్యాకృష్టక్షితిభృద్ధనుర్హరిశరధ్వస్త త్రిపూరక్షసే।
లోకేశత్రిదశేశవర్ణితయశోలోలాయ, లీలాయిత
ప్రాకామ్యాయ, నమోఽస్తుతే! గిరిసుతావాల్లభ్య
లభ్యశ్రియే॥ 44

(శ్లో) శా॥ త్ర్యక్షాయ, ద్రుహిణద్రుమేంహిమగిరేరక్రీతదాసాయ; వృ
ద్ధోక్షానుక్షణయానచుంచుమనసే, యుద్ధ్యత్కిరాతాయతే।
ప్రక్షీణీకృతకైంకిరాతమదసర్వస్వాపహారాయ, తే
చక్షుశ్శ్రోత్రకృతా హిరణ్యమణిభూషాభూషితాయోన్నమః॥ 45

ఉ॥ దేవ! భవత్సహాయత, యతిప్రథిత ప్రచుర ప్రభావశో
భావిభవంబు లేనియెడఁ, బ్రాభవవైభవముల్ ఘటిల్లుటల్
తీవరమైన జానుమడలీక పరాక్రమమెల్లఁ బొల్లగా
వావిరిఁబుచ్చుటల్, దనుజువధ్య నొనర్చుట, శక్యమెట్లగున్?॥

శా॥ లోకానుగ్రహకాంక్షమై, తతశుభశ్లోకున్, మునీంద్రున్, మహో
ద్రేక స్పర్ధలులేని సౌమ్యచరితున్ సృష్టించి యీతున్నఁ, బి
ర్వ్యకుల్ వెట్టెడు జానుమండలుని దోర్వీర్యం బణంపంగలం
డే, కైవల్య నిధాన! (కైలాసనివాస!) ప్రాకృతుండు?
పెక్కేలా, వచోవైఖరుల్?॥ 47

ఉ॥ నీ భుజ సంభవుండగు మునిప్రవరుండు ఘనుండితండు, ము
క్తాభిధుఁడే త్రైటిన్ జని, మహారణరంగమునందు జానుమ
త్ప్రాభవమున్, ప్రభావముహరింప లభించునెటుల్ మహాస్త్రముల్
నీభవికైకదృష్టియెమలీమసకంఠ! యలీకమైనచోన్॥ 48

చ॥ పొగడితగాదు శంకర! రిపు ప్రకర ప్రచుర ప్రతాపమే
ర్చఁగ, జగముల్ భయంకర కృశాను పతచ్ఛలభంబులయ్యె; నీ
వగణి తవత్సలమున హాయినిగూర్పఁగ, నిమ్మహర్షి నీ
దగుభుజదండమందు జనితాద్భుతుఁబుట్టఁగఁజేసియంపవే?॥ 49

ఉ॥ ఇమ్మహనీయమూర్తియె, యహీన పరాక్రమమొప్ప, జానుమం
తుమ్మదమత్తుఁ జంపియుఁ, జతుర్దశ లోకములన్ కృపావిశే
షమ్మునఁబ్రోచె మార్తికుఁడశంకిత పౌరుష భూషణుండుఁ; స
త్యమ్మిది; నమ్ము మీశ్వర!మహాస్త్వమహాత్త్వనితాంతభాస్వరా!"

మ॥ అని, యగ్గించు మహర్షున్, సురల, సద్యః ప్రోత్థితా పారకా
రుణికత్వమ్మున నాదరించి, మునివర్యున్, ముక్తులాలించి, "ర
మ్మ"ని, యంకంబునఁగూరుచుండఁడి, "వత్సా!లోకకళ్యాణమున్
ఘనతన్ గూర్చిన నీకుఁగల్గునెపుడున్ గళ్యాణముల్ పుత్త్రికా!॥"

మ॥ అని, వెన్వెంటనె శంకరుండు మదిలో ధ్యానించె నాభూతభా
వను, లక్ష్మీశు, ననంతరంబచటఁదాఁ బ్రత్యక్షమయ్యెన్ ఘనా
ఘన దేహుండు, విహంగవాహుఁ డెదుటన్; గౌరీశముఖ్యుల్ సురల్
మునులున్ మ్రొక్కిరి భక్తియుక్తులయి; శంభుండున్ రమావల్లభున్॥

కం॥ కాంచనపీఠస్థున్ గా
వించుచుఁ, జాతుర్యమొప్ప వృషభాంకుఁడుఁ దా
నంచిత సమయోచిత జి
హ్వాంచల సంచలవచస్సుమాసవలవముల్॥ 53

మ॥ చినుకన్ "శ్రీశ! "మహోఽసహంబగుచు, గార్చిచైచ్చ, జగద్దాహకం
బును, సర్చిద్రము, జానుమండ భుజోద్యాభతప్రతాపాగ్ని యె
ల్లను నిర్వాపితమయ్యె; లోకములు కళ్యాణంబుఁ గాంచెన్; మహ
ర్షిని, ముక్తాహ్వయు, నస్త్రశస్త్రనిధి, నారీతిన్ బ్రకల్పించుటన్॥" 54

చ। అని భువనంబులన్ జనులహం ప్రథమంబుగ పూని, బెద్దఁజే
సి, నుతలనారతంబును విశేషముగా నొనరింత్రు; వేఱుగా
మనమున నెంచవంచెటిఁగి, మాఅటలేకవచింతుఁ, గ్రొత్తయే
మనకు సురారిమారణము! మాధవ! యిట్టివి లీలలేగదా!॥ 55

చ॥ అయినను, లోకవిశ్రుత మహర్షి మహత్త్వ మహస్త్వముల్ వృథా
వ్యయములుగాఁ దలంచుటలు భవ్యులుమెచ్చరు; తత్ప్రభావమే
భయమునుబాపి, లోకమున పారముదంబుధిఁ దేల్చి, ప్రోచె; వా
నియతుల పౌరుషంబెయని, నిత్యముఁ దద్యశమే ప్రకీర్త్యమా॥ 56

చ॥ మును, ఘనుఁడై, హిరణ్యకశిపుండు వరంబులు గోరినట్టికో
రెను దనుజుండు పద్మభవసృష్టినవధ్యత; బ్రహ్మయున్ "దథాఽ
స్తు"నియెను; జానుమండలుని యాగడముల్ మితిమీఱఁజూచి, యే
నును భుజసృష్టిఁజేసితిని నూతనరీతిని మౌక్తికాహ్వయున్॥ 57

ఉ॥ జానుమదాహ్వయున్ బొదివి, చంపుటయొక్కటెకాదు; శ్రీశ! య
మ్మౌని మొదల్ జగమ్మునను, మానితమై, పొగడొందుకృత్తి మా
ర్యానఘనసంజ్ఞమై, పఱఁగు యావదుడుగ్రహచంద్రతారమై,
మానుగ, "దోసతోఁటవలె", మానరమై, సరమైధమై, ధరన్॥ 58

కం॥ ఇదినా సంకల్పము; స
ద్విదితంబగుశిల్పమై, భువిన్ నిల్చుత! భ
వ్యదయాఽఽఢ్యా! యార్యకృ
త్తిదృఢమహోత్తుంగ సౌధరాజంబుర్విన్॥ 59

ఉ॥ కావున, శ్రీశ! మా త్తుకుఃకంటె జగద్ధితబుద్ధియేఁడి? మే
ధావికి వీనికిన్ దగిన తామర సోదర సోదరాంగ శో
భావిభవాతిశాయిని, శుభంకరి, మౌనికులోద్భవన్, ద్రిలో
కీ వినుతావదానునకుఁ గేల్దదియింపవరించి, తేఁదగున్॥" 60

మ॥ అని, గౌరీశుఁడు పల్కఁ బల్కులకు భవ్యాత్ముండు విష్ణుండు, ధ్యా
న నిమీలన్నయనుండుగా, క్షణము పుణ్య శ్లోకుఁ డూహించి, యి
ట్లను; "గౌరీవర! నేను మున్నెఱుఁగుదున్; యత్నంబదేలా? మహా
ముని, దుర్వాసుని యాశ్రమంబునను శంభూ!
"ముక్తికాంతాఽభిధన్" 61

మ॥ కదళీగర్భసముద్భవన్, మునిసుతన్, కళ్యాణశీలన్, దనూ
్రమదిమాధఃకృత పుష్పకేసర కుసుంభస్ఫార ధూళీమధూ
ళి, దరస్మేరముహుర్విలాస, శశభృల్లేఖాఽఽభఫాలప్రభన్॥
మదమాతంగమరాళరాజగమనన్, మౌనీంద్రుఁ డొల్లన్ దగున్॥ 62

వ॥ అదియు, మహామహానీలమహోమహోర్మి హేలాహేలనకారిచారు నీలాలకోపేతయు, శ్రీవర్ణనవశ్రీతూర్ణాపహారికర్ణశష్కులీయుగళయు, విధుబింబవిడంబిముఖమండలాడంబరయుఁ, గర్ణాంతవిశ్రాంత నేత్రాభిరామయు, నాపాండుగండయుగళ మణిముకురయుగళయు, మదన విజయమంగళకంబూపమానానూనతిర్యగ్రేఖాఽమంద సౌందర్యధుర్యగళయుఁ, దిలకుసుమచంపకముకుళశోభాఽపహాసినాసికావిలాసభాఽసమానభాసమానయుఁ, జక్రనిర్వక్రరామణీయకతృణీకరణచణ వృణాళనాళాంత స్తంతుకేశప్రవేశానవకాశపీనవృత్తకఠినవక్షోజద్వంద్వసర్వస్వయుఁ, జారుదోర్వల్లికాఽఽంచితయు, రంగత్తరంగత్రివళీవిరాజితయు, సింహశాబకమధ్యయు, నీలరోమావళీకాళవ్యాళీవ్యాలీన విలాసబిలాయమానానావిలావర్త వర్తులానాభీలనాభీసత్కృశోదర నిరంతర శోభితయుఁ, బృథ్వీచక్రప్రాపిత నిర్వక్రనిర్భయాక్రాంత చక్రవృద్ధివర్ధిత

వార్ధుషికాయుతాయతకటీతటీ సమాటీకనాటోపయు, రంభాస్తంభ సంరంభౌపమ్య సమారంభసుభగం భావుకోత్సంగ సంగతాభంగ మంగళ భంగీ శృంగారాంగీకార శుభాలంకారయుఁ, ప్రస్ఫుర త్పాదపల్లవయుఁ, కోకిలకాకలీకాకుకోమలాలాపాన్యదురాపకలా కలాపకలాపఖేలాలీలాలాలిత లాలసానలసయు, నఖనక్షత్రభాసుర రయునై, తనకనులయెదుట మసలుటఁగని, యోగ్యంబైన ముక్తి మానీంద్రునకీఁగోరియు, దుర్వాసోమహర్షి మహామహర్షియై, సంకల్పించు కొనియుండె"నని, విశదపఱచుటయువిని, శంకరుండు సంతుష్టచేతోఽం తరుండై, సహోపవిష్టులైన సభాసదులు సాధువాదంబులు నిర్నిరోధం బుగా, రోదోఽంతరాళంబు నిండించుచుండు సందడింబడి, సానందం బుగా నిట్లనియె॥ 63

మ॥ "బృహదారణ్యక మధ్యగన్, గుణమణిన్, శ్రీవల్లభాదిష్ట, న
మ్మహనీయాకృతి, "ముక్తికాంత"నిపుడే, మద్దోస్సముద్భూతుఁడౌ
మహితున్ గూర్చి శుభోద్యమంబునకునమ్మౌనీంద్రు, దుర్వాసు, పూ
ర్వహముఁ జేయంగను, పెండ్లి పెద్దఁగుఁడౌ; వాచంయముల్!
చయ్యనన్॥ 64

వ॥ ముక్తికాంతా ముక్తేశుల కల్యాణోత్సవంబు శుభదినంబున, సుముహూర్తంబున సుసాధంబుగావింపను, దన్మహామహంబు వేదోక్త మార్గంబున, క్షత్రియ కల్పోక్త ప్రకారంబుననే సాగింపను, మీర లందఱు నేఁగి, దుర్వాసో మౌనీంద్రు నంగీకరింపఁజేసి, కార్యసాధనంబుఁ గావించుకొనిరండు. అంతియకాక, యేతద్వంశీయులు నాకును, విష్ణువు నకును గూర్చు భక్తులై, వైదికాచార ప్రవర్తులై, క్షత్రియధర్మంబు లవలంబించునట్లు మీరెల్లరు నిర్వాహకులు గావలసిన దిసుఁడీ!"యని, మఱిమఱి తఱిమి పలికె, యనిపిన, వారును దుర్వాసస్తపోవనంబు దరియంజొచ్చిరెట్లన॥ 65

మ॥ అమరుల్ వజ్రధరాదులెల్ల మునులున్ హర్షాత్ములై, దివ్యవా
ద్యములెంతే మొరయన్, సురాంగనల నృత్యంబుల్ సెలంగన్ దివిన్,
సుమనోవృష్టియు ముమ్మరమ్ము, గురియన్,
శుంభన్మహోత్సాహమొ
క్కమొగిన్ ఱెక్కలు విచ్చుకొన్నటులు వేడ్కన్ జేరిరచ్చోటికిన్॥

వ॥ అదియును, వివిధ సురభిళకుసుమవిసరవిస్ఫురలతానికుంజమంజుళంబును, బహుబర్హిర్ముఖ మిథున విహారహారియు, ఫలభారావనమ్రామ్రమాది శాఖోపశాఖోప శోభితాఖిలశాఖిరేఖాఽఽకులంబును, కమలోత్పల విస్ఫార కమలాకర విస్తారంబును, సమంతతస్సంచరన్నానావిహంగకులకోలాహలబధిరిత భూనభోఽంతరాళంబును, అసకృదాదిత్యోపాస్త్యనాయాస్త మునికుమారకవారంబును, ఉటజాంగణాబద్ధ కదంబక మృగతర్ణక క్రియమాణమంథరరోమంథవ్యాపారబంధురంబును, నిత్యనైమిత్తికస్నాతోత్తిష్ఠన్ముని బృందామందవ్యాకీర్ణచారు తీర్థావతారాకీర్ణంబును, మహామహీరుహశాఖాఽంతరాసక్తవల్కలంబును, హోమాజ్య ధూమపాళీ సంతత సమంతతోవ్యాప్తి సుగంధగంధిలంబునునై, సర్వేంద్రియగ్రామసంతర్పకంబై, సర్వసంభారసంభాసురంబై యొప్పుచుండు నందు— 67

మ॥ అతులోత్సాహమునన్ మునుల్, సురలు దివ్యక్షేత్రమున్ జేరి, ని
స్మితులై, కాంచిరి విస్మృతాఖిల బహిర్మిథ్యాప్రపంచున్, మహో
న్నత నిష్ఠాఽన్వితు. దీర్ఘదీక్షితుని, ప్రాణాయామనిశ్చేష్టు, సు
వ్రతు, యోగాభ్యసనైకతత్పరుని, దుర్వాసోమునీంద్రోత్తమున్॥

సీ॥ స్థిరునిఁ, బద్మాసనాసీనుని, శాంతాతి
నిష్ఠాగరిష్ఠుని, నిశ్చలాత్ముఁ,
బశ్యదంతర్జ్యోతి, నశ్యదైహికజాతి,
సౌమ్యరూపు, సువర్చసంబువాని,

జాతరూపో పమచ్ఛాదనాఽన్వితాంగుని,
రుద్రాక్షభూషితోరోవిరాజి,
నంగీకృతాఖిల స్వాంగ భస్మోద్ధూళ
నాలంకరిష్ణు, దోషాసహిష్ణుఁ,

గీ॥ గూర్చనిర్వక్రవక్త్రు, నకుంఠదత్త
నాసికాఽగ్రస్థదృష్టి, నిశ్వాసరోధు,
నిశ్చలోర్ధ్వోన్నతాంగు, నిర్నిద్రయోగ
ముద్రు, దుర్వాసుఁ జూచి, సమ్మోదమొంది॥ 69

వ॥ భక్తియుక్త చేతస్కులై, ప్రహ్వీశీర్షులైన మహర్షులు మౌనమ్మాని, కన్నులు విచ్చిచూచి, "మహాత్ములారా! స్వాగతంబు. మీరాకచే ధన్యుండను, మాన్యుండను మాత్రమేగాక, మత్పూర్వపుణ్యంబులుఫలించినవాఁడనైనాఁడ"నని విన్నవించుకొంటకు మీవంటి పుణ్యాత్ముల దర్శన భాషణంబులే తార్కాణంబులు. భవదాగమనంబియ్యది యాదృచ్ఛికంబైనను, మిక్కిలి శుభోదర్కంబును, భవిష్యచ్ఛ్రేయోదాయకంబునౌనని, చెప్ప సందేహమేల? మహామహులారా! యెందుండి మీరాక? యెందేఁగుచు, మీరియ్యెడ కేందులకేతెంచితిరోగదా! శిష్యవాత్సల్యంబున, నీయుపదేశ్యున కేదేని బోధింపఁగలది కలుగునెడ, నెడసేయక, తప్పక సెలవీయరే" యని యభ్యర్థించిన, నయ్యాగంతుకు లిట్లనిరి॥ 70

చ॥ "ఉరుమహిమాఢ్య! లెస్సభవదూహ; నుతింపఁగనౌను; మేముశం
కరునికటంబునుండి నినుఁ గానఁగవచ్చితి; మింకనీకుదాఁ
పురమదియేల? తద్వచనమున్, శుభవాచికంబు నీ
కరమరలేక విన్పుటకహం ప్రథమత్వమున్ మునీశ్వరా!" 71

చం॥ వినుఁడు జానుమండలుని పీఁచమణంపఁగ శంకరుండు నూ
తనముగ మౌక్తికర్షిఁదన దక్షిణబాహువునన్ సృజించి, పం
చిన, నతఁడున్ సురారిహతుఁజేసి జగంబులఁబ్రోవ మెచ్చి, వి
ష్ణుని శుభ నిర్ణయంబుఁగొని, సువ్రత! నీసుతమానికిమ్మనెన్. 72

కం॥ ఇది మావచ్చినపని; మఱి
యదియువినుము; మౌనినాథ! యిఁక, మౌక్తికమా
నిదియగునుదంత మెల్లన్
విదితమొకద, జగతి! నదియు, నీవెఱుఁగుదుగా!. 73

చం॥ అతఁడు మహేశునంశమున నద్భుతతద్భుజసంభవుండు, సు
వ్రత! భవదాత్మ సంభవ ధ్రువంబుగఁ బెండిలియాడ, నూమ్మల
ద్యుతియుఁ- ప్రభాఽఽళి, చంద్రుఁడును-జ్యోత్స్నయుఁబోలి పరస్పరానుకూ
లతజగతిన్ ప్రవర్తిలఁగలారిటులైన, ముదంబుమాకగున్. 74

కం॥ "హరు సందేశంబును, శ్రీ
హరియామోదంబు, నస్మదాశయమెన్నన్
సరియే"యని తోఁచిన, ముని
వర! కర్తవ్యమున దృష్టిఁబఱపఁగదయ్యా!". 75

వ. అనిన, విని దుర్వాసో మహర్షి పరమహర్షియై, వారితో సప్ర
శ్రయవిబుధాశ్రవచర్యంబుగా నిట్లనియె. 76

మ॥ "సురలారా! మునులార! గంధగజవాసోహేమవాసోవచో
వరయుష్మచ్ఛుభదర్శనంబుల నుసంపన్నంబులయ్యెన్ దప
శ్చరణాస్మ జ్జనురిద్ధపుణ్యములు; విశ్వశ్రేయమున్ గూర్ప(ర్చ) నీ
పరిణీతి ప్రథితప్రబంధమిలఁబర్వన్ మత్ప్రణీతంబగున్. 77

చం॥ హరిహర శాసనంబది మహామహులార! శిరోఽగ్రధార్యమౌ;
మఱిభవదీయ నిర్ణయము మాన్యవతం సము;ముక్తి కాంతనా

వరసుతయైన నీయమ భవత్సుతయే సుడీ! యీమె నమ్మ నీ
శ్వరునకొసంగినాఁడ"నని, ప్రక్కకుఁ జూచి, సుతన్ గనుంగొనెన్. 78

ఉ॥ అప్పటికామెయున్ జనకునంతి కమందు పవిష్టయై, వినన్
జొప్పడునెమ్మనమ్మునకు నూల్కొను సిగ్గును గెంటలేకయే,
యప్పలుకుల్ "విసీ-వినని" యట్టులుగా, గణియించుచుండెఁదా
నొప్పువిలాససారస దళోద్భవపత్రముఁ బన్నతాస్యయై. 79

వ॥ అంత, దుర్వాసుండు ముక్తికాంతను వీక్షింపఁజేయుచు, నామెచే బృందారకమౌని బృందంబులకు మ్రొక్కింప, వారందఱును—"కళ్యాణీ! ముక్తిక మౌనీంద్రుని భర్తగాఁబొంది, రూపయౌవన శౌర్య ధైర్య సంపన్నులును, సబ్రహ్మవర్చసులునైన సత్పుత్త్రిలన్ గాంచు"మని, యాశీర్వదించి, నిలింపులంత నంతర్హితులైరి. మహర్షులు త్రిరాత్ర వ్యవధానంబుగా వివాహముహూర్తంబు నిశ్చయించిచెప్పి, దుర్వాసుని వీడ్కొని, మహోల్లాసంబునఁ గైలాసంబున కేఁగి, యథా వృత్తంబుగా నావృత్తాంతంబంతయుం జెప్పి, గౌరీనాథునానంద సందోహ దోహలున్ గావించిరంత, నద్దేవ దేవుండును యోగ్యులైన భృత్యుల నాదేశించి,మౌక్తిక మౌనీంద్రుని వివాహంబునకుఁ గావలయు సర్వసన్నాహంబులు గావించెననిన, విని, యవ్వలివృత్తాంతం బెట్టిదని వీణామౌనివాణీ జానినడుగుటయును. 80

కం॥ సిరులిరవొందెడు నరనా
పురముననివసించు భక్తముఖ్యుఁ కున్ని
త్యగమా వైభవముల్, మో
క్షరసానందమును గూర్చుకపిలమహేశా! 81

ఇది, ఆంధ్రీకృత ముక్తీశ్వరోపాఖ్యానంబునందు
ముక్తీశ్వర వివాహసన్నాహంబన్నది చతుర్దశాధ్యాయము

—(•)—

# పంచదశాధ్యాయము

ఆ॥ సిరిగలాఁడు తొల్లి చేసాచె; సిరిలేని
యీఁవు చేయిసాచువృత్తివాఁడ;
వైన, నీవులొప్పుమీఁనెయ్యురిర్వురు
నరసపురము నేలు దొరలు; బళిర!॥ 1

ఆ॥ అవధరింపు; మవలిదగుకథ; సురముని
నలువకనియె–"వినఁగవలతువిస్త
రంబుగాఁగదీని; నంబురుహాసనా
సీన! ముక్తమునివిశేషగాథ॥ 2

చం॥ అతని వివాహశోభితమహంబు, తదీయవిలాసలాలసల్,
సుతజననంబు, వారల విశుద్ధ చరిత్రలు, వారి పేరులున్,
మతిమహిమంబు, సంచితసమంచిత తద్విభవంబు, మున్నుగాఁ
దతకృపఁ దెల్పవే, బహుకథాకథన ప్రతిభాప్రభావితా! 3

కం॥ సెప్రీయుపె" యని, నారదుఁ
డెమినడుగఁ బలుకఁదొడఁగెనీరీతినజుం
"డలఘు మహిమాన్వితమ్మును,
లలితమ్మది వినిన, బహుఫలప్రద" మనుచున్॥ 4

వ॥ తదనంతరంబ, పూర్తికుంపు పాణిగ్రహణ ప్రస్థానోద్యుక్తుం డౌటవిన్నంతనే, సర్వగీర్వాణులు నాతనినానత భూషణభూషితుం గావించి రెట్లన 5

సీ॥ మణికిరీట మొసంగె మఘవుండు; కుండల
ద్వయమిచ్చె వహ్ని; యప్పతియురత్న
మాలికల్ గై సేసె; నైఋబిలుండు కే
యూరంబులిచ్చెను; శ్రీరమాఽధి
నాథుండు మణికంకణము లొసంగెను; వార్ధి
మౌక్తికహార సంపన్నుఁ జేసెఁ;
గటి సూత్రమును దివౌకసులిచ్చిరి; సితాత
పత్రంబుఁ జంద్రుండు; పద్మబంధుఁ

గీ॥ డొసఁగెఁ జామర యుగళమింపె సకమెసఁగ;
నీయమూల్యనువస్త్ర విస్తృతి ధరించి,
యార్యవర్యుండు హోమకుండాంతరుత్థ
కాంచనరథంబుకినెక్క, శోభాఽఽంచితుండు॥ 6

వ॥ శంఖశృంగకాహళ భేర్యాదినానావాద్యంబుల ఘోషంబులు భూనభోఽంతరాళంబును ప్రీలంజేసి, యంభోధి గంభీరారావంబునేవ గించి, యంభోధరారంభగర్జాధ్వానంబునుదర్జించి, యంతట నవ్యాహతంబుగా వ్యాపించుచుండ, సర్వసుపర్వులున్ బరివేష్టింప, బ్రహ్మవేత్తలైన బ్రహ్మర్షుల వేదనాదంబులు మేదురంబులై, వేదురులుగాక, యాదరంబుఁ గూర్చుచున్, బిక్కటిల్ల, మౌక్తిక మాసీంద్రుండు పెండ్లికొడుకై, ప్రస్థానంబు సాగించుచుండె-నంత॥ 7

కం॥ ప్రమథులతోఁగూడి, మహో
క్షమునారోహించి, వేడ్క-శంభుండును, దే
హామహోఽన్వహాన్వితుఁడు, దా
ర్ఘ్యమూఁపుపై వెల్గుహారియుఁ గుడియెడమలుగాన్॥ 8

వ॥ అనుసరించి, సరసంబులుపచరించుచు, సహచరులయి, యరుగుదెంచు చుండిరంత, శింజన్మంజీర మంజుళపాదంబులు మంగళవిన్యాసంబుల మెత్తమెత్తనత్తమిల్లఁ, దత్తత్తారుణ్యాచారుతాఽఽ నృణ్యబిబ్బోకంబులనాలోకించు కొంచెపుఁగోడెగాండ్రను దీండ్రంపుటాలోకంబులన్ దబ్బునఁ దబ్బిబ్బుసేసియుబ్బడంచుచు, శ్రోత్రపేయంబులైనగానామృతరసాయనంబులా యాయిమాతా యాతాదుగ్ధపాయివృద్ధంబుగా, నెల్లవారలకాప్యాయనోల్లాసంబులు గూర్చుచుండ, రత్నభూషణభూషితలై, చంచత్కాంచన కాంచీదామాంచిత నితంబ బింబసంబాధ సంభాసమానాసమానానూన సుందరతర మందమందయానలై, తార హారావళీరమ్య పీనపీనవక్షోజ శోభితలైన యమరగణికల సముదయంబులుదయద్భవసవహ బహుద్యుతి విద్యాసిమద్యాయిత మధుర మధురమూర్తిమత్త్వ ధారంధర్యంబుననందంద నర్తించుచుండ, ముక్తేశుండు దుర్వాసస్తాపసాశ్రమంబునశ్రమంబునన్ ప్రవేశించె — 9

ననంతరంబ.

చం॥తన యను యాయివర్గముముదంబును బొందుటపొంటెడా, మునీ
ట్తనయను బెండ్లియాడి, శుభధామముఁబొందఁదలంచి, విశ్వక
ర్మనుస్మరియింప, నాతఁడును, గ్రక్కున నొక్కపురంబు,సర్వశో
భనభరితంబు, సంతనఁ "ప్రభావతి"నా, రచియించి,యిచ్చెనన్.10

వ॥ అదియును, మణిఖచిత సమసముచిత రుచిరతరా చిరరుచి నిచయచాకచకిన్ గచాకచి ఘట్టించుకుట్టిమాట్టాలకాది ప్రదేశంబులను, మందరకలధౌతాద్రి తుల్యోత్తుంగరంగన్మంగళసౌధయూధాట్టహాసాయితా యతప్రభాప్రభాసమానంబై, రత్నసాను సమానానూనకాంతి సంతతి సంతతతంతన్యమానాత్మనీన మహామహార్థియై, కూటాగారరమ్యోపకార్యారంభసంరంభ భూయిష్ఠయై, శతాధిక వాపీకూప తటాకానేకన సముట్టంకితయై, యగాధపరిఘా పరివేష్టి

తమై, బహుబృహత్తోరణోపబృంహణ విరాజమానమై, పరితఃప్రణర్తిత పతాకాసంకీర్ణమై, నానావాద్యవిశేష విస్తారితమై, యంత్రపాంచాలికాఽఽంచితమై, శతఘ్నీశత సంకులమై, దివ్యాలంకారదీప్తిసందీప్తమై, నానాచిత్రోపశోభితమై, సద్యోనిర్మాణ విద్యోతితమై, వెల్గొందుచుండ, మౌక్తిక మౌనీంద్రుండును, సపరివారంబుగా నద్దాని నిద్దంపు సొంపులింపు సంపాదింప, నిలింపలోక సంపత్సంపన్నంబై, "పురవరంబిదియింత యొప్పారునే!" యని, యాశ్చర్యానందంబులు డెందంబునిండి యీక్షింపుచు, దుర్వాసోమౌనీంద్రు నాశ్రమంబునన్ బ్రవేశించె-నంత. 11

మ॥ ముని, దుర్వాసుఁడెఱింగి, మౌక్తికుని సమ్మోదంబునన్ బూజసే
సి, నితాంతోత్తమమాతిధేయ విధి, సంస్ఫీతంబుగాఁదీర్చి, యా
తనివెన్వెంటనె పెండ్లిపెద్దలయి, సంస్త్యాయమ్ముఁజేరంగవ
చ్చిన వారిన్ మరియాదఁజేసెఁగడు దాక్షిణ్యంబగణ్యంబుగన్. 12

చం॥ అపుడు, త్రియంబకుండనియె నాదరమొప్పఁగ, నత్రిపుత్త్రుతోఁ;
"విపుల విశుద్ధతత్త్వ! మునివీరుని, మౌక్తికు, నల్లువానిఁగా
సపులకబాష్ప పూర్ణముగఁ జక్కఁగ స్వీకరణంబొనర్చి, వా
ని పురిని బెండ్లిసేయనగు నీదుహితన్; మఱి, నీదుహితంబిదేగదా!"

వ॥ అనిన, "వల్లె" యని, యమ్మునితల్లజుండును, ముక్తికాంతను దోడ్కొని, "ప్రభావతీ" నగరంబునన్ బ్రవేశించినంత, మౌక్తిక మౌనీంద్రుండును, సురమునివర నికరంబులతోడన్ దన్నగరంబుఁ జొత్తెంచి, స్వర్ణరత్నభిత్తి స్తంభసంభాసమానంబై, యసమానంబుగాఁ బ్రకాశించు నొక్క-దివ్య మందిరంబున విశ్రమించి, మించిన వైభవంబుతో సమంచిత శోభాశోభితుండై, వికసిత నిజముఖకమలుండై, కామధేనువును స్మరియించి, యయ్యది ప్రత్యక్షంబైనంత, నమ్మహర్షియు మహాహర్షియై, తద్గోత్కర్షంబున నిట్లనియె. 14

కం॥ "సురసురభి! వలయువస్తూ
త్కరముల, సంభారములనుగళ్యాణార్థం
బరవాయిఁగొనక, విరివిగఁ
గురియవలయుఁజూ! జడిగొనుకోర్కులుదీఱన్". 15

కం॥ అని, పలుకుటయేతడవుగ
ననిమిషనై చికియుఁదన్మనోఽభీష్టద, వ
స్తునిచయ బహుసంభారము
లనుగురిసెన్; దానమునిలలాముఁడుమురిసెన్. 16

వ॥ తదనంతరంబ. 17

ఉ॥ శైవులు, వైష్ణవుల్ మిగుల సంతసమందిరివచ్చి, కౌతుకో
ద్భావనఁజేసి, కౌతుకవిధాన సమంచిత వేదికాస్థితుం
డౌవరవేషు, మానిఁగనులారఁగనుంగొను భాగ్యమందఁజే
తోవనజాతముల్విరియ, దోయమువారలుఁ గూడివేడుకన్॥ 18

ఉ॥ అప్పుడుపార్వతీపతి, రమాఽధిపుఁడున్ నిజవాహనంబులం
దుప్పరవీధినుండి, కుతుకోన్నతులై, సతులున్, సుతుల్కరం
బొప్పుఁగుప్పలై, తగునవోఢను, వోఢనుజూడ, వేడుకల్
ముప్పిరిగొనఁగ,ఁదారు, హరువుల్, మురువుల్, పరువంబులొప్పినన్

సీ॥ ఒకవంక గరుడకాకోదరస్వామివి
ష్వక్సేనులొప్పఁగా, శార్ఙ్గపాణి
యొకట్రేవవిఘ్ననాయక బాహులేయపా
రిషదాదులొప్పఁగా, వృషభగమనుఁ,
డొకచాయ నింద్రాది సకలదిక్పాలకుల్,
వహ్నిప్రభృతివిదిక్పతులునలువు,
ఒకచెంత దినకరాదికనవ గ్రహముల
శ్విన్యాదితారకా శ్రేణులెల్ల

గీ॥ భువనకళ్యాణ కారణంబవుచు, ముక్తి
కాంతికామాక్తికర్షులయంతరాంత
రములనును సిగ్గుదొంతరల్ క్రమముగాఁ గు
తూహల భరంబుగుటఁగాంచి, తుష్టిమించి. 20

మ॥ దివిజానీకముకంటెఁగౌతుకభరాధిక్యంబు దీపింప, గౌ
త్సవసిష్టాత్రిపరాశరాసురి భరద్వాజర్ష్యశృంగర్క్ష గా
లవకాత్యాయనయాస్కముద్గల ముఖుల్ మౌనీంద్రులున్, దద్వివా
హవిధిప్రాభవ వైభవేక్షణ శుభవ్యాపార పారీణులై. 21

మ॥ తమకేపాటియుఁ దీసిపోవని మహత్త్వంబున్, దపోనిష్ఠ, స్వా
త్మమహిమప్రథగల్గు శిష్యజనమున్, దచ్ఛిష్యబృందంబు స్వ
స్తిమహామంత్రతదర్థబోధకశుభాశీర్వాదముల్ బోరుకో
ల్పు, ముదంబొప్పఁగఁ, బెండ్లి వేడుకలలోఁ బాల్పంచుకోవచ్చినన్.

వ॥ అప్పుడు "ప్రభావతీ" నగరంబు సముచ్ఛలత్కేతనమాలికాఽభిరామంబును, ప్రస్ఫురత్సుగంధగంధిల ధూపధూమ సంతతసంతర్పిత సమంతతో ఘ్రాతాఘ్రాత మహాజననాసికాపుట కుటీరకుటుంబకంబును, ముక్తాఽఽవళీమణిగణ తోరణనికాయవిరాజమానకాయమానమానితంబును, జతురంగచమూసమూహ కోలాహలహాళహాళికాఽధికతర బధిరిత భూనభోఽంతరాళంబును, రంభోర్వశ్యాదిస్వర్వేశ్యానైకత్రైవిష్టపరంభోరురునృత్యారంభమంగళ సంగీత భంగీ సంగాశసుభగం భావుకంబును, శృంగారపురుష సంచార సమధిష్ఠితంబునునై, యొప్పె - నప్పుడప్పరమశివుండు మొదలయిడిన క్షణంబుననే మౌక్తిక మౌనీంద్రుండు మంగళాచార సంపన్నుండై, యభ్యంగ స్నానమాచరించి, స్నాతోత్థితుండై, శుద్ధవస్త్రంబులుధరియించి, ఫాలభాగంబునన్ జందన రక్తాక్షతల్ దాల్చి, దివ్యాంగనాఽనల్ప కల్పితంబులును, గల్పవృక్ష సద్యస్సముత్పన్నంబులును, మణికనక ఖచితంబులునగు మకుటకటకకటి సూత్రకుండల కేయూరోర్మికాఽఽది బహువిధా

భరణంబుల నలంకరించుకొనియున్నంతఁ, గొందఱు ఖంజ లోచనా జనంబులు పంతంబులుమీఱ, సంతసంబులు రెట్టింప, సంతసనఁ, బెండ్లి కొడుకునకుఁ దికాలంజనాలక్త కాదికమ్ములైన మంగళాచారయుక్తా లంకరణంబులు గావించిరంత॥ 23

ఉ॥ శ్రీవర శంకరోక్తుఁ, వసిష్ఠునకున్ బ్రణమిల్లి, మౌక్తికుం
డావృజినాపహారి, హరి, నాహరుఁ బాదములంటి మ్రొక్కి, శో
భాఽఽవహవోఢృ వేషమున నందఱి చూడ్కుల కందమై, ముఖ
శ్రీవాలయన్, దరస్మిత మరీచుల హేచులు పర్వఁజేయుచున్॥ 24

వ॥ వరాసనాసీనుండై, తీవిమీఱి చెన్నొందుచుండ, శంభుండు వసిష్ఠున్ జూచి, విస్పష్టంబుగా నిట్లనియె- "మహర్షి వరిష్ఠా! వసిష్ఠా! మద్భుజోద్భవుండైన యీ ముక్తర్షి నీ శిష్యుండు. నీవును, నీ వంశీయులును - వీనికిని, వీని వంశీయులకును - వీనికిని, ఆధ్వర్యవంబు వహించుచు, వైదికక్రియా కలాపంబులు నిర్వర్తించుచుండవలయు. వీరలార్యతు త్రియుంనంబరంగుచు, నీశిష్యులై, ప్రసిద్ధిఁ గాంచుచుందురు. వీరు దీనికిన్ దప్పి రేనిఁ, గులచ్యుతులై, యుభయ భువనంబులకున్ దప్పిన వారలౌదురు. సరి; యదియటుండనిమ్ము. ప్రకృతమునవీవి మౌక్తికునకు ముక్తికాంతతోడి వైవాహిక మహా మహంబు సర్వంబును యథావిధి మంత్రపూర్వకంబుగా, సాంగోపాంగంబుగా, సకలభువన భవికావహంబుగా, సుసంపన్నంబుఁ గావింపవలయు"నని, యాదేశించెఁ; దదనంతరంబు॥ 25

చ॥ అదివిని యాక్షణంబున మహర్షి వసిష్ఠుఁడు "వల్లె" యంచు, స
మ్మదమున నాతిథేయుని సమక్షముఁ జేరి, "మహాత్మ! యిప్డె నీ
దు దుహిత, ముక్తికాంతనిటుతోడ్కొనిర"మ్మని, తొందఱింప, న
చ్చదురుఁడు నల్లెమైదువలఁజయ్యనఁ బంపెనుగన్నెఁ దేరఁగన్॥ 26

మ॥ జనకాదేశము, తాపసీతతి సహాసక్తిఁ బ్రకారిత్వ యయ
త్న నిరూఢాశయముల్ మదిం దెలిసి, కన్యారత్నమయ్యంగనా
జనముల్, ముక్తివధూటి, మంగళశిరస్స్నానోత్థితన్ జేయ, నూ
తన వస్త్రాభరణాంగరాగతిలకద్రాగ్భ్యావకాద్యాఢ్యయై॥ 27

ఉ॥ తొయ్యలి, రత్నశోభిత చతుష్కమునన్, మణిపీఠమందుఁ దా
నయ్యమరాంగనోపరచితానితరాప్యసపర్యలంది, య
క్షయ్యయశోఽభిశోభితుని, శాంతివిధాత, జగత్త్రయీపావనుం
డయ్యమినాంవరున్, వరు,మహామహు,ముక్తికమౌనిఁ గాంచుడున్॥

చం॥ కుతుక భరంబునన్ మదిని గోరికలీరికలెత్తి, హత్తఁ, గాం
త, తతశుభాకృతిన్, వరమనః ప్రియమౌనటులామరీగణం
బతిచతురత్వ మొప్పఁగ, దృఢాదృతిమైఁ గయిసేసిరుజ్జ్వలాం
చిత సమయోచితోత్తమ విచిత్రపరిష్కరణోత్కరంబులన్॥ 29

సీ॥ ఒక సురాంగన వధూటికి దుకూలముఁ గట్టె
నొక తెమణ్యుప్త కంచుకముఁ దొడిగె;
నొక తె కన్నులకుఁ గాటుకఁ దీర్చె; నుదుటిపైఁ
గళ్యాణతిలక రేఖలను దిద్దె;
చెక్కుటఁ జుక్కవేఱొక్క తెసేర్చె; యా
వకముఁ బాదములనింకొక తె పూసె;
వాల్గంటి యొక్కర్తు కీల్గంటుఁ గీల్కొల్పె;
ముత్యాలజాలముల్ మొగిఁ దగిల్చెఁ;

గీ॥ గటకనూపుర కేయూర కర్ణికాఽఽంగు
ళీయకోడ్యాణకాదులు, లేపనాంగ
రాగముఖ్యోచితానేకరమ్యరచన
లెఱిఁగి, వోధవ్యఁగై సేసిరించువేడ్క॥ 30

చం॥ సురలలనాలలామలు, విశుద్ధచరిత్ర, నవోఢఁ, గల్పభూ
మిరుహాసముద్భవంబుల, నమేయ మహత్త్వమహత్త్వభాస్వరి
ష్కరణములన్, ముహుర్ముహుఁరఖండవిలాస విశేషభాసుర
స్ఫురణముఁ గూర్చి రెంతయును, వోఢ్రమనోనయనాభి
రామగన్॥ 31

వ॥ మఱియును, మంగళాచారానూచాన సంప్రదాయానుసారంబుగా ముక్తికాంతకు శ్రవోఽలంకరణోత్పలదళ సహితంబుగా, దూర్వాఽంకూరసర్వ పాద్యుత్తమలాంఛనంబులు దీర్చిరంత, నొక యమరయువతిమణి ముకురంబుఁదెచ్చి, ముందఱనిల్పె, నోఢవ్యయు, నవ్యసౌందర్య సామ్రాజ్ఞివోలె నందుఁదోచిన, లజ్జాలాలసలప్పెల్లెండ్రై, యన్యోన్యంబు విజ్ఞేయంబులుగా, "దోబూచులాడుచుండ," నంతఁ, దాపసవర్షీయసీప్రయుక్తాశీర్వాదంబులు శ్రోత్రపర్వంబులుగాఁ, దదవకీర్ణశోభనాక్షతంబులక్షతామోదంబుఁ గూర్చె; నంతట, సుముహూర్తంబాసన్నంబై నట్లు మౌహూర్తికులైన కొందఱు మహర్షులు తొందఱింప, ముత్తైదువలుకొందఱు పెండ్లికూఁతున్ గౌతుకవేదికాఽఽసీనం గావించి రనంతరంబ, మౌక్తికుండును, దద్దత్యమౌనీంద్ర బృంద సమానీతుండై, సుఖోపవిష్టుండయ్యె-నయ్యెడ॥ 32

చ॥ శతధృతినందనుండు, సదసద్విదుఁడబ్జజతుల్యుఁడౌ పురో
హితుఁడు వసిష్ఠుఁడున్ శ్రుతి సమీరిత మార్గమునన్, గణేశున
ర్చితుని నొనర్చి, యారవిశశిప్రభృతిగ్రహావర్గమున్, శచీ
పతిముఖులౌ దిశావలయపాలకులన్ వరివస్యఁ జేసియున్॥ 33

కం॥ పుణ్యాహవాచనంబు, న
గణ్యామ్నాయోక్త పుణ్యకర్మలు పెక్కుల్
పుణ్యాత్ముఁడు, పరమబ్ర
హ్మణ్యుండు, వసిష్ఠమౌనియన్నియుఁ దీర్చెన్॥ 34

వ॥ పిమ్మట, వైవాహికాగ్నిని సంస్థాపించి, యందు మాంగళి
కాహుతులు వ్రేల్చిన యనంతరంబ॥ 35

కం॥ శ్రీమత్కౌతుక వేదిక
పై, మహిత వివాహావేష వైభవశోభో
ద్దాముని, మౌక్తికు, దుర్వా
సోముని యిట్లనియె స్వస్తిసూక్తము మునుగాన్॥ 36

చం॥ "నుతగుణ! మంగళాస్పద! మనోభవ, నాసుత, ముక్తికాంత, సం
తతమును, నీకనువ్రత, హిత ప్రవణైకమతిన్ జరించు; మౌ
నితిలక! పాణిఁ గైకొనుము నీకరమున్ గదియించి; స్వస్తిగా
వృత! సతిఁ గూడి, వైభవసమున్నతిఁగాంచుము సర్వకాలమున్॥"

మ॥ అని, వాగ్దాన పురస్సరంబుగను, గన్యాదానమున్ జేసె స
మ్ముని దుర్వాసుఁడు మౌక్తికర్షికిని సమ్మోదంబు మీఱన్, వసి
ష్ఠుని యామోదముతోడఁ; ఘోషయు, మహర్షుల్, నిర్జరుల్ మెచ్చ, వా
ద్యనినాదంబులు, స్వస్తి వాచనములొయ్యన్ మించ,
నామెన్ గొనెన్॥ 38

వ॥ అప్పుడు ముక్తికాంతా మౌక్తిక మౌనీంద్రుల కళ్యాణమండపంబు చతుర్దశభువన కళ్యాణ తాండవమండపాయమానంబై, స్వస్తివాచనిక మౌనీంద్ర వేదనాద మేదురంబై, మాంగళ్యనినాద మోదమానర్షియోషిత్పరిషత్పరివేష్టితంబై, దివ్యదుందుభినిర్ఘోషముహుర్ముహుర్ఘూర్ణితంబై, తపోధనద్విజన్మవృద్ధాచరిత సాధువాదైధితంబై, సకలజన మనోనయనశ్రవణ సంతర్పకంబై, భువనవలయమనోరథ పరిపూరకంబయ్యె-
నయ్యెడ॥ 39

సీ॥ శ్రీ మహాలక్ష్మి ముక్తామణి మంగళా
క్షతపాత్రమంచిత కనకమయము;
రత్నదీపాంకురారాత్రికంబూని, ని
ల్చిన, నానువెంట నిలింపకన్య,
లద్రిపుత్రీశచీహవ్యవాహాంగనాఽఽ
దులు నంతనంత, నుత్సుకితముగ
మంగళగీతికాఽ భంగశృంగారనై
పథ్యముల్ శ్రోతృసంపశ్యదక్షి

గీ॥ తర్పకమ్ములుగా, మణిస్థగిత కనక
నిర్మితాకృత్రిమాకార నర్మమర్మ
లీలలొప్పారఁ, దారునిల్చిరి పరస్ప
రాంతరపరీప్సతోడియొయ్యారమొప్ప॥ 40

మ॥ తొలుతన్ మౌక్తికుఁడానవోఢ శిరమందున్ ముత్తెపుందోయిలిన్
దలఁబ్రాలోసెను; ముక్తికాంతయును,విన్నాణంబుగా,వోఢృనొఁ
దల; మైత్రావరుణ ప్రదిష్టవిధినూత్న ద్వంద్వమున్ వ్రేల్చె వే
ల్పులఁదన్పంగఁ బ్రధానహోమమును, నాలోలాజహోమంబొగిన్॥

ఉ॥ సప్తపదిన్ వధూవరులు సంతన, దీర్చిరనంతరంబ, మ
ణ్యుప్త వివాహవేదిక, మహోత్సవమొప్పఁ బ్రవేశహోమమున్;
నప్తరదాగమాన్వయ ఘనప్రతిభుండు, సతీసుతాఖ్యులై,
యూప్పులునైన మౌనివరులాదృతి, దివనలిచ్చి మెచ్చఁగన్॥ 42

ఉ॥ నాలవనాఁట, నెన్మిదియనంజను జామున శేష హోమమున్,
మూలజయాదిహోమ విధిపూర్వకమున్, మరునాఁటి సాయపున్
వేళ, శుభావహంబగుచు, వేల్పులు మెచ్చనథర్వవేత్త, దా
నైళమతీర్చెఁసాకగాలి బ్రహ్మసుతుండు ప్రదీపదీప్తమున్॥ 43

మ॥ ఇటులావాసరపంచకంబు బహు సంతృప్తిన్ మునుల్ ముక్తికా
చటులాక్షీజటిలేశ మూర్తికులు స్వచ్ఛస్వాంతులై, దీక్షనొం
దుట శ్లాఘించిరి వేదవేత్త లితరుల్ నోరూరు మృష్టాన్న మ
బ్బుట,వస్త్రాభరణాదులందుటఁగడున్ మోదాత్ములై రందఱున్॥44

మాలిని॥ ఇది సకల శుభాఢ్యంబిద్ధకళ్యాణ పూర్ణా
భ్యుదయ కరమునౌ శంభుస్ఫురద్బాహుదండో
ద్యదృషిమునిసుతా కళ్యాణ వృత్తాంతమిద్ధా
ని, దృఢమతిఁ బఠింపన్, నిండుసంపత్సమృద్ధుల్॥ 45

వ॥ అనిన, విని, యవ్వలి వృత్తాంతంబెట్టిదని, వీణాపాణి వాణీ
జాని నడుగుటయును॥ 46

ఆ॥ సిరులకిరవుధరణి నరసాపురంబు సు
స్థిర నివాసమని, మదిందలంచి,
యున్న సుజన కోటికెన్న, ముంగొంగుబం
గరువుగాదె, నీవు కపిలమల్ల!॥ 47

ఇది, ఆంధ్రీకృత ముక్తీశ్వరోపాఖ్యానంబునందు ముక్తీశ్వర
కళ్యాణంబను పంచదశాధ్యాయము.

—(*)—

# షోడశాధ్యాయము

ఆ॥ సిరియు నీకుఁ జెల్లి; సిరిగలాఁడవు బావ;
సిరిగలాని చెల్లి చెలువ నీకు;
సిరులు నీకఁ జూడఁగొఱయైన, సిరులేఁగ
లాఁడ వాడువార! ప్రోడవాడు॥ 1

ఆ॥ అవధరింపుమవలిదగుకథ; సురముని
నలువకనియె—"వినఁగవలతువిస్త
రంబుగాఁగ, దీనినంబురుహాసనా
సీన! ముక్తమునివిశేషగాథ. 2

కం॥ జటివరుఁడమ్మౌక్తికముని
యటుపిమ్మట నేమిసేసె? నతఁడుమదాను
త్కట ధర్మవిషయ కానఘ
కుటిలాన్యపథప్రచారకుండెట్లయ్యెన్?" 3

కం॥ అని, యడిగిన, విని, కమలా
సనుఁడు దనతనయునకును విశాలకరుణామై(హృదయుఁడై),
విని చెమటియు, ముక్తమునీం
ద్రునివృత్తాంతంబుఁబు. కితుండయి, యిట్లాల్. 4

ఉ॥ అంతట, మౌక్తికుండును, మహామతిమద్వరుఁడాత్మమందిరా
భ్యంతరశోభితున్, శివు, హిమాద్రిసుతాధవు, మాధవున్, సచే
తోఽంతరుఁడై, యభేదభజనాదరుఁడున్, గురుభక్తియుక్తుఁడున్,
సంతన దేవమానియజన ప్రవణుండునునై, విరాజిలెన్. 5

ఉ॥ ఆ విధిఁ గొన్నినాళ్లరుగ, నమ్మునిముఖ్యుఁడు సన్ముహూర్తమం
దావరదాత్రియైననిమిషాంబ యథావిధిఁ బూజసేసెఁ; దా
నావిధిముఖ్యులాత్రిదశులర్హ్యాతముల్, గురుతైన యట్టిమై
త్రావరుణిప్రభృత్యృషివర ప్రముఖుల్ సుముఖత్వమొందఁగన్.

మ॥ నిమిషాంబార్చన పుణ్యకాలమున మౌనిశ్రేష్ఠుఁడా మౌక్తికుం
డమితామోదమునన్ వధూసహితుఁడై, యామ్నాయమర్మార్థవి
త్తములన్, విత్తములన్, గవాంబర సమృద్ధంబుల్ యథా వైభవం
బమలాత్ముండయి, యిచ్చి, మెచ్చఁగొలిపెన్ హాళిన్
శుభాకాంక్షియై. 7

చం॥ పరమమహర్షులున్, సురలు, బంధులు, బంధుజనాధికబంధురుల్ మునీ
శ్వరుఁడల మౌక్తికుండు నిలుపన్ బదునాఱు దినంబులుండి, ని
ర్భరతరమోదమానులయి, వారలు స్వాలయముల్ గనంగనేఁ
గిరి, మునిమౌక్తికుండు నిజకృత్యములన్ గిరిజేశు వేడినన్. 8

వ॥ విని, పరమశివుండు మౌక్తిక మౌనీంద్రునితో నిట్లనియె- "వత్సా! సనాతనంబులైన కులధర్మంబులన్ జెప్పెద; నాకర్ణింపుము. మానవుల కెల్లరకును సత్యంబు సనాతనధర్మంబు. దానికంటె నహింస పరమధర్మంబు. దానికంటె నస్తేయంబును, దానికంటె శమదమంబులును, దానికంటె శ్రుతంబును, దానికంటె యజ్ఞంబులును, దానికంటెఁ దపంబును, దానికంటె నిజాధ్యయనాధ్యాపనంబులును ప్రధానంబులుగా ద్విజధర్మంబులు. సర్వవర్ణంబుల వారికిని సత్యాహింసాస్తేయశాంతి దాంతులు సద్గతి కారణంబులు. సర్వధర్మంబులును వేదమూలకంబులు. బ్రాహ్మణుండు వేదార్థప్రవచనయాజనప్రతిగ్రహంబులకు దక్షుండు, నధికారియునౌను. అన్యవర్ణంబులవారు బ్రాహ్మణులకుం బ్రణామంబాచరించియుఁ, బరిప్రశ్నంబు సేసియు,

శుశ్రూషఁగావించియు, విశేషించి- ధర్మార్థంబు గ్రహింపందగు; నేల యన, జపతపోయజ్ఞచ్ఛిద్రంబు న్నియును బ్రాహ్మణ ప్రతిపాదితంబులైన వాననిశ్ఛిద్రంబులై, సంభద్రంబుఁగూర్చు- నిందుసందియంబా వంతయులేదు. మఱియును. 9

ఉ॥ సత్త్వరజస్తమోగుణవశంబునఁ గర్మవిభాగమొప్ప:సం
విత్త్వవిశిష్టుఁడై, విధిభువిన్ సృజియలంచెను జాతున్నియున్
సాత్త్వికులైరి విప్రులు; రజఃప్రథితుల్ నృపతుల్; మఱిన్దమో
వత్త్వవిరాజమానులలవైశ్యులు, శూద్రులు, స్త్రీలు పుత్త్రికా!

ఉ॥ క్షత్త్రియవైశ్య శూద్రులును, సారసలోచన లెల్లవేళలన్
బుత్త్రిక! విప్రకోటి తనివుంగొనునట్లు మెలంగుటొప్పుఁ; ద
న్మైత్రి భవత్కులోద్భవులనారతమున్ విడనాడకుండ, స
ర్వత్ర, క్రియాకలాపములు బ్రాహ్మణ సమ్మతిఁజేయఁగావలెన్.

ఉ॥ శక్తి నతిక్రమింపక, ద్విజాతికి దానము, దేవపూజ, స
మ్యక్తృప, సన్మతీప, నిగమాధ్యయునంబను వీనినెప్పుడ
త్యక్తములౌనటుల్ సలుపనౌను; బ్రజాపరిపాలనంబు వి
ధ్యుక్తము; నిత్యమాయుధము లొప్పుగఁ దాల్చుట క్షత్త్రి
ధర్మమహా॥ 12

వ॥ మానవులకు దండధారణంబనా పత్కాలికంబైన ధర్మంబు. వైదికంబైన కర్మజాతంబాపత్కాలంబునందైనను త్యాజ్యంబుగారాదు. ఆపత్కాలంబు ప్రాప్తించినను, నాయుధపరిగ్రహంబావశ్యకంబు గాన ప్పుడును భవద్వంశోద్భవులు చిత్రకర్మ కర్మఠులై, రాజచిత్రంబులు రచియించి, రాజాశ్రయంబుఁబొంది, వర్తిల్లుటయొప్పు. వారు నిర్మించిన విష్ణ్వాదివిగ్రహంబులు దేవాలయాదులందు విశేషంబుగఁ బూజింపంబడుచుండు. మఱియు, వారు సర్వశిల్పకర్మంబులు నిర్మించి,

భూపాలురకుఁ జేతోమోదంబుఁ గూర్చుచుఁ, దదాశ్రయంబున మహత్త్వంబుఁ గాంచుచుందురు. వారుదక్క, తక్కినవారెవ్వరును జిత్రకర్మంబున కర్హులుగారు. భవదీయులును, దదన్యంబైనవృత్తిని స్వీకరింపఁగోరకుందురుగాక! శిల్పశాస్త్రానుసారంబుగా, దేవాగారరాజమందిరనిర్మాణంబులును, యంత్రాదిసంప్రతిష్ఠాపనంబును, సర్వతోభద్రాది నానావిమానవిర్మాణంబును, భవద్వంశోద్భవులత్యంత నైపుణ్యంబగణ్యంబుగా, సంతతనఁ దీర్పగల్గియుందురు. చిత్రవిద్యమీ వంశీయులకు సర్వసాధారణంబై, ధారణాధీనంబౌను. అట్టి దీని వైభవం బెట్టిదనిన.

ఉ॥ విశ్వము చిత్రమందె ప్రభవించును; దానసలీనమౌచుఁ, దా
శాశ్వతమౌను; విద్యయును, శాస్త్రము, శస్త్రకళాకలాపముల్
నశ్వరమున్ సుమీ! యదివినా, యఱలేకయ, భావమెన్న, మౌ
నీశ్వర! త్వత్కులీనులకదే, కులవిద్యయు, జీవవృత్తియున్॥ 14

వ॥ ఇది నీవంశీయులకున్ గులవిద్యగావున; దీని నీవారలెల్లనాదరించునట్లుగాఁ జూచుకొమ్ము. నీకు మేలయ్యెడు—నెట్లన॥ 15

చం॥ కృతయుగమందుఁ బార్థివవరేణ్యులెయౌదురునీదువంశజుల్;
కతిపయదేశనాయకతఁ గాంతురు త్రేతను; ద్వాపరంబునన్,
బ్రతను ధనుల్; కలిన్ శుభకరస్వచరిత్రులునై, ద్విజార్చనా
రతులును, చిత్రకర్మఁగరంబు సమర్థులు, భూపతిప్రియుల్॥ 16

ఉ॥ మద్వచనంబుదప్పదిది; మౌక్తికమాని! కలిప్రభావమీ
షద్వికచంబుగాఁగ, సహసా బహుజృంభితులౌచు, మ్లేచ్ఛులా
పద్వశఁజేసి మేదిని, శుభంబులమాపి, యణంచుచుండ, శుం
భద్విధిఁ జిత్రశిల్పములఁ ద్వత్కులజుల్ చరియింత్రువృత్తిగాన్॥ 17

వ॥ చిత్రశిల్పనిర్మాణంబు నీవారలకున్ గులవృత్తియైనట్లన్యులకున్ గానేరదు; వీరికియ్యది దోషంబుగా నట్లన్యులకున్ గాఁ జాలదుసుమ్మద్దియట్లంటేని. 18

శా॥ స్వర్ణస్తేయము స్వర్ణకారులకు దోషంబౌనె? వాణిజ్యమం
దర్ణోరాశిగభీర! యున్నవియె సత్యాసత్యముల్? హాలికా
భ్యర్ణస్థమ్ము గుఁ గాదె, హింస! యిటులే, యన్నింట దోసంబులే;
స్వర్ణాధాన్యమర ప్రవృత్తులును హింసాశంసితంబుల్ సుమీ!॥19

మ॥ అవియయ్యెజనులాచరించినను, దోషాభాసముల్; కాని, య
య్యవి యన్యాచరితంబులైన యపుడయ్యాయత్త దోషంబులే
యవుఁ; జిత్రంబును, శిల్పమున్, గళలు పుణ్యప్రాపకంబుల్ గదున్;
భువనానంద విధాయకంబులునునౌ; ముక్తేశ! ధర్మ్యంబులౌ॥ 20

వ॥ విధివిహితంబులైన చిత్రశిల్పంబులు స్వీకరించుట త్వద్వంశ్యులాచార పూతంబైన సనాతన ధర్మంబుగా భావింపవలయు; నీవారలకెన్నండునధోగతియన్నమాటయే లేదు. క్షత్రియకల్పానుసారమ్ముగా సర్వకర్మ సమాచరణంబు వారికావశ్యకంబు. వారు - "మౌక్తికులు", "నార్యక్షత్రియులు" నాఁబరంగుచు, "వర్మ" - "రాజ" శబ్దంబులు దాల్పనర్హులౌదు" రనిన, విని, మౌక్తిక మౌనీంద్రుఁడు పరమశివునకు సవినయంబుగా నిట్లనియె॥ 21

ఉ॥ "దేవ! మహానుభావ! విశదీకృతముల్ వొనరించి, తెల్పవే!
శైవములేవొ, వైష్ణవల సన్మతధర్మములేవొ" యంచు, నెం
తేవి చికిత్స దోఁపఁగ, ముని ప్రవరుండడుగన్, మహేశ్వరుం
డీవిధిఁ జెప్పఁగాఁ దొడఁగె నించినవేడ్క, సుధామయోక్తులన్॥ 22

కం॥ శివపాదార్చన రతుఁడును
భవభక్తిపరాయణుండు, పంచాక్షరమం
త్రవర జపపరుఁడు, రుద్రా
క్ష విభూతిధరుండు శుద్ధశైవుఁడనఁబడున్॥ 23

కం|| పాశుపతదీక్షఁ గొంచుట
యే, శైవులు సార్వకాలికేష్ట పథంబౌ;
ధీశాలీ! ముద్రాష
ట్కాశంసితమౌచు, శైవములారాఱుభువిన్|| 24

వ|| కంఠికయు, రుచి(చ)కంబును, కుండలంబును, శిఖామణియు, భస్మంబును, రుద్రాక్షమాలయునను నీయాఱును ముద్రాషట్కంబనం బరంగు; నీయాఱింటెని ధారణంబుఁ జేయు శైవునకున్ బునర్జన్మ యుండదు. మఱియు, బ్రహ్మహత్యాద్యుగ్రమైన పంచమహాపాతకంబులు భస్మధారణంబున భస్మీభూతంబులౌను. రుద్రాక్షస్పృష్టంబైన తోయంబెవ్వాని కాయంబునన్ జిందు నవ్వానికి శివసాయుజ్యంబు ప్రాప్తంబగు. లింగధారణంబునన్ జేసి శ్వపచుఁడయినను, జతుర్వేదవేత్తకంటెన్ గోటిరెట్లు పుణ్యాధికుండౌట నిక్కంబు. మఱియును. 25

కం|| శివలింగ ధరుల, నరులను,
శివవ్రత పరాయణులనుజేరి, యెవరు దు
ర్శ్రవవచనమ్ములు వల్కుదు
రవశ్యమున్ నిరయగాములౌదురు వారల్|| 26

కం|| శివలింగధారణంబును
శివలింగార్చనము సేఁత, శివసంస్మృతియున్
శివసాయుజ్యముఁ గూర్చును;
శివకరపథమిదియ వింటె? శ్రీముక్తేశా!|| 27

కం|| శివలింగధారి శివుఁడే
యవు; జంగమ లింగమతఁడు సాక్షాల్లింగై
క్యవిభవమంది, యతండున్
శివసన్నిధిఁ బాయకెపుడుఁ జేరి, వసించున్|| 28

కం॥ శివమహిమ ప్రతిపాదక
మవు శైవపురాణచయమునాదృతిరోమాం
చ విరాజితుండునై, తా
నవశ్యమున్ జదువవలయు ననవరతంబున్॥ 29

వ॥ సార్వకాలిక పాశుపత దీక్షాదక్షుండైన శైవునకు భూతజాతం బంతయున్ బ్రణామంబు లాచరించు; నాతోనాతం డెంతయుం బ్రమోదించుచు, వినోదించుచుండు. వ్రతతిలకంబైనపాశుపతంబుతో సమానమైన దేదియు లేదు. లోహంబుల యందు సువర్ణంబును, శిలలయందు వజ్రంబును, రసవిసరంబునన్ బీయూషంబును, బక్షులయందు హంసంబును, వృక్షంబులయందశ్వత్థంబును, వర్ణంబులయందు బ్రాహ్మణవర్ణంబును, గోవులయందు సురసురభియు, రత్నంబుల యందుఁ గౌస్తుభంబును, ద్విరదంబులందైరావతంబును, హయంబులందు నుచ్చైశ్శ్రవంబును, సద్గుణంబులందౌదార్యంబును, వాగ్వ్యాపారంబులందు సత్యం బెట్లట్లు సర్వతంత్రంబులయందును బాశుపతంబుత్తమోత్తమంబు. వత్సా! భవత్సాహాయ్యార్థంబై, జానుమండలదండనంబుననీకియ్యదివేగదా, పరమసాధనంబై, రిపుని ధనంబును, నీకువిజయధనంబును సంపాదించి యిచ్చినది! నీ వంశీయులు నిక్లై రుద్రగాయత్రీ పరాయణులై, నాకత్యంతాప్తులై, ప్రవర్తించుచుందురుగాక! ఇంక, వైష్ణవ ధర్మంబులు వక్కాణించెద; నాకర్ణింపుము. 30

సీ॥ పంచ సంస్కార సంపన్నుండు, పురుషోత్త
మ ప్రపన్నుండు, సత్త్వ ప్రధానుఁ
డాచార్య భక్తియుక్తాత్ముండు, విష్ణుభ
క్తులకు భక్తుండు, శాంతుండు శ్రోత్రి

యాఁడుఁ, బ్రదిశుక్లుఁడును, దక్షుఁడు ధర్మనిష్ఠుఁడా
స్తికుఁడును, బహుపుణ్యశీలుఁడు త్త
మజ్ఞాన వైరాగ్యమహిత ధీయుతుఁడు, స
మ్యగ్వివేకస్ఫురద్ద్రాగ్విలాస

గీ॥ శాలి, యష్టాక్షరీ మంత్ర జపపరాయ
ణుండు, సౌమ్యుండు, నిత్యతృప్తుండు, మృదుల
శీలుఁడాతిథేయుండును, శేషశేషి
భావవేత్తయునగును శ్రీవైష్ణవుండు॥ 31

వ॥ ఆచార్యానుగ్రహంబునన్ దాపపుంద్ర నామమంత్రయోగ(యా)గంబులను పంచ సంస్కారంబులను బొందుట పరమ వైష్ణవధర్మంబు. సంస్కారంబులియ్యవియైదును వైష్ణవత్వసిద్ధి హేతువులు. మఱియును, ఆకారత్రయ సంపన్నత్వంబును, బూర్వోక్తపంచ సంస్కారతత్పరత్వంబును, అర్థపంచకతత్త్వజ్ఞత్వంబును వైష్ణవత్వ ప్రతిపాదకంబులనుచు, వీనియన్నింటి వైశిష్ట్యంబు విస్తృతంబుగా నారదశాండిల్యాది మహర్షులచేఁ బాంచరాత్రిక సిద్ధాంతంబు నుపేర వర్ణింపబడియె; నందలి విశేషంబులు కొన్ని వాక్రుచ్చెద; నాకర్ణింపుము. 32

గీ॥ తప్త చక్రాంకనంబునఁ, దనరువహ్ని
తప్తముల్ శంఖచక్రముద్రల భుజములఁ
దాల్చుటద్దానఁదద్విష్ణుధామమందు
శాశ్వతస్థానమొందు వైష్ణవుఁడు పుత్రి!॥ 33

చం॥ నుదుట శుభోర్ధ్వపుండ్రము జనుండు ధరించినమాత్ర, శ్రీరమా
హృదయధనాపహారి వసియించును; వాని మనోగుహాన్ సదాఽ
భ్యుదయముఁగూర్చుచున్; దులసిపూసలుఁ, దామరపూసలొప్పుచే
ర్లఁడగ ధరించువారలఁ జరతృనకృతంబునుగాంతు రెప్పుడున్॥ 34

ఉ॥ వైష్ణవలాంఛనంబుల నెవండను ధరించునో, వానిఁ జూచి, యా
జిష్ణువిరించి ముఖ్యులు శుచిస్మితులై, యభినందనోక్తిరో
చిష్ణుత గారవింతురు; భుజిక్రియ నెవ్వఁడు వారిఁ దన్పునో,
విష్ణుసమర్పితంబది యువేయి మడుంగుల పుణ్యదంబగున్. ౨౫

ఉ॥ అంకిలిలేక యెవ్వఁడు శిరోఽవనతిన్ బ్రణమిల్లు, శంఖచ
క్రాంకితు, నూర్ధ్వపుండ్రకలితాననుఁ, వాఁడు శతాధికాశ్వమే
ధాంకురితోరుపుణ్యనిచయాగ్నిఁ దుఁడౌను; దరింత్రు పెద్దలే
యుంకువనైన, నిట్టి సుకృతోదయ మాట జగంబెఱుంగునే? ౨౬

వ॥ భవద్వంశోద్భవులు కొందఱు విష్ణుభక్తిపరాయణులై, లోకపావనులై, యుభయవంశతారకులై, విశద విశాల యశోఽభిశోభితులౌట తథ్యంబు. వత్సా! నీకిట్లు శైవవైష్ణవధర్మంబులన్నియు విస్తరించి దెల్పితి. ధర్మంబులీ యుభయ విధంబులును బరమపద ప్రాప్తికి సాధనంబులే సుమా! ముక్తికాంతాసంయుక్తుండవై, నిత్యసంతోషివై ధర్మ్యంబగు మార్గంబున భూమిని బాలించుచు, జనులను న్యాయ్యప్రవర్తనంబున శిక్షింపుచు, బ్రాహ్మణపోషణంబు మానక, బహువిభవశుభపరంపరల ననుభవించుచు, వర్ధిల్లు''మని, యభినందించి, తదభివందనంబులందుకొని, పరమశివుండు ప్రమథగణ పరివృతుండై, మహోక్షవాహన సమారోహణంబుఁ జేసి, కైలాసాచలంబునకు వేంచేసె-నంత.

సీ॥ ముక్తేశ్వరుండు సత్యవ్రతాత్మ ధర్ముఁడై,
ముక్తికాంతాసమాయుక్తుఁడౌచు,
సర్వసౌఖ్యములు నిచ్చలు నిచ్చఁబొంది, ''బ్ర
హ్మప్రీత''మని, తత్తమఖిలహుతము,
నిష్టముల్ జేయుచుఁ, దుష్టిమైఁ బూర్తముల్
పెక్కు-నిల్పుచు, విశ్వవిశ్వమాత్మ
సద్గుణసచ్చేష్టితోద్గారి హార్దిని
త్యాయతాయతి యొప్పఁ జేయుచాప్త

గీ॥ శత్రువర్గంబు భేదమెంచకయ, తుల్య
దృష్టినీక్షించి, తీర్థయాత్రికులకన్న
సత్రములునిల్పి, యజ్వలుసంతసింప
యజ్ఞములుసాఁగఁ జాలసహాయుఁడయ్యె. 38

వ॥ ఇట్లు పెక్కుమాసంబులేఁగ, సుమసమయమ్మేతేర, ముక్తీశ్వరుండు ముక్తికాంతా సంయుక్తుండై, యుద్యానవిహారసముద్యుక్తుండయ్యె; నయ్యెడ. 39

శా॥ సంధ్యారాగ సముజ్జ్వలత్సుమపరాశ వ్రాతసంక్షోభితా
వంధ్యారుణ్యము, మల్లికాది సుమనోవ్యాప్తి స్ఫురన్నిత్యసౌ
గంధ్యమ్మాత్తరజోవ్రజోద్యదిభమార్గప్రేక్ష్య వృక్షోత్కర
ర్వాంధ్యాన్యణ్యవిదూరగమై, యలరునుద్యానంబునందాస్థమై. 40

వ॥ అయ్యుద్యానంబును, జూతనారంగ పనసానసకపిత్థాశ్వత్థాదిపాదప బాసురంబును, నానావీరుత్సంకీర్ణంబును, మంజుకుంజగుంజన్మంజీర శింజితవీణాదినాదానుకారి రాజహంసకలకంఠ నీలకంఠ కీరశారికా పారావతచక్రవాకాది నీడోద్భవలోకకోలాహల హాళహాళికా బహుళంబును, యక్షకిన్నర సిద్ధగంధర్వచారణ సంచార సంక్షోభితంబును, మకరందప్రవాహ మజ్జన్మధుకరకులకలకల సంకులంబును, శిరీషకుసుమ విసరవిసృమర పరాగభరశుభాంగ రాగశుంభద్భూతకృత్యకృన్మరు దర్భకాదభ్రవిభ్రమ భ్రమణరమణీయంబును, బుష్కల పుష్ప వినిష్పతదభ్రజోవ్రజోన్మగ్నచ్ఛన్న విచిత్రకృతమహీతలపరిచ్ఛన్నంబును, ఘనాంబుమయ్యపరీవాహపానఃపున్యసంతర్పిత బహుజన సముదయంబును, నందనచైత్రరథసన్నిభంబునునై, సర్వేంద్రియ సంతర్పకంబై, సందర్శనయోగ్యంబైనంజూచి, ముక్తీశ్వరుండును, ముక్తికాంతాముత్తల్లియునందు మల్లీప్రభృతి వల్లీమతల్లీమతల్లికాదిక స్ఫూర్త్యుద్వల్లీలాలోకన సలాలసవిలాసలాలితమానస భాసురులై, విహరింపందొడంగిరెట్లన. 41

సీ॥ ఏలాలతాజాలడోలా విహృతిలీల
హేలావతినిగూడి, యెన్ని యేని
కేళీవినోదముల్ హాళిఁ జెల్పె వార, మో
దాన్వితుండగుఁబతి; యాసతియును
వేలాఁతిగవిలాససాలాపమృదుహాస
భాసురాబ్జాస్యయై, వానిఁ గాంచు;
సాలోకములనుదా మేలోకమునుగాన
కేలాకో! వింతయింపులుమగఁల

గీ॥ వగలు, వలపులు, సొలపులు, సొగసులహహా!
మగఁడు, మగువయు విడువరుబిగికవుఁగిలి;
నవిరళకపోలజల్పనంబ్రర, వారు
వ్యాపృతైకైకదోర్లతా బద్ధులౌచు. 42

వ॥ అయ్యార్యక్షత్రియ మునీంద్రుండుచంద్రాస్యన్ గూడి, కుసుమశయనమున్ గూర్చుకొని, యమందానంద సందోహదోహలంబైన కౌతూహలంబు మదనకదనహేళ హాళికకుదోసాదమోదమోహదంబు గాఁగఁ, దన్మహామహంబు బహుతిథంబుగణరాత్రంబుగా, నవ్యాహతవిహారహారియైయుండెఁ; నమ్మహామహులరహోవిహారంబయ్యది, సహర్షవిత్రుటిత రత్నకంచుళికంబును, ముహుర్ముహు రంగుళీవిహితరదచ్ఛదంబును, సలాలసవిలాసమృదుహాస భాసురముఖోన్ముఖీకరణసముల్లసిత రత్నకుండలధాళధళ్యమండితగండమండలదర్పణప్రతిబింబితశశిసఖనిజ ముఖదర్శన స్పర్శన భ్రమనివారణయత్నితాభిమర్శనలంపట కరతల విలసనలలిత లలితంబును, సాకూతదృక్ప్రాత్తకైతవయాతాయాతవ్యాపారపారీణేందిందిర పాటచ్చరబందీమందిరాయమాణమానినీవదనారవిందస్యందద మందానంద సందోహ మరందబిందుబృందతుందిలిత నిజమనశ్చంచల చంచరీకంబులై, పరస్పరవిమర్ద

జన్మంబును, విగళిత వేద్యాంతరంబును, స్మర్యమాణ స్మరమాధుర్య రమాధుర్యంబును, ఉదిరితావితథమిథో౽భిమానంబును, స్వస్వ సంవేద్యంబులై, ప్రవర్తిల్లె; నందువారలిర్వురును బ్రకటితసాత్త్వికోదయులై, కామకేళీసౌఖ్యమగ్నచేతస్కులై, యామద్వయకాలంబు నొక్కక్షణంబుగాఁగడపిరంత. 43

చం॥ రతిసుఖపారవశ్యము మరల్చి, జితేంద్రియుఁడై నమౌని, సం
తతభువనోపకారిలనాకలనా చలనాత్మకుండుగా
క, తృషనణంచి, భోగవిముఖత్వము నిట్టెగడించి, మించి, ''య
ద్యతనమవశ్యకృత్యమిదియా; నదియా''నని, యూహసేయుచున్.

మ॥ పతియున్, బత్నియుఁ బాలుపాన్పుడిగి, విస్ఫారాంచితారక్తదృ
క్ప్రతతుల్ వ్యాపృతిఁజేసి, కాంచిరెదుటన్, గాసారమొక్కండు; ఝం
కృతివిస్తృత్యతివేలకౌతుకితభృంగీభృంగ సంగీతసం
గతకంజాతసుఖ స్వపజ్జల విహంగ స్ఫార సంచారమున్॥ 45

వ॥ అదియును, వనరమా శృంగార మాణిక్య దర్పణాకారంబై కన్పట్టినంత, ముక్తీశ్వరుం డొక్కచోటఁ, గవనిడువక, కువ కువ యఱచుచు, గనుఁగవకు ముదమును బచరించుచుండు నొక్క జక్కవకవంగనుంగొని, ముక్తికాంత కవ్వాని సోయగంబుఁ జూపుచు "కాంతీ, యీవింతంజూచితే? యీకోకద్వంద్వంబు క్రీడాసక్తంబై, యొండొంటిం దాఁకి, మృణాళనాళాంతరాళ దంతురతనుతరతంతు ప్రవేశంబునకు లేశంబైననంతరంబీయక, క్రిక్కిరిసియున్న నీచన్నుల జంటను బోలి యుండె'' ననుచు, ననుచుముదమునణఁచుకొనవలఁతిగాక, యతఁడు నిజ వనితనొకపరిబిగికవుఁగిటఁగిటకిటనఁ గీలించుచు, నించినవేడ్కనై "లికుచకుచా! దాంపత్యంబన్న నిట్లుండవలెఁగా! ఇట్టి భాగ్యంబు పుణ్యభాగ్యశ్రీప్రకాశులైన మహామహులకు మాత్రంబె లభ్యంబగునని, పల్కి, యానందవారాశినోలలాడుచుండె-నప్పుడు. 46

శా॥ ఆ పుణ్యాత్ముల దర్శనంబునను, గోకాకారముల్ వీడి, ర
మ్యాపాతంబున, దివ్యరూపమున దూరాపాస్త శాపుల్, మహా
పాపుల్ గాక, కనంబడన్, మునియునవ్వారిన్ విచిత్రంబుగాఁ
జూపెన్ గాంతకుఁ; జూపి యిట్లు పలికెన్
శుంభద్వచోగుంభనన్ (వైఖరిన్) 47

ఉ॥ "సుందరి! సూచితే, మిపులఁ జోద్యము; జూడ సరోవరాంతికం
బందురమించు జక్కవలయందము, చందము మాఱి, దివ్య రూ
పేందిరఁబొందఁగల్గుట మహిన్ గనమున్ వినమున్; మనఃప్రియా!
యెందునుగాని;జంటయిదియెచ్చటిదో, యెదియో - యెఱుంగమున్॥"

చం॥ సతిపతిమాట కెంతయు ససాధ్వసయై, "యిదియే" మటంచు; దా
నతనిఁగవుంగిలించుకొన, నంతట దివ్యులలోననొక్కఁడా
యతమతికౌతుకంబున మహర్షిని మార్కకుసంస్తుతించుచున్,
జతురవచోవిలాసముల, శాపవిధంబునువిన్నవించెగతిన్॥ 49

మ॥ "అకళంకోదయ! మార్కకాహ్వయ !! విహారాయత్త చిత్తుండఁ; 'జి
త్రక' నామాన్వితుఁడన్;సతీయుతుఁడ;గంధర్వాన్వయుండన్;సరో
నికటాదోఽతివివిక్త దేశమున హృన్నీరజముప్పొంగ, నుం
డి,కనుంగోమిము, మాదుసైవతములన్,దీటెన్ గదా, శాపమున్!॥"

చం॥ అన, విని, మార్కకుండనియె నాతనితో-"భవదీయ పూర్వగా
థను వినఁ గోరెదన్; గఠినతా విపరీతపరీత కోపతన్
గని, మిముఁదిట్టె నెవ్వఁడు? కనన్ గనఁగాఁ, గనదేతదాకృతిన్
గనుట యిదెట్లు? చెప్పుమనఘా! వినఁగాఁ గడువింతయయ్యెడున్॥"

వ॥ అని, యడిగిన, మునివరునకు వియచ్చరప్రవరుండిట్లనియె॥ 52

మ॥ "చిరదృష్టాస్మదఖండపుణ్యము, పురాచీనంబు, వృత్తాంత; మ
బ్బుర పహానయ్యది; "చిత్రకా"హ్వయుఁడ; నేఁబోర్కాని
ప్రాయంబు, సుం
దరరూపంబుఁగలాఁడ; మేఁయిన "గంధర్వా"న్వయోద్భూతిఁజెం
ది, రుచిస్ఫీతను, నాతివీడక, మహర్ధిన్, మానసేత్సారతిన్॥ 53

చం॥ వెలలి, విహారహారినయి, విస్తృతగర్వము, శౌర్యమొప్ప, నం
గలినయి, కాపిశాయనసికామమదంబున విహ్వలుండనై;
లలనసెంగ వెంట సవిలాసముగా, వివశీకృతుండనై,
జలములఁ గ్రీడసల్పితి; విచారవిదూరతకేమి సెప్పుదున్?॥ 54

చం॥ శఫరగణంబులన్, నయనచారువిలాసనిరాసజేర్ష్యఁబు
చ్చు ఘుమఁగోరి, యట్టిటులఁ జోఁపుచుఁ, దన్వియురోజవర్తుల
త్వఘణితిఁగాంచు జక్కవకవన్ వడిఁబట్టుచు, దర్పణాత్క-పో
ల ఫలకశోభివారిజదళంబుల నొక్కులు సక్కఁజేయుచున్॥ 55

మ॥ మకరందౌఘములన్ బ్రియాఽధర సదృజ్మాధుర్యధుర్యంబులన్
ప్రకటప్రీతిని మెచ్చుచున్ రుచుల, జుబ్బన్ జూఱగాఁ గ్రోలుచున్,
సకియన్ గాఁగిటఁజేర్చి, తద్భయముఁ బెంచన్ బుచ్చువ్యాజంబునన్
సుకమున్ గోరి, సరోవిహారమున మెచ్చున్ గూర్చకోసాగితిన్॥ 56

ఉ॥ అంతటఁ, గశ్యపాహ్వయమహర్షి గిరీశునిభక్తిఁ గొల్చి, యా
పొంతకు వచ్చుటన్ గనుచు, మూఢుఁడనై, దృఢమౌక్తికంబులన్
శాంతుని, వాలుకా శిలలఁ జాలఁగఁజిమ్మి, బహుప్రకార దు
ర్ద్రాంతుఁడనై, మదోద్ధతి, నదాటున మేనికినొవ్వఁ గూర్చితిన్॥ 57

చం॥ మధుమదమత్తు, నన్నుఁగని, మాన్యుఁడు, కశ్యపమౌని, దుర్భర
క్రుధఁ గనులెఱ్ఱవాఱఁగ, నకుంఠవచఃకఠినత్వమొప్ప, ని
వ్విధమున బిట్టుదిట్టె—"నవివేకము, గర్వము, ప్రేయసీష్ట స
న్నిధి నధికాధికంబులయి, నీఱుగఁజేసెఁద్వదీయచేతనన్॥ 58

చం॥ సలిల విహారలోలుపతఁ జాననుగూడి, సరోఽవగాహనో
త్పులకితదేహవాటెఱుఁగుదున్; మరియాద, వినీతి, భక్తిఁ, బె
ద్దలయెడఁ జూపుసంస్కృతి, వృథాత్యజియించి, మహాఽపరాధమి
ట్టులుగ నొనర్చితేలర? కఠోరతపోఽధికునన్నెఱుఁగవో!" 59

చం॥ సరి; యదియట్లులుండఁదగు; జాల్మ! యడవోచును, చిన్నపెద్దయం
తరువులెఱుంగ కీవిపుడునన్ బ్రహరించిహసించితౌర! యిట్టి యి
ప్పరుసపుఁజేతకై కువకువన్, గవనీడక, జక్కవల్ వలెన్
బరఁగుఁడు క్రీడలన్ మరఁగి, వారిరుహాకరతీర భూములన్॥" 60

చం॥ అని శపియించు కశ్యపమహర్షిఁ బ్రసన్నునిఁ జేయువారమై,
వినయముదోఁప, మేమపుడు విహ్వలితాంతరమొప్పఁ, దత్పదా
వనిఁ బ్రణమిల్లి శాపమును బాపఁగ వేడుకొనంగ, మానియున్
గనికరమూనె; శైత్యకలనంబు జలంబునకేమిక్రొత్త(బ్రాతి)యో?॥

కం॥ "పుత్త్రిక! శివసుతుఁడార్య
క్షత్త్రియ సత్తముఁడు, మార్తికప్రథితాఖ్యుం
డాత్రిస్తహారిణనయనయు
రుత్రపయుఁ, గ్లమంబుఁగల్గి యూథాకృతులై॥ 62

కం॥ లలితలలిత సుమకిసలయ
లులితశయనశయులువిలసిలుచు, మిముఁగనఁగాఁ
గలుగు శుభసమయమున మీా
రలు శాపవిముక్తిఁగాంత్రు; రజ్జులు మేలా?॥"

వ॥ అని, మమ్మనుగ్రహించి, యమ్మౌనివర్యుండు స్వాశ్రమంబునకేఁగె; నేమును, భవదాగమనాకాంక్షులమై, యిచ్చోటనే నిరీక్షించుచున్, బెద్దకాలంబు గల్పియుంటిమి. నేఁడు మీాదివ్యదర్శన భాగ్యంబు ప్రాప్తించినంతనే యేమునుశాపమోక్షంబుఁగాంచి, భాసురంబైన

పూర్వరూపంబునందఁగల్గితి"మని, చిత్రక దంపతులు మౌక్తిక దంప
తుల ననేక ప్రకారంబుల నభినందించి, "మహామహా! మమ్మనుగ్ర
హింపుము. నీకు మేలయ్యెడు! మేముపోయివత్తు"మని, గంధర్వలోకం
బున కేగిరనంతరంబ॥ 64

శా॥ శృంగారాంచితరత్నసానువిలసచ్ఛ్రీస్వర్ణసౌధోజ్జ్వలా
భంగేందూపలవేదికాలిధవళ ప్రాకారసాకారసా
రంగాంకాహితశేఖరావసథవిభ్రాజద్వివస్వచ్ఛకో
రాంగీకార శుభోదయాహ్వాయసుహీధ్యా పూర్ణసౌభాగ్యమున్॥ 65

మ॥ అతిలోకోజ్జ్వల వజ్రనిర్మిత సుకుడ్యాచిత్రితానేకచి
త్రతతిస్ఫూర్తిమదూర్జితావృతివిదూర ప్రోత్థశుంభద్ధ్వజృం
భితసుస్తంభవిరాజమానమణి సంస్ఫీతస్వ సౌధాంతర
స్థితి నానావిధభోగభాగ్య కలితక్షేమంకర ప్రక్రియన్॥ 66

వ॥ ముక్తికాంతాఽన్వితుండై, రత్నసింహాసనాసీనుండై, శోభాయ
మానుండుగా, జగజ్జేగీయమానుండై, యొప్పారె-ననిన, విని, యవ్వలి
వృత్తాంతంబెట్టిదని, వీణాపాణి వాణీజాని నడుగుటయును. 67

ఆ॥ సిరులకునికియయిన నరసాపురమ్మున
వెలసి, లసితవిభవములనుబడసి,
బలసికొలుచుభక్తవరుల కోర్కులు దీర్చు
కపిలమల్ల! రిపునికాయభిల్ల!!॥ 68

ఇది, ఆంధ్రీకృత ముక్తీశ్వరోపాఖ్యానంబునందు గంధర్వశాప-
తన్మోక్షవర్ణనంబను షోడశాధ్యాయము.

—(♦)—

# సప్తదశాధ్యాయము

కం॥ సిరిమగఁడుములికిగా, బం
గరుగట్టుదిగట్టువిల్లుగాఁ, దిగప్రోళ్ల
బ్బురముఁగఁ గూల్చిన యోగం
డరగండఁడ! కపిల్లమల్ల! నరసపురేశా!!॥ 1

ఆ॥ అవధరింపుమవలి దగుకథ; సురముని
నలువకనిడె- "వినఁగవలతువిస్త
రంబుగాఁగ, దీనినంబురుహాసనా
సీన! ముక్తముని విశేషగాథ॥" 2

కం॥ అని, యడిగిన, విని, కమలా
సనుఁడును, దనతనయునకు విశాలహృదయుఁడై,
వినిచెమఱియు, ముక్తమునీం
ద్రుని వృత్తాంతంబుఁబులకితుండయి, యిట్లన్॥ 3

శా॥ ఆర్యక్షత్త్రియమాని, మౌక్తికుఁడు, భార్యాఽన్వితుఁడై, యాసనో
పర్యాసీనుఁడునై, వసిష్ఠముని, దివ్యప్రాభవున్, వైభవో
దార్యౌచిత్యవినమ్రతాఽన్వితుఁడునై, దర్శించి, సుఖ్యాతిము
ఖ్యార్యాభీష్టఫలాప్తిఁగోరి, పరమాహ్లాదంబుతో నిట్లనన్. 4

ఉ॥ "షడ్గుణపూర్ణ! పూర్ణపురుషత్వపిత్ర్యాణ నిరాసముల్, తురా
షాడ్గురుతుల్యధీవిభవ! శాశ్వతశాంతియు, నంతరంగస
ద్విడ్గణజేతృనిర్మలమతిత్వము లేనియనన్ మహామతి
త్విడ్గిలనైకతానమని, పేరినదోసము త్రాసమేగదా!" 5

ఉ॥ ప్రాభవవైభవోన్నతులపారముగాఁ గలవారలున్, స్వత
శ్శోభితసద్యశోఽభిత ఋజుప్రచురప్రకట ప్రవర్తన

శ్రీభరితుల్, శుభోచితులు, సేవకసేవధులున్, ప్రభూతసై
జాభిజనాధికుల్ వెతల యందనపత్యులు బ్రుంగకుందురే? 6

మ॥ భవదాశీర్వచన ప్రభావమున సర్వక్షేమముల్, భోగభా
గ్యవిశేషంబుల శేష సౌఖ్యములు తుల్యంబుల్ లభించెన్ మహా
త్మ! వసిష్ఠా! క్షమిణాంవరిష్ఠ! యనపత్యత్వంబు లేకుండినన్,
లవమాత్రంబును మోదముంబడసి, కాలంబేఁగునట్లించెదన్. 7

చం॥ అదికటవయ్యెనో మునికులాగ్రణి! నీకిదియింపునింపునే?
సదయవిధాయకా! సదయసంభరితంబు పలాలితంబన
భ్యుదయకరంబుగాదె! యఫలోదయమాశ్రమవృక్షకంబు? నె
మ్మదిముదమొంద, సంతతసమంచిత సంతతినాకుఁగల్గునే?. 8

శా॥ ఈనీకోఁతలి యందయారసమపత్యేష్టాప్తినాకబ్బిన
ట్లానందాంబుధినోలలాడు నటులాహా వృష్టిమీయట్టిస
న్మౌనీంద్రాదులు, బంధుమిత్రులును విఘ్నణంబుగా, నైకది
వ్యానింద్యాశిషముల్ పరంపరలుగా, హాళిన్బచారింపరే?. 9

కం॥ సత్సంతానావాప్తికివి
ద్వత్సంస్తవనీయ! నాకవశ్యమొనర్పన్
వత్సలతన్ గర్తవ్య
ప్రోత్సాహమొనర్పవే, సముత్సుకతమెయిన్. 10

కం॥ క్రతువున్నఁగాని, సువ్రత!
వ్రతమున్నన్ గాని, పుత్త్రఫలదంబైనన్
గుతుకంబుననుపదేశో
చితు, సుతునిన్ నన్ను ధన్యుఁజేయఁదలఁపరే?". 11

మ॥ అని, ప్రార్థింప, వసిష్ఠమౌనివరుఁడధ్యాత్మోత్తమధ్యానని
ష్ఠనిమీలన్నయనుండునై, క్షణము స్పష్ట సృష్ట పుత్త్రప్రియ

త్వనిగూఢాశయమొప్ప, మార్తికమునీంద్రస్వాంతమానందథు
క్షణ సంధుక్షణమై, చెలంగఁగను, వర్ణించెనీరీతిగన్. 12

చం॥ "విను; మునిరాజ! పుత్త్రఫలవిశ్రుత సత్ఫలదవ్రతంబదె
ట్లన, మకరస్థుఁడెప్పుడగునారవి, నాఁడుమొదల్ వియద్ధునిన్
మునిఁగి, లలాటమందరుణమున్ దిలకంబు ధరించిచందనం
బును, ధృతశుభ్రవస్త్రుఁడయి, పొల్పుగవేదికయందు భక్తిమై. 13

కం॥ చతురశ్రంబుగ స్థండిల
మతిముదమున నేర్పరించి, యందునుముగ్గుల్
మదిమద్వర! వర్ణిచూ
ర్ణతతిన్ దీర్పంగనొనురమ్యంబులుగాన్. 14

శా॥ పుష్పారోపణమున్, సుగంధిలము, సమ్మూర్ఛన్నిజామోద స
ర్పిష్పూరప్రచురప్రదీపముల యర్చిష్మత్త్వమొప్పార, వా
స్తోష్పత్యుజ్జ్వలమై భవాస్పద! సుధాంశునొవంద్యపాద్వయున్
నిష్పాపస్వజనోత్కరావను, నినున్, సేవింపనొభక్తిమై. 15

వ॥ ఇట్లు ప్రత్యహంబును, ప్రాతఃకాలంబున శయనోత్థితుండవై, శుభ వేషశుచి వ్రతంబులవధరించి, యుద్యదాదిత్య మండలంబును మాస మాత్రంబారాధించి తినేని, సూర్యోపమాన తేజోవిరాజమానులైన సూనులన్ బడయంగల్గుదువు. ఇదియె, "సావిత్రవ్రతంబు" నాఁబడు; నియ్యది సర్వాభీష్ట ప్రదంబు॥" 16

చం॥ అని, వచియించు సద్గురువచోఽమృతమున్ శ్రవణాంజలిన్ గడున్
దనివునఁగ్రోలి, పూని యు, మనఃప్రియఁ దోడ్కొనుచున్,
మనఃప్రియం
బునఁజని, గాంగసైకతముఁ బుణ్యతమంబునుజేర్చియున్, వసి
ష్ఠుననుమతిన్ వ్రతాచరణ శోభితుఁడై, యొసఁగెన్ యథావిధిన్॥ 17

చం॥ రవిమకరస్థుఁడౌటఁగని, బ్రాహ్మణబృందము భోజనాదులన్
మిపులఁగఁదన్ని, మౌక్తికముని ప్రవరుండువ్రతోత్తమంబుఁదీ
ర్ప, విధివిధానమొప్పఁగ, శుభద్యునదీజలపూరమందుఁదా
ను, వనితయున్ గృతాప్లవన నుత్తమనుత్తమ పూతమంబునన్॥ 18

చం॥ మది గడుఁదెల్వివొంద, ముని మౌక్తికుఁడంతట, ముక్తికాంతయున్
ముదమునఁ గుంజరాశనము పొంతను పేర్చిన వేదికన్ నవా
భ్యుదయముఁబొంద స్థండిలమునున్నతమున్, నుతమున్,
సమాహితుల్
చదురులునై, యమర్చి, బహుళ శ్రుతిచోదిత శుద్ధపద్ధతిన్॥ 19

వ॥ భూశుద్ధియు, భూతశుద్ధియుంజేసి, తన్మధ్యభాగంబునన్ బీఠంబు నిల్పి, రంగవల్ల్యాదులచే సంస్కృతంబుఁగావించి, కలశస్థాపనంబొనర్చి, దేశకాలాది సంకీర్తన ప్రాణాయామ పురస్సరంబుగా సంకల్పంబుఁ జేసి, యంత్రగోచరంబులైన తత్తన్మంత్రంబులచే సమ్యగావాహనాదికంబులైన సర్వోపచారంబులు నిర్వర్తించి, త్రిమూర్త్యాత్మకుండును, మనోఽభీష్టప్రదాయకుండును, లోకనాథుండును, జగద్వంద్యుండునైన భాస్కరుని ధ్యానించి, యందుఁదన్మూర్తినినిల్పి, రక్తగంధ పుష్పాక్షతాదులతో సర్వోపచారంబులు సమర్పించుచున్, బూజించి, యిట్లని ప్రార్థించె॥ 20

## -: పంచచామర శ్లోకత్రయమ్ :-

"నమస్సహస్రరశ్మయే, ఫణాధరోరురశ్మయే,
సమస్త కర్మసాక్షిణే, విశాంగణాభి రక్షిణే;
రమాహిమాద్రిపుత్రికా సరస్వతీవరాత్మనే,
సమాదృతత్రయీ తనుత్వ చారుకీర్తికర్మణే॥ 21

గుణత్రయప్రభావతః ప్రపంచ సృష్టిరక్షణా
త్యయక్రియైకచుంచునై జశక్తి మత్త్వశాలినే,

సరోజినీ మనోహరాయ, సప్తసప్తి సంజ్ఞినే,
మహామహాయ,తే, నమస్తమోఽపహాయ, భాస్వతే॥ 22
అనామయ ప్రదాయకాయ, భాస్కరాయ, సర్వదా
నమస్కృతి ప్రియాయ, పాయస ప్రమోద సంయుజే,
రయాత్మనే, వికర్తనాయ, రశ్మిమాలినే, నమో
నభోమణిత్వ సంజుషే, జగత్త్రయైక చక్షుషే॥" 23

వ॥ అని, స్తుతియించి యర్ఘ్యత్రయంబిచ్చి, నైవేద్యంబు లర్పించి, ద్వాదశనమస్కారంబులు గావించి, పూజా సమాప్తియైనంత, నంతర్ముఖవరిష్ఠుండగు వసిష్ఠు నర్చించి, ప్రత్యహంబును గోటిసంఖ్యాకులైన సంఖ్యావద్బ్రాహ్మణోత్తములకు సాజ్యేష్టమృష్టాన్నాదికంబులహోరాత్రంబులు సంతృప్తిఁగావించినంత॥ 24

కం॥ ఇరువదియొకటవ దినమున
హరిదశ్వుఁడు మౌక్తికస్రక్శిరా విభ్రాజితుం
డు, రుచిస్ఫీతుండు, నుదయ
దురుకరుణాఽన్వితుఁడై, శుభోదర్కముగన్॥ 25

కం॥ కలశోపరి, ఛాయానూప
ద్మలతో సాక్షాత్కరింప, మూర్తికమానీ
ట్టి కుండువలి కెబద్ధాం
జలిపుటుఁడయి, యిట్లుసప్త సప్తికి భక్తిన్॥ 26

మ॥ "త్రిదశాధీశ్వర! ద్వాదశాత్మక! గభస్తి శ్రేణిచేనీవునీ
రద సృష్టిం బహుసస్య శస్యమగువర్షంబున్ ధరిత్రిన్ జనా
భ్యుదయంబుల్ హావణిల్లఁబంచెదవు; యజ్ఞోత్కృష్టపుణ్యార్థమున్
సదయుండెవ్వఁ డొసంగుయాజ్వులకు మోక్షంబీవుగా కుంఠిసన్?॥ 27

శా॥ అగ్నిప్రాప్తము హవ్యమెల్ల నినుఁజయ్యన్ జేరు; నీవల్లనా
భుగోర్వీకము వర్షమేర్పడుఁ; దదుద్భూత ప్రభూతాగళో

న్మగ్నంబన్నము; దానిచేఁ బ్రజలు; సంభావ్యంబగున్ దినసీ
భగ్నాన్యంబు ప్రభావమో మిహిర! విష్వగ్ధృగ్యజ్ఞ జోస్రోత్కరా!॥28

వ॥ దేవా! విశ్వకర్తవు, విశ్వభర్తవు, విశ్వహర్తవు నీవేకదా! బ్రాహ్మణులు సాయంప్రాతఃకాలంబుల నిత్యంబును, సావిత్రాఖ్యంబైన నీతేజంబును ధ్యానింపుచుందురు. నాపుణ్యాగణ్యభాగ్యంబుననే, నిన్నున్ జూడన్ గల్గితి. నాజన్మంబు సఫలంబయ్యె. నాతపంబుఫలించె. భవదనుగ్రహంబున నుద్భావితవంశ్యులెల్లరున్ బావితులును, సర్వసంభావితులు గాదు". రని, యనేక ప్రకారంబుల స్తోత్రంబుఁ గావించు నామౌనీంద్రునిన్ జూచి, యానిస్తంద్రతేజస్సాంద్రుండు, "వత్సా! నీ యభీష్టంబెయ్యది? వక్కాణింపుమయ్యదియ వశ్యంబు వశ్యంబుగా వరంబొసంగెద" నావుడు, నమ్మహర్షి మహాహర్షియై, తన్నోత్కర్షంబున నిట్లు విన్నవించె। 29

ఉ॥ "దేవ! మహానుభావ! జగతీత్ర యవిస్మిత సత్ప్రభావ! సం
భావిత భక్తభావ! యిదె, మామక మంచితవాంఛితంబు; మో
దావహమేతదాప్తియ; మదన్వయవృద్ధిక పత్యభాగ్యమం
దీవలెసద్దయన్, గొడుకులెన్మిదిమందిని, గూఁతు నొక్కతెన్॥" 30

చం॥ అని, వినయంబునన్ దనమనోఽభిమతంబును దెల్పు మౌక్తికున్
గని, యినుఁ "డట్టులేయవును గావుత" మంచు, వరంబొసంగి, తాఁ
జనెఁ దనదైన తావునకు; శాంతమనస్కను, గాంతఁ గూడి, య
మ్మునివరుఁడున్ స్వకీయపురమున్ దరియన్ జనె సాప్తబంధుఁడై. 31

వ॥ అనిన, విని, వీణాపాణివాణీజానికిట్లనియె. 32

ఉ॥ "ఎట్టెటు? మౌక్తికాహ్వయ మునీశ్వరుఁడా జననాప్తసిద్ధుఁడై,
తృప్తైకనొట్టినట్టి బలుదిట్టగదా! జగదాదరా! యతం
డట్టి సవిత్రుపాస్తిఁ దన యాస్తికతన్ సకుతూహలంబుగా
నట్టనలోకసంగ్రహణ నిష్ఠమెయిన్ బ్రకటించెనిట్టులన్. 33

ఉ॥ అంతియ; కానిక, యమ్మునికవాప్యముగాని దోకింతయున్నె?ని
శ్చింతుఁడు, శాంతుఁడా తఁడు శుచివ్రతుఁడై, వరమెట్లుగోరె? నిం
దెంతయు వింతదోఁచెడు; మహిష్ఠమిథోఁదద ఉదంతమెల్లనా
ద్యంతముఁదెల్పి, శిష్టముఁకథాంశమునాకెఱిఁగింపుఁడీ" యనన్. 34

చం॥ శతధృతి నారదోదితవచః ప్రకటార్థమెఱింగి, నవ్వుచున్,
గుతుకము వెల్లడించితి వకుంఠ దృఢాశయశోభివౌదు; మ
త్సుతుఁడవు; లోకసంగ్రహణ శుంభదనుత్తమభావభాసురుం
డతఁడగుఁజూవె! కావున, దినాధిపుప్రాశ్రయమొందుట బ్రమే? 35

వ॥ అదియునుంగాక, పరమేశ్వరువిభూతియస్తి భావంబులనుద్భావితం
బౌట విభూతిమద్వస్తురత్నంబెద్దియైనను, సంసేవ్యంబ యగుంగాదె!
ఈశ్వర సంకల్పితంబున విభూతి వివిధాత్మకమై, విఖ్యాతింగాంచు;
నదియవివిధంబులగు శక్తులనుదత్తద్భావ స్వభావానుసారంబుగా
నుద్భావింపంజేయుచుండు. దానంజేసి భావశక్తులనేకంబులై,
భాసించు; నెట్లన— నాత్మశక్తియు, నాకాశశక్తియు, గంధవాహ
శక్తియు, రుద్రశక్తియు, రాక్షసశక్తియు, మానుషశక్తియు భిన్న
భిన్నప్రకారంబుల దృశ్యమానంబులై యుండు; నీచెప్పిన సర్వశక్తు
లును విభూతివశంబులై యొప్పు; నివియన్నియు నీశ్వరునకు వశీ
భూతంబులై, చెన్నొందుచు, నమ్మహామహుని యందైక్యంబుఁ
గాంచు; నమ్మాత్రికమానీంద్రుండు చెప్పినచొప్పుననే, లోకశిక్షార్థ
ర్థంబతాను సర్వశక్తి సంపన్నుండయ్యు, నయ్యుగ్రముూలిఁ బర్యుపా
సించి, తదనుగ్రహంబునవరంబువడసె; నంతియకాక- యమ్మహా
త్ముండు వసిష్ఠాదిష్టమార్గంబున సపత్నీకుండును, సబాంధవుండును,
ననుహృత్పరివార పరివృతుండునునై, బహువ్రతంబు లాచరించె.
మఱియు, ననేకులు పూర్వకాలంబునలోక శిక్షార్థంబతాము సామ
ర్థ్యంబుగల్గియుఁ, బెక్కుపుణ్యవ్రతంబులాచరించిరదియట్లుండె; నిఁకఁ,
బ్రకృతకథను బంధంబునను సంధించుకొనుమదియెట్లనిన. 36

శా॥ ఆముక్తర్షిసహస్రరశ్మి కరుణాఽవాప్తాఖిలోత్కృష్టస
త్కాముండై, నిజవంశవర్ధనమపత్యప్రాప్తి మూలంబుగా
నాముక్తిప్రథితాభిధానయగు స్వీయార్ధాంగి గర్భంబుని
స్సీమానందముఁ బొందఁదాల్చె విబుధాశీర్వాదముల్ మించఁగన్.

కం॥ నెలలుపదినిండుచుండఁగ,
లలనామణియంతనుజ్జ్వల ప్రథితగుణో
త్పులకితసకల సుహృద్బృం
ధులాలితున్, శుభతనున్ బ్రసవించెన్. 38

కం॥ గ్రహపంచకముచ్చస్థా
నహితస్థితిఁ గాంచఁ,గాంత, నందితపితృబం
ధుహిత సుహృత్సహృదయసా
ధుహితు, సుతున్, గనెన్నయోన్నతున్,బహుమహితున్. 39

ఉ॥ వానితనూవిలాసమనవద్యమపూర్వ మరిష్టగేహసం
దానిత దీపకాంతుల నణంచు (చె)ఁదదీయమహస్సమూహమున్,
వాని జనుశ్శుభాహము జనప్రియతాఽఽవహమై, మహోత్సవా
హీన సహంబునొచు, మహురిష్టబహూద్వహమై, వెలింగినన్॥ 40

వ॥ దివ్యదుందుభులు మొరసెఁ; బుష్పవర్షంబు గురిసెఁ; దశదిశలు వెల్లి
విరిసెఁ; నీరజస్కంబులైన వాయువుల్లల్లనవీచినంత, నెల్లరయుల్లంబులు
మురిసెఁ; బ్రదక్షిణార్చిర్జాలంబులు జాజ్వల్యమానంబులై, వైతా
నికాగ్నివితానంబులు మెఱసెఁ; నప్పుణ్యపూర్ణుని జన్మకాలంబు
సకల శుభసంధాయకంబై, వెలసెఁ; నప్పుడు జాతకర్మంబు నిర్వర్తించి
మహార్త్రిక మౌనీంద్రుండు మౌహూర్తికుల రావించి, యుంచిన వేడ్క నక్కు
మారునకు జన్మపత్రంబు శుభోదర్కంబుగా వ్రాయించి, దశమదివసం
బున సర్వశాస్త్రార్థవేత్తలైన మౌనిసత్తములతో, ముచ్చటించి,

శ్రోత్రియ క్షత్రియుండు పుత్త్రునకు "జ్యోతిష్మంతు"డను నామ కరణంబు నిర్వర్తించి, గోధాన్యహిరణ్య ధరణ్యాది మహాదానంబు లెన్నేని; "బ్రహ్మపీఠ"మ్మని, ధారాపూర్వకంబుగా నుర్వీ గీర్వాణా ధీనంబులు గావించి, తద్బ్రాహ్మణ బృందంబును సానందంబుగా, సగౌరవంబుగా, నాగనంపె; నంత నక్కుమార శేఖరుండును, సర్వా హ్లాదకరుండై, బాలచంద్రునిపోలిక దినదిన ప్రవర్ధమానుండై యున్నంత॥

కం॥ జపిత, వ్రతియు, ముక్తముని, ని
జపిత, మహామహుఁడు మూటఁజౌళము, నాపై
నుపనయనము గర్భాష్టమ
ముపేక్ష సేయకయ చేసెనుత్సాహమునన్॥ 42

శా॥ ఆజ్యోతిష్మదభిఖ్యుఁడౌవటుఁడునై యగ్రోధదండంబు, మౌం
జీజ్యారోరురుచర్మముజ్జ్వలము, మాంజిష్ఠంబు వస్త్రంబు, స
జ్జజ్యాయుక్త ధనుర్వర గ్రహణమున్ క్షత్త్రోచితోగ్రాయుధ
ప్రాజ్యోరు స్ఫురణంబు, వేదబహుశాస్త్రజ్ఞానమున్ బొందుచున్॥

కం॥ తత్తద్గురుముఖతస్సము
పాత్తములౌయాయువిద్యలన్నియు, జ్యోతి
ష్మత్తకుఁ బొత్తును గూర్ప, న
నుత్తమ సంస్కారవంతుఁ డొప్పెనతండున్॥ 44

వ॥ అనంతరంబ, ముక్తికాంతా మౌక్తిక హాసీంద్రులకున్ గ్రమం బున, హంసకుండును, జిత్రవర్ణుండును, మందపాలుండును, రుక్మవర్ణుం డును, రుక్మమాలియు, రుక్మభూషణుండును, విష్ణుదాసుండునను నేడ్వురు ద్వీశ్వర విద్వరులు, మీఁరసదృశౌజస్కులునైన కుమారు లుద్భవించి; రిట్లీకుమారాష్టకంబు సురూప సంపన్నత్వ శుభగుణాంచి తత్వంబుల నీడవోవక, పితృశుశ్రూషణ పరాయణత్వంబును, గురు చరణాగపింబాబ్ధి వందనతద్భక్త్యైకతానత్వంబును, సకలజనమనః

ప్రమోదాపాదకస్వస్వవ్యాపారపారీణత్వంబునుం గల్గి, దినదిన ప్రవర్ధమానులగుచున్నంత, మౌక్తిక మౌనీంద్రుండు వారి కందళకును శాస్త్రానుసారంబుగా, వసిష్ఠాదిష్ట మార్గంబున సర్వవిద్యా వైశారద్యంబును, ముఖ్యంబుగ ధనుర్వేదనిష్ణాతత్వంబును, జిత్రవిద్యాఽనవద్యత్వంబును గల్గించె; నంత, వారును ద్వితీయాశ్రమస్వీకారార్హంబైన వయోరూపయౌవనంబుల నొప్పుచుండ॥ 45

ఉ॥ మౌక్తికమౌనియున్ మునిసమాజముఁ గూడి, వసిష్ఠ మౌనివ
ర్యోక్త పథంబుఁ దప్పక, మహోజ్జ్వల రూపగుణాభిరామస
మ్యక్తనుకాంతి నూతనవయోఽన్వితలన్, బహుగోత్రకర్తృతా
యుక్త మహర్షిరాట్సుతల, నుత్సుకతన్ జతగూర్చె వారికిన్॥ 46

చం॥ ముని యిటులాత్మజన్ములకు మోదమెలర్ప, వివాహమంగళం
బును నెరవేర్చి, వారిని విముగ్ధవధూయుతున్, సతీమత
ల్లిని, సతి, ముక్తికాంతను, సలీలముగాఁ గొనివచ్చి, చేరెన
వ్వనజభవ ప్రభావుఁడు "ప్రభావతికిన్" నిజరాజధానికిన్॥ 47

వ॥ అట్టి శుభసమయంబుఁ బసిగట్టియున్న జగజెట్టి, జానుమండలానుజుండు, సుమండలుం డను దనుజవరుండు రణరంగంబున మున్ను మూర్ఛాక్రాంతుండై, యున్నట్టుండి నవాఁడిట్టె బిట్టు లేచి, పసిగట్టుకొని, విజృంభించి, సంపాదించి తెచ్చిన చమూసమూహంబుతో నాక్క-పెట్టన నెత్తివచ్చి, చిచ్చరపిడుగులన్ గడు కడఁచు కలికములుకు నుజడిగఁ బఱపినయంత, వాసవడిగలతనానాథాకితంబైన యూధాకళాత్రియులు హానిజెందుటకిచ్చగింపక, యమ్మౌక్తిక మౌనీంద్రుండు నిజతపోమహిమంబున నరదంబులను, ద్విరదంబులను, జవనతురంగములను, జతురోద్భట భజపటలంబులను సృష్టించి, యాక్రమించునొంచు పోరాని మహాహవంబుఁ జేసి, క్షణార్ధంబున॥ 48

చం॥ ఉభయబలస్థులొక్కమొగినుద్ధురవృత్తి సమిత్సమిద్ధులా
చు భయదజృంభణంబున, యశోవిజయంబులుగోరి, పోరఁగన్,
త్రిభువనముల్ చలించె; విపరీత విపత్కరతత్స్థితిన్: "జగ
చ్ఛుభమగు నిప్పుడిట్లు దనుజుల్ కఱకుంద నమేలపూనిరో!॥ 49

ఉ॥ "ఐనదియేదొ యైనది; శుభాభ్యుదయంబులు కల్గనెల్లెడన్;
జానుమదాహ్వయాసు(శ)ర వినాశముతో"నని, సంతసింపఁగా,
వానికిఁదమ్ముఁడౌ కఠినవర్తనుఁడైన సుమండలాహ్వయుం
డీన యవంచకుండిటులిసీ! యెసరేగియిటుల్ ప్రవర్తిలెన్॥ 50

శా॥ భగ్నంబైన చమూసమూహముఁ బృథక్ప్రాగ్భారరక్తప్రవాహా
భుగ్నంబై, వడిఁదేలు పీనుగుల ప్రోవుల్, శీఘ్రతత్పాటనో
న్మగ్న క్రీడదనేక భూతగణ సమ్యగ్ఘూర్ణకోలాహలో
ద్విగ్నప్రేత పిశాచనీ చనటనల్ వీక్షింపనా నియ్యెడన్॥ 50

వ॥ ఇదేటి సుదారుణంబ దాటునన్ బదామడలు దాఁటినన్ గాని, గాటంబై, రోటుపుచ్చుచున్నయది! మేటిపోటరులెల్లరున్ పీటతాటంబై, టాటోటులాచుండిరే! కటకటా! యీసాలకటంకటేయుల టకటాంకుసేఁతలకు మాఱులేదొకో!"యని, పరిపరివిధంబులంబరితపించుచుండు భువన సముదయ సముదయ దయనీయ స్థితినిగని, మునివరతనయుఁడగు జ్యోతిష్మంతుఁడు నిజజనకుని చరణనళినయుగళంబునకుం బ్రణతులొనరించి, తదనుమతిని బడసి, మలినబడలుపడక, తడయక, యనిమొనకుఁజని, యనితరసులభంబగునిజభుజబలంబును బ్రకటించుచుఁ, బ్రతిభటులను బ్రతిఘటించుచు— 52

చం॥ శితశరవర్షమున్ గురిసి, సిగ్గఱి డగ్గరి బిట్టుపోరుదు
ర్మతుఁ, మదాంధ్య సంయుతుల, రక్కసమూకల రజ్జులాడుచు

చ్చితుల, సుమండలాశ్రితులఁ జిందరవందరఁజేసి, చిందమున్
గుతుకమెలర్పనొత్తిన యకుంఠబలున్, రిపుకంఠలుంఠనున్॥ 53

మ॥ దితిజారణ్యతనూనపాదుఁడగు(త్తయిన) జ్యోతిష్మంతుఁగన్, దివ్యస
ద్ద్యుతిమంతున్నుతియించు, సన్నుతులురోదోవ్యాప్తముల్ గాఁ బ్రజా
పతి సంజ్ఞాఽస్త్రమునన్ సుమండలుఁగఁ గూల్పన్,
శ్రోత్రియాగ్ర్యుండు శ్లా
ఘితుఁడయ్యెన్; సురదుందుభుల్ మొరసె; సంగీతంబు
విచ్చెన్ దివిన్॥ 54

కం॥ సుమనస్తనితి సుమనస్తనితి
సుమనస్తనితి స్తుతిలపితము, జ్యోతిష్మచ్ఛౌ
ర్యమును, సుమండల సంహార
ణముఁ, ద్రిభువన నిత్యరక్షణముఁ బ్రకటించెన్॥ 55

వ॥ అంతట, మౌక్తిక మౌనీంద్రుండును, జ్యోతిష్మంతునభినంద
నాలింగనాదుల నాదరించి, సంతుష్ట స్వాంతుండై, సతీసుతుఁ తోడం
గూడి "ప్రభావతీ" నగరిం బ్రవేశించి, సామ్రాజ్యంబున సుప్రతిష్ఠి
తుండై, చిరకాలంబు సుఖంబుండె॥ 56

కం॥ లలితవధూకృతహర్షో
త్పులకితులును, వినయ వినమితులునగు సుతులు
జ్జ్వలమతులయి, సేవింపఁగఁ
గులికిర కలుషితులు మౌక్తికుండును, సతియున్॥ 57

వ॥ అనిన, విని, యవ్వలి వృత్తాంతంబెట్టిదని, పీఠపూనివాణీజాని
నడుగుటయును॥ 58

ఆ॥ సిరులు మెఱయు మేనసరులు పెన్గాలిమే
పరులు; బూదిపూఁతవఱలునంగ
రాఁగ; మెన్న ఱాఁగయాఁగంగ సిగదండ;
కపిలమల్ల! నీకుఁ గలుషభల్ల!!॥

ఇది, ఆంధ్రీకృత ముక్తీశ్వరోపాఖ్యానంబునందు
ముక్తీశ్వరపుత్రాభ్యుదయంబన్నది
సప్తదశాధ్యాయము.

—(♦)—

# అష్టాదశాధ్యాయము



హైమననగజామా
తా! హేమగిరీంద్ర చాపధారీ! కైలా
సాహార్యగేహా! వృషవర
వాహా! కపిలేశమల్ల! పరిపరిభిల్లా!!॥

ఆ॥ అవధరింపుమవలి దగుకథ; సురముని
నలువకనియె - "వినఁగవలతు; విస్త
రంబుగాఁగదీని; నంబురుహాసనా
సీన! ముక్తముని విశేషగాథ॥" 2

కం॥ అని, యడిగిన, విని, కమలా
సనుఁడును, దనతనయునకును విశాలహృదయుఁడై,
వినిచె మఱియు, ముక్తమునీం
ద్రుని వృత్తాంతంబు పులకించుచును, యిట్టుల్॥ 3

వ॥ సర్వసంపత్సంపన్నుఁడును, బ్రాజ్య సామ్రాజ్యాధిష్ఠితుండు
నైన యమ్మౌక్తిక మౌనీంద్రుండును సద్గుణ సాంద్రుండు గావున,
ముక్తికాంతా శుక్తి గర్భంబున స్వోర్జితోర్జస్వలముక్తాఽఽవలింబోని
దాని, "నుజ్జ్వలా"భిఖ్యావిఖ్యాతయైన దానిఁ గన్య నొక్కతెన్ గాంచె;
నామెయు సకల సుగుణగణ విరాజమానయై, చంద్రరేఖయుంబోలె,
దినదినప్రవర్ధమానయై, లోకాలోకాంతరవర్తి లోకాలోకాహ్లాద
కారిణియై, యొప్పుచుండ, నమ్మౌక్తిక మౌనీంద్రుండు ముక్తికాంత
తోడను, జ్యోతిష్మదాదులైన పుత్త్రులతోడను సమాలోచనంబుఁ జేసి,
యష్టవర్షప్రాయయైన యక్కన్యను వేదవేదాంగవేత్తయు, సర్వ,
విద్యాపారంగతుండును, జ్యవనమునివరతనయుండునగు "శ్రవిష్ఠున'
కిచ్చి వివాహంబుఁ గావించె - ననంతరంబ॥ 4

కం॥ లలనాలలామయయ్యు
జ్జ్వలయు, వరు, శ్రవిష్ఠమౌనిఁ, "జ్యవనతనయుఁ" బొం
ది, లలితగుణయుతులను, బు
త్త్రులఁ, బుత్త్రికలనుమనోజ్ఞరూపులఁ గాంచెన్॥ 5

కం॥ జ్యోతిష్మదాదులందఱుఁ
జేతోమోదమునఁ గనిరి స్వీయాంగనలం
దాతతరూపాఢ్యలఁ, బ్ర
స్ఫీతనయోన్నతుల, సుప్రతీతుల, సుతులన్॥

మ॥ పరమోదారుఁడు, మౌక్తికుండతులితైశ్వర్యంబు, శశ్వచ్ఛుభో
త్కరముల్, పుత్త్రికళత్రపౌత్త్రులును, దత్సంతాన సంతానము
త్తరకాలంబు, మహత్తరంబుఁ గడపన్, ధన్యుండుగా, శ్రీశరో
పరమోదారచి చీషుఁ జేసి, విషయాపాయాధికోత్సాహియై॥ 7

మ॥ స్థిరసంకల్పుఁడు, మార్తికుఁడపుడు జ్యోతిష్మంతు, జ్యేష్ఠాత్మజున్
ధరణీభారధురంధరత్వమున విన్నాణంబుగాఁ నిల్పి, యీ
శ్వరు, గౌరీశ్వరుఁ జూచు వేడ్కఁ రజతక్ష్మాధ్రంబుఁ దాఁ జేరి, సు
స్థిర భక్తిన్ శ్రుతిశీర్ష సూక్తులనుతించెన్ పార్వతీవల్లభున్॥ 8

-: శరణాగతి :-

చం॥ అవని రథంబు, చక్రయుగమారయఁ బుష్పవదాహ్వయద్వయం
బవు; ధనువల్ల మేరువు; రమాధిపుఁ డాశుగమా సరోజసం
భవుఁడవు సూతుఁ; డశ్వములు ప్రామినుకుల్; త్రిపురాసురాంతకా
హవమున నే మహామహునకట్టి శివున్ శరణంబు వేఁడెదన్॥ 9

చం॥ అరుదుగ, సాంధ్యనృత్య సమయంబుల, భస్మకృతాంగరాగమే
పరిపరిపీలుకర్బురశుభం యుపురక్షణనుండుఁ దాల్ప, దా
ని రజము లేశమబ్బినను, నిర్జరవల్లభముఖ్యు లందఱున్
శిరములఁ దాల్తురట్టి సినునిచ్చలు నే శరణంబు వేఁడెదన్॥ 10

చం॥ విషయ విరక్తచిత్తులులు, వేదవిదగ్రసరుల్, మహాత్ములౌ
ఋషులు నిరంతరంబును నిరీహులైయయ్యును, మోక్షకాంక్షులై,
విషమశరారినే విపులవిశ్వశరీరుని, వామవాము, నే
వృషభపతి ధ్వజున్ మదిస్మరింతురో, యట్టినినున్ దలంచెదన్॥ 11

చం॥ ఎవనియనుగ్రహంబునను మృత్యువశుండు మృకండుపుత్త్రుఁడా
యువుఁగనెఁ బూర్ణమత్తతిమహోద్ధతిఁ జూపిన మిత్తిమొత్తి, మృ
త్యువును జయించు పేర్వడసెనో యెవఁడట్టినినున్ మహామహున్,
భవు, బహువైభవున్న భవు, భావభవాభిభవున్ దలంచెదన్॥ 12

చం॥ ఎవనిని జేరనేరవో యకృత్రిమవాక్కులు సైతమట్టి ని
న్నెవఁడు నుతింపశక్తుఁడగు? నీశ్వర! శంకర! విశ్వమూర్తి! మృ
త్యువెవనిఁ "జూచి-చూడకయ", తూర్ణము పెన్గతిఁ గాంచె; దానుగా
ల్పవడెమనోజుఁడున్నతని, లోకవిభున్, శివు, నిన్ దలంచెదన్॥ 13

చం॥ అవని, "నమశ్శివాయ" యనునైదగు నక్కరముల్ పవిత్ర మం
త్రవరముగా జపింప, జనతా ఘన తాప తతాఘనాశమౌ,
దివిజగణాభివంద్యు, జగతీత్రితయీ విభవైకకారణున్,
వివిధవచో రహస్యపరినిష్ఠితు, నిన్ శరణంబువేడెదన్॥ 14

వ॥ త్రిమూర్తిమూలుండవు, త్రిలోకనాథుండవు, త్రిపురారివి, త్రయీమయుండవునైన నిన్నుం, ద్రిదశావృత్తంబుగా నాత్మానుసంధానంబుఁగావించుకొని, శరణాగతుండనౌచున్నాఁడ"నని, ప్రార్థించు నమ్మౌక్తికమౌనీంద్రున్ గాంచి, శంభుండు భక్తపరాధీనుండుగావునన్, ప్రీతాత్ముండై, యమ్మహా భక్తాగ్రేసరునితో నిట్లనియె— "వత్సా! భవత్సాధుస్వాదు స్వభావసామీచీన్యంబునకును, సద్ధీచీనంబగు భక్తితత్పరత్వంబునకునుబరమప్రీతుండనై, ప్రసన్నుండనైతి. నీవాంఛితంబీడేర్తు; నద్దాని వేవేగ, దెలుపు"మనవుడు, మునిపతియు, నపరిమిత కుతుకభరిత హృదయుండయి, "దేవా! నాకాత్మహితంబైనదాని నెద్దానినైన, నాజ్ఞాపూర్వకంబుగా వక్కాణించి, నాయజ్ఞతన్ బోకార్పవే!" యని, ప్రార్థించినంత, శర్వాణీ ప్రాణేశ్వరుండా ముక్తేశ్వరున కిట్లానతిచ్చె॥ 15

చం॥ దమము, శమంబు, క్షాంత్యుపరతంబులు, శ్రద్ధ, సమాధినాఁగ, నా
ఱు, మహిని జేతనాత్మహితరూపములౌ; ధ్రువమధ్రువంబు జ్ఞే
యముసుమి! తద్వివేక జనితాత్మహితంబది దొడ్డ; యైహికా
స్థ మటిమటిన్ వివేకులకుఁ ద్యాజ్యముసూ! పశుపుత్త్రికాదులన్॥ 16

కం॥ మాయామయబంధంబున
మేయంబును ద్రెంచుకొనఁగ మేకొనునిచ్చా
వైయాత్మ్యము యాత్మ్యము; స్వ
ర్గాయతభోగేచ్ఛ మహితమౌ; హితమౌ॥ 17

వ॥ ఇందులకుశమదమాదులైన పూర్వోక్తసాధనంబుల సాధించి ప్రణవంబుదృ(ద్రి)ఢతంబుగా, నాత్మ బాణంబుగా, బ్రహ్మలక్ష్యంబుగాఁ బ్రక్షేపింపందగు; నట్లుకాదేని, జ్ఞానదీపంబునన్ జేసి మాయామేయ ధ్వాంతంబు శాంతంబుఁ గావించి, యాత్మనాత్మచే దర్శింపం జాలిన మహాత్ముండు బ్రహ్మమయుండౌను. మఱియును॥ 18

ఆ॥ నిష్కళంబు, తతము, నిష్క్రియంబును, నిర్మ
లంబు, సర్వమేకముం, బరంబు
బ్రహ్మమగుణమెవఁడు పరికించు, వాఁడు ధ
న్యాత్ముఁడఖిల దర్శియానువాఁడు॥ 19

కం॥ భేదిల్లున్ హృద్గ్రంథియు;
భేదింపఁబడును సకల చిరసంశయముల్;
మేదురకర్మ క్షయమగు;
నేదిష్ఠము బ్రహ్మమగును నిచ్చలెవనికిన్॥ 20

వ॥ కుమారా! దీనిన్ బ్రయత్నపూర్వకంబుగా నాత్మహితార్థంబు సంపాదించుకొమ్ము. దీనన్ జేసి మాయనుమాయించి; బ్రహ్మాభాయంబుఁ గాంచుట తథ్యం''బన, మౌక్తికుండు వెండియు నిట్లనియె- ''దేవా! విషయ విరాగిత్వంబేయుపాయంబున సంపాదనీయఁబు? విరక్తుని లక్షణంబులెయ్యవి? తద్వ్యాపారంబెట్టిది? తదీయ సంభాషణంబు లెట్టివి? వివేచించి వచింపవే!''యని, ప్రార్థించినంత, నంతకాంతకుండు ముక్తికాంతాకాంతునకేకాంతంబుగా నిట్లనియె- ''వత్సా! నిత్యానిత్య వస్తు వివేకంబునన్ జేసి వైరాగ్యంబువుట్టుఁ; బర్యాలోచింప దృశ్యంబంతయు నశ్యంబేయగు. దృశ్యమానంబుఁ ఎంబెయ్యది యధిష్ఠితంబగు, నయ్యది యదృశ్యంబనశ్యంబయ్యదియ పరబ్రహ్మంబు. మాయాసుప్తుండైన జీవుండెప్పుడెప్పుడు ప్రబుధ్యమానుండగు, నప్పుడ

యీవిశాలవిశ్వంబంతయు స్వప్నతుల్యంబనియు, ననాదినిధనంబైన పరబ్రహ్మం బొక్కండద్వితీయంబు, నునిద్రంబునగు మహామహం బని యుగ్రహించుచుఁ దటిచ్చంచలంబులును. గంధర్వనగరాకారంబులు నైన పదార్థంబులయందుఁ బరమార్థ భావంబుగల్గి, ప్రాజ్ఞుండు రక్తుండును, రిక్తుండునుగాకుండు. వివేకవంతుండు యోగసంసక్తమానసుండై యాత్మను స్వాధీనంబుగావించుకొనందగియుండు. సత్యంబగు బ్రహ్మంబు నందు రక్తుండుగాఁదగు. వికారంబులకు లోనుగారాదు సుమీ! సుఖదుఃఖంబులన్ దితిక్షయు, రాగద్వేషంబులందు విరాగంబును, లాభాలాభంబులన్ దుల్య వ్యాపారంబును, ప్రియాప్రియంబులందు మోదఖేదంబులకు వశంవదుండుగాకుండుటయు, స్తుతినిందా సందర్భంబులందుఁ బొంగుక్రుంగులు లేకుండుటయు, స్వకీయపరకీయోభయవిషయంబుల నుదాసీనతయుఁగల్గి, ప్రవర్తించుట లెస్స. మఱియును॥ 21

సీ॥ శాంతాత్ముఁడై యుంట, చింతాకులుఁడుగామి,
సమదృష్టలోష్ఠకాంచనుఁడునగుట,
రక్తుండుగాక, వివిక్తదేశముఁ జేరి,
మానసనిగ్రహంబూనివశితఁ
గాంచుట, యింద్రియగ్రామలుబ్ధుఁడుగామి,
నఖిలభూతావళినాత్మతుల్య
ముగఁ దలంచుట, గురునిగదితంబుల శ్రద్ధఁ
జూపుట, ఫలదృష్టిఁజొఁపి, కర్మ

గీ॥ లాచరించుట, దైవసంప్రాప్త లాభ
మేదియెంతైన, సంతుష్టిమెఁదనియుట,
మున్నుగాఁగల్గి, వర్తించు పుణ్యమూర్తి
సిద్ధిఁగాంచును; నిత్య సమృద్ధిఁగాంచు॥ 22

వ॥ ఇదియ వైరాగ్య సంపత్సంపాదనోపాయంబిఁక, విషయ విరక్తుం
డైన ధన్యాత్ముని చిహ్నంబు లెఱింగించెద. సావధానుండవై, యాక
ర్ణింపుము. తత్ప్రధాన చిహ్నంబు సర్వప్రథమంబు, నధిగతప్రథమం
బునగు శాంతం బియ్యది సర్వప్రధానసాధనంబు. దారుణంబైనకష్టంబు
ప్రాపించియు, నెవ్వండుద్వేగంబుఁజెందకుండు—నాతండు యోగియని,
స్థిరధీమంతుండని, సాధువని, విరక్తుండని, యగ్గింపంబడుచుండు. యోగ
సంసక్తుండైన యాతండు విషయవిరక్తుండై, పరుషవచనంబులు వలుకక,
శాంతుండును, విగతజ్వరుండునయి, నిశ్చలుండై యుండు. 23

కం॥ ఇట్టిండె "బ్రహ్మ కూఁకటి
ముట్టఁ" గలుగునిట్టె; యతఁడపునరావృత్తిం
డట్టె స్థిరుండగుఁదగ; జగ
జ్జెట్టియతఁడో, వేఱొకండో, చెపుమా। తనయా!! 24

శా॥ రాగద్వేషహతు(పరు)ల్, నరుల్ దవిలి కర్మంబుల్, ఫలాసక్తులై,
భోగాశల్ మదిఁబెంచుకొంచును, గడున్ మూఢాత్ములై, వాంతమున్
వేగన్ నోళులజుఱ్ఱు పెంగలులు పిర్వేఁకుల్ గనన్ బోవరో!
యోగయ్యాళిని, మాయఁగన్మొఱఁగి, యయ్యయ్యో! మఱిన్
వర్తురే! 25

శా॥ దేవానాంప్రియు, లానరుల్ చెడుటతోఁ దీఱన్ భోసంగుల్ గ;నం
గా, "వైభోగము" లింకఁగల్గునని, మూర్ఖ్యంబొప్ప, గొప్పల్ వచః
ప్రావీణ్యంబునఁ జూపుచుందురు పునర్జన్ముల్, పునర్మృత్యువుల్
గా, వెళ్ళింతురు చక్రవద్భ్రమణలీలా లోలతన్ గాలమున॥ 26

ఉ॥ మానసరోధనంబొకఁడె మంత్రము మాయనుమాయుఁజేయు; సు
జ్ఞానులు, మానులున్ ప్రయతనంబొనరింత్రెటులెటుల్; ప్రశాంతమా
యానిబిడాజవంజవ జవాభ్ర బిడాలము యోగదిద్ధచే
తోఽనఘదుగ్ధభాండమునహర్నిశమట్టిగ, ద్రోయుసంచొగిన॥ 27

వ॥ మానసులకు మానసంబేగదా, బంధమోక్షంబులకును, విపత్సంపద లకును భ్రమకారణంబు! నిగ్రహంబునకు నిర్వికారంబును, బంధంబు నకుం సహకారంబు నగు మనంబే కారణంబు. యోగమాహాత్మ్యంబున హృదయంబును వశపఱచుకొనునది. తద్వశీకరణోపాయంబులు శాండిల్యదహరాద్యులైన బ్రహ్మవిద్యలు పెక్కులు లెక్కకు మిక్కిలి గలవు. కర్మంబులుచ్చావచంబులుండేఁ గదా! ఫలోద్దేశ వినాకృతం బైన పంచయజ్ఞాద్యనుష్ఠానంబుత్తమోత్తమంబు. ఆత్మారాముండైన యోగీంద్రుండాత్మతృప్తిన్ బొంది, సర్వభూతహితుండై, బ్రహ్మ నిర్వాణంబుఁ గాంచు. 28

సీ॥ సాధుసంసేవ నంబున, శ్రవణమనన
సమ్యగనుశీలన సదనుష్ఠానపరత,
సంయమి, మనమ్మును జయించి, స్థానమందు
శుద్ధతరమునఁ గూర్చుండి, యిద్ధబుద్ధి॥ 29

శా॥ ప్రాణాయామ పరాయణుండయి, క్రమాభ్యాసంబునన్ జేసి, స్వా
ధీనంబుంబొనరించి, చేతము సదాస్తైక్య ప్రపూతంబు, నా
త్మానాత్మ ప్రవివేకమున్ బడసి, ధ్యానాధీనుఁడై, బ్రహ్మమున్
దానత్యంతము సాన్నిహిత్యముననాస్థన్ బొందుముమ్మాటికిన్॥ 30

కం॥ వైరాగ్య భాగ్యవంతుఁడ
వై, రాజిల్లు ముకుమార! వైరాజంబై,
నీరాజ్యము స్వారాజ్యము
రారజ్యద్భూతిఁ "ద్రోసిరాజ"నకున్నె? 31

మ॥ అభిజాతుండవు మద్భుజాగ్రజని; ముక్తాభిఖ్యమానీంద్ర! నీ
యభిమాతుల్ విజితుల్, భవద్భుజ బలాత్యాదిత్య దీప్త్యున్నతిన్;
ప్రభవిష్ణుల్ సుతులుద్భవించిరి యశోభ్రాజిష్ణుపుల్, జిష్ణువుల్;
శుభముల్, బుణ్యములున్, బుమర్థములు సుశ్లోకుండవై, పొందవే!॥

చం॥ సుతులను రాజ్యధూర్వహనశోభితులన్, హితులన్ బ్రజాఽఽళికిన్,
గుతుకభరాభితోభృశతనూకృతవైరతనూనపాత్సమం
చితులను, వైభవోన్నతుల, నిత్యశుభాన్వితులన్ బొనర్చి, నీ
సతియును, నీవు నైశమ విచారవిదూరతఁ గానకేఁ గుఁడీ!॥ 33

శా॥ జ్ఞానానంద ప (భ) రాంతరుండవయి, వత్సా! శాంతచిత్తుండవై,
నానానూనమనః ప్రవృత్తి వివిధాంశు ప్రాత్మ సంలీనమౌ
జ్ఞానాంకూరమ్ము గోత్కరంబునకు హింసం జేయకుండంగ; ద
త్త్వానఃపుణ్య "నమశ్శివాయ" మనువిద్యన్, బుణ్యదన్ నిల్పుమా!॥

ఉ॥ గుహ్యతమంబు సుమ్మిది! యకుంఠిత దీక్ష భజింపుమయ్య! స
న్నాహ్యమగాతిపట్టరు వినాశమొనర్పఁగ; భక్తిరజ్జుస
న్నహ్యము, జ్ఞానవారినివినా, నిలుపందలఁపుంగొనన్, మనో
నూహ్యము; దీనఁదీర్పకుము హృన్మదసూయుమదాశఁ బుట్ట శ్రేయుస్."

మ॥ అనుచున్, "తారకమంత్రరాజమును" శ్రేయః ప్రాప్తిబీజంబుఁ బు
త్త్రినకున్ బోధమొనర్చి పార్తికునకున్ రుంతసద్గామండితుం
డనుకంపాఽతిశయా వికంప్య హృదయవ్యాబద్ధనాళీకమం
దు, నితాంతా దృతి తేనె సోనయుగ, నుద్బుద్ధంబుగాఁ దోఁచినన్. 36

వ॥ అంత, నమ్మార్తిక ! శ్వరుఁడు గౌరీశ్వరునిట్లని విన్నవింపం
దొడంగె॥ 37

శా॥ "ధన్యుండన్; గృతకృత్యుఁడన్; గృతుఁడమార్గస్యుండ; దేవా! కడున్
మాన్యుండన్ మునిముఖ్యులన్; భవదనన్య ప్రాప్యమాహాత్మ్య యున
మ్మున్యజ్ఞానవమంబు, నిత్యనవమున్ బొందంగలేరెవ్వరి
మున్యగ్రుల్? ననుఁ బ్రోచునీకృపతతంబున్, సన్నుతంబున్ గనా!॥

మ॥ విషయాపేక్ష క్షణంబునన్ క్షయితఁబట్టౌన్; బంకనిర్ముక్తుఁడం
శివదానంద ఘులాఘలోభయుతిభాతిన్, దివ్యచక్షుస్ప్రదు

ర్వ్యపహాధ్వాంతసితాంతసైన్యమున మూరించబోవువారిన్ ప్రభా
జుపమున్, ప్రబధ్ధమయూఖముల్ వలెనునెచ్చున్ గూర్చె నీ
చేరికల్॥ 39

శా॥ కారాగార నిబద్ధుఁడుద్దవిడి, ముక్తత్వంబు నొందంగ, నెం
తేరంజిల్లును; మూర్ఛమున్గి మతిజ్ఞప్తింబొంది హాయిన్ గనున్;
మారారీ! జనుఁడట్టులేనినుఁగనన్, నామానసం బెంతయున్
దేతెన్; జ్ఞానమహోమహోదయము తృప్తిన్ గూర్చె; గౌరీవరా!॥

వ॥ ప్రభూ! ప్రభూతంబు, ననితఃపురాఽనుభూతంబు నగు భవదపార
కృపారస పారావారావగాహోరు సంపాతంబు నన్ను
మిక్కిలి "యుక్కిరి బిక్కిరిన్" గావించె. బ్రహ్మజ్ఞానోపదేష్టవైన నీకే
నేమి ప్రతికృత్యంబొనర్పన్ గలాఁడ? నీవు నాసర్వస్వంబున కధీశ్వ
రుండవు గాదె! కేవలము నకారణకారుణికత్వమ్మునన్ జేసి యహర్నిశ
క్రియమాణంబులై, యతిప్రమాణంబులై, భగవదాభాగవతవిషయక
సహస్రసహస్రలబ్ధకారాగాధంబులై, సాధారణమేధాదురోబోధంబులైన
మదీయాపరాధంబులన్ బరస్సహస్రంబులనజస్రైధమానంబులను వీడు
దాసుండేగదా!" యని,యవ్వానితీంద్రుఁడం బెంచక, కొంచక, మన్నించి,
యుంచినజాలిన్ మించుచుండన్ గోరుచున్నవాఁడ" ననుచు, ననిచిన
ప్రియతమెయి మెయిగగురుగొనవినిచిన, విని, యినానలశశినయనుం
డును, నయంబు, వెఱయ, మునివరున కిట్లనియె. 41

గీ॥ "నీమనశ్శుద్ధిమానీంద్ర! నేనెఱుంగ
నే? భవదఖండ సద్భక్తి వైభవంబు
గనఁగలుగునొక్కొ, యీ జగజ్జనులయందు?
నర్థవాదంబుగాదు; యథాఽర్థమిద్ది. 42

ఉ॥ ఈవు ప్రభావతీ నగరికిప్పుడయేఁగి, ప్రభూతరాజ్యల
క్ష్మీవిభవాతిశాయివయి, మేదినిపై సుఖశాంతులిమ్మ,కా
లావధిలేకనిల్పి, తనయప్రతిపాదిత రాజనీతివి
ద్యావిసరుండవై, బహుతిథంబు సుఖింపు సతీయుతుండవై. 43

మ॥ కులధర్మంబుల, లోకధర్మముల, నక్షుద్రంబులన్ నిల్పి, యె
త్తిలి, యాజ్యేష్ఠుఁడు, శ్రేష్ఠుఁడౌసుతుని, జ్యోతిష్మంతు, రాజ్యాభిషే
కలసద్వైభవుఁజేసి, యీవు-సతియున్ గామంబు నీపేడి, యా
నలఁబోనాడి, నితాంతనిశ్చలతపశ్చర్యన్ బ్రవర్తింపుఁడీ!. 44

వ॥ కుమారా! నీకుమారులును, వారిసంతానంబువారును సార్వభౌమ్యంబుగల్గియుఁ, జిత్రవిద్యాఽభ్యాసభాసురులై, దేవతాభక్తియుక్తులై, ముఖ్యంబుగా నిమేషాంబాఽఽరాధనాయత్తచిత్తవృత్తులై యుండునది. మహౌదార్యసౌదర్య సాశ్చర్యచర్యుండైన కులాచార్యుం బూజించుట శ్రేయోదాయకంబు. నిమిషాంబాఽఽరాధనంబును, గులాచార్య సపర్యయు నెవ్వండవ్వలంబుచ్చు-వాఁడు వంశక్షయం బొందు సుమా! వాఁడంత్యజాత్యుండై, నిరయంబును బొందు.మఱియు, వాఁడు గర్దభంబై, జన్మించు. భక్తియుక్తుండై, యథాశక్తి నన్నును, నిమేషాంబను, గులాచార్యు నర్చించువాఁడు విత్తశాఠ్యంబు వర్జింప నౌను జూవె! ఈయాఖ్యానంబెవ్వఁడాకర్ణించు - నాతండు పుత్రపౌత్రాయురారోగ్యైశ్వర్యాదిలాభంబులు గల్గి, సర్వసౌఖ్యంబు లొందుదు''రని,పరమశివుండువచియింప, నమ్మార్తికమానీంద్రుండును' అద్దేవదేవునకున్ బ్రణమిల్లి,తదనుజ్ఞాతుండై, కైలాసావరోహణంబుం గావించి, ప్రభావతీనగరిన్ బ్రివేశించి, రాజకార్యంబులందవ్యాజంబుగా వ్యవహరించుచు, విప్రులన్ బ్రసన్నులన్ గావించుకొనుచు నిజతనుజులనెల్ల రనెల్లధర్మంబులన్ బ్రవర్తిల్లఁజేయుచు, నానావిద్యలన్ వారి నవ్వారిగా నారితేఱినవారిన్ గావించుచుఁ, బ్రవర్తిల్లఁ జేయుచుండె. 45

శా॥ ఆముక్త ప్రభురాజ్యపాలనమునం (పాలనావసరమం) దన్యాయ కార్పణ్య మి
థ్యామార్గప్రవణత్వ ధర్మ విముఖత్వ వ్యాధిచోరాగ్నిపీ
డామూఢత్వ షడీత్యకాలమరణేడ్యప్రేషణాదుల్ గనం
గా, "మందన్నను, మచ్చటన్న", నవిలోకంబందు లేవద్దిరా!॥ 46

శా॥ ఆర్యక్షత్త్రియ మూలపూరుషుఁడు ముక్తాభిఖ్యవిఖ్యాతుఁడా
మర్యాదా పురుషోత్తమోత్తముఁడు ధర్మ్యంబై నరక్షోల్లస
చ్చర్యన్ బాలనసేయ, లోకము సుభిక్షంబొందె; గూక్షత్వయు
క్రౌర్యంబుల్ "పని-పాట(టు)లేని"వయి, తద్రాజత్వమన్వర్థమా॥

మ॥ మునిముక్తప్రభుఁడున్, ప్రజాహితమతిన్, బూతక్రతుండున్, బునః
పునరుద్యద్ధనురుద్యముల్, క్రతువులంభోధారలనోన్య లో
క నితాంతాభ్యుదయంబుఁగూర్పఁగ, నమోఘ ప్రాభవోపేతులై,
కన దత్యుజ్జ్వల వైభవంబున(ల) మెలంగన్ వారి కేచెల్లెడున్(ఁగా!)॥

మ॥ చతురాశ్రమ్యుచితోరుధర్మములు నక్షయ్యంబులై, వర్ణ ధ
ర్మతతాచారరతిన్ జనుల్ మెఱఁగి, సన్మార్గ ప్రవృత్తిన్ జెలం
గి, తమోదూరత నీశ్వరాంఘ్రియుగభక్తిన్ గల్గి, శశ్వన్మనో
జితకాశుల్ తనివొందిరూర్జితయశశ్శ్రీశోభితుల్, ధీయుతుల్॥ 49

వ॥ అంత, నారాజర్షియు, నాత్మక్షేమమాలోచించి, "సంసారంబసారం
బనియు, విషయాభిలాషంబు వితథంబనియు, ధనయౌవనంబులశాశ్వ
తంబులనియుఁ, బశుపుత్త్రి ధనాదికంబులు గంధర్వనగరాకారంబు
లనియు భావించి, నిత్యంబును, బ్రహ్మయుక్తాత్మండైన, నమ్మానవుం
డుత్తమగతిన్ జెందుఁ; బుత్త్రిమిత్రకళత్రాదులుగాని, ధనధాన్యహార్యా
భరణ వాహనాదులుగాని మేలుఁ గూర్చునే? గావల్ల భునియంద
హృదయంబును బదిలపఱచుకొని, యింద్రియగ్రామవ్యావృత్తుండై,

బ్రహ్మభూతాత్మభావనుండనై, పరమశివునియందె రమించుచుండు"నని
నిశ్చయంబుగా సమాహితుండనై, తత్క్షణంబ॥ 50

చం॥ కొడుకులఁ బిల్చి, యెంతయును గూరిమి మీఱ, వినంగ వారలా
మృదునుపదేశమంతయు మఱన్ మఱిఁ దెల్పి, "స్వధర్మవర్తన
మ్ముడుగక, యన్యధర్మముల నూహల నిల్పక, మానసాంబుజం
బుడుగర వెట్టుఁడీశు పదయుగ్మమునన్, గురుపాదసన్నిధిన్॥ 51

మ॥ తగఁ జేయన్ వడుగుల్ కుమారులకు నబ్దంబందు గర్భాష్టమం
బగుదానన్; దృఢభక్తియుక్తులయి, గుర్వాజ్ఞన్ లవంబేనియున్,
డిగఁద్రో (ద్రా) వం జనదెప్పుడున్; ద్విజులకున్, దేవాళికిన్
బూజలన్
నిగమోక్తంబుఁ బథంబుఁ దప్పక, కడున్ నిష్ఠన్ బచారింపనౌ॥ 52

శా॥ ఆచార్యానుమతిన్ బ్రవర్తిలవలెన్; స్వాభీష్టదృష్టిన్ మనో
వ్యాచక్రింసకుఁ గైవసంబయిన, వ్రాత్యత్వంబు సంప్రాప్య(ప్త)మా;
వాచాలత్వము దోషదూషితమగున్; పాణిగ్రహంబందు జా
త్యాచారానుగుణంబుగాఁగఁ, గులకన్యన్ స్వీకరింపన్ వలెన్॥ 53

వ॥ స్నానసంధ్యా జపహోమ దేవతార్చన సన్మానంబులన్నవి యాఱును ప్రతిదిన కర్తవ్యంబులు. బ్రాహ్మణారాధనాచార్య పూజనంబులు కులాభివృద్ధి శ్రేయోదాయకంబులు. మీరు కులధర్మానురూపంబులైన చిత్రాశ్వరథనాగవిజ్ఞాన కౌశలంబునను, విగ్రహవిమాన దేవాలయ కల్పనానల్ప భవ్యంబైన శిల్పవిద్యయందును "అందెవేసిన చేయి"యని యొప్పిదంబుగల్గి, మహేశ్వరుని, నిమేషాంబను, కులగురువులను, విప్రప్రవరులను బూజించుచు, వైదిక మార్గంబు ననుసరించియే, యుపనయన వివాహాది క్రియాకలాపంబులు నిర్వర్తించుకొనుచున్ ప్రవర్తించునది. దీనం జేసియే, మీరు యశోఽభిశోభిత

దశదిశాఽవకాశులరై, యప్రతీకాశులరై, వంశవిస్తారకులరై, శాశ్వ
తైశ్వర్యాద్యనేకాభీష్టావాప్తిన్ బరితుష్టిన్ గాంతు''రని, యుపదే
శించి, యమ్మాంక్తిక మౌనీంద్రుండంతట|| 54

కం|| కార్తాంతికనిర్దిష్టము
హూర్తంబున జ్యేష్ఠు, శ్రేష్ఠు, జ్యోతిష్మంతున్
గీర్తింపఁగా జనుల్, శుభ
మూర్తిన్ రాజ్యాభిషేకమున్ బొనరించెన్|| 55

స్రగ్ధర|| జ్యోతిష్మంతుఁడురాజై, సురుచిరవిభవస్ఫూర్తి. వార్తన్, ప్రదయిన్, రా
జ్ఞీతిన్, శక్తిత్రయిన్, మంత్రివరపరిషదన్వీతుఁడౌచున్, నరీతిన్,
రీతిన్, శ్రేయః పదవ్యాప్తనయనయుగ శ్రీవిలాసోపలాల్య
ఖ్యాతిన్, లోకంబులేలెన్ యమనియమముఖాష్టాంగయోగా
వియుక్తిన్|| 56

వ|| పితృచరణ హితవచన నయవినయ సమయశక్తిత్రయ సంభక్తి
చతుర చతురు పాయాంచిత పంచాంగశుద్ధిషాడ్గుణ్యసాద్గుణ్య సంగ్ర
హణా సుప్త సప్తాంగ సామగ్ర్యాగ్ర్యుండై, ప్రత్యర్థిదుర్నిరీక్ష్యుండై,
యాయవ్యయ పరీక్షాదక్షుండై, పౌరకార్య పౌర్వాపర్యపర్యా
లోచనతాత్పర్యధౌరంధర్య నిర్ధారణచాతుర్య శౌండీర్యుండై, యథా
యోగ్యయోజ్యనియోగసామర్థ్య శ్లాఘ్యుండై, ప్రతిజ్ఞాపాలన
నిజాజ్ఞాఽన్యథాసంభావనాద్యనుత్తమ లక్షణ లక్షితుండై, జనరంజన
చణ నిజరాజత్వనిర్వ్యాజరారజ్యమానుండై, రాజ్యలక్ష్మీ వైభవ
ప్రాభవ శోభితుండై, జగజ్జేగీయమానుండై, సకల సుఖంబుల ననుభ
వించుచుండె— నంతట, నమ్మౌక్తిక మౌనీందుఁడును, దీర్ఘయాత్రా
సక్తుండై, క్రమంబుఁదప్పక, ప్రస్థానంబు సాగించుచు|| 57

శా॥ జ్యోతిష్మంతునిఁ బ్రాజ్యరాజ్యమున నాయుష్మంతునిన్ బుత్త్రిణిన్
జేతః ప్రీతినినిల్పి, కాంతయును వెన్వెంటన్ దనున్ గొల్వ, సం
స్ఫీతం బీశ్వర సేవసేవధిగఁ దా, శ్రీశైల మల్లార్జున
ఖ్యాత బ్రహ్మమజిహ్మభక్తి వెలయంగాఁ జూడనేఁ గెన్ వడిన్॥ 58

శా॥ దక్షారామ విహారహారి, నిజభక్త శ్రేణిపుణ్యావళీ
నిక్షేపంబును, భీమనాయకుని, మాణిక్యాంబ, మందాకినిన్
దాక్షిణ్యంబున నేలుకోఁగల గృహస్థ శ్రేష్ఠు, నేదిష్ఠ వృ
ద్ధోక్షాధీశ్వరు, హారాణదోరాయి,ద్విరదాస్యపాస్య, స్కందార్చితున్॥

కం॥ తనిప్పునఁగని, మునియు, ననం
గుని గెల్చిన జోదు, సప్తగోదావరమం
దనఘుఁడఘమ మర్షణాప్లవ
మును, ద్రిషవణమున్ బొనర్చె ముదితయుఁ, దానున్॥ 60

ఉ॥ రత్నసభాపతి ప్రభునిఁ, బ్రాగ్రసర ప్రమథాధినాథని
ర్యత్నచిరత్న రత్ననిలయంబుఁ, జిదంబర దివ్యదేశమున్,
నూత్న మహామహత్త్వముఁగనుంగొనె వ్యాఘ్రపదర్షి వంద్యమున్,
బ్రత్నముఁ, దైజసంబయిన బ్రహ్మము, వేదపదాభినుత్యమున్॥ 61

శా॥ శ్రీకాళద్విపమోక్షదాయకము, వర్షిష్ఠంబు, వాయ్వాత్మమున్,
బ్రహ్మకాంతాగళ మంగళాభరణమున్, జ్ఞానప్రసూనాంబికా
శ్రీకళ్యాణనికేతనంబును, శుకర్షిక్షేత్రరాజంబు, యా
మ్యాకైలాసము, నాథనాథసుతనుత్యానుత్తమానన్యత్యమున్॥ 62

సీ॥ ఏపీట, మున్నీటి యిల్లాలు, మిన్నేఱు
దగ్గావహినీఖ్యాత, ద్రాగ్విభాతి,
నేయూర, విశ్వేశ్వ రేశ్వరస్వామి, జ్యో
తిర్లింగ దివ్యదీధితులఁ గ్రాలు,

నేచోట, దుంఠి విఘ్నేశలోలార్కభై
రవబిందు మాధవుల్ రాణఁగాంతు
రేచోర, నోర్మిమైనసామినామేనివా
నయుఁగూర్మిఁ బాయసాన్నంబుఁ బెట్టు,

సీ॥ నెచట, బహుఘట్టముల్, పుణ్యౌఘచయమొసఁగు,
నెచట, వేదాదివిద్యలు ప్రచురములగు,
నెచట, నపవర్గము లభించు నచిరముగను,
నట్టి శ్రీకాశికాపురిన్ మెట్టి, యంత॥ 63

శా॥ కేదారేశ్వరు భక్తిఁగొల్చి, మధురాక్షేత్రేశ్వరున్, సుందరున్
మోదంబొప్పఁగ, మీననేత్రచరణంబుల్ మ్రొక్కి, రామేశ్వరున్
నేదిష్ఠామగ భూజమాశ్రితులకున్, హేమోచ్చకూటస్థు, దో
ర్హాదిన్యుద్వహజూటకోటరు, విరూపాక్షేశ్వరున్ గొల్చియున్॥ 64

శా॥ ఏకామ్రేశ్వరదేవదేవునకు నిత్యైకాంత సంవాసమున్,
శ్రీకామాక్షికి రాణివాసపు శుభశ్రీఁ గూర్చు కాణాచి, వి
ఖ్యాకామప్రకరాతిధేయమును, యాతాయాత భక్తౌఘవా
చాకోలాహలలాలితంబుఁగనె మోక్షస్థానమా కాంచికన్॥ 65

వ॥ మఱియు, నమ్మహామహిముండు మహితమహత్త్వ మహత్త్వ విఖ్యాతంబులై, యసంఖ్యాక సంఖ్యావన్నిత్యనుత్యంబులై, శైవ పారమ్యరమ్యంబులైన మహాప్రదేశంబులను దర్శించి, భక్తితాత్పర్య పర్యవస్యద్వరివస్యాయత్త చిత్తుండై, కైలాసశైలంబునకున్ బ్రస్థానంబుఁ గావించె॥ 66

కం॥ ఆషాఢికమాసీంద్రుం,
డాముక్తి శుభాభిధానమైహికభోగా
వ్యామిశ్ర వ్యాపారమ
నోపమేయపవిత్రవృత్తులై, తామాపైన్॥ 67

మ॥ ప్రణతుల్ సేయుచుఁ, దీర్థయాత్రలను సంరంభంబునన్ మించి, ద
క్షిణకాశీప్రథిత ప్రభావమును, ముక్తిక్షేత్ర విఖ్యాతమున్,
"క్షణముక్తీశ్వరమున్" స్థిరంబగు నివాసంబౌనటుల్ నిల్వ, నీ
క్షణశబ్దగ్రహభూషణాఖ్యుఁడు రరీకారంబు సూచించుడున్॥ 68

కం: "ముక్తీశ్వర" నామంబవి
ముక్తిక్షేత్రానవమము, భూరిమహిమ వే
దోక్తక్రతుసమ్యక్కృతి
సక్తద్విజ బృంద పుణ్య సంపూర్ణంబున్॥ 69

కం॥ ఆ క్షేత్రంబు, పవిత్రం
బై, క్షోణిన్ బుణ్యరాశియౌ కాశికిదీ
పై, "క్షణముక్తీశ్వర" మనఁ
గా, క్షుద్రప్రాణికైన, క్షణమోక్షదమౌ॥ 70

ఉ॥ అచ్చట శంకరుండు స్థిరుఁడై, స్వమహోఽతిమహత్త్వయుక్తి నై
యచ్చరదృక్చకోరకముదావహసాధసుధాప్రభాఽఽవళుల్
నిచ్చలు మెచ్చుఁగొల్పఁగ, మలీమసమానసతామసాపహం
బచ్చపుఁగూర్మిఁగోర్కు లనవార్నిశమున్ దయఁదీర్చు
పెంచ్చగన్. 71

మ॥ఇది, శ్రీ మౌక్తిక మాదిదివ్యచరితంబీకృతి, నీకానుపూ
ర్వి దివాకోఽ నిశగీయమానమయి, యుర్విన్ దత్కలోద్భూతభూ
తిదముక్తిప్రదమైనదానిఁగడుఁ బ్రీతిన్ జెల్పితిన్; బుత్త్రి!నా
రద! లోకోపకృతి ప్రకామరతతర్ష ప్రక్రమోపక్రమా!! 72

ఉ॥ ఈ కథ భుక్తిముక్తిదమ; యెవ్వరికైనను ముఖ్యమిద్ది; సు
శ్రీకరమౌను మౌక్తికవిశిష్టకుల ప్రభవాళికెప్పుడున్;
ప్రాకట భక్తి, మౌక్తికులు ప్రాభవమై భవకాముమై, యశ
శ్శ్రీకమనీయనాయక వరేణ్యతఁగోరినచో, వినంగనౌ. 37

వ॥ మౌక్తికవంశ సంజాతుండయ్యు, నిమ్మహోపాఖ్యానమ్మాకర్ణింపని వాని జన్మంబు వ్యర్థంబు. ఉపనయన సంస్కారంబు నొందనివానికి ద్విజత్వంబు సిద్ధింపకుండుట తథ్యంబు. ఇందలి ముక్తర్షి వృత్తాంతంబు విన్నంతనే కార్యసిద్ధియు, శివపరిభావాకర్ణనంబున శివప్రసాద ప్రాప్తియు, ముక్తీశ్వరోత్పత్తి శ్రవణంబున భవబంధవిముక్తియు, రుద్రగాయత్రీ ప్రభావశ్రవణపుటావిధీకరణంబున ముక్తిలక్ష్మీపుట భేదనభేదనలాభంబును, పాశుపతవ్రతశ్రవణంబున బహుయజ్ఞాహరణ ఫలంబును, సమిదాంబాఽభ్యుదయాధిగమంబున శత్రుజయయశశ్శ్రీ సంప్రాప్తియు, జానుమద్వధవిధానాకర్ణనంబున సార్వత్రిక శాశ్వతిక బహులాభంబును, ముక్తికాంతా మౌక్తికకళ్యాణాకర్ణనంబునన్ గళ్యాణసాకల్యప్రాప్తియు, నాదిత్యోపాసనశ్రవణంబున నాదిత్య ప్రసాదతేజస్వితత్వంబులును, యావత్సైతద్వృత్తాంతా కర్ణనంబున సకలమనోరథఫలావితథసంసిద్ధియు నగుటంజేసి, ప్రయత్న పూర్వ కంబుగా నీ పుణ్యకథాఽఽకర్ణనంబునన్ జిత్తమాయత్తంబుఁగావించు నది. ఇయ్యది, ముఖ్యంబుగా మౌక్తికవంశీయుల కవశ్యకర్తవ్యంబు.

కం॥ శుభమాసమునను, శుభప
క్షభతిథియుత శుభతరమగుసమయమునందున్
శుభదవ్రత సందర్భ
ప్రభూత సంతోష సంభవం బెపుడరయన్. 75

కం॥ ఉపనయన వివాహాదిక
మెపుడగు, నపుడింట్ల బంధుహిత పుత్త్రికళ
త్ర పరివార పరివృతు
లుపజాత కుతూహలుల్ మహోత్సాహమునన్॥ 76

కం॥ శుచివేషులై, శుభంయు
ప్రచయగమనులగుచు, సుచితభంగిఁ, బ్రతిగృహం
బచిరకృతాలంకృతము, సు
రుచిరముగా, వినఁగవలయు శ్రుతిపర్వముగన్॥ 77

చం॥ తొలుత, "సవిఘ్నమ" స్తనుచు, ధూర్జటినందనుఁబూజసేసి, యం
త, లలిత భక్తి నానిమిషనాఁజను శక్తినిగొల్చి, యవ్వలన్
వలగొని మ్రొక్కి సద్గురు, మనఃప్రియతన్, ముని, ముక్తనాము,ను
జ్జ్వల మహిమున్ దలంచుచు, శ్రవఃపుటపేయముఁ జేయనొఁగథన్॥

వ॥ ఇట్లు కథాఽఽరంభావసానంబులు రెంటను బూజాఽఽదికంబులు నిర్వర్తించి, చేసిన కథాశ్రవణంబు – దీర్ఘాయుష్యంబును, బుత్త్రి పౌత్త్రాభివృద్ధిని, సంపత్సమృద్ధిని, సంకల్పసిద్ధిని, కళ్యాణాభివృద్ధిని, సర్వకామప్రకామప్రపూర్తినిన్ గల్గించు; నీ మౌక్తిక మౌనీంద్రుని చారిత్రంబత్యంత పవిత్రంబు." 79

కం॥ "అని, శతధృతియును నారద
మునికివినిచెదీని, ముక్తమునికథ; నేనా
తనివల్ల జాహ్నవీతట
మున, మును వినినాఁడ నొకట ముదమొదవమదిన్॥ 80

కం॥ అదియేయిది; వినిపించితి;
మృదుహృదయ! యుధిష్ఠిరా! వరిష్ఠయశః పూ
ర్ణ దశదిశాఽభ్యంతర! నీ
కుదిత తతముదంబుఁగాంతుపున్నతచరితా!॥ 81

కం॥ ఆ మౌక్తిక మౌనీంద్రుం
డామృడుని పదైక(ద్భాబ్జ) భక్తినస్త్రంబు
ద్దామంబు, పాశుపతమున్,
భూమహితము, భూమహితముఁ బొందియు, దానన్॥ 82

ఉ॥ జానుమదాహ్వయాసు(శ)రుని, సర్వజగద్భవికాపహారి, నీ
శానభుజోద్భవుండు, సురసన్నుత శౌర్యుఁడు, మౌక్తికుండు, తే
జోనిధి, సంహరించి, ప్రవిశుద్ధయశోధనుఁ డయ్యె; నీవునో
సూనృతవాగ్విశారద! యసూర్క్షణదూర! జయంబుఁ గాంచుమా!॥

శా॥ నీవీ పుణ్యకథా శ్రుతిన్ రిపుల, నిర్ణిద్ర ప్రతాపాఢ్యులన్,
దేవారి ప్రతిమా తిధార్ష్ట్యభరితోద్వేలా సమర్థత్వదు
ర్భావోపేతుల, నుక్కడంచి, జయలాభ శ్రీప్రమోదోద్యత(తా)
ద్యావాపృథ్వ్యవకాశపూరిత యశోద్రాఘిష్ఠతన్ బొందుమా!"॥84

కం॥ అని, వినిచి, పరాశరముని
తనయుఁడు, ద్వైపాయనుండు, ధర్మజు చేవం
దనములు శతాధికంబులు
గొని, యంతర్ధానమందె గురుతరమహిమన్॥ 88

మ॥ ఇది, ముక్తృషిపవిత్ర చిత్రచరితం బెల్లు విన్పించినాఁ
డ; దృఢాస్థన్ బ్రవచింపుఁడీ! సుకృతభా(భ)ండారంబు, దీనిన్ గడున్
జదురుల్, శౌనకముఖ్యమౌనులు! విశేషంబున్న నాధోరణిన్,
మదినిల్పందగు; బోయివత్తు"నని, సమ్మా(న్మా)న్యుండు,
సూతుండాగన్॥ 86

చం॥ చని యెనిజేచ్ఛ; న త్తటిని శౌనక ముఖ్యులదఃకథావిధిన్
విని; తనివొంది, యెంతయువినీతిఁ బునః పునరావిరచ్య(చరిష్య) మా
న (ణ) నతినుతి ప్రకారముల నైమిశకాననవాసులాతపో
ధనులు, మునుల్ మనంబుల ముదంబును బొందిరి; పొంగి రెంతయున్॥87

ఇది, ఆంధ్రీకృత ముక్తీశ్వరోపాఖ్యానంబునందు, మహామౌక్తికధర్మ
నిర్ణయంబనునది యష్టాదశాధ్యాయము.

—(♦)—

-: ఫలశ్రుతి :-

కం॥ శివ భుజజనియగు నృపవరా
నివరు శుభచరిత్ర, దీని, నిశ్చలనిష్ఠన్
భువివినినఁ, జదివినను, మా
నవుఁడు సిరులఁబడయుఁ; దుదిఁబినాకిన్ జెందున్॥ 88

-: ఉపసంహారము :-

సీ॥ "ప్రభవఁ" బ్రభవించినట్టి "గోపాలకృష్ణ
మార్య", నాముండు, "వైఖానసా"న్వయుండు,
"కాశ్యపాత్రైలి" వంశ్యుండు, కబ్బమిట్లు
"ప్రభవశివరాత్రి" వేళఁబూర్ణ మొనర్చె॥ 89

మ॥ "నఁవిఘ్నేశచతుర్థి", సత్కవివరేణ్యప్రోద్యదాత్మానభి
జ్ఞల సత్కావ్య కృతాంగరీయ ఉరుశస్య స్వచ్ఛకీర్త్యబ్ధిల
బ్ధ్యలవాలుబ్ధత, మహాత్తిక ప్రభునుపాఖ్యాన ప్రబంధంబుఁదాఁ
దెలుఁగుంజేయనుపక్రమించియు, సమాప్తింజేసెనీనాఁటికిన్॥ 90

-: ఉన్నమాట :-

శా॥ కాశీభా(భ)ట్ల" శుభాన్వయుండు, కవితాఽగాధాబ్ధిగాంభీర్యమున్
రాశీభూతము దాచెనే ఘనుఁడు, "సుబ్రహ్మణ్య" విద్వద్వ్రతం
సేశుండా కవిపుంగవుండును, యశోఽహీనున్ ననున్ జేయుపు
ణ్యాశాస్యంబున, ముక్తమౌని చరితంబాంధ్రీకరింపించెఁదాన్॥ 91

సీ॥ "విఘ్నేశు పెండ్లికి వేయి విఘ్నము"లన్న
సామెత నిజమౌనొ, యేమొ! తెలియ
"దది స్థిరవాసరంబగుటచేనిట్లు జా
గైనది" యనుమాట యదియుఁ దెలియ
దాప్తమిత్రము, మదీయాభ్యుదయానంద
సమ్యగావ్యాయిత రమ్యచిత్తుఁ
డైన "సుబ్రహ్మణ్య" ధీనిధి మాటిమా
టికినిచ్చు హెచ్చరికొకటె, మఱియుఁ,

గీ॥ "ప్రభవశివరాత్రియున్," "జయవాసరంబుఁ"
గూడినట్టి పర్వంబు నొక్కటెయుఁ దెలియు;
నీ మహాకావ్యనిర్మాణమింతకాల
మైన, జయసిద్ధి, సంపూర్తి యౌటకిట్లు॥ 92

-: నాయకాద్వైతస్థాపనము :-

ఆ॥ "కపిలమల్ల!" నీవుఁగయికొమ్ము కృతికన్య;
"నమరలింగ!" నీవునాచికొమ్ము!
కాదధర్మమిద్ది; యైదుగూపుల నింద్రుఁ
జేవరింపలేదె, కృష్ణనొకతె?॥ 93

కం॥ పంచేంద్రోపాఖ్యానము
పాంచాలీ పంచభర్తృవాదమ్మును దా
వంచిత మొనర్చునట్లే
పంచముఖుని మూర్తులన్ని భరియించుఁగృతిన్॥ 94

మాలి॥ దశకరధృతదివ్యత్ఖడ్గఖట్వాఽంగశూలా
దిశితపరికరశ్రీదీప్త దిగ్లోకజాలా!
వశితనరసపూస్సద్భక్తరక్షాఽపదేశా
తిశయభువన పుణ్యాప్తి ప్రదానప్రకాశా!॥ 95

మంగళమహాశ్రీ॥ హారసితతామరసహంసశరదిందుబి స
హాసిశుభదివ్యదయితాఽఽశ్రిత(ఽన్విత)తనుశ్రీ!
ఘోరతరహాలహాల ఘూర్ణన జగత్ప్రళయ
కుంఠనచణాసితర గోప్య సగళశ్రీ!
నీరరుహనాభశర నిర్జితపురత్రితయ
నేత్రతిశరార్వ సురనిర్ఝరమహశ్రీ!
క్ష్మారవిశశి ప్రభృతిమానిత శుభాకృతి స
మంచిత సమగ్ర బహుమంగళమహాశ్రీ! 96

-: గద్యము :-

ఇది, శ్రీమత్కాశ్యపాఖేయా త్రిలి వేంకటాచార్య విద్వత్కవికార్త్రాంతి
కేంద్ర ద్వితీయపుత్త్రి, సజ్జనకారుణ్యపాత్ర, బుధజనవిధేయ,
గోపాలకృష్ణమాచార్య నిర్మిత బ్రహ్మాండ పురాణాంతర్గత
శ్రీముక్తీశ్వరోపాఖ్యానాంధ్రీకరణంబు
సర్వంబు సంపూర్ణము.

—(*)—

శ్రీ పరమేశ్వరార్పణమస్తు!

## - గమనిక -

## (మొదటి 7 వ పుట - 20 వ పంక్తి తర్వాత)

శేషమ్మ - నవర భార్గవ పెద్దింటి లక్ష్మణాచార్యుల భార్యగాం, పెద్దరామమ్మ - పెనికేరు శ్రీయుతా త్రేయూంగర వేంకటాచార్యుల జాయగా, బుల్లిరామమ్మ – మండపేట గౌతమ వింజరపు వేంకట శోభనాద్ర్యాచార్యుల ద్వితీయగా, లచ్చమ్మ - దుళ్ళ ఖండవిల్లి భార్గవాప్పలాచార్యుల ధర్మపత్నిగా, గృహిణీస్థానీయలై, సంప్రాప్త సత్సంతాన భాగధేయలైరి. పూర్వకాలంబు నుండియు, మా యింట స్త్రీసంతానమ్మెక్కుడై, యన్యగోత్రీయ కుటుంబ విస్తృతి హేతు "వేయిండ్ల మొదలై" వర్ధిల్లి, చారితార్థ్యంబుఁగాంచె.

-: ప్రాప్తిస్థానము :-

అత్తిలి గోపాలకృష్ణమాచార్యులు

7-1-43, "శోభన్ మందిర్"

నరసాపురము - 534275 ప॥ గో॥ జిల్లా. (ఆం. ప్ర.)